# బైబులుభాష్య సంపుటావళి

## పదవ సంపుటం

# దేవమాత, అంత్యగతులు

ఫాదర్ పి. జోజయ్య, S.J.
ఆంధ్ర లొయోలా కాలేజి
విజయవాడ - 520 008

# విషయసూచిక

# మనవి మాట

బైబులు భాష్యం సంచికలను 1972లో ప్రారంభించాం. ఇప్పటికి 157 సంచికలు ముగిసాయి. వీటినే యిప్పుడు పది బైబులుభాష్యం సంపుటాలనుగా ముద్రించాం. ఈ సంచికల్లో ఓ 60 మాత్రం ఇదివరకే "బైబులు గ్రంథమాల" అనే పేరుతో పుస్తక రూపాన్ని సంతరించుకొని పలు ముద్రణలు పొందాయి.

ప్రస్తుతం ఈ 157 సంచికలను, వీటిల్లో వచ్చే అంశాలనుబట్టి, ఓ క్రమపద్ధతిలో అమర్చాం. ఈ సంపుటాల్లో వుంది ప్రధానంగా బైబులు వివరణలు, దైవశాస్త్ర విషయాలు, ప్రార్థనాంశాలు. మన క్రైస్తవ భక్తివిశ్వాసాలను బలపరచేది ముఖ్యంగా ఈ యంశాలే. ఎందరో వేదపండితుల భావాలు ఈ పుస్తకాల్లోకి వచ్చాయి. ఆ మహానుభావులందరికీ వందనాలు.

ఈ పుస్తకాలు మన క్రైస్తవమత సత్యాలను లోతుగా అర్థంచేసికోవడానికీ, ప్రార్థన జేసికోవడానికీ, ఇతరులకు బోధించడానికీ గూడ ఎంతో వుపయోగపడతాయి. కనుక మన గురువులు, మఠకన్యలు, ఉపదేశులు, గృహస్థులు మొదలైనవాళ్లు ఎవరైనాసరే వీటిని వినియోగించుకొని ఆధ్యాత్మిక లాభాన్ని పొందవచ్చు.

చాల సంవత్సరాల పొడుగున కొనసాగించిన రచనలు కనుక ఈ గ్రంథాల్లో పునరుక్తులు అనివార్యమయ్యాయి. పాఠకులు మన్నింతురుగాక. మొదటవ్రాసిన సంచికలకు తర్వాత వ్రాసిన వాటికీ శైలిలోకూడ భేదం వుంది.

మన క్యాతలిక్ సమాజంలో పఠనాభ్యాసం లేదు. ఇది మనం అవశ్యం సవరించు కోవలసిన ప్రధానలోపాల్లో వొకటి. ఇందుకే ఈ గ్రంథాలను చౌకధరకే విక్రయిస్తున్నాం. ఈ పుస్తకాలు మన సాహిత్యరాశిని పెంచి మన ప్రజల్లో పఠనాభిరుచిని ప్రోదిచేస్తాయని ఆశిస్తున్నాం. అసలు తెలుగులో మనకున్న క్యాతలిక్ సాహిత్యమే చాల తక్కువ.

ఫాదర్ టి.మర్రెడ్డిగారి ఆర్థిక సహాయంలేందే ఈ సంపుటాలు ఇప్పుడు, ఈ రూపంలో వెలుగు చూచేవి కావు. ప్రభువు ఆ మహనీయుని దీవించి ఆయన కృషిని సఫలీకృతం జేయునుగాక. విజయవాడ మేత్రాసనం తరపుననే ఈ పుస్తకాలను ప్రచురిస్తున్నాం.

ఈ సంపుటాల్లో రచయిత 31 ఏండ్ల పొడుగున కొనసాగించిన అవిరళకృషి దాగివుంది. కరుణామయుడైన ప్రభువు యెరూషలేం దేవాలయంలోని సాయంకాలపు ధాన్యబలినివలె ఈ సాహిత్యబలిని గూడ నెనరుతో స్వీకరించునుగాక.

ఈ పుస్తకాలకు పరిచయవాక్యాలు వ్రాసియిచ్చిన విజయవాడ పీఠాధిపతులు, పూజ్యులు, మహాఘనత వహించిన డాక్టరు ఎం.ప్రకాష్‌గారికి నమస్సుమాంజలులు. వీటిని సర్వాంగసుందరంగా ముద్రించిన శ్రీ పి.సాంబిరెడ్డిగారికి వారి సిబ్బందికి, ఓపికతో ప్రూఫులు దిద్దిన శ్రీ వి. గోపాలరెడ్డిగారికి మా కృతజ్ఞతలు.

\- గ్రంథకర్త

# ముందుమాట

ఫా.జోజయ్య గారు తమ రచనల ద్వారా ఆంధ్ర శ్రీసభకు సుపరిచితులు. వారి అవిరళకృషి, సేవాతత్పరత, తెలుగులో చక్కని సాహిత్యాన్ని రాయాలనే తపన, దానికితగిన అంకితభావం వేనోళ్ల కొనియాడదగింది. వీరు రచించిన చిన్నచిన్న పుస్తకాలను సంకలనం చేయడం అనే ప్రక్రియ వీరి జీవితకాలంలోనే జరగకపోయినట్లైతే, ఈ గొప్ప సాహిత్యాన్ని కోల్పోయే అపాయం వుండేది. అరుదుగా పాఠకులకు తెలుగులో లభ్యమయ్యే బైబులును మరియు కతోలిక వేదాంతమునకు సంబంధించిన అంశాలను క్షుణ్ణంగా పరిశోధన జరిపి చక్కని భాషలో ఆంధ్ర కతోలిక సంఘానికి గత ముప్పది సంవత్సరాలపైగా అందించారు ఫా.జోజయ్య గారు.

తెలుగు కతోలిక శ్రీసభకు, బైబులును క్రైస్తవ సిద్ధాంతాలను అర్థం చేసుకోవాలన్న కోరిక గల క్రైస్తవేతరులకు ఫా.జోజయ్య గారు గొప్ప వరమని నేను భావిస్తున్నాను. వీరి రచనలు సత్యాన్ని అన్వేషించడం యెడల ఆయనకున్న పట్టుదలకు, అందరికి జ్ఞానోదయాన్ని కలిగించాలన్న తపనకు, మరియు ఆంధ్ర శ్రీసభ పురోభివృద్ధి యెడల ఆయనకున్న తృష్ణకు నిదర్శనాలు. సరళమైన స్వచ్ఛమైన, సామాన్య ప్రజలకు అర్థమయ్యే తెలుగుభాషలో రచింపబడిన ఈ పుస్తకాలను చదివి, ఆధ్యాత్మిక జీవిత వికాసానికి క్రైస్తవ సిద్ధాంతాలను లోతుగా అర్థం చేసికోవటానికి వీటిని వినియోగించుకోవాలని కోరుతున్నాను. ఎంతో నేర్పుతో, క్రమపద్ధతిలో విభజింపబడిన రచనలను "బైబులు భాష్య సంపుటావళి" అన్న పేరుతో పదిసంపుటాలుగా అచ్చు వేస్తున్నందుకు అభినందిస్తున్నాను. ఈ గ్రంథాల ప్రచురణ బాధ్యతను తన భుజాలపై వేసికొని, సమయాన్ని వెచ్చించి, వలసిన ఆర్థిక వనరులను చేకూర్చినందుకు, ఆంధ్ర శ్రీసభకు ఉపయోగకరమైన ఈ సాహిత్యాన్ని ప్రజలకు అందించాలనే మంచికార్యాన్ని చేపట్టి విజయంతంగా పూర్తి చేసినందుకు ఫా.మర్రెడ్డి గారిని నా హృదయపూర్వకంగా అభినందిస్తున్నాను.

ఆణిముత్యాల్లాంటి ఈ రచనలను ఆధ్యాత్మిక సంపత్తిగా అందరూ గుర్తించాలని, కతోలిక క్రైస్తవ సమాజమంతా ముఖ్యంగా మేత్రాణులు, గురువులు, మఠవాసులు అందరు ఈ కృషిని అభినందించాలని, ఆదరించాలని నా ఆకాంక్ష. మన ప్రజల స్తోమతకు తగినట్లుగా వీటి వెల కూడ చాల తగ్గించడమైనది. కావున ప్రతి ఒక్కరు, గ్రంథాలయాలు, ఆశ్రమాలు, మఠాలు, కతోలిక కేంద్రాలు ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోవాలని నా మనవి.

ఫా.జోజయ్య గారు చేసిన ఈ కృషిని మరోసారి అభినందిస్తూ, వారు ఇంకా ఆంధ్ర శ్రీసభకు తమ అమూల్యమైన సేవలను రానున్న కాలంలో అందించాలని మనసారా కోరుకుంటూ, ప్రార్థిస్తూ...

ఇట్లు
మీ జ్ఞానతండ్రి
**+ మల్లవరపు ప్రకాష్**
విజయవాడ పీఠాధిపతులు

# 1. పునీతమాత

## మనవిమాట

ఈ గ్రంథం శ్రీసభలో మరియమాతకుండే స్థానమేమిటో నిర్ధారిస్తుంది. ఆ పునీతమాతపట్ల భక్తి ఎందుకు చూపాలో, ఎలా చూపాలో చెప్తుంది. ఈ పుస్తకాన్ని మరియను గూర్చిన కట్టుకథలతో నింపదలచుకోలేదు. ఇది ప్రధానంగా మరియను గూర్చిన దైవశాస్త్రాలను వివరించే గ్రంథం. ఈ శాస్త్రాంశాలుకూడ అత్యధికంగా పితృపాదుల పారంపర్య బోధనుండి స్వీకరింపబడ్డాయి. బైబులు వస్తుతః మరియనుగూర్చి చెప్పే అంశాలు చాల స్వల్పం.

మామూలుగా మరియమాత పేరెత్తగానే ప్రోటస్టెంటు సోదరులతో భేదాభిప్రాయాలు కలుగుతాయి. కాని ఈ భేదభావాలు అడుగంటిపోవాలనే రచయిత కోరిక. అంచేత ఈ పుస్తకంలో మరియనుగూర్చిన క్యాతలిక్ భావాలూ, ప్రోటస్టెంటు భావాలూ నిష్పాక్షికంగా చర్చింపబడ్డాయి. పితృపాదుల పారంపర్యబోధను గుర్తించందే మరియ స్థానమూ, ఆ పునీతమాతపట్ల చూపే భక్తీ అర్థంకావని నిరూపింపబడింది. ఈ గ్రంథం క్రైస్తవశాఖల విభజనకు గాక, సమైక్యతకు దోహదం చేయాలనే గ్రంథకర్త ఆశయం. క్రీస్తు జననియైన మరియ క్రైస్తవ ప్రజను ఐక్యం చేస్తుందిగాని విభజించదు.

మామూలుగా క్యాతలిక్ క్రైస్తవులకు మరియమాత పట్ల గాఢభక్తి వుంటుంది. కాని ఈ భక్తి కొన్నిసార్లు అర్థంలేని మూఢభక్తి ఐపోతూంటుంది. ఈ గ్రంథంలో దేవుని రక్షణ ప్రణాళికలో మరియకున్న స్థానమేమిటో శాస్త్రదృష్టితో వివరించి చెప్పాం. ఈ పుస్తకపఠనం వలన మన ప్రజల మరియభక్తి పూర్వంకంటె అర్థవంతమూ ఫలభరితమూ ఐనట్లయితే గ్రంథకర్తకు అదే పదివేలు. ఇది ఆరవ ముద్రణం.

## విషయసూచిక

# 1. నిష్కళంకమాత

సెడూలియస్ అనే ఐదవ శతాబ్దపు లాటిను కవి మరియమాతను ప్రశంసిస్తూ "సుందరమైన గులాబిపూవు ముండ్లమొక్క మీద ఎదుగుతుంది. అది తల్లి చెట్టుకంటె అందమైంది. తల్లి చెట్టులాగ ముళ్ళు లేందికూడ. అలాగే మరియ అనే పూవుకూడ ఏవ అనే ముండ్ల మొక్కమీద వికసించింది. ఈ కన్య దోషరహితయై దోషసహితయైన ఆ తొలికన్య పాపానికి ప్రాయశ్చిత్తం చేసిం" దని వ్రాసాడు. ఈ కవి భావించినట్లు మరియ నిష్కళంక. ప్రస్తుతం నిష్కళంకమాతను గూర్చి ఐదంశాలు విచారిద్దాం.

## 1. నిష్కళంకమాత అంటే యేమిటి?

మరియా మనలాగే పాపపు ఆదాము కుటుంబంలో పుట్టింది. కనుక మనలాగే ఆమెకూ జన్మపాపం సోకాలిసింది. కాని పాపం ఆమెకు సోకలేదు. పరలోకంలోని తండ్రి మరియను జన్మపాపం నుండి పదిలపరచాడు. ఎలాగ? భవిష్యత్తులో జన్మింపబోయే క్రీస్తు వర ప్రసాదాలద్వారా దేవుడు ముందుగానే మరియను పాపం నుండి పదిలపరచాడు. మనమంతా పాపంలో పుట్టాం. అలా పుట్టినంక, క్రీస్తు ద్వారా ఆ పాపం నుండి రక్షింపబడ్డాం. కాని అదే క్రీస్తు ద్వారా మరియ అసలు పాపానికి గురికాకుండానే పదిల పరచబడింది. నేలమీద జారిపడిన పసిగందును లేవనెత్తడం కంటె, ఆ బిడ్డ అసలు పడకుండా వుండేలా జాగ్రత్తపడ్డం మేలు. పరలోకపిత మరియమాతనుకూడ అలా జాగ్రత్తతో పదిలపరచాడు.

కనుక మన రక్షణకంటె ఆమె రక్షణం శ్రేష్ఠమైంది. ఆమెకు అబ్బినభాగ్యం మన కబ్బలేదు. ఈ రక్షణ ఫలితంగా ఆమెకు జన్మపాపమూ సోకలేదు, కర్మపాపమూ సోకలేదు. కర్మపాపరూపమైన ఛావైన పాపంగానీ స్వల్పపాపంగానీ ఆమెకు కళంకం ఆపాదించలేదు.

ప్రభువు ఆమెను నీతివస్త్రంతో ఓ వధువునులాగ అలంకరించాడు. వరప్రసాదాలనే ఆభరణాలతో కైసేసాడు. మరియ దేవదూతలకంటె పునీతుల కంటెగూడ అధిక వరప్రసాదాలతో నిండిపోయింది. కాపుననే శ్రీసభ తన ఆరాధనలో ఆ నిర్మలహృదయను కొనియాడుతూ "ఓ మరియా! నీవు పరిపూర్ణ సౌందర్యవతివి. పాపదోషం నీ కేమాత్రమూ సోకలేదు" అంటూ పరమగీత వాక్యాన్ని ఆమెకు అన్వయింపజేస్తుంది - 4, 1. ఏ ఫ్రేము అనే నాల్గవ శతాబ్దపు భక్తుడు క్రీస్తు నుద్దేశించి "ప్రభూ! నీలో పాపదోషమంటూలేదు, మీ తల్లిలో కల్మషమంటూ లేదు" అని వాకొన్నాడు. ఆ భక్తుడే మరోతావులో "దైవవార్త దైవవక్షస్సును వీడి కన్యవక్షస్సు నాశ్రయించి మానవరూపం చేకొంది. ఆదైవవక్షస్సులాగే ఈ కన్యవక్షస్సు కూడ పరమ పవిత్రమైంది. ఇక నేడు మన వక్షస్సున వసించే ప్రభువు స్తుతింపబడునుగాక" అంటాడు. కనుక మరియ పరమ పవిత్రురాలు. పాపమునుండి పదిలపరచబడిన పునీతురాలు. ఎన్మిదవ శతాబ్దంనాటికే క్రైస్తవ ప్రపంచంలో నిష్కళంకమాత ఉత్సవం ప్రచారంలో ఉండేది. 13వ శతాబ్దంలో డన్స్‌స్కోటస్ అనే దైవ శాస్త్రజ్ఞుడు మరియ నిష్కళంకగా జన్మించిందని రుజువుపరచాడు. 1854లో పదవ భక్తినాథ పోపుగారు మరియ నిష్కళంకగా ఉద్భవించిందని అధికార పూర్వకంగా ప్రకటించారు.

## 2. మరియను ఈలా యెందుకు పదిలపరచాలి?

దేవుడు మరియను జన్మపాపంనుండీ కర్మపాపం నుండీ పదిలపరచాడన్నాం. ఎందుకు? తన తల్లిని తాను ఎన్నుకున్న నరుడు ఒక్కడే ఒక్కడు, క్రీస్తు. ఈలా తానెన్నుకున్న స్త్రీని క్రీస్తు తనకు యోగ్యమైన మాతనుగ తయారుజేసికొన్నాడు. తల్లి కళంకం బిడ్డకు సోకుతుంది. అంచేత జన్మాదినుండీ ఆమె యందు కళంకం ఉండకూడదు. దేవదూత ఆమెకు మంగళవార్తచెప్తూ "దైవానుగ్రహానికి ప్రాప్తురాలవైన మరియా! నీకు శుభం" అంటాడు-లూకా 1,28. అనగా ఆమె పుట్టువునుండి దైవానుగ్రహంతో నిండివుండేదనే భావం. ఈలాంటి తల్లి మరియ. ఈ తల్లివలన క్రీస్తుకు చిన్నతనం కలుగలేదు. అందుకే శ్రీసభ ప్రార్థనలో ఉపయోగింపబడే ఓ గీతం క్రీస్తునుద్దేశించి "ప్రభూ! నీవు కన్యగర్భాన్ని అనాదరం చేయలేదు" అంటుంది. చక్కని ఇల్లు గట్టించి శత్రువు కిచ్చి వేయం. ప్రభువూ తన చక్కని తల్లిని, పిశాచం వశంజేసి పాపకళంకితను జేయడు. మంచిపండ్లు కాసేచెట్టు మంచిచెట్టు. మంచి గొర్రె పిల్లను ఈనిన గొర్రె మంచిగొర్రె. అలాగే పవిత్ర క్రీస్తును మనకందించిన మరియమాతగూడ పవిత్రురాలే.

బైబులు భగవంతుడు పరిశుద్ధుడు. అపవిత్రప్రాణి ఏదికూడ అతని సముఖంలోకి రాలేదు. ఇక మరియ పవిత్రుడైన దేవుణ్ణి మన మానుష కుటుంబంలోనికి తీసికొని

రావాలి. కాని ఆమె అపవిత్రురాలైతే క్రీస్తు ఆమె గర్భంలోకి అడుగు పెడతాడా? అంచేత ఆ దేవునిలాగే ఆమెకూడ పరిశుద్ధురాలు కావాలి గదా? కనుకనే పిత ఆమెను ఓ దేవాలయంలాగా పరిశుద్ధపరచాడు. మరియ దేహాత్మలను పవిత్రపరచి ఆ మాతృమూర్తిని క్రీస్తుకు యోగ్యమైన వాసస్థలమయ్యేలా తీర్చిదిద్దాడు. ఆ మంగళమూర్తి క్రీస్తుని తన హృదయంలో నిలుపుకున్న ఓ పవిత్రదేవాలయం. "ప్రభూ! నీ మందిరానికి పారిశుధ్యం తగివుంటుంది" అంటాడు కీర్తనకారుడు - 93,5. ఔను, మరియకు పారిశుధ్యం తగివుంటుంది.

మరియ పిశాచం తలను చిదుకగొట్టబోతుంది - ఆది 3,15. ఈలా సైతానుని జయించే కన్య తానే పాపంద్వారా ఆ సైతానునికి దాసురాలు కాకూడదుగదా? కనుక ఆమెకు పుట్టువునుండీ పాపం సోకలేదు.

దేవదూత ఆ మరియతో "పవిత్రాత్మ నీ మీదికి దిగి వస్తుంది. మహోన్నతుని శక్తి నిన్ను ఆవరిస్తుంది" అంటాడు - లూకా 1, 36. ఈ దివ్యాత్ముడు చాల గొప్పశిల్పి. గొప్పచిత్రకారుడు. చిత్రకారుడు సుందరిని చిత్రించినట్లుగా పరిశుద్ధాత్ముడు తనవధువైన మరియమాతను సుందరంగా, పవిత్రంగా తీర్చిదిద్దాడు. ఆమెను అన్ని అలంకరణలతో, అన్ని సౌభాగ్యాలతో, అన్ని పుణ్యాలతో ఓ నిర్మల వధువునులాగ అలంకరించాడు. కావుననే ఆ కన్య పాపకళంకం సోకని సంపూర్ణ సౌందర్యవతి. దేవుడు మరిమాతను పాపం నుండి పదిలపరచడంలో, ఓ కల్యాణమూర్తినిగా ఆమెను తీర్చిదిద్దడంలో భావం ఇది.

## 3. నిష్కళంకమాత మహిమ

జన్మ కర్మపాపాలనుండి విముక్తయైనందున మరియమాతకు సిద్ధించిన మహిమ అంతింతకాదు. ఆమె పితకు ప్రియ కుమారి, సుతునకు ప్రియజనని, పరిశుద్ధాత్మునకు ప్రియవధువు ఔతుంది. పాపపు ప్రపంచాన్నుండి వైదొలగి పవిత్రుడైన భగవంతునికి అంకిత మౌతుంది. ఈ లోకంలో ఇద్దరే యిద్దరు పవిత్రులు. క్రీస్తు, క్రీస్తు మాతయైన మరియా.

ప్రాచీన క్రైస్తవ వేదశాస్త్రజ్ఞులు మరియను చాలా ఉపమానాలతో స్తుతించారు. పూర్వవేద మందసపుకొయ్య చెడిపోకుండా వుండేది. పాపకళంకం సోకని మరియకూడ ఈ మందసపు కొయ్యలాగ చెరుపు నెరగనిది. ఆదామేవలను వెళ్ళగొట్టాక ప్రభువు శృంగారవనాన్ని సురక్షితం చేసి కాపాడాడు. మరియకూడ సురక్షితమైన శృంగారవనం వంటిది. ఆమె మెరవుతో గూడుకొన్న మేఘం లాంటిది. ఉషస్సుతో నిండిన ఆకాశం లాంటిది. ఈ మెరపూ, ఈ ఉషస్సూ ఆమె కన్న క్రీస్తే. ఈ పునీతరురాలు పాపపు నరజాతిలో

జన్మించినా తానుమాత్రం పాపపు బురదలో అడుగుపెట్టలేదు. అంచేత ఆమె ముండ్లపొదలో పూచిన లిల్లీపూవు లాంటిది. ముండ్లమొక్కపై వికసించిన గులాబివంటిది. ఆ పరిపూత హృదయ పాపాత్మురాలై పతనమై పోయిన మొదటి యేవకు పరిహారంచేసిన రెండవయేవ. కనుకనే శ్రీసభకూడ యూదితు వాక్యాలను మరియకు అన్వయించి "యెరూషలేమును సంతోషపరచే కన్యవు నీవు. ఈ జనులను ఆనందపరచే ధన్యవు నీవు" అంటుంది - యూది 15,9. ఆనాడు యూదితు హోలోఫెర్నెసు అనే శత్రుసైన్యాధిపతి నుండి యెరూషలేమును రక్షించింది. అలాగే మరియకూడ పిశాచం అనే శత్రువునుండి క్రైస్తవసమాజాన్ని రక్షిస్తుంది. యూదితు విజయం యెరూషలేమునులాగే కన్యమరియ విజయం క్రైస్తవ లోకాన్ని ఆనందపరుస్తుంది.

## 4. నిష్కళంకమాత బోధించే సత్యాలు

మరియమాత ఎందుకు, ఎలా నిష్కళంకమాత ఐందో చూచాం. ఆమె పావనరూపాన్ని కొంతవరకు ధ్యానించుకున్నాం. ఆ పుణ్యశీల పతిత నరజాతికి చెందిన మనకు కొన్ని సత్యాలను బోధిస్తుంది.

పవిత్రురాలైన మరియ నేడు పవిత్రుడైన భగవంతుని సన్నిధిలోవుంది. మన యిల్లుకూడ అక్కడేగాని యిక్కడకాదు. అంచేత మరియ మనం దృష్టిని ఆవైపునకు మరల్చాలని ప్రబోధిస్తుంది. మనం ఆ దేవునికోసం కలిగించబడ్డామని హెచ్చరిస్తుంటుంది. అటువైపు పయనించమని మనకు సంజ్ఞ చేస్తుంటుంది.

ఆ తల్లికి పాపమాలిన్యం సోకలేదు. పవిత్రుడైన భగవంతుని తల్లి ఎంత పవిత్రరాలుగా వుండాలో అంత పావిత్ర్యంతో అలరారింది. దేవుడు మనలనుకూడ పవిత్ర జీవితం జీవించడానికే కలిగించాడు. అంచేత మరియ మనలను నిర్దోషంగా నిష్కల్మషంగా జీవించమని ఆదేశిస్తుంది. దేవుని సన్నిధిలో నడుస్తూ ఉత్తమ జీవితం జీవించాలని సూచిస్తుంది.

మరియ పాపాన్ని జయించి మోక్షాన్ని సాధించింది స్వీయశక్తివల్లగాదు, దైవశక్తివల్ల. కనుక ఆమె మనం కూడ దైవబలంతో దివ్యజీవితం జీవించి మోక్షంలో అడుగుపెట్టాలని చెప్తుంది. ప్రభువుమీద భారంవేసి జీవించాలని బోధిస్తుంది.

## 5. నిష్కళంకమాతపట్ల భక్తిభావాలు

నిష్కళంక మరియను మనం చక్కగా ధ్యానించుకోవాలి. భగవంతుడు నరుణ్ణి తనకు పోలికగా చేసాడు. ఆ దేవుళ్ళాగే నరుడుకూడ దివ్యుడు. కాని తొలి మానవుడైన

ఆదాము పాపంచేసి ఈ దైవసాదృశ్యాన్ని కోల్పోయాడు. నరుడు దేవుడు సంకల్పించు కున్నట్లుగా జీవించడం మానివేసాడు. కాని నరజాతి యంతటిలో దేవునికి పోలికగా, దేవుని సంకల్పం ప్రకారం జీవించిన ఏకైక మానుషవ్యక్తి మరియ. నరుణ్ణి గూర్చిన దేవుని ఆశయాలన్నీ ఆమెయందు సంపూర్ణంగా నెరవేరాయి. ఈ తల్లి మనంకూడ దేవునికి పోలికగా మెలగాలని కోరుకుంటుంది. అనగా, మన తలపులు, పలుకులు చేతలు దివ్యలకు తగినట్లుగా వుండాలని వాంఛిస్తుంటుంది. తన వేడుదలవలన ఈ భాగ్యాన్ని మనకు సంపాదించి పెడుతుందికూడ.

మరియ పరమపవిత్రురాలు అన్నాం. మనం పతిత మానవులం. అయినా ఆమె మనలను అసహ్యించుకోదు. మనతో సంబంధం త్రెంచివేసుకోవాలి అనుకోదు. ఆ విమలమూర్తి మన నరజాతికి చెందిన స్త్రీ. తన బిడ్డలమైన మనం కూడ వైమల్యంతో జీవించాలనే ఆమె కోరిక. అంచేత ఆమె మనలను పవిత్రమూర్తియైన భగవంతుని దాపులోనికి తీసుకొని వస్తుంది. తాను క్రీస్తు సాన్నిధ్యంవలన ధన్యురాలు ఐంది. అలాగే మనమూ క్రీస్తు సాక్షాత్కారం పొంది, దైవత్వాన్ని చేకొని దివ్యజీవితం జీవించేలా చేస్తుంది.

మరియ మాతృమూర్తి. ఆ విశ్వజనని క్రీస్తు శిశువుని లాగే మనలను తన గర్భంలో ఇముడ్చుకుంటుంది. ఆ దైవ శిశువునులాగే మనలనూ గారాబంతో సాకుతుంది. పెంచి పెద్దచేస్తుంది. మన అక్కరలు బాగోగులు ఆ తల్లికి తెలియనివికావు. ఆ విశుద్ధమూర్తి మనకోసం నిత్యమూ ప్రార్థిస్తుంటుంది. మనంకూడ వినిర్మల జీవితంజీవించి తన రూపురేఖలు అలవరచుకునేలా చేస్తుంది. ఆ పునీతమాతకు బిడ్డలం కావడం మన భాగ్యవిశేషం.

# 2. కన్యమాత

నాల్గవ శతాబ్దపు భక్తుడు గ్రెగొరి నీస్సా మరియను ప్రశంసిస్తూ "మోషే కొండవద్ద చూచినపొద కాలుతూకూడ భస్మంకాలేదు. మరియ దైవతేజస్సును గర్భంలో ధరించినా కూడా కన్యాత్వం కోల్పోలేదు. ఆ తేజస్సే ఆ పొదను కాపాడింది" అని వ్రాసాడు. ప్రాచీనకాలం నుండి వస్తున్న క్రైస్తవ సంప్రదాయం ప్రకారం మరియ నిత్యకన్య. ఇక్కడ కన్యమాతను గూర్చి ఆరంశాలు విచారిద్దాం :

## 1. మరియ కన్యమాత అంటే ఏమిటి?

ఆ పవిత్రహృదయ బిడ్డను కనకముందు, కన్న తరువాత కూడ కన్యగానే వుండిపోయింది. అందుచే క్రైస్తవ ప్రపంచం ఆమెను "ధన్యురాలైన నిత్యకన్య" అని కొనియాడుతూంటుంది.

దేవదూత "నీవు గర్భం ధరించి బిడ్డను కంటావు" అని చెప్పగానే మరియ "నేను పురుషుని యెరుగను గదా, ఇదెలా జరుగుతుంది?" అని అడుగుతుంది -లూకా 1,34. దేవదూత "నీవు పురుషుని వలనగాక పరిశుద్ధాత్మ శక్తివలన గర్భవతి వౌతావు" అని చెప్తాడు. మరియ తన అంగీకారాన్ని సూచిస్తూ "ఇదిగో ప్రభువు దాసురాలను. నీమాట చొప్పుననే నాకు జరగాలి" అంటుంది. ఆ విధంగా ఆమె తన కన్యాత్వానికి భంగం కలుగకుండానే బిడ్డను కంది.

అంతకు ఎన్మిదివందల ఏండ్లకు పూర్వమే ప్రవక్త యెషయా "కన్య గర్భవతియై బిడ్డను కంటుంది, ఆ బిడ్డకు ఇమ్మానువేలు అని పేరు పెడతారు" అని ప్రవచనం చెప్పాడు. 7,14. చారిత్రకంగా యీ ప్రవచనం ఆహాసు రాజు భార్య కనిన హిజ్కియా ప్రభువునకు వర్తించినా, ప్రవక్తకుకూడ తెలియరాని పరిపూర్ణార్థం వలన కన్యమరియకు కూడ వర్తిస్తుంది. అందుకే సువిశేషకారుడు మత్తయి ఈ ప్రవచనాన్ని మరియ పరంగా ఉదాహరించాడు - 1,23.

పై బైబులు సందర్భాలు రెండూ మరియ బిడ్డను కనకముందు కన్యగా వుందని సూచిస్తాయి. కాని బిడ్డను కన్న తరువాత? ఆమె బిడ్డను కన్న తరువాతకూడ కన్యగా వుండిపోయిందని బైబులు ఎక్కడా చెప్పదు. కాని అలా వుండిపోలేదని కూడ ఎక్కడా చెప్పదు. సువార్తల్లో పలుతావుల్లో "క్రీస్తు సోదరులు" అనేమాట విన్పిస్తుంది. కాని హీబ్రూభాషా మర్యాద తెలిసినవాళ్లు ఈ "సోదరులు" క్రీస్తు సొంత తమ్ముళ్ళు కాదనీ పినతల్లి పెత్తల్లి లేక చిన్నాయన పెదనాయన బిడ్డలని వెంటనే గ్రహిస్తారు. అలాగే "మరియ తొలిచూలు బిడ్డను కంది" అనే ప్రయోగంగూడ ఆమెకు మలిచూలు బిడ్డలున్నారని నిరూపింపదు - లూకా 2,7. "కుమారుని కనేవరకు యేసేపునకు ఆమెతో శారీరక సంబంధంలేదు" అనే మత్తయి 1,25 వచనంకూడ, క్రీస్తు తరువాత మరియమాతకు మళ్ళీ పిల్లలు పుట్టారని రుజువు చేయదు. బైబులు స్పష్టంగా చెప్పదుగాని పారంపర్యంగా వచ్చిన క్రైస్తవ సంప్రదాయం మాత్రం మరియ బిడ్డను కన్న తరువాతగూడ కన్యగానే వుండిపోయిందని చెప్తుంది. అందుకే ఆమెను "నిత్యకన్య" అంటాం.

## 2. ఆత్మశక్తి

దూత మరియతో "పవిత్రాత్మ నీ మీదికి దిగివస్తుంది. సర్వోన్నతుని శక్తి నిన్ను ఆవరిస్తుంది. అంచేత నీకు జన్మింపబోయే పవిత్ర శిశువు దేవుని కుమారుడౌతాడు" అంటాడు - లూకా 1,35. కనుక మరియ పవిత్రాత్మ శక్తి వలన గర్భవతి ఐంది. కాని యిక్కడ పరిశుద్ధాత్మ చేసిందేమిటి? ఆ యాత్ముడు పిత సుతుడు అనే దైవవ్యక్తులను ఐక్యపరుస్తుంటాడు. నరుని దేవునితో జోడిస్తుంటాడు. కనుక ఆ యాత్ముడు ఐక్యతా

గుణాన్ని ప్రసాదించే దివ్యశక్తి. ఆ దివ్యాత్మడే రెండవ దైవవ్యక్తియైన వార్తను మరియతో ఐక్యపరుస్తాడు. ఆ దివ్యశక్తి వలననే మరియ గర్భవతి ఔతుంది.

ఈ శక్తి శారీరకమైంది కాదు. పరిశుద్ధాత్మ మరియకు భర్తాకాదు. క్రీస్తుకు తండ్రీకాదు. అసలు పరిశుద్ధాత్మ కేవలం ఆత్మ స్వరూపం. కనుక మరియమీద పనిచేసింది భౌతికశక్తిగాదు. ఆధ్యాత్మిక శక్తి. ఈ ఆధ్యాత్మిక శక్తినే బైబులు చాలాతావుల్లో "అభిషేకం" అని పిలుస్తుంది. ఆత్మ మరియను అభిషేకించింది. అనగా ఆమెయందు అంతరంగికంగా, ఆధ్యాత్మికంగా చైతన్యం కలిగించింది. కలిగించి ఆమె స్వయంగానే బిడ్డను కనే శక్తిని ప్రసాదించింది. ఈ అభిషేకం వలననే క్రీస్తుకూడ శక్తిని పొంది మెస్సీయాగా దేవుని ప్రతినిధిగా బహిరంగ జీవితం ప్రారంభించాడు - లూకా 4,18. ఈ అభిషేకం వలననే మనంకూడ జ్ఞానస్నాన సమయంలో ఆధ్యాత్మిక శక్తినిపొంది దేవుని బిడ్డలమౌతాం. 1యో 2,27. మరియకూడ ఈలాంటి అభిషేకం వలననే గర్భవతి ఐంది. నూత్నవేద ప్రజల్లో మొదట పరిశుద్ధాత్మను పొందిన వ్యక్తి మరియమాత. ఈ యాత్మ శక్తి వలననే ఆమె నరుణ్ణి దేవునితో, దేవుణ్ణి నరునితో జోడింప గలిగింది. దేవుణ్ణి నరుణ్ణిచేసి నరుణ్ణి దేవుణ్ణి చేయగలిగింది.

## 3. మరియ కన్యగా ఉండిపోవటానికి కారణాలు

మరియ నిత్యకన్యగా ఉండిపోయిందన్నాం. ఎందుకు? ఆమె దేవునికి తల్లిగా ఎన్నుకోబడింది. కనుక తాను పూర్తిగా దేవునికే చెందివుండాలి. పూర్తిగా దైవసేవకే అంకితంకావాలి. తాను అన్యులకు చెందిపోగూడదు. పౌలు "వివాహిత భర్తనేలా సంతోషపెట్టాలా అని రేయింబవళ్ళు భర్తృసంబంధ విషయాలతో సతమత మౌతూంటుంది. కాని ప్రభువునకు సమర్పితయైన కన్య ప్రభువునేలా సంతోషపెట్టాలా అని ఆందోళన పడుతూ దేహంనందూ ఆత్మయందూ విశుద్ధరాలై వుంటుంది" అంటాడు - 1 కొ 7, 34. కనుక మరియ కన్యగా వుండిపోయింది పూర్తిగా దేవునికి చెందివుండడము కోసమే. ప్రభుని సంతోష పెట్టడం కోసమే. తన ప్రేమనంతా దేవునికి నైవేద్యం చేయడం కోసమే. అందుకే మానవమాత్రులు ఆమె ప్రేమను పంచుకోలేదు.

వివాహం క్రీస్తుకూ శ్రీసభకూ వుండే ఐక్యభావం సూచిస్తుంది. కాని కన్యాత్వం క్రీస్తుకూ కన్యకూ వుండే ఐక్యభావం సూచిస్తుంది. క్రీస్తుకే వివాహమైన వధువు కన్య. కావున మరియ పాపంలేకుండా పుట్టడానికీ, కన్యగా వుండిపోవడానికీ కారణం ఒక్కటే. దేవునికి తల్లి అయ్యేందుకు, దేవునికి అంకితమయ్యేందుకు. ఈలా కన్యగా వుండిపోయి మరియ నిండు హృదయంతో ప్రభువును ప్రేమించేది. పూర్వవేదం చదువుకుంటూ ఆ

ప్రభువును ధ్యానించుకునేది. యెరూషలేము దేవాలయానికి వెళ్ళి ఆ ప్రభువును ఆరాధించుకునేది. ఆ ప్రభువు పాపపులోకాన్ని ఉద్ధరించాలని వేడుకుంటూండేది. ఆమె ప్రార్థనా ఫలితంగా ప్రభువు తన ప్రతినిధియైన మెస్సీయాను సత్వరంగా భూమి మీదకు పంపాడు.

పూర్వవేదం కన్యాత్వాన్ని పెద్దచూపు చూడలేదు. పూర్వ, నూత్న వేదాల మధ్యకాలంలో జీవించిన కుమ్రాను భక్తులు మాత్రం కన్యాత్వాన్ని ఆదరించారు. ఇక క్రీస్తు వచ్చాక నూత్నవేదంలో కన్నెరికానికి విలువ హెచ్చింది. ఈలా శ్రీసభలో కన్యాత్వాన్ని స్థాపించి కన్యా జీవితానికి గౌరవస్థానం కల్పించిన ప్రభువు, తన తల్లికిగూడ ఈ భాగ్యాన్ని ప్రసాదింపకపోడు గదా!

## 4. కన్నెరికపు విలువలు

మరియ కన్యగా వుండిపోయి చాల విలువలు నెలకొల్పింది. క్రీస్తుకు పరలోకంలో తల్లిలేదు. భూలోకంలో తండ్రిలేడు. అనగా అక్కడ యిక్కడాను మానుష ప్రయత్నం లేకుండానే జన్మించిన ఏకైక కుమారుడు యేసు. ఈలాంటి కుమారునికి తల్లియై జన్మ సార్థకం జేసుకుంది మరియ. బలిపీఠంమీది పాత్రం పవిత్రమైంది. దాన్ని వేరేపానీయాలకు వాడం. క్రీస్తు జననంద్వారా మరియమాత గర్భంకూడ పవిత్రమైంది. ఆ గర్భం దేవునికే అంకితమైంది. ఆ గర్భం నుండి వేరే బిడ్డలు కలుగరు. కలుగకూడదు. ఆమె కన్నెరికం అంత విలువైంది.

కన్యాత్వంద్వారానే మరియ దేవునికి యోగ్యురాలైన తల్లి కాగల్గింది. కన్యాత్వం ద్వారానే ఆమె మనకూ తల్లి ఔతుంది. మన రక్షణకోసం ప్రభుని ప్రార్థిస్తుంది. మనకు వరప్రసాదాలు ఆర్జించి పెడుతుంది. మనలను పవిత్రులను చేస్తుంది.

ప్రాచీన క్రైస్తవ రచయితలు ఆమె కన్నెరికాన్ని వేనోళ్ళ కొనియాడారు. సీనాయివద్ద మోషే చూచిన పొద కాలుతూకూడ నుసికాలేదు. సంసారజీవితం జీవించి బిడ్డనుకన్నా మరియ తన కన్యాత్వాన్ని కోల్పోలేదు. ఆమె తన్ను సృష్టించిన దేవుణ్ణి, భూమ్యాకాశాలు భరించలేని ప్రభువుని, తన ఉదరంలో భరించిన భాగ్యమూర్తి. దానియేలు గ్రంథం వర్ణించే అగ్ని గుండంలోని అగ్ని బాలురను తాకలేదు. అలాగే మరియమాత గర్భంలో ప్రవేశించిన దైవతేజస్సుకూడ ఆమె కన్యత్వాన్ని నాశంచేయలేదు. యెహెజ్కేలు గ్రంథం వర్ణించే తూర్పుద్వారం, ఓమారు ప్రభువు ప్రవేశించాక శాశ్వతంగా మూసివేయబడింది - 44,12. ఇక నరులెవ్వరూ దానిలో ప్రవేశింపలేరు. అలాగే మరియ గర్భమూ ఓమారు క్రీస్తు జన్మించాక పూర్తిగా మూసివేయబడింది. ఇక ఆమెకు వేరే బిడ్డలంటూ కలుగలేదు.

క్రీస్తు మృతశరీరాన్ని రాతి బండయందు తొలిచిన సమాధిలో వుంచారు. అంతకుముందు ఆ సమాధిలో ఎవరినీ ఉంచలేదు. క్రీస్తు తర్వాత ఇంకెవ్వరినీ ఉంచలేదు. అలాగే కన్యమాత గర్భంకూడాను. క్రీస్తు జన్మింపక ముందుగాని, జన్మించినంకగాని ఆ గర్భంలో మరో శిశువు నెలకొనలేదు. క్రీస్తు సమాధిరాతిని ఛేదించకుండానే వెలుపలకు వచ్చాడు. గది తలుపులు తీయకుండానే గదిలోపల ప్రవేశించాడు. అలాగే ప్రభువు మరియ కన్యాత్వం చెడకుండానే అమె గర్భంలో ప్రవేశించాడు. కన్యాత్వం చెడకుండానే ఆమె గర్భం నుండి వెలువడ్డాడు.

మామూలుగా కన్య తల్లి కాలేదు, తల్లి కన్యగా వుండలేదు. ఐనా మరియ మాత్రం కన్య, తల్లికూడ. ఆమె కన్యగా వుండిపోయింది తన్ను తాను దేవుని సమర్పించుకొనడం కోసం అన్నాం. తాను మాతృమూర్తి కావడం ద్వారా ఈ సమర్పణ భావం ఫలసిద్ధి నందింది. తన్ను తాను అంకితం చేసికొనిన దేవుణ్ణి అధికానురాగంతో ప్రేమించింది. పైగా కన్యగా వుండడంవల్ల ఆమె హృదయం అవిభక్తంగా వుండిపోయింది. కనుక మరియ తన దేవుడు, పుత్రుడు ఐన క్రీస్తుని కన్యా హృదయంతోను, మాతృ హృదయంతోను ప్రేమించిందని చెప్పాలి.

## 5. కన్య మరియ బోధించే సత్యాలు

ఈ సందర్భంలో కన్య మరియ మనకు మూడు సత్యాలను జ్ఞాపకం చేస్తుంది. మొదటిది, కన్యాత్వం రాబోయే మోక్ష సామ్రాజ్యపు జీవితాన్ని సూచిస్తుంటుంది. వివాహంద్వారా బిడ్డలను కంటాం. కాని ఈలా పుట్టిన నరులకు మరణం తథ్యం. ఐతే కన్యాత్వం మరణాన్ని జయించే మోక్ష జీవితాన్నీ, ఉత్థాన జీవితాన్నీ సూచిస్తూంది - లూకా 20, 34-36. కనుక వివాహ జీవితం మరణానికీ, కన్యా జీవితం శాశ్వత జీవానికీ సంకేతంగా వుంటాయి.

రెండవది, కన్యాత్వమంటే దేవునికి సమర్పితం కావడం. దేవుని సన్నిధిలో నడవడం. ఆ దేవునికి పరిచర్య చేయడం. ఆ దేవునికోసం తోడిప్రజలను ఆదరించడం. కన్య భగవంతునికి నివేదిత. కావున పవిత్రమూర్తి. సమర్పణమే కన్యాత్వపు ప్రధాన విలువ.

మూడవది, కన్యాత్వాన్ని మనంతట మనం పాటించలేం. అది భగవంతుడు అనుగ్రహించే వరం. మొదటి ధన్యవచనం సూచించే దీనాత్ములు దేవునివద్ద నుండి పొందే భాగ్యం - మత్త 5,3. కనుక మనం దీనభావంతో ఈ భాగ్యాన్ని దేవుని వద్దనుండి అడుగుకోవాలి.

### 6. కన్యమాతపట్ల భక్తిభావాలు

కన్యాజీవితం జీవించడంలో, పరిశుద్ధ జీవితం గడపడంలో కన్యమరియ మనకు ఆదర్శంగా వుంటుంది. ఈ పరిశుద్ధ జీవితానికి విరుద్ధంగావచ్చే శోధనలను జయించడానికి ఆ తల్లి సహాయపడుతుంది. కన్యమరియ వినయమూ మర్యాదా ఆమె కన్యాత్వాన్ని కాపాడాయి. ఆనాడు ఆమెను చూచినపుడు ఎవరికీ కామభావాలు కలుగలేదు. ఆమె ఆకారమూ, ప్రవర్తనమూ ఇతరులలోకూడ పరిశుద్ధభావాలు కలిగించేలా వుండేవి. మనంకూడ ఈలాగే విశుద్ధ జీవితం జీవించేలా సాయపడమని ఆ తల్లిని అడుగుకుందాం.

మన ఈ దేహం జ్ఞానస్నానం ద్వారా ప్రభువుకే నివేదితమైంది. కనుక మనం అశుభ్రవర్తనంతో ఈ దేహాన్ని అమంగళ పరచకూడదు. క్రైస్తవుడు ఈ దేహంతోను పాపం చేయకూడదు, ఈ దేహంలోను పాపం చేయకూడదు – 1కొ 6,18. ఆ పునీతకన్య తన దేహాన్ని శుచిమంతంగా కాపాడుకుంది. మనమూ మన దేహాలను శుచిమంతంగా వుంచుకునేలా సాయపడమని ఆ తల్లిని వేడుకుందాం.

మరియ దేవునికి నివేదిత. అలాగే మనమూ మన బిడ్డలను దైవసేవకు అర్పిస్తుండాలి. పూవును కోసి ముచ్చటగా జడలో ముడుచుకోవడం మంచిదే. కాని అదే పూవుని భగవంతుని పీఠంమీద సమర్పించడం ఇంకా యోగ్యమైంది. అలాగే మన బాలికను ఓ పురుషునికి సమర్పించడం మంచిదే. కాని దేవునికి అంకితం చేయడం ఇంకా యోగ్యమైనపని. మన పుత్రులను దైవసేవకు అర్పించడమూ ఈలాంటిదే. మరియ మనకు ఈలాంటి కోరికలు కలిగించాలని వేడుకుందాం.

మరియ దేవునికి అంకితమైన భక్తురాలు. ఆమెను చూచి మనంకూడ హృదయం దేవునివైపు మరల్చడం నేర్చుకోవాలి. మన హృదయం ఈ లోక సుఖభోగాలతో సంతృప్తి చెందలేదు. అది దేవునికోసం కలిగింపబడింది. ఆ దేవుని ప్రేమించి ఆ దేవునియందు విశ్రమిస్తే గాని దానికి విశ్రాంతి అంటూ వుండదు. కనుక మన హృదయాలను దేవునివైపు మరల్చే భాగ్యంకోసంగూడ ఆ తల్లిని మనవిచేద్దాం.

## 3. దేవమాత

సిరియా దేశభక్తుడు ఏఫ్రేము "మరియ తన చేతుల్లో నిప్పును నిలుపుకుంది. తన బాహువులతో అగ్నిజ్వాలను ఆలింగనం చేసుకుంది. ఈ యగ్నిజ్వాలను ఆమె స్తన్యమిచ్చి పోషించింది. సమస్త ప్రాణికోటిని పోషించే పోషకుణ్ణి స్వయంగా చనుబాలతో పోషించి పెద్దచేసింది. భూమ్యాకాశాలు భరించలేని విశ్వభర్తను తన ఉదరంలో భరించింది. ఆ

మరియ మహిమను కొనియాడ్డం ఎవరితరం?" అని వ్రాసాడు. మరియ దేవమాత. మానవులమాత. ప్రస్తుతం ఆ పునీతమాతనుగూర్చి నాల్గంశాలను విచారిద్దాం.

## 1. దేవమాత

మరియమాత ఎలా దేవమాత ఔతుంది? క్రీస్తులో రెండు స్వభావాలు ఉన్నాయి. అతడు నరుడూ, దేవుడునూ. ఐనా ఈ క్రీస్తు ఇద్దరు వ్యక్తులు కాదు, ఒకే వ్యక్తి. అతడు దేవుడూ మానవుడూ ఐన క్రీస్తు. దైవవార్త మానుషదేహాన్ని స్వీకరింపగా క్రీస్తు ఆవిర్భవించాడు. ఈలా మానవుడు దేవుడూ ఐన ఏకైక వ్యక్తిని మరియ కన్నది. ఆమెకు పుట్టిన కుమారుడు క్రీస్తు మొదట దేవుడై అటుతరువాత మానవుడు కాలేదు. లేదా మొదట మానవుడై తర్వాత దేవుడు కాలేదు. అతడు మొదటి నుండి దేవుడూ మానవుడూను. అతడు దేవుడూ మానవుడూ కనుక అతన్ని కన్నతల్లికూడ దేవునికీ మానవునికీ తల్లి ఔతుంది. అందుచేత ఆమెను "దేవమాత" అని పిలుస్తుంటాం.

ఈలా దేవమాత కావడం కోసమే మరియ పాపం లేకుండా నిష్కళంకగా ఉద్భవించింది. ఇందుకోసమే ఆమె కన్యగా వుండిపోయి ప్రభువుకి తన నిండు హృదయాన్ని సమర్పించుకుంది. ఇందుకొరకే ఆమె సకల వరప్రసాదాలూ పొంది సుందరమైన వధువుగా తయారైంది.

మరియ దేవమాత కావడమంటే యేమిటి? ఆమె మూలంగా దేవుడు మన మానవ కుటుంబంలోకి దిగి వచ్చాడు. మన మంటిమీద అడుగుపెట్టాడు. ఆమె వలన క్రీస్తునందు మన రక్తమాంసాలు ఏర్పడ్డాయి. అతడు మనకు పెద్దన్న కాగలిగాడు. మనము అతని తమ్ముళ్ళమూ, చెల్లెళ్ళమూ అయ్యాం. దేవుణ్ణి నరునివద్దకు కొనివచ్చి నరుని దేవుని వద్దకు కొనిపోయే ధన్యురాలు మరియ.

## 2. విశ్వాసుల మాత

మరియ దేవమాత మాత్రమేకాదు. విశ్వాసులమాత కూడ. ఎలాగ? ఆమె క్రీస్తుమాత అన్నాం. క్రీస్తులోకి జ్ఞానస్నానం పొందేవాళ్ళంతా అతనితో ఐక్యమౌతారు. అతడు వాళ్ళకు శిరస్సు. వాళ్ళు అతని దేహం - రోమ 12,5. అతడు తల్లితీగ, వాళ్ళు అతనిలోకి అతుక్కపోయిన రెమ్మలు - యోహా 15,5. అతడు పునాదిరాయి. వాళ్ళు అతనిమీద భవనంగా నిర్మింపబడే సజీవశిలలు -1 పేత్రు 2,5. ఈ క్రీస్తు పూర్తి క్రీస్తు. జ్ఞానక్రీస్తు. అనగా రక్షకుడూ, రక్షణం పొందవలసిన వాళ్ళూను. ఇక క్రీస్తును కన్న మరియమాత ఈ పూర్తి క్రీస్తునుకూడ కంది. అనగా క్రీస్తు మాత, క్రీస్తుతో ఐక్యమైన

మనకూ తల్లి ఔతుంది. అందుకే ప్రభువు కల్వరిమీద శిష్యునితో "ఇదిగో నీ తల్లి" అని వక్కాణించాడు - యోహా 19,27. ఇక్కడ యీ శిష్యుడు క్రీస్తును నమ్మే శిష్యులందరికీ ప్రాతినిధ్యం వహిస్తాడు. కనుక అమె మనకందరికీ తల్లిగా ఈయబడింది. ఆ తల్లి క్రీస్తును గర్భంలో ధరించినపుడే మనలనుకూడ తన ఉదరంలో మోసింది. శిరస్సు అవయవాలతో గూడిన పూర్తి క్రీస్తునకు ఆమె జనని. ఇక్కడ ఒక్కటే భేదం. ఆమె క్రీస్తుకు భౌతికంగా జనని. మనకు మాత్రం జ్ఞానరీత్యా తల్లి. అనగా మనం జ్ఞానస్నానం ద్వారా క్రీస్తుతో ఐక్యం గావడంవలన ఆమె మనకు తల్లి ఔతుంది.

ప్రాచీన క్రైస్తవ రచయితలు మరియమాతను తొలి తల్లి ఏవతో పోల్చారు. ఏవ దుష్టదూత మాటవిని తినవద్దన్న పండు తిని అవిధేయత చూపింది. రెండవ యేవయైన మరియ దేవదూత మాటవిని విధేయత చూపింది. ఆమె చెడ్డదూత మాటవిని మోసపోయింది. ఈమె మంచిదూత పలుకు ఆలించి, ఆ చెడ్డదూతను ఓడించింది. ఆ తొలితల్లి తన తెలివితక్కువతనంవల్ల మనకు చావుతెచ్చిపెట్టింది. మన మెడకు ఉరిపెట్టి పోయింది. కావున ఆమె మృతులమాత. కాని యీ రెండవతల్లి తన వివేకంవల్ల మనకు జీవం సంపాదించి పెట్టింది. మన మెడకు తగులుకొనిన ఉరిని తొలగించింది. కావున ఈమె జీవవంతులమాత. ఆ తల్లికంటె యీ తల్లి యోగ్యురాలు. ఆ తల్లి పాపానికి ఈ తల్లి ప్రాయశ్చిత్తం కూడ చేసింది. ఆ తల్లి తరపున ఈ తల్లి ప్రభువునకు విన్నపం చేసింది.

## 3. మాతృత్వపు మహిమలు

మరియ దేవుని తల్లి అన్నాం. దేవమాత గావడమంటే సామాన్య భాగ్యంకాదు. సృష్టి ప్రాణికి ఇక యింతకంటె గొప్ప భాగ్యమూ, మహిమా లేనేలేదు. దేవుని తరువాత దేవుడంతటి వ్యక్తి మరియ. ఆమెకు దేవునికంటె తక్కువ స్థానం. కాని పునీతులకంటె దేవదూతలకంటెకూడ యెక్కువ స్థానం. అనగా దేవునికి చాలా దగ్గరస్థానం. ఆ కుమారుడెంత యోగ్యుడో ఆ తల్లీ అంత యోగ్యురాలు. అందుకే దేవమాత ప్రార్థనలోని బిరుదులన్నిటికంటె "సర్వేశ్వరునిమాత" అనేది చాల గొప్పబిరుదం. ఈ భాగ్యం వలననే సమస్త జాతిజనులూ ఆమెను ధన్యురాలని మెచ్చుకుంటారు - లూకా 1, 48. ఈ భాగ్యం దేవుడే ఆమెకిచ్చిన వరం. కాని ఈ వరంతో ఆమె సహకరించింది. దేవుని పూర్ణహృదయంతో ప్రేమిస్తూ, దివ్య మాతృత్వానికి తన్నుతాను తయారుచేసుకుంది. భక్తుడు అగస్టీను నుడివినట్లు "మరియ దేవుని గర్భంలో ధరించకముందే హృదయంలో ధరించింది." అనగా ఆమె భగవద్హృదయ, సద్భగవద్భక్తురాలు.

ఆ తల్లి మనవిని క్రీస్తు త్రోసివేయడు. ఆమె పాపాత్ములకోసం నిత్యం మనవి చేస్తుంది. విశ్వాసులందరికోసం ప్రభుని వేడుకుంటుంది. ఆమెకు మనకు సహాయం చేయాలనే కోరికా వుంటుంది. శక్తీ వుంటుంది. కనుక తాను సహాయం చేసితీరుతుంది.

మరియ దేవునికి మాత్రమేగాదు, విశ్వాసులకుగూడ తల్లి అన్నాం. క్రీస్తుకు భౌతికంగాను మనకు జ్ఞానరీత్యాను తల్లి అన్నాం. భౌతికంగా ఆ బిడ్డను చనుబాలతో పెంచి పెద్దజేసింది. జ్ఞానరీత్యా మనలను వరప్రసాదాలతో పెంచి పెద్దజేస్తుంది. ఈ వరప్రసాదాలను మనతరపున క్రీస్తు నుండి అడిగి పెడుతుంది.

పరలోకపిత మరియను కలిగించింది కేవలం క్రీస్తుకు తల్లిగా వుండడంకోసం మాత్రమే గాదు. దేవదూతలకు రాజ్ఞిగా వుండడం కోసం గూడ. పిశాచాలను జయించడం కోసం గూడ. నరులకు సహాయం చేయడంకోసం గూడ. కనుక ఆ తల్లి మనకు అనుగ్రహాలు ఎన్నైనా ఆర్జించి పెడుతుంది. మేళ్ళు ఎన్నైనా చేకూర్చి పెడుతుంది.

## 4. పునీతమాతపట్ల భక్తిభావాలు

పతనమైన మానవుణ్ణి భగవంతుడు స్వయంగానే రక్షించి వుండవచ్చు. కాని అలాచేయడం నరుని స్వాతంత్ర్యానికి, గౌరవానికి భంగం కలిగించినట్లే ఔతుంది. నరుణ్ణి నరుడే రక్షించుకుంటే అతని స్వాతంత్రత్యానికి తగినట్లుగా వుంటుంది. అందుకే దేవుడు నరుడై జన్మించాడు. నరుడైన దేవునినుండే నరునికి రక్షణ కలిగింది. విరిగిపోయిన పూల మొక్క దాన్నదే బాగుచేసికొని మళ్ళా పూలు పూచింది. కాని ఈ దేవుణ్ణి నరకుటుంబములో ప్రవేశపెట్టి నరుల రక్షణం నరకుటుంబంనుండే వచ్చేలా చేసింది మరియ. ఆమెవలన దేవుణ్ణి మన మానవుణ్ణి చేసికున్నాం. మనలను మనమే రక్షించుకున్నాం. మన మర్యాద కాపాడుకున్నాం. అలాంటి తల్లికి మనం చేతులెత్తి జోహారులర్పించాలి. ఆమెను వేనోళ్ళ పొగడి కొనియాడాలి.

జంతువులు పిల్లలను గంటాయి. నరులూ బిడ్డలను కంటారు. జంతువులు కేవలం వాటి పిల్లల దేహపోషణం కొరకు చన్ను జేపి పాలిచ్చి పోషిస్తాయి. ఆ పిల్లలు పెద్దయ్యాక వాటినిక పట్టించుకోవు. కాని నరులు అలా కాదు. మానవ మాతాపితలు తమ బిడ్డలను వ్యక్తుల్లాగ ఆదరిస్తారు. శాశ్వతంగా ప్రేమిస్తారు. మరియకూడ ఈలాగే. ఆమె మెస్సియాకు తల్లి కావడానికి ప్రేమభావంతో అంగీకరించింది. మెస్సియా శిశువును కంది. ఆ కుమారుణ్ణి గాఢంగా ప్రేమించింది. కాని యీ కుమారుడు మన తల్లులంతా కనే కుమారుల్లాంటివాడు కాడు. భగవంతుడు కూడ. కనుక మరియ ఈ కుమారుణ్ణి ఎంతగా ప్రేమించేదో అంతగా ఆరాధించేది కూడ. ఆమె ప్రేమే ఆరాధన. మనం క్రీస్తుని

"నా దేవా! నా ప్రభూ!" అంటాం. కాని ఆమె "నా కుమారా! నాదేవా"! అనుకునేది. ఈలాంటితల్లి మరియ ఒక్కర్తే. కనుక ఆమెను ఎంతైనా స్తుతించాలి.

క్రీస్తు రక్షకుడు, మనం రక్షింపబడిన వాళ్ళం. ఈ రక్షణం ద్వారానే పరలోకంలోని పిత మనతండ్రి ఔతాడు. క్రీస్తు మన పెద్దన్న ఔతాడు. మరియమాత మానవుల తల్లి అవుతుంది. ఈ తల్లిని మనం స్తుతించి మహిమపరచాలి. ఆమె మహిమలన్నింటిలోను గొప్ప మహిమ దైవమాతృక గావడం. ఈ మాతృత్వాన్ని బట్టే స్త్రీ లందరిలోను మరియ ధన్యురాలు. సమస్త జాతులూ ఆమెను భాగ్యవతి అని కొనియాడతాయి. కొంతమంది భక్తులు దేవమాత వద్దనుండి నిత్యం అవీ యివీ అడుగుకొంటూ వుంటారు గాని ఆమె మహిమనూ, మాతృత్వాన్నీ స్మరించనే స్మరించరు. ఎవడో వొకడు నిత్యం మంగళ వార్తజపంలో రెండవభాగం మాత్రమే చెప్పుకునేవాడట! ఈ జపంలో మొదటిభాగం మరియను స్తుతిస్తుంది. రెండవభాగం ఆయా మనవులను అడుగుకుంటుంది. అతడు మరియమాత నుండి మనవులు పొందితే చాలు, ఆమెను స్తుతించటం దేనికిలే అనుకున్నాడు. మన ప్రవర్తన ఈలా వుండకూడదు.

మరియమాత ఆనాడు లోకానికి క్రీస్తు నందించింది. ఈనాడు మనకూ ఆ క్రీస్తు నందించమని ఆ తల్లిని అడుగుకోవాలి. ఆమెను కొనియాడుతూ "నీ గర్భఫలం ఆశీర్వదింపబడునుగాక" అంటాం. మరియ అనే చెట్టు క్రీస్తు అనే మంచి పండును కాచింది. ఆ పండును సంపాదించుకొంటే మనమూ ధన్యులమౌతాం. కనుక ఆ పండుకోసం ఆ తల్లిని అడుగుకోవాలి.

భక్తుడు బెర్నార్డు జీవితంలో ఓ వృత్తాంతం. విన్పిస్తుంది. బెర్నార్డు మరియ భక్తుడు. ఓనాడు అతడు మరియ మాతమీద సుమ్మర్లు పడుతూ "నీవు నాపట్ల తల్లిలా మెలగడంలేదుకదా?" అన్నాట్ట. వెంటనే మరియ అతని మాటల తీరు సవరిస్తూ "నీవు మాత్రం నాపట్ల బిడ్డలా మెలుగుతున్నావా?" అని అడిగిందిట. మనంకూడ ఏబ్రాసిపనులు చేసినపుడెల్ల మరియమాతపట్ల బిడ్డల్లా మెలగడం మానివేస్తుంటాం. ఈ దౌర్భాగ్యానికి గురికాకుండా వుండాలని కూడ ఆ తల్లినే అడుగుకుందాం.

## 4. రక్షణమాత

రెండవ శతాబ్దపు భక్తుడు ఇరెనేయుస్ "ఏవ అవిధేయురాలై చావు తెచ్చిపెట్టుకుంది. మనకూ చావు కలిగించింది. కాని మరియ దూతవాక్యానికి విధేయురాలై రక్షణం సంపాదించుకుంది. నరజాతి కంతటికీ రక్షణం ఆర్జించి పెట్టింది. ఏవ తన అవిధేయత వలన మనకు ఓ వురి తగిలించిపోయింది. మరియ తన విధేయత వలన ఆ

వురి తొలగించింది. ఆ తొలికన్య అవిశ్వాసంతో మనకు ఓ ముడి పెట్టిపోయింది. ఈ మలికన్య విశ్వాసంతో ఆ ముడి విప్పింది" అని వ్రాసాడు. మరియ రెండవ యేవ. ఆ తొలి యేవ మనపతనానికి కారణమైనట్లే ఈ మలియేవ మన ఉద్ధరణానికి కారణమైంది. కనుక ఈమె రక్షణమాత. ప్రస్తుతం రక్షణ మాతనుగూర్చి మూడంశాలు విచారిద్దాం.

## 1. ఇద్దరు ఏవలు

తొలి ఆదాము పాపంచేసాడు. అతడు మన నరజాతికి శిరస్సు. కనుక అతనిపాపం మనకూ సంక్రమించింది. అతని వలన మనమంతా పతనమైపోయాం. ఈ పాపానికి పరిహారం చేయడం కోసమే రెండవ ఆదాము క్రీస్తు వచ్చాడు.

ఆ తొలి ఆదాము పాపంలో ఓ స్త్రీ కూడ పాల్గొంది. ఆమె పాపం దానంతటదే మనలను నాశంజేసివుండదు. ఆదాము పాపం చేయకుండా ఏవమాత్రమే పాపం చేసినట్లయితే మనం పతనమైపోయివుండం. ఎందుకంటే ఆమె మనకు తలగాదు. కాని ఆదాము పాపముతోగూడి ఆమె పాపం కూడ మనకు నాశం తెచ్చి పెట్టింది.

తొలి ఆదాము మనలను నాశం జేసినట్లే మలి ఆదాము క్రీస్తు మనలను ఉద్ధరించాడు. అతనిలాగే ఇతడూ నరజాతికి శిరస్సు. కనుకనే క్రీస్తు రక్షణం మనకూ సంక్రమించింది.

ఈ రెండవ ఆదాము ఉద్ధరణంలో ఓ స్త్రీ కూడ పాల్గొంది. ఆమె ఉద్ధరణం దానంతటదే మనలను రక్షించి వుండదు. నరజాతికి శిరస్సు క్రీస్తుకాని మరియకాదు. క్రీస్తు సిలువమీద చనిపోకపోయినట్లయితే మరియ ఎంత కృషిచేసినా మనకు రక్షణం లభించివుండదు. కాని క్రీస్తు రక్షణకార్యంలో మరియకూడ పాల్గొనడం వల్ల క్రీస్తుతోపాటు ఆమెకూడ మనలను రక్షించింది.

ఐనా క్రీస్తు రక్షణమూ మరియమాత రక్షణమూ ఒకే కోవకు చెందినవిగావు. క్రీస్తు మనకు అవసరమైన రక్షకుడు. అతడులేక నరజాతికి రక్షణంలేదు. పౌలు వాకొన్నట్లు "దేవునికీ మానవునికీ మధ్య ఒక్కడు మధ్యవర్తి, క్రీస్తు - 1తిమో 2,5. ఇక మరియమాత రక్షణం క్రీస్తు రక్షణంలాగ అవసరమైగాదు. ఔచిత్యంకోసం మాత్రమే. ఏమిటి ఆ ఔచిత్యం?

అక్కడ మన పతనంలో ఓ స్త్రీ పాల్గొంది అన్నాం. ఇక్కడ మన ఉద్ధరణంలోగూడ మళ్ళా ఓ స్త్రీ పాల్గొంటే ఔచిత్యంగా వుంటుందనుకొని దేవుడు క్రీస్తుతో ఈమెను జోడించాడు. ఆ యేవకు ఈ యేవ సరితూగు. క్రీస్తులేక మరియలేదు. క్రీస్తు రక్షణం లేక మరియమాత రక్షణంలేదు. క్రీస్తు రక్షణానికి మరియమాత రక్షణం ఏమి చేర్చదు. ఆమె రక్షణాన్ని తొలగించినా క్రీస్తు రక్షణం తగ్గిపోదు. కాని క్రీస్తు రక్షణంతో పాటు ఆమె రక్షణం కూడ వుంటుంది. క్రీస్తుతోపాటు ఆమెకూ స్థానం వుంది. ఆమెకు అసలు స్థానమేలేదు అనకూడదు.

మరియకూడ మన రక్షణంలో పాల్గొంది అన్నపుడు క్రీస్తుకి అప్రియం గలుగదు. ఆమెను గౌరవించడంద్వారా క్రీస్తుకి గౌరవం తగ్గిపోదు. ఆ తల్లిని గౌరవించినపుడు క్రీస్తునే గౌరవించినట్లు.

మరియ రెండవ యేవ. మన పతనాన్ని తలంచుకొనేపుడెల్లా తొలియేవను స్మరించక తప్పదు. అలాగే మన ఉద్ధరణాన్ని తలంచుకొనేపుడు ఈ రెండవ యేవను స్మరించకతప్పదు. తొలి యేవ పతనమూ, మలియేవ ఉద్ధరణమూ ఈ రెండూ చారిత్రక ఘట్టాలు. వీటిని మనం కాదనకూడదు, కాదనలేము. ఇక మరియ క్రీస్తు రక్షణంతో సహకరించడంవల్ల క్రీస్తుతోపాటు తనూ సహరక్షకి అనబడుతూంది అన్నాం. కాని మరియ క్రీస్తు రక్షణంతో ఏలా సహకరించింది? ఆమె మనలను ఏలా రక్షించింది?

## 2. మరియ మూడు దశల్లో సహరక్షకి

మరియ మూడుదశల్లో సహరక్షకిగా వ్యవహరించింది. క్రీస్తు జననమందు, కల్వరిమీద, మోక్షంనుండి. ఈ మూడు దశలను క్రమంగా విచారించి చూద్దాం.

మొదట, క్రీస్తు జననమందు మరియ సహరక్షకి. దేవదూత తన సందేహం తీర్చగానే మరియ "నీ మాట చొప్పున నా కగునుగాక" అంటుంది. ఆ వాక్యం ఈ నేలమీది నరులు పల్కిన వాక్యాలన్నిటిలోను గొప్పవాక్యం. ఈ వాక్యం ద్వారా పితతోపాటు సుతునితోపాటు మరియ కూడ మనుష్యావతారానికి సమ్మతించింది. ఈ సమయంలో ఆమె మానవులందరికీ ప్రాతినిధ్యం వహించింది. అనగా దేవుణ్ణి మానవలోకంలోకి తీసికొనిరావడానికి మనందరి తరపున ఒప్పుకుంది. ఇక్కడ ఆమె చూపిన బాధ్యతా, అంగీకారమూ చాల గొప్పవి.

క్రీస్తు ఆమెనుండి జన్మించాడుగదా? మరియ క్రీస్తుకి ఓ మానుషదేహాన్ని అర్పించింది. తరువాత ఈ దేహాన్నే క్రీస్తు సిలువమీద పితకు బలిగా అర్పించాడు. కనుక పూజలో గురువు రొట్టె, రసం అనే కానుకలను సమర్పించినట్లే మరియకూడ దైవవార్తకు మానుషదేహం సమర్పించింది. ఈ బలివస్తువు వలననే కల్వరియాగం నిర్వహింపబడింది.

ఆ తల్లి బలికై గొర్రెపిల్లను సంసిద్ధం చేసింది. లోకపు పాపాలకు పరిహారం చేయడం కోసమై ఈ గొర్రెపిల్ల సిలువమీద చనిపోయింది. ఈ రీతిగా మరియ క్రీస్తు జననం ద్వారానే మన రక్షణంలో పాల్గొంది. భక్తుడు అంబ్రోసు నుడివినట్లు, మరియ రక్షకుణ్ణి కనడం ద్వారానే మన రక్షణాన్ని కూడ కంది.

రెండవది, మరియ కల్వరిమీద మన రక్షణంలో పాల్గొంది. ఆమె కల్వరి కొండమీద క్రీస్తుతోపాటు తానూ బాధలు అనుభవించింది. అతని నెత్తుటితో తన కన్నీటిబొట్లను

మేళవించింది. అతనితో పాటు తానూ ఇంచుమించుగా చనిపోయింది. తల్లి హక్కులన్నిటినీ విడనాడి క్రీస్తును పరలోకపితకు అర్పించింది. సిలువమీద ఓ బలి అర్పింపబడుతూంటే ఆమె హృదయంలోకూడ ఓ బలి అర్పింపబడింది. ఈలా క్రీస్తును కల్వరి కొండమీద పితకు అర్పించింది. మరియ ఈ యర్పణం ద్వారా క్రీస్తుతోపాటు తానూ మన రక్షణంలో పాల్గొంది. మరియ సహకారం ద్వారా క్రీస్తు స్త్రీ పురుషుల పాపాలకుగూడ పరిహారం చేసినట్లయింది.

మరియ తొలిబిడ్డను కన్నపుడు ఏ బాధా అనుభవించలేదు. కాని కల్వరిమీద మలిబిడ్డలమైన మనలను కన్నపుడు ఎంతైనా బాధ అనుభవించింది. "ఇదిగో నీ కుమారుడు" అని క్రీస్తు నుడివినపుడు, ఆ మాటలద్వారా జ్ఞానవిధంగా తాను మనకు తల్లి ఐనపుడు, మరియ పుట్టెడు దుఃఖం అనుభవించింది. ఈలా ఆమె బాధామయమాతగానే మన రక్షణంలో పాల్గొంది.

ఈలా క్రీస్తుతోపాటు మన రక్షణంలో పాల్గొనేందుకే మరియ నిష్కల్మషగా పవిత్రురాలుగా పదిలపరచబడింది. తానే పాపాత్మురాలైనట్లయితే మనరక్షణంలో పాల్గొని వుండలేదు. తొలిస్త్రీ పాపాత్మురాలై మన నాశంలో పాల్గొంది. ఈ రెండవ స్త్రీ పునీతురాలై మనరక్షణంలో పాల్గొంది.

మూడవది, మరియ మోక్షంనుండిగూడ మన రక్షణంలో పాల్గొంటుంది. ఆమె ఈ లోకంలో వుండగా నరులకు సాయపడింది. ఆమె సాన్నిధ్యం ద్వారా యెలిసబేతు గర్భంలోని యోహాను పునీతుడయ్యాడు - లూకా 1, 44. ఆమె వేడుదలద్వారా ప్రభువు కానావూరిలో నీరు ద్రాక్షసారాయంగా మార్చాడు. యెరూషలేము మీదిగదిలో ఆమె శిష్యులు పరిశుద్ధాత్మను పొందాలి అని ప్రార్థనం చేసింది - అచ 1,44. ఈలా భూమిమీద జీవించి వున్నపుడు నరులకు సాయపడుతూ వచ్చిన మరియ మోక్షంలో వుండిమాత్రం మనలను మరచిపోతుందా? ఆమె స్వర్గంలో ఉండి అహోరాత్రులూ మన రక్షణకోసం క్రీస్తుని మనవిచేస్తుంది. మనం పిశాచం చేతుల్లో చిక్కుకోకుండా వుండేలా తోడ్పడుతుంది.

ఈలా మరియ క్రీస్తు జననమందు, కల్వరిచెంత, మోక్షంనుండి మన రక్షణంలో పాల్గొంది. క్రీస్తుతోపాటు ఆమెకూడ మనలను రక్షించింది. కావున మరియ సహరక్షకి, రక్షణమాత.

## 3. రక్షణమాతపట్ల భక్తిభావాలు

మరియ క్రీస్తు శిశువును ప్రేమించినంతగా భూలోకంలో ఏ తల్లికూడ తన బిడ్డను ప్రేమించి యెరుగదు. ఐనా ఈ మరియ తన బిడ్డను మన రక్షణకోసం అర్పించడానికి

వెనుదీయలేదు. ఈలాగే క్రైస్తవ తల్లిదండ్రులు కూడ తమ బిడ్డలను క్రీస్తు సేవకు సమర్పించడానికి వెనుకాడకూడదు.

క్రీస్తు జన్మించినపుడూ చనిపోయేప్పుడూ ఆ ప్రభుని మరియ పరలోకపితకు అర్పించిందన్నాం. నేడు మనంకూడ పూజలో క్రీస్తుని భక్తితో పరలోకపితకు అర్పించుకునే భాగ్యంకోసం వేడుకుందాం. మరియ గర్భసీమలో గోదుమ పైరు పంటపండింది. ద్రాక్ష పండ్లు కాసింది. ఆ తల్లి మనకు స్వర్గపు రొట్టెను స్వర్గపు రసాన్ని అందిస్తుంది. ఈ రొట్టెను భుజించి ఈ రసాన్ని పానంచేసి ఆకలి తీర్చుకుందాం, సంతృప్తిచెందుతాం.

మరియ రక్షణమాత. కనుక ఆమెను మనకోసం మనవి చేయమందాం. అశ్రద్ధవల్ల మనమాతల్లిని మరచిపోయినా ఆ తల్లి మాత్రం మనలను మరచిపోకుండా వుండాలని విన్నవించుకుందాం.

విశేషంగా మరణ సమయంలో ఆమె మన రక్షణ మాతగా వ్యవహరించాలని మనవి చేసికుందాం. "ఇప్పుడూ మా మరణ సమయమందూ ప్రార్థించ" మని బ్రతిమాలుకుందాం.

# 5. ఉత్థాపితమాత

స్యూడో అగస్టిన్ అనే ఎన్మిదవ శతాబ్దపు రచయిత మరియనుగూర్చి ప్రస్తావిస్తూ "మరియమాతదేహం క్రీస్తుకు మందసంగా వుండిపోయింది. కనుక ఆ కుమారుడు ఉన్న కాడే ఆ తల్లి దేహంకూడ వుండిపోవడం సముచితం. ఏ దేహంనుండి క్రీస్తు తనదేహాన్ని చేకొన్నాడో ఆ పునీతదేహం ప్రాణం విడిచాక క్రుళ్ళి మన్నయి పోయిందంటే, పురుగులకు మేతయిపోయిందంటే, నాకు నమ్మబుద్ధి పుట్టడం లేదు. కనుక ఆమె దేహం క్రీస్తు సన్నిధిని చేరి వుండాలి" అని వ్రాసాడు. మరియమాత ఉత్థాపితమాత. ప్రస్తుతం ఉత్థాపితమాతను గూర్చి మూడంశాలు విచారిద్దాం.

## 1. ఉత్థానం అంటే యేమిటి?

మనం చనిపోయాక మన యీ దేహాలు ఇక్కడే మన్నై పోతాయి. కాని మరియమాత దేహం అలా మన్నైపోలేదు. ప్రభువు ఆమెను దేహాత్మలతో మోక్షానికి తీసికొని వెళ్ళాడు. మరియ ఆత్మతోపాటు దేహంకూడ ప్రభు సన్నిధిలో మహిమను పొందింది. ప్రస్తుతం మానవ మాత్రుల దేహాలేవీ మోక్షంలో లేవు. పునీతుల ఆత్మలు మాత్రమే మోక్షంలో వుంటాయి. పునీతుల దేహాలైనాసరే మన దేహాలైనాసరే లోకాంతంలో గాని ప్రభు సన్నిధిని చేరవు. కనుక ప్రస్తుతం క్రీస్తు మినహా, మోక్షంలోవున్న మానుషదేహం మరియమాత

దొక్కటే. క్రీస్తు తనంతటతాను ఉత్థానమయ్యాడు. మరియమాత తనంతటతాను ఉత్థానం కాలేదు. ప్రభువే ఆమె దేహాన్ని ఉత్థాపనం చేసాడు. అనగా లేపాడు. కనుకనే ఆమె దేహం మోక్షాన్ని చేరింది.

## 2. ఉత్థాపన కారణాలు

దేవుడు మరియమాత దేహాన్ని ఎందుకు ఉత్థాపనం చేసినట్లు? పాపం ద్వారా నరునికి మరణం సిద్ధించింది – 1కొ 15,56. మరణం చెందిన దేహాలు మన్నైపోతాయి. కాని మరియకు పాపమంటూ లేదు. ఆమె నిష్కళంకమాత. అంచేత ఆమె దేహం పాపశిక్షగా క్రుళ్ళి మన్నై పోవలసిన అవసరం లేదు. నేరుగా మోక్షానికి వెళ్తుంది. మరి ఆమె చనిపోవడం మాత్రం దేనికి? మరియ చనిపోయింది తాను పాపాత్మురాలు కావడంవల్ల కాదు. క్రీస్తుకు పోలికగా వుండడంకోసం. నరజాతికి శిరస్సైన క్రీస్తు చనిపోయాడు కనుక నరులంతా చనిపోవలసిన ధర్మం వుంది. కనుక మరియ కూడ చనిపోయింది. (అసలు ఆమె చనిపోనేలేదు, చనిపోకుండానే నేరుగా మోక్షానికి వెళ్ళిపోయింది అని ప్రాచీన క్రైస్తవ వేదశాస్త్రజ్ఞులు కొంతమంది నుడివారు. కాని అందరూ ఈ వాదాన్ని అంగీకరించరు. మరియ మరణాన్ని గూర్చి మనకేమీ స్పష్టంగా తెలియదు. శ్రీసభ ఈ విషయంలో అధికారపూర్వకంగా ఏమీ బోధించలేదుకూడ.)

క్రీస్తుతోపాటు మరియకూడ మన రక్షణంలో పాల్గొంది. మన వినాశం ఒక పురుషుడు ఒక స్త్రీ ద్వారా. అలాగే మన ఉద్ధరణంకూడ ఒక పురుషుడు ఒక స్త్రీ ద్వారా. తొలి ఆదాము తొలియేవ తెచ్చిపెట్టిన పతనానికి రెండవ ఆదాము రెండవ యేవ ప్రాయశ్చిత్తంచేసి ఉద్ధరణం కలిగించారు. ఇక, ఈ రెండవ ఆదాము దేహం మోక్షంలో మహిమను పొందింది. అతనితో కలసి రక్షణరంగంలో కృషిచేసిన రెండవయేవ దేహంకూడ మహిమను పొందాలి. అలా పొందడమే మరియమాత ఉత్థాపనం.

క్రీస్తుకి ఆ తల్లిపట్ల అపార గౌరవమూ ప్రేమా వుంటుంది. తన్ను ధరించిన ఆ పునీత దేహం క్రుళ్ళి పురుగులకు మేతైపోవడానికి, మన్నైపోవడానికి, క్రీస్తు అంగీకరిస్తాడా? తన్ను కని చనుబాలతో పెంచి, ముద్దాడి పెద్దజేసిన ఆ తల్లి పునీత దేహాన్ని ఆ కుమారుడు ఎలా గౌరవించాలో అలాగే గౌరవించి తీరుతాడు. జీవవంతుడైన దేవుడు ఆమెకు జీవమిచ్చి వెలుగులోకి తీసుకవెళ్ళాడు. క్రీస్తు ఎక్కడవుంటే ఆ తల్లి అక్కడే వుంటుంది. క్రీస్తును గౌరవించాక ఆ తల్లిని గౌరవించాలి. పూర్వవేదపు మందసం కొయ్యలాగ ఆమె దేహం చెరువు నెరుగదు.

దేహాత్మలతో మోక్షం జేరుకొనిన మరియను ముగ్గురు దైవవ్యక్తులు ఆదరించి మహిమ పరుస్తారు. దేవునికి తల్లియైనందుకు తగినట్లుగా, మన రక్షణంలో పాల్గొన్నందుకు తగినట్లుగా, ఆ సర్వమంగళను సన్నుతిస్తారు. నీతిమంతులు ఏలాంటి మహిమను పొందుతారో మనం ఊహించనైనా ఊహించలేం అంటాడు పౌలు. జీవితమంతా పాపం విడనాడి నిర్మలజీవితం జీవించిన మరియకు ఏలాంటి మహిమ సిద్ధిస్తుందో మనం మాత్రం ఊహించగలమా? పునీతులు, కన్యలు, స్తుతీయులు, వేదసాక్షులు, దేవదూతలు మొదలైన వాళ్ళందరికంటె ఆమె స్థానం గొప్పది. వాళ్ళందరికీ ఆమె రాజ్ఞి. చుక్కలన్నిటికంటె సూర్యుడెక్కువ. మోక్షవానులందరికంటె మరియమాత యెక్కువ. అన్ని గ్రహాలూ సూర్యునినుండి వెలుగును పొందుతాయి. ఆమె మహిమ నుండి అందరూ పునీతులూ మహిమను పొందుతారు. మోక్షవాసులందరూ మొదట దేవునియందు సంతోషిస్తారు. ఆ పిమ్మట మరియమాతయందు సంతోషిస్తారు. ఆమె మహిమ వాళ్ళ మహిమ. ఆమె వాళ్ళందరికీ రాజ్ఞి. ఈలా మోక్షంలో క్రీస్తు సమీపంలో మరియమాత, మరియమాత సమీపంలో సకల పునీతులూ శాశ్వతంగా వసిస్తుంటారు.

## 3. భక్తిభావాలు

మరియమాత మహిమకు మనమూ సంతోషించాలి. మన నరజాతికి చెందిన ఓ స్త్రీ దేహాత్మలతో నేడు మోక్షంలో వుందంటే మనకే గౌరవం. మన మానవజాతికంతటికీ మహాలంకారం ఉత్థాపితమాత.

మరియ దేహంలాగే మన దేహమూ ఉత్థాపనమౌతుంది. క్రీస్తు ఉత్థానంలో మరియు పాలుపొందింది. ఆమెలాగే మనంకూడ పాలుపొందుతాం. ఓ రోజు ఉత్థానమౌతాం. అందుకే "శరీరం యొక్క ఉత్థానాన్ని విశ్వసిస్తున్నాను" అంటాం. ప్రభువు మళ్ళా విజయంచేసి మన యీ దీనశరీరాన్ని మహిమాన్విత శరీరంగా మార్చాలని కోరుకుంటాం. ఆయన రెండవ రాకడకోసం కనిపెట్టుకొని వుంటాం - ఫిలి-3,21. ఈలా ఉత్థానంకోసం ఎదురుచూచే క్రైస్తవ ప్రజకు ఉత్థాపితమాత ఓ ధ్రువతారలా దారిచూపుతుంది. ఆమె మనలనూ తన చెంతకు పిల్చుకుంటుంది.

మరియమాత దేహంలాగే మన ఈ దేహంకూడ ఉత్థానమై దేవుని యెదుట మహిమను పొందుతుంది అన్నాం. ఈ దేహం ఓనాడు దేవుని యెదుట నిలుస్తుంది. అలాంటి ఈ దేహాన్ని మనం పవిత్రభావాలతో చూస్తుండాలి. ఈ దేహం జ్ఞానస్నానంద్వారా దేవుని ఆత్మకు మందిరమౌతుంది. తేపతేపకు క్రీస్తునే ఆహారంగా పుచ్చుకొంటుంది. కడన ఉత్థానమై ప్రభుసన్నిధిలో నిలుస్తుంది. కనుక ఈ దేహం పవిత్రమైంది. పురుష దేహమైనాసరే

స్త్రీ దేహమైనా సరే, ఈ దేహాన్నెపుడూ కామభావాలతో చూడకూడదు. గౌరవ మర్యాదలతో, భక్తి ప్రపత్తులతో చూస్తుండాలి. పౌలు బోధించినట్లుగా ఈ దేహంతోను పాపం చేయకూడదు, ఈ దేహంలోను పాపం చేయకూడదు. అనగా అశుద్ధ పాపాలతో ఈ దేహాన్ని అమంగళపరచుకోగూగదు - 1కొ 6,8.

ఉత్థాపితమాత మోక్షంలోవుండి మనలను మరచిపోదు. అక్కడనుండి మనకోసం మనవి చేస్తుంటుంది. మనలను కూడ తన చెంతకు పిల్చుకుంటుంది. మనమూ ఆ చోటునకు చేరాలని హెచ్చరిస్తుంటుంది. కావున మనం ఇచటనుండి చూపు మరల్చి అటువైపునకు చూస్తుండాలి. ఆ తల్లి చూపించే దివ్య ధామంవైపు పయనం సాగిస్తుండాలి.

# 6. మరియరాజ్ఞి

ఏడవ శతాబ్దపు భక్తుడు ఇల్డెఫోన్సస్ మరియను గూర్చి చెప్తూ "నేను క్రీస్తుదాసుణ్ణి గనుక మరియదాసుణ్ణి. మరియే దేవుని దాసురాలు కనుక నా రాజ్ఞి. నేను మరియ రాజ్ఞిని సేవించి క్రీస్తు సేవకుడనని రుజువు చేసికొంటాను" అని వ్రాసాడు. మరియ మన రాజ్ఞి. ఇక్కడ మూడంశాలు విచారిద్దాం.

## 1. మరియ రాజ్ఞి అంటే ఏమిటి?

మరియ పరలోక, భూలోకాలకు రాజ్ఞిగా నియమింపబడింది. సృష్టి ప్రాణులందరికీ ఆమె రాజ్ఞి. "కృపారసము గల మాతయై యుండెడి రాజ్ఞీ వందనము" మొదలైన ప్రాచీన జపాలు ఆమెను రాజ్ఞిగా పేర్కొంటాయి. కనుక బహుప్రాచీన కాలం నుండే క్రైస్తవ ప్రజలు ఆమెను రాజ్ఞిగా కొనియాడుతూ వచ్చారని విశదమౌతుంది.

మరియ రాజ్ఞిత్వం మనలను పరిపాలించడం కోసంగాదు, మనకొరకు మనవిచేయడంకోసం. ఆ తల్లి నరులందరి కోసమూ క్రీస్తుని మనవి చేస్తుంది. అందరికీ వరప్రసాదాలు ఆర్జించి పెడుతుంది. ఆమె కోరికలనూ, మనవులనూ క్రీస్తు ఎప్పుడూ కాదనడు. ఆ రాజ్ఞి ఓ చంద్రబింబం లాంటిది. వేడుదలరూపమైన ఆమె పాలనం మనందరికీ ఆహ్లాదం కలిగిస్తుంది.

## 2. కారణాలు

కాని మరియ ఎందుకు రాజ్ఞి యైనట్లు? క్రీస్తు రాజు. ఆ రాజు తల్లియైన మరియకూడ రాజ్ఞి. దేవమాతగా ఆమె పొందిన అంతస్తే ఆమెకు ఉత్థాపనం సంపాదించి

పెట్టింది. ఆ యంతస్తే ఆమెను విశ్వానికి రాజ్ఞిగాగూడ చేసింది. ఆ తల్లి మధ్యవర్తియైన క్రీస్తుతో సహకరించి పనిచేసిందన్నాం. ఆమె క్రీస్తు అనే రాజుకు సహాయురాలుగా నిలిచింది. కనుకనే ఆ ప్రభువు రాచరికంలో తానూ పాలుపొంది మనరాణి ఔతుంది.

క్రీస్తు తాను ఆర్జించిన రక్షణంద్వారా మనకందరికీ ప్రభువయ్యాడు. ఆ రక్షణంలో పాల్గొనిన మరియమాతకూడ మనకు రాజ్ఞి ఔతుంది. దైవరాజ్యాన్ని స్థాపించడానికి క్రీస్తు మరియమాతా ఇద్దరూ పాటుపడ్డారు. ఆ రాజ్యానికి క్రీస్తు రాజైతే, మరియ రాజ్ఞి కాదా?

పిత, సుతుడు, ఆత్మ – ఈ ముగ్గురు దైవ వ్యక్తులూ ఆమెను రాజ్ఞిగా నియమించి కిరీటం వుంచారు. శ్రీసభ ఆమెను రాజ్ఞిగా ఎన్నుకొని మరియరాజ్ఞి మహోత్సవం అనే పండుగను నెలకొల్పింది. ఆమె రాజ్యం క్రీస్తురాజ్యమంత విస్తీర్ణమైంది. భూమిమీద, ఉత్తరించే స్థలంలోకూడ ఆమె రాచరికం చెల్లుతుంది. ఆ రాజ్ఞి నరకంలోని పిశాచాలకు గర్వభంగం కలిగిస్తుంది. దేవునికి ఓడిపోతే పోయ్యాంగాక, ఈ సృష్టి ప్రాణికికూడ ఓడిపోయాంగదా అని పిశాచాలు సిగ్గుతో క్రుగ్గిపోతాయి. మోక్షంలోని పూర్వనూత్న వేదాల పునీతులకూ, దేవదూతలకూ మరియ రాజ్ఞి ఔతుంది. ఈ విధంగా భూమిమీద, మోక్షంలో నరకంలో – అంతటా ఆమె ప్రాభవం చెల్లుతుంది. క్రీస్తు ఎన్నాళ్ళు ఎంతవైభవంగా రాజ్యపాలనం చేస్తాడో ఆమెకూడ అన్నాళ్ళు, అంతవైభవంగా రాజ్ఞిగా ఉండిపోతుంది. ఆ కుమారుడు ఆ తల్లి పరిపాలించే రాజ్యానికి అంతమే వుండదు.

క్రీస్తు రాజు అన్నాం. కాని ఆ ప్రభువు రాచరికం అధికారం చెలాయించడంకోసం గాదు, సేవచేయడంకోసం. "మనుష్య కుమారుడు సేవలు చేయించుకోవడం కోసం గాదు, సేవలు చేయడంకోసం వచ్చాడు" - మార్కు 10,45. ఈ క్రీస్తురాజు లాగే మరియరాజ్ఞికూడ మనకు సేవలు చేస్తుంది. మరియ సేవ ఆమె వేడుకోలే. ఇక క్రీస్తురాజుతో పాటు మనమూ రాచరికం చేస్తాం. క్రీస్తురాజుతోపాటు, మరియ రాజ్ఞితోపాటు మనమూ పరిపాలనం చేస్తాం - 2 తిమో 2, 12. ఆ ప్రభువుని ఆరాధించి సేవించడమే రాచరికం.

## 3. భక్తి భావాలు

మరియరాజ్ఞిని మనం సేవిస్తుండాలి. మన పనులు కష్టసుఖాలు ఆ తల్లికి అర్పించుకోవాలి. మన జపతపాలు భక్తిక్రియలు, పుణ్యకార్యాలు ఆ రాజ్ఞికి కానుక పెట్టాలి.

ఈ రాజ్ఞికి పిశాచం శత్రువు. ఆమె పిశాచం తల నలగద్రొక్కుతూంటుంది. నిత్యం పోరాడి ఆ పిశాచాన్ని నరకానికి తరిమివేస్తూంటుంది. ఇటువంటి పిశాచాన్ని మనం సేవించకూడదు. దానితో చేతులు కలుపనూకూడదు. మనం పాపం చేసేప్పుడూ, దురభ్యాసాలకు లొంగిపోయేప్పుడూ ఆ రాజ్ఞిని సేవించకుండా పిశాచాన్ని సేవిస్తుంటాం. అది ఆ తల్లికి కోపాన్నీ దుఃఖాన్నీ కలిగిస్తుంటుంది.

ఆమె రాజ్ఞీత్వం మనకోసం విజ్ఞాపనం చేయడమే అన్నాం. మనకు వరప్రసాదాలు ఆర్జించి పెట్టడమే అన్నాం. అంచేత ఆమె ప్రార్థనంమీద మనకు నమ్మకం వుండాలి. అవసరాల్లో ఆ తల్లిని అడుగుకోవడం నేర్చుకోవాలి. నమ్మికతో ఆమెమీద భారంవేసి జీవించడానికి అలవాటుపడాలి. పన్నెండవ శతాబ్దంలోనే బెర్నార్డు భక్తుడు ఆమెనుద్దేశించి "తల్లీ! నీ శరణుజొచ్చి, నీ సహాయమడిగి, నీ వేడుకోలును కోరుకున్న వాళ్ళల్లో నిరాశ చెందినవాడు ఒక్కడూలేడు" అని సవాలు చేసాడు. ఈ సవాలు మనకు ధైర్యాన్ని ఆశనూ కలిగించాలి. కనుక భక్తులు నమ్మకంతో ఆ తల్లిని శరణు వేడుతూండాలి.

# 7. వరప్రసాద మాత

15వ శతాబ్దపు భక్తుడు సియన్నా బెర్నదీను మరియనుగూర్చి చెప్తూ "అన్ని వర ప్రసాదాలూ పితనుండి క్రీస్తుకూ, క్రీస్తునుండి మరియకూ, మరియనుండి శ్రీసభకూ లభిస్తాయి. కనుక అన్ని వరప్రసాదాలూ మరియ అధీనంలో వుంటాయి. ఆ వరప్రసాదాలను ఆమె తన చిత్తం చొప్పున, తన కిష్టంవచ్చిన వాళ్ళకి, తనకు తోచినరీతిగా పంచిపెడుతూంటుంది" అని వ్రాసాడు. మరియ వర ప్రసాదాలమాత. ఇక్కడ ఈ విషయాన్ని గూర్చి మూడంశాలు చర్చిద్దాం.

## 1. వరప్రసాదాల మాత అంటే ఏమిటి?

ప్రస్తుతం మన పొందే వరప్రసాదాలేవైనాసరే మరియమాతద్వారాగాని లభింపవు. క్రీస్తుద్వారాగాని పితదగ్గరకు వెళ్ళలేం. అలాగే మరియద్వారాగాని క్రీస్తు దగ్గరకు వెళ్ళలేం. క్రీస్తు మనకోసం పితను మనవిచేసినట్లే, ఆ తల్లి మనకోసం క్రీస్తును మనవిచేస్తుంది. ఈ భూమిమీద చరిస్తున్నపుడు ఆ తల్లి ఎలిసబేతును సందర్శించి స్నాపక యోహానునకు మేలుజేసింది - లూకా 1, 41. కానావూరిలో పెండ్లివాండ్ల అక్కర తీర్చింది - యోహా 2, 3. కల్వరికొండ మీద యేసు శిష్యులకు తాను తల్లిగా నిలిచింది - యోహా 19,2. యెరూషలేము మీదిగదిలో వుండి శిష్యులు ఆత్మను పొందాలని ప్రార్థించింది - లూకా 1, 14. ఈలా ఈ లోకంలో జీవించినపుడు క్రీస్తు శిష్యులను ఆదరిస్తూ వచ్చినతల్లి నేడు మోక్షంలో వుండిమాత్రం మనలను మరచిపోతుందా? పోదు. మనకోసం మనవి చేస్తుంది. వరప్రసాదాలను ఆర్జించి పెడుతుంది.

## 2. మరియ యెందుకు వరప్రసాదాల మాత?

మరియమాత ఏలా వరప్రసాదాల మాత ఐంది? ఆమె మన రక్షణంలో తోడ్పడిందన్నాం. రక్షణంద్వారా క్రీస్తు మన పాపాలను పరిహరించి వరప్రసాదాలను

ఆర్జించి పెట్టాడు. ఇక రక్షణ ఫలితమైన వరప్రసాదాలను ఆర్జించడంలో క్రీస్తుకు తోడ్పడిన మరియ, ఆ వరప్రసాదాలను పంచిపెట్టడంలో గూడ తోడ్పడుతుంది. రక్షణంలో ఆమె తోడ్పాటు అవసరమై కాదు. ఔచిత్యంకోసం అన్నాం. వర ప్రసాదాలను పంచిపెట్టడంలోగూడ ఆమె తోడ్పాటు అవసరమై కాదు, ఔచిత్యంకోసం మాత్రమే.

పునీతులు మనకు ఏదో వో ప్రత్యేక వరప్రసాదాన్ని ఆర్జించి పెట్టగలరు. కాని అన్ని వరప్రసాదాలను ఆర్జించి పెట్టలేరు. మరియ మనకు ఏ వరప్రసాదాన్నైనా సంపాదించి పెట్టగలదు. అన్ని వర ప్రసాదాలూ ఆమెద్వారానే గాని లభించవు. కనుక పునీతులుకూడ ఆమెద్వారాగాని మనకు ఆయా వరప్రసాదాలను ఆర్జించిపెట్టలేరు. వేయేల, క్రీస్తు వరప్రసాదం మరియ చేతులమీదుగాగాని నరులను చేరదు.

మన అక్కరలు ఆ తల్లికి బాగా తెలుసు. ఆమెకు మనకు సహాయం చేయాలనే కోరికా వుంది, శక్తీ వుంది. అంచేత మన తరపున మనవి చేసితీరుతుంది. ఈ మనవి కూడ మన రక్షణానికి వ్యతిరేకంగా వుండదు. అంచేత ప్రభువు ఆమెకోరికను తప్పక తీరుస్తాడు. వెంటనే తీరుస్తాడు కూడ.

మంచితల్లి బాధ్యత బిడ్డలను కనడంతోనే తీరిపోతుందా? తాను ఆ బిడ్డలను పోషించాలిగదా? తొలియేవ మనలను మరణానికి కంటే యీ రెండవయేవ జీవనానికి కంది. అనగా మరియ మనలను జ్ఞానజీవితానికి ప్రసవించింది. ఈలా పుట్టిన బిడ్డలమైన మనలను ఆ తల్లి తన వరప్రసాదాలతో పోషిస్తుంది. కావున ఆ తల్లిమీద మనకు ఎంతైనా నమ్మకముండాలి. బిడ్డ తల్లి పట్లలాగ, పనికత్తె యజమానురాలి పట్లలాగ, మనమూ మరియమాతపట్ల నమ్మికతో జీవిస్తుండాలి. మన అయోగ్యతను ఆమె యోగ్యత పూరిస్తుంది. మన అశక్తతను ఆమెశక్తి సవరిస్తుంది. కనుక మన అక్కరలన్నీ ఆ తల్లిద్వారా దేవునికి విన్నవించుకోవాలి.

వేదశాస్త్రజ్ఞులు మరియమాత మనకు ఎలా వరప్రసాదాలూ ఆర్జించి పెడుతుంది అని ప్రశ్నించుకొని చాల ఉపమానాలు చెప్పారు. 12వ శతాబ్దపు భక్తుడు క్లేర్వో బెర్నార్డు ఆమెను ఓ కాలువతో పోల్చాడు. దూరప్రాంతంలోని చెరువు లేక ఆనకట్టయందలి నీళ్ళు కాలువద్వారా మన వూరి పొలందాకా వస్తాయి. క్రీస్తు ఓ వరప్రసాదాల చెరువు. ఆ చెరువునుండి వరప్రసాదాలనే జలాలు మరియమాత అనే కాలువద్వారా మన హృదయంలోకి ప్రవహిస్తాయి.

ఇంకా కొందరు మరియను ఓ నిచ్చెనతో ఉపమించారు. నిచ్చెనగుండా యింటిమీదికో, చెట్టుమీదికో ఎక్కిపోతాం. క్రిందికి దిగివస్తాం. మరియమాత అనే నిచ్చెన గుండా దేవుడు మన మంటిమీదికి దిగివచ్చాడు. మరియ అనే నిచ్చెనను వాడుకొని

మనం మోక్షానికి ఎక్కిపోతాం. ఆమెద్వారా క్రీస్తు దగ్గరకు వెళ్తాం. అనగా మరియ తన వరప్రసాదాలద్వారా మనలను క్రీస్తు చెంతకు చేరుస్తుంది.

వేరుకొందరు ఆ తల్లి చంద్రబింబంలాంటి దన్నారు. చందమామ సూర్యుని వద్దనుండి వెలుగును పొందుతుంది. తాను వెలుగుతుంది, ఆ వెలుగునే వెన్నెలరూపంలో భూమికి అందిస్తుంది. అలాగే మరియకూడ క్రీస్తు దగ్గరనుండి వర ప్రసాదం పొందుతుంది. తాను ధన్యురాలౌతుంది. ఆ వరప్రసాదాన్ని మనకూ అందించి మనలనుకూడ ధన్యులను చేస్తుంది. కనుక సూర్యునికీ భూమికీ మధ్య చంద్రబింబం ఎలాగో, క్రీస్తుకు నరులకూ మధ్య మరియ అలాగు. మరియ యెప్పుడూ క్రీస్తుతో పోటీపడదు. తాను ఆ ప్రభుకార్యాన్ని కొనసాగిస్తుంది, అంతే. కనుక క్రీస్తు ఉన్న కాడ మరియ ఉండక తప్పకదు. మరియపట్ల భక్తి చూపడానికి ఇష్టపడనివాళ్ళు ఆమె స్థానాన్ని అర్థం చేసికొనే ప్రయత్నం చేయడంలేదనే చెప్పాలి.

పూర్వవేదపు పుణ్యస్త్రీలను చాలమందినిగూడ మరియకు ఉపమానంగా చెప్పారు. ప్రస్తుతానికి ఒక్క ఉపమానాన్ని చూద్దాం. పర్షియారాజు యిస్రాయేలు ప్రజలను నాశం చేయబోతుండగా ఎస్తేరురాణి ఆ ప్రభువును మనవిచేసి తన జనులను కాపాడింది. అలాగే మరియకూడ మోక్షంలో ప్రభుసన్నిధిలో మనకోసం మనవిచేస్తుంది. ఆ ప్రభుకోపం తొలగిస్తూంటుంది.

ఫలితార్థమేటంటే అన్ని వరప్రసాదాలు పితనుండి క్రీస్తుకూ, క్రీస్తునుండి మరియకూ, మరియనుండి విశ్వాసులకూ సంక్రమిస్తాయి. దేవుడు మరియను ఈలా వరప్రసాద ప్రదాయిని చేయడం అవసరమైగాదు. ఔచిత్యం కోసం. ఇది దేవుడేర్పచిన నిర్ణయం. ఈ నిర్ణయానికి తిరుగులేదు.

## 3. భక్తి భావాలు

తూర్పుదేశపు జ్ఞానులు ప్రయాణమైవచ్చి తల్లి మరియను ఆమెతోవున్న బిడ్డను చూచారు - మత్త 1,11. సువిశేషం చెప్పదుగాని, ఆ తల్లి క్రీస్తుబిడ్డను వాళ్లకు అందించి వుంటుంది. జ్ఞానులు ఆ శిశువును ముద్దిడుకొని ఆరాధించి, వుంటారు. అప్పటినుండి శ్రీసభలో ఆమెస్థానం, క్రీస్తును క్రైస్తవ ప్రజలకు అందిస్తూండడమే. మన తరపున మనం, ఆ జ్ఞానుల్లాగే, మరియద్వారాగాని క్రీస్తును చేరలేం.

అడగందే అమ్మైనా పెట్టదు. మనం బిడ్డల్లాగ ఆ తల్లి చెంతకు గబగబ పరుగెత్తాలి. మన అవసరాలను ఆ తల్లికి విన్నవించుకొని ఆమె సహాయం అడుగుకోవాలి. మన అయోగ్యతను తలంచుకొని భయపడకూడదు. బిడ్డల దౌర్భాగ్యం ఎంత గొప్పదో అంత జాలితో తల్లి వాళ్ళను ఆదరిస్తుంది గదా?

మరియ మనకు రకరకాల వరప్రసాదాలు ఆర్జించి పెడుతుంది. కాని ఆమె ఇచ్చే ప్రధాన వరప్రసాదం క్రీస్తే. మరియ క్రీస్తనే పండ్లను కాసిన ద్రాక్షతీగ. క్రీస్తనే వెన్ను వేసిన గోదుమ పైరు. ఈ గోదుమ అప్పం, ఈ ద్రాక్ష సారాయం మన పూజలో క్రీస్తుగా మారిపోతాయి. కనుక ఆ తల్లి రోజురోజు మనకు క్రీస్తనే భాగ్యాన్ని ప్రసాదిస్తుండాలని అడుగుకుందాం.

మరియను తల్లిగా బొందడమూ, ఆమెను ప్రేమించడమూ గొప్పభాగ్యం. మరియమాతపట్ల భక్తిలేనివాళ్లు దిక్కూమొక్కూలేని అనాథశిశువుల్లా అలమటించి పోతారు. 12వ శతాబ్దపు భక్తుడైన ఆన్సెల్మ్ "ఓ ప్రభూ! నీవు మీ తల్లిని ఎంతగా ప్రేమించావో, మేముకూడ ఎంతగా ప్రేమించాలని కోరుకొంటున్నావో, అంతగా ఆ తల్లిని ప్రేమించేభాగ్యం నీ మాతృ ప్రేమద్వారా మాకు ప్రసాదించు" అని ప్రార్థించాడు. కాని క్రీస్తు ఎంతగా కోరుకొంటూన్నాడో అంతగా ఆ తల్లిని ప్రేమిస్తున్నామా?

# 8. ఇద్దరు ఏవలు

క్రైస్తవమతానికి ఆధారాలు రెండు : బైబులు, పితృపాదుల బోధలు. ఈ రెండవదానినే పారంపర్యబోధ అంటాం. పితృపాదులు గ్రీసు, సిరియా, లాటిను దేశాలకు చెందినవాళ్ళు. వీళ్ళు గ్రీకు, సిరియను, లాటినుభాషల్లో ప్రజలకు బోధించారు, రచనలు చేసారు. గ్రీకు పిత్రుపాదుల్లో క్రిసోస్తం, అలెగ్జాండ్రియా సిరిల్, గ్రెగోరీనీస్సా, గ్రెగోరీ నాసియాన్సన్, జాన్ దమసిన్ మొదలైనవాళ్ళు ముఖ్యులు. లాటిను పితృపాదుల్లో అగస్టీన్, జెరోము, అంబ్రోసు ముఖ్యులు. సిరియను పితృపాదుల్లో ఏ ఫ్రేము ముఖ్యుడు. వీళ్ళంతా క్రీస్తుశకం 2-5 శతాబ్దాల మధ్యలో జీవించినవాళ్ళు. అంతా పునీతులు. చాలమంది బిషప్పులు కూడ. వీళ్ళ బోధలు ఇప్పుడు గ్రంథరూపంలో లభిస్తాయి.

క్రైస్తవ మతాంశాలన్నీ స్పష్టంగా బైబుల్లో లేవు. కొన్ని అంశాలు పితృపాదుల బోధల్లో మాత్రమే వుండిపోయాయి. అందుకే శ్రీసభ బైబులుతోపాటు పారంపర్య బోధనుకూడ గ్రహించింది. మనకు బైబులు ఎంత ప్రమాణమో పారంపర్య బోధకూడ అంత ప్రమాణం. పరిశుద్ధ రచయితలను ప్రేరేపించి బైబులు గ్రంథాలను వ్రాయించిన పరిశుద్ధాత్మే పితృపాదులను కూడ ప్రేరేపించి వాళ్ళ చేత ఆయా క్రైస్తవ సత్యాలను చెప్పించింది.

16వ శతాబ్దంలో ప్రోటస్టెంటు శాఖలు ఆదిమ క్రైస్తవ సమాజనుండి చీలిపోయాక పారంపర్య బోధను గ్రహించడం మానివేసాయి. బైబులును మాత్రమే ప్రమాణంగా స్వీకరించాయి. ఈ కారణంచేతనే నేడు క్యాతలిక్ సమాజానికి ఇతర

ప్రోటస్టెంటు క్రైస్తవ సమాజాలకూ క్రైస్తవ సత్యాల విషయంలో కొన్ని భేదభావాలు గోచరిస్తాయి.

మరియమాతనుగూర్చి క్యాతలిక్ సమాజం విశ్వసించే సత్యాలన్నీ బైబుల్లో స్పష్టంగా కనిపించవు. కాని పితృపాదలు బోధల్లో వున్నాయి. ప్రోటస్టెంటు శాఖవాళ్ళు పితృపాదుల బోధలను నిరాకరించారు కనుక ఆ శాఖల్లో మరియమాతను గూర్చిన అంశాలు అడుగంటిపోయాయి.

పూర్వాధ్యాయాల్లో మరియమాతనుగూర్చి చెప్పిన అంశాలను చాలవరకు పితృపాదుల రచనల్లోనుండే స్వీకరించాం. మరియనుగూర్చి ప్రస్తావించేప్పుడు పితృపాదులంతా ఆమెను ఏవతో పోలుస్తూ వచ్చారు. మరియమాత స్థానం అర్థంచేసికోవాలంటే ఈ పోలికను చక్కగా అర్థంచేసికోవాలి. అంచేత ఈ యధ్యాయంలో ఈ పోలికను పరిశీలిద్దాం. ప్రస్తుతం పితృపాదుల రచనల్లో నుండి ఈ యిద్దరు ఏవల పోలికకు సంబంధించిన వాక్యాలను ఇక్కడ సంగ్రహంగా పొందుపరుస్తున్నాం.

తొలియేవ పాపంలేకుండానే జన్మించింది. కాని ఆ భాగ్యాన్ని ఆమె నిలుపుకోలేదు. రెండవయేవకూడ పాపం లేకుండా జన్మించింది. పాపంలేకుండానే జీవించిందికూడ. కనుక ఆమె అవివేకవతి, ఈమె వివేకవతి.

తొలియేవ తాను మరణానికి లొంగివుండేదికాదు. ఆ భాగ్యదశలో ఆదిదంపతులకు చావంటూ లేనేలేదు. కాని తొలియేవ మూర్ఖురాలై పాపంచేసి మరణం తెచ్చిపెట్టుకుంది. ఐనా రెండవ యేవ పాపాన్ని ఎదుర్కొని నిలిచింది. మరణాన్ని జయించింది. దేహాత్మలతో మోక్షానికి వెళ్ళింది. కనుక ఆమెకంటె యీమె ధన్యురాలు.

ఆ తొలితల్లి భౌతికంగా ఆధ్యాత్మికంగా గూడ మనకు మాతగా నియమింపబడింది. కాని యేవ ఆ యాధ్యాత్మిక జీవితాన్ని కోల్పోయింది. మనకూ దాన్ని అందించలేకపోయింది. కాని యీ రెండవయేవ మాత్రం మనకు ప్రతిదినం జ్ఞానజీవితాన్ని అందిస్తూనే వుంటుంది. రోజురోజు మనకు వరప్రసాదాలు ఆర్జించి పెడుతూనే వుంటుంది. కనుక ఆ తల్లికంటె ఈ తల్లి మేలైంది. ఆమె మృతులమాత ఈమె జీవవంతులమాత.

ఆ తల్లి అవిధేయతవలన దేవుని యాజ్ఞమీరి తనకూ మనకూ చావు తెచ్చి పెట్టింది. ఈ తల్లి విధేయతవలన దేవుని యాజ్ఞకు బద్ధురాలై తనకూ మనకూగూడ జీవం తెచ్చిపెట్టింది. ఆమె అవిధేయవతి, ఈమె విధేయవతి.

ఆ కన్య తన పాపంద్వారా మనగొంతుకు ఉరిపెట్టి పోయింది. మరోకన్య ఈ వురి విప్పింది. ఆ కన్య పాపాత్మురాలు అనబడుతుంది. ఆ తొలికన్య పాపానికి ఈ మలికన్య పరిహారం చేసింది. ఆ తొలి కన్య తప్పిదం క్షమించమని ఈ మలికన్య దేవునికి మనవిచేసింది. ఆమెకు తగిలిన శాపాన్ని ఈమె తీర్చింది. కనుక ఆమె యీమెను తన రక్షకిగా భావిస్తుంది.

పిశాచం ఆ తొలిస్త్రీని వంచించింది. యేవ మోసపోయింది. ఆమె పిచ్చిదై పిశాచం పలుకులు స్వీకరించింది. హృదయంలో నిల్పుకుంది. తన కడుపులో విషం తాల్చింది. కాని ఈ రెండవ స్త్రీ పిశాచం పలుకులకు మోసపోలేదు. ఈమె గబ్రియేలుదూత పలుకులను స్వీకరించింది. తన హృదయంలో నిల్పుకుంది. తన గర్భంలో జీవాన్ని ధరించింది. ఆ స్త్రీ మనకు విషాన్ని అందించింది. కాని ఈ స్త్రీ అమృతాన్ని ప్రసాదించింది.

నాడు ఆ తోటలో చెట్టుదగ్గర నిలుచుండి సైతానుమాటలకు మోసిపోయింది ఆ తెలివితక్కువ కన్య. మళ్ళా మరో చెట్టుదగ్గర, అనగా సిలువ చెంత నిలుచుండి సైతానుని జయించింది ఈ తెలివిగల కన్య. ఆనాడు సైతాను కన్య పాదం కరిచింది. ఈనాడు ఈ కన్య సైతాను తలనే కాలితో నలగద్రొక్కింది. పిశాచం ఆనాడు తాను పొందిన విజయాన్ని తలుచుకొని పొంగిపోయింది. కాని ఈనాడు తాను పొందిన పరాభవానికి క్రుంగిపోయింది. "ఆనాడు ఆ కన్యను మోసగించి నేను పాముకుందిమాత్రం ఏముంది? మెదలకుండా వున్నా బాగుండేదిగదా" అని విచారించింది. పిశాచం దేవుడు ఓడిస్తే ఓర్చుకుంటుందిగాని కేవలం ఓ సృష్టి ప్రాణి ఓడిస్తే ఓర్చుకోలేదుగదా! ఐనా మరియమాత ఓడించందే పిశాచం ఓటమి పూర్తి యోటమి కాజాలదు. ఒక పురుషుణ్ణి ఒక స్త్రీని జయించి ఆనాడు తాను పూర్తిగా నెగ్గింది. మళ్ళా ఒక పురుషుడూ ఒక స్త్రీ జయిస్తేనే గాని దానికి పూర్తిగా శృంగభంగం జరుగదు.

తొలి ఆదాము పాపంచేసాడు. అతడు నరజాతికి శిరస్సు కావున అతని పాపం మనకూ సంక్రమించింది. కాని ఆ తొలి ఆదాము పాపంలో ఓ స్త్రీకూడ పాల్గొంది. ఏవ మన తలగాదు గనుక ఆమెపాపం తనంతటతాను మనలను నాశంజేసి వుండదు. కాని ఆదాము పాపంతోగూడి ఆమె పాపంగూడ మనకు నాశం దెచ్చిపెట్టింది. ఇక ఒక పురుషుడు ఒక స్త్రీ మనకు నాశం దెచ్చిపెట్టినట్లే, మళ్ళా ఒక స్త్రీ ఒక పురుషుడు మనకు రక్షణం దెచ్చిపెట్టారు. ఏవ మన పతనంలో పాల్గొన్నట్లే మరియ మన ఉద్ధరణంలో పాల్గొంది. మరియ తనంతటతాను మనలను రక్షించి వుండలేదు. ఆమె మన తలగాదు. రక్షకుడేమో క్రీస్తే. కాని క్రీస్తు రక్షణంలో తానూ పాల్గొనడంవల్ల క్రీస్తుతో, క్రీస్తునందు, తానూ మన రక్షకి అని చెప్పబడుతుంది.

నేడుమనం మరియమాతను గౌరవించడంలో ఉద్దేశం యిది. తొలియేవ మన పతనంలో పాల్గొన్నట్లే మలియేవ మన ఉద్ధరణంలో పాల్గొంది. ఆదాము పాపంతో గలిసి తొలియేవ పాపం మనలను నాశంజేసింది. క్రీస్తు పరిహారంతో ఐక్యమై మలియేవ పరిహారం మనలను రక్షించింది. యథార్థంగా పాపియేమో ఆదామొక్కడే, రక్షకుడేమో క్రీస్తు ఒక్కడే. కాని అతనితోను ఇతనితోను ఓ స్త్రీని జోడించడం దేవునిచిత్తమైంది. రక్షణగాథలో ఆయేవా

ఈయేవా చారిత్రకంగా నిలిచిపోయారు. ఈ యిద్దరు స్త్రీలు నిర్వహించిన పాత్రలను మరచిపోలేం. ఆమె పతనాన్నీ, ఈమె ఉద్ధరణాన్నీ స్మరింపక తప్పదు. ఈ స్మరణమే మరియమాత పట్ల భక్తినీ గౌరవాన్నీ కలిగిస్తుంది.

ఆ తల్లి పట్ల మనం చూపే భక్తి క్రీస్తుకి అప్రియం గలిగించదు. ఆ తల్లిని గౌరవించినపుడు ఆ కుమారునే గౌరవిస్తున్నాం. ఆ తల్లిని అనాదరం చేసినపుడు ఆ కుమారునే అనాదరం చేసినట్లు.

# 9. ధీరనారి మరియ

క్రీస్తు తర్వాత మరియమాత అంతటి వ్యక్తిలేదు. ఆమె రక్షకుని మాత, మోక్షానికి రాజ్ఞి. తిరుసభకు తల్లి. మన క్యాతలిక్ సమాజంలో స్త్రీలూ, మఠ కన్యలూ మరియను ఆదర్శంగా పెట్టుకొని తమ వ్యక్తిత్వాన్ని పెంపొందిచుకొంటుంటారు. కనుక మరియ ప్రాముఖ్యం అన్ని విధాల గణనీయమైంది.

ప్రాచీన వేదశాస్త్రులు మరియను గూర్చి సంప్రదాయ పద్ధతిలో మాట్లాడుతూ వచ్చారు. ఆమె కోమల హృదయ. నిష్క్రియాశీల. దేవుని వరప్రసాదాన్ని స్వీకరించడం మాత్రమే ఆమె చేసిన పని. ఇంకా ఆమె వినయవతి. దేవుని చిత్తప్రకారం జీవించిన భక్తురాలు. సహనశీల. బాధామయురాలు. విశుద్ధురాలు, నిత్యకన్య, ప్రార్థనామయి. కరుణాపూరిత. పూర్వరచయితలు మరియను చిత్రించిన తీరు ఇది.

పేదసాదలూ, విశేషంగా స్త్రీలు మరియను ఆదర్శంగా బెట్టుకొని ఓర్పుతో జీవించాలి అన్నారు. ప్రత్యేకించి కాన్వెంటు నాల్గుగోడలు దాటి వెలుపలికి వెళ్లకుండా సాంఘిక బాధ్యతలు ఏవీ లేకుండా జీవించే మఠకన్యలకు ఆమె ఆదర్శం అని చెప్పారు. ఆమె వినయవిధేయతలూ కన్యాత్వమూ వారికి ప్రేరణం కలిగిస్తాయి అనుకొన్నారు. సిస్టర్లు మరియకు ప్రార్థన చేసి తమ అవసరాల్లో ఆమె నుండి సహాయంపొందాలని కోరారు. మనం చిన్ననాటి నుండి మరియను గూర్చిన ఈలాంటి భావాలకు అలవాటు పడిపోయాం.

కాని నేటి క్రైస్తవవేదాంతులు మరియను ఇలా చిత్రించడంలేదు. వీరి దృష్టిలో మరియ సామాజికబాధ్యతల నెరిగినవ్యక్తి. సంఘజీవి. పేదలను ఆదుకొన్న కరుణామయి. ఎన్నో సమస్యల నెదుర్కొని వాటితో నిబ్బరంగా పోరాడిన ధీరవనిత. క్రియాశీల. దేవుని చిత్తానికి కట్టుపడివున్నా తన స్వేచ్ఛను ఈ క్రింది విధాలుగా సద్వినియోగం చేసికొన్న ఆదర్శ మహిళ.

## 1. యువతిగా మరియ:

దేవదూత మరియకు మంగళవార్త చెప్పాడు. ఆమె గర్భం ధరించింది. కాని ఆ సంగతిని యోసేపుకి తెలియజేయడం ఎలా? యూదుల సంప్రదాయం ప్రకారం పెండ్లికాకుండానే చూలాలైన యువతిని రాళ్లతో కొట్టి చంపుతారు. కనుక ఆమె యెంతో ఆందోళనకు గురైయుండాలి. ఆమె మంగళవార్తను గూర్చి విన్న యోసేపు కూడ ఆశ్చర్యచకితుడై యుండాలి. ఇంకా మెస్సీయా బాధలనుభవిస్తాడని మరియకు కొంతవరకైనా తెలుసు. అలాంటి బాధామయ సేవకునికి తను తల్లికావాలి. ఐనా ఆమె దేవదూతతో నీమాట చొప్పుననే నాకు జరుగునుగాక అని ధైర్యంగా పలికింది. మరియ పిరికిది కాదు, సాహసవంతురాలు.

## 2. ఎలిసబేతును సందర్శించడం :

మరియ తన బంధువైన యెలిసబేత్తుకు పురుడుపోయడానికి పోయింది. ఈ సందర్భంలో ఆమె మహిమగీతం ఆలాపించింది. ఈ పాట బయటికి చూడ్డానికి భక్తి మంతంగానే వుంటుంది. కాని యిది గొప్ప విప్లవ గీతం. దీనిలో సాంఘికంగా, రాజకీయంగా, ఆర్థికంగా మత పరంగాగూడ గొప్ప విప్లవభావాలున్నాయి. ధనవంతులు దైవరాజ్యాన్ని కోల్పోతారు. అది పీడితులకు దక్కుతుంది. పవిత్రుడూ, శక్తిమంతుడూ, కరుణామయుడూ ఐన ప్రభువే దాన్ని పీడితుల పరంజేస్తాడు. దీనులు విజయాన్ని చేపడతారు. అహంకారులు మన్ను గరుస్తారు. ఈలాంటి పాటను విన్పించిన వ్యక్తి గుండెల్లో ఎన్ని తిరుగుబాటు భావాలున్నాయో ఊహించవచ్చు. మరియ మన మనుకొన్నట్లుగా వట్టి తీయని తల్లీ, లోకం పోకడలెరుగని భక్తురాలూ కాదు.

## 3. ఎలప్రాయపు తల్లి :

నిండు చూలాలైన మరియ 90 మైళ్లు నడచి బేత్లెహేము చేరుకొంది. కనుక ఆమె మనం మామూలుగా దేవమాత చిత్రాల్లో చూచే సుకుమారి కాదు. దేహదారుఢ్యం గల మహిళ. బేత్లెహేములో ధనవంతులు మరియా యోసేపులకు ఆశ్రయం నిరాకరించారు. కనుక ఆమె వ్యధకు గురైంది. నేడు మురికి వాడల్లో నివసించే పేదవారిలాంటిదైంది. సమాజం అనాధరణకు గురైంది. జంతువులూ పామరులైన గొర్రెల కాపరులూ ఆమెకు సహచరులయ్యారు. ఈ పట్టున ప్రాచీన రచయితలు ఆమె శిశువును కన్నాక గూడ కన్యాత్వాన్ని కోల్పోలేదని వ్రాసారు. వారికి ఆమె కన్యాత్వం ముఖ్యం. కాని నేటి రచయితలు ఆమె కటికపేదల అగచాట్లకు గురైందని చెప్తున్నారు.

## 4. శిశువును కానుక పెట్టడం :

మరియా యోసేపులు బాలయేసుని దేవాలయంలో కానుకగా అర్పించారు. ఆ సమయంలోనే వృద్ధుడైన సిమియోను వచ్చి ఈ శిశువు అనేకులపతనానికీ ఉద్ధరణానికీ కారకుడౌతాడు. ఓ ఖడ్గం నీ హృదయాన్ని గూడ దూసుకొని పోతుందని మరియతో చెప్పాడు. పూర్వరచయితలు ఇక్కడ మరియ మోషే ధర్మ శాస్త్రానికి విధేయురాలు కావడం గొప్ప అని చెప్పారు. కాని ఆధునికులు ఇక్కడ తల్లిగా మరియ అనుభవించిన బాధలు ముఖ్యమని చెప్తున్నారు. బాధ్యత నెరిగిన వ్యక్తిగా ఆమె కుమారునితో పాటు తానూ భావికాలంలో రాబోయే శ్రమలను అనుభవించడానికి సంసిద్ధమైంది.

## 5. ఈజిప్టుకు పారిపోవడం :

తిరుకుటుంబం రాజకీయంగా దేశబహిష్కృతమైంది. ఇప్పుడు కూడ పాలస్తీనానుండి ఈజిప్టుకు మట్టిరోడ్డువెంట ప్రయాణం చేయడం చాలకష్టం. మరియ భద్రంగా గట్టిన కాన్వెంటు గోడల మధ్య వసించలేదు. ఎండవానలకూ శీతోష్ణాలకూ గురైంది. ఆనాటి క్రూరరాజకీయాలకు చిక్కి నలిగిపోయింది. మరియా యోసేపులు పూర్వపు యిస్రాయేలీయుల్లాగే కాందిశీకులుగా, పేదలుగా ఈజిప్టుకు వెళ్లారు. అక్కడ బానిస బ్రతుకులు ఈడ్చారు. ఇక్కడ బేత్లెహేములో క్రీస్తుశిశువు తప్పించుకొనిపోయాడని ఆగ్రహించి హెరోదు నిరపరాధులైన శిశువులను మట్టుపెట్టించాడు. బలవంతులు దుర్బలులైన పేదలకు చేసే అన్యాయాలకు మరియ పరితపించి కన్నీరు కార్చింది.

## 6. దేవాలయ సందర్శనం :

క్రీస్తుకు 12 ఏండ్ల యీడొచ్చినపుడు మరియా యోసేపులు యెరుషలేము పాస్కోత్సవానికి వెళ్లారు. ఆ సమయంలో క్రీస్తు బాలుడు నేను తండ్రి పనిలో నిమగ్నుణ్ణికావద్దా అన్నాడు. ఆ మాటలు తల్లికి అర్థం కాలేదు. ఆమెకు క్రీస్తు భవిష్యత్తును గూర్చి స్పష్టంగా తెలియదు. దేవుని మీద భారంవేసి తనకు అంతుబట్టని సంగతులను విశ్వాసంతో నమ్ముతూ వచ్చింది. చీకటిలో తడవుకొంటూ నడచింది. ఈ సంఘటనం తర్వాత కొన్నాళ్లకు యోసేపు చనిపోయి వుండాలి. ఇక కుటుంబం ఆలనాపాలనా అంతా ఆమె నెత్తిన పడింది. కనుక మరియను పవిత్ర కన్యనుగా కంటె కాయకష్టం చేసికొని బ్రతికిన గృహిణినిగా గణించడం మెరుగు.

## 7. క్రీస్తు బహిరంగ జీవితం :

ప్రభువు తల్లిని వీడి బహిరంగ జీవితం ప్రారంభించాడు. యెరూషలేములోని మతాధికారులు క్రీస్తుకు వ్యతిరేకులయ్యారు. అతడు కూడ యూదుల విశ్రాంతి దినం, ధర్మశాస్త్ర నియమాలు మొదలైన వాటిని నిరసిస్తున్నాడు. పేదలు సుంకరులు మొదలైన అట్టడుగువర్గంవాళ్ల కోపు తీసికొంటున్నాడు. మరియ కలత చెందింది. కుమారుని భావాలు ఆలోచనలు ఆమెకు సరిగా అర్థంకాలేదు. ఐనా విశ్వాసంతో దేవుణ్ణి నమ్మింది. క్రీస్తు ఆదరించే పేదల పట్ల తానూ ఇష్టం పెంచుకొంది.

యేసుకి 30 ఏండ్లు. మరియ 50 ఏండ్ల వితంతువు. కానాపూరి వివాహంలో ఆమె కుమారునడిగి బంధువులకు ద్రాక్షరసం సరఫరా చేయించింది. కొందరు నరులు క్రీస్తుని ఎడబాయని అనుచరులయ్యారు. కొన్ని సార్లు ఆమె కూడ కుమారుని అనుసరించింది. యెరూషలేములోని రాజకీయ నాయకులు మతాధికారులు మాత్రం క్రీస్తును తీవ్రంగా ఎదిరిస్తున్నారు. మరియ భయపడింది. రాజకీయ ప్రాబల్యానికి వెరచింది. అధికారుల బలానికి దడిసింది. ఆమె మన మనుకొన్నట్లుగా కేవలం కోమల హృదయ, మృదుస్వభావ, మననశీల మాత్రమేకాదు. ధీరవనిత. ఆనాటి రాజకీయాల్లో ఆమెకు ప్రవేశముంది. వాటి తాకిడికి గురైంది కూడ.

## 8. క్రీస్తుకి తీర్పు :

మరియ క్రీస్తుకి జరిగిన తీర్పును, అతడనుభవించిన హింసలనూ కండ్లార చూచి వుంటుంది. సిలువ మార్గంలో ఆమె కుమారునికి ఎదురుపడింది. శిష్యులు ప్రభువును విడచి పారిపోయినా ఆమె అలా చేయలేదు.

## 9. సిలువ క్రింద :

క్రీస్తు చనిపోయేపుడు మరియ సిలువ క్రింద నిలచివుంది. కుమారుని శ్రమలు కండ్లారా చూస్తూగూడ అతనికి సహాయం చేయలేక దుఃఖించింది. విశేషంగా తన కుమారుడు అపజయం పొంది మరణించినందులకు ఎంతో బాధపడింది. ఐనా ఆమె వేదనలు మానసికమైనవే గాని శారీరకమైనవి కావు. శత్రువులు ఆమెను ఎగతాళి చేసి యేడ్పించి వుంటారు. ఆమె నిబ్బరంగా సహించి ఊరకుంది. క్రీస్తు ఆమెను యోహానుకి తల్లిగాను, యోహానుని ఆమెకు కుమారునిగాను అర్పించాడు. కుమారుని మరణానంతరం ఆమె వయసుమళ్లిన మహిళగా కొన్ని యేండ్ల పాటు జీవించివుంటుంది. ఆ కాలంలో ఒంటరితనం వల్ల క్రుంగిపోయి వుంటుంది.

### 10. చివరిదాకా విశ్వాసాన్ని నిల్పుకొంది :

శిష్యులు పారిపోయినా మరియ క్రీస్తును విడచి పారిపోలేదు. కుమారునిమరణం వరకు అతనికి అంటిపెట్టుకొని వుంది. క్రీస్తు చర్యలు తనకు అర్థంగాక పోయినా అతన్ని విశ్వసిస్తూవచ్చింది. క్రీస్తు దాటిపోయిన తర్వాత అతని వుద్యమాన్ని బలపరచింది. శిష్యులకు తల్లియై క్రీస్తులేని లోటు తీర్చింది. తన పాలబడిన బాధ్యతలను సంతృప్తికరంగా నిర్వహించింది. క్రీస్తు జీవితకాలమంతా అతనిపట్ల, క్రీస్తు మరణానంతరం అతని అనుచరుల పట్లను అంకితభావంతో మెలిగింది.

### 11. ఉత్థాపితమాతయైన మరియ ఈనాడు మనకు స్ఫూర్తినిస్తుంది :

క్రీస్తులాగే మరియ కూడ నరులదేహాత్మల పరిపూర్ణ విమోచనం కొరకు కృషి చేసింది. మరియను జూచి నేటి మన స్త్రీలు కూడ పరిపూర్ణ విమోచనం కొరకు కంకణం కట్టుకోవాలి. మన దేశంలో, ప్రపంచమంతటా గూడాను, స్త్రీలకు ఎన్నో అన్యాయాలు జరుగుతున్నాయి. మహిళలు మరియ నుండి ప్రేరణం పొంది ఈ యన్యాయాలను ధైర్యంతో ఎదిరించాలి. వాళ్లు వట్టినే పుణ్యక్షేత్రాలకు వెళ్లి ఆమెకు ప్రార్థనలు చేస్తేనే చాలదు.

చాలా మంది సిస్టర్లు వాళ్ల పేరుకిముందు మరియ పేరుగూడ చేర్చుకొంటారు. మంచిదే. కాని సిస్టర్లు మరియలాగ బాధ్యతాయుతంగా మెలగాలి. దుష్టశక్తులనుండి తమ్ముతామూ, తోడి స్త్రీజాతినీ కూడ విమోచించుకోవాలి. మరియ కన్యాత్వం మాత్రమేగాక ఆమె సామాజిక స్ఫురణ, ధైర్యము కూడ వారికి ఆదర్శం కావాలి.

మామూలుగా మరియమాత పట్ల మనకందరికీ భక్తివుంటుంది. కాని ఈ సంప్రదాయభక్తి చాలదు. మరియ ఆనాటి విమోచనోద్యమంలో పాల్గొంది. ఆనాటి ఘరానా అధికారుల నెదిరించి పీడితులైన దీనప్రజల కోపు తీసికొంది. ఆనాటి పరపీడనం నేడూ లోకంలో కొనసాగుతూనేవుంది. కనుక మరియను ఆదర్శంగా పెట్టుకొని మనం కూడ అన్యాయాలు నెదిరించి పోరాడాలి. అందరికీ న్యాయం జరిగి సమసమాజం ఏర్పడేలా చూడాలి. మన తరపున మనం ఎవరికీ అన్యాయం తలపెట్టకూడదు. ధీరత్వం, క్రియాపరత్వం, అంకితభావం గల మరియమాతను చూచి నేటిలోకంలో మనం కూడ ఆ దొడ్డగుణాలను అలవర్చుకోవాలి.

## 10. మరియమాతపట్ల భక్తి

పరలోకపిత ఆనాదినుండి మనలను రక్షించాలని సంకల్పించుకున్నపుడే క్రీస్తుతోపాటు మరియనుగూడ ఎన్నుకున్నాడు. ఆమె క్రీస్తుతో సహకరించి మన రక్షణంలో పాల్గొంది. రక్షణమాత ఐంది. నేడు మోక్షంలో వుండి మనకు అన్ని వరప్రసాదాలూ

సంపాదించి పెడుతుంది. మన తరపున క్రీస్తును మనవి చేస్తుంటుంది. ఆ ప్రభువు మళ్ళా రెండవమారు విజయం జేయకముందు విశ్వాసులంతా ఆమెపట్ల భక్తి చూపుతారని చాలమంది పునీతులు అభిప్రాయపడ్డారు.

దేవుడే ఆమెను ఎన్నుకొని మన రక్షణమాతనుగా నియమించాడు. కనుక మనమూ ఆమెను ఎన్నుకొని గౌరవించాలి. ప్రభువు ఆమెద్వారా మనచెంతకు వచ్చాడు. మనమూ ఆమెద్వారాగాని తన్ను జేరలేమని నేర్పాడు. అంచేత మనం ఆ తల్లిపట్ల భక్తి చూపుతూండాలి.

క్రైస్తవ ప్రజలు మరియమాతపట్ల చూపే భక్తి క్రియలు చాలావున్నాయి. ఆమె పండుగలు చేసికొనవచ్చు. నిష్కళంకోద్భవమూ, ఉత్థాపనమూ ఈ పండుగల్లో ముఖ్యమైనవి. శనివారాలను భక్తిపూర్వకంగా ఆమెకు సమర్పించవచ్చు.

మనలనూ మన రోజువారి పనులనూ ఆ తల్లికీ ఆమె ద్వారా క్రీస్తుకీ అర్పించుకోవచ్చు. పాపం కట్టుకోకుండా వుండేలా సాయపడమని ఆ తల్లిని అడుగుకోవచ్చు.

మరియమాత ఉత్తరీయం ఒకటుంది. 1251లో ఆమె సైమన్ స్టోక్ అనే ఆంగ్లభక్తునికి దర్శనమిచ్చి తన ఉత్తరీయాన్ని ధరించేవాళ్ళు నరకానికి పోరని మాటయిచ్చింది. ఈ యుత్తరీయంతోపాటు ఆమె స్వరూపాలు ధరించడమూ, ఆమె చిత్రాలూ ప్రతిమలూ ఇండ్లల్లో పెట్టుకొని పూజించడమూ సనాతన క్రైస్తవాచారం. మరియమాత ప్రతిమకు చూపిన గౌరవం ఆ బొమ్మకు గాదు, మరియకు చెందుతుంది. గతించి పోయిన మన తాతగారి ఫోటోకు చూపిన గౌరవం ఆయనకే చెందుతుంది గదా!

మరియను గౌరవించే సభలు కొన్ని వున్నాయి. సొడాలిటీ, లీజను వీటిల్లో ముఖ్యమైనవి. ఈ సభల్లో చేరి ఆ తల్లిని నుతించవచ్చు.

మరియమాత పేర చెప్పే జపాలూ చాలా వున్నాయి. మరియ నామం, దేవవరప్రసాద జపం, త్రికాలజపం, నవీనా జపాలూ, దేవమాత ప్రార్థన, కృపారస మంత్రం, మిక్కిలి నెనరుగల తల్లి అనే జపం, జపమాల, దేవమాత ఆఫీసు, దేవమాత కీర్తనలు మొదలైనవి భక్తిరసభరితమైన ప్రార్థనలు.

పై జపాల్లో రెండు చాల ముఖ్యమైనవి. అవి మరియ నామం, జపమాల. మరియనామం పవిత్రనామం. ఆ నామం తన్నుచ్చరించే వాళ్ళను పవిత్రపరుస్తుంది. పిశాచాన్ని పారద్రోలి రక్షణను సంపాదించి పెడుతుంది. దేవమాత ప్రార్థనలన్నిటిలో జపమాల శ్రేష్ఠమైంది. క్రీస్తు మరియల జీవిత ఘట్టాలను ధ్యానం జేసికొంటూ జపమాలను చెప్పినట్లయితే చాలా ఫలితం పొందవచ్చు.

క్రీస్తు సాన్నిధ్యంలాగే మరియ సాన్నిధ్యం అనేది కూడ ఒకటుంది. భక్తులు చాలమంది ఆ తల్లి సాన్నిధ్యాన్ని స్మరించుకొన్నారు. ఆమె వాళ్ళ విశ్వాస నేత్రాలకు

ప్రత్యక్షమౌతుంటుంది. వాళ్ళను తన పచ్చడం క్రింద కాచికాపాడుతూంటుంది. రోజురోజు మరియ మనకు చేసే సహాయమే, మనకిచ్చే రక్షణమే ఆమె సాన్నిధ్యానికి నిదర్శనం. కనుక మరియ తాను జీవించినపుడు ఆనాటి స్త్రీ పురుషులతో ఏలా తిరుగాడిందో ఈనాడు తన భక్తులతోను అలా తిరుగుగాడుతూంటుంది. ఆ పునీత హృదయ సాన్నిధ్యాన్ని మననం చేసికొంటూ పాపాన్ని జయించవచ్చు. దివ్యజీవితం జీవించవచ్చు.

మరియకు అంకితమైన గుళ్ళకు వెళ్ళి ఆమెను కొనియాడ్డం కూడ ఓ భక్తిమార్గం. ఆ తల్లి పేర ప్రదక్షిణలు జరుపవచ్చు. ఆమె దర్శనమిచ్చిన పుణ్యక్షేత్రాలు దర్శించవచ్చు. స్మరించవచ్చు. ఈ సందర్భములో విశేషంగా లూర్దుమాతగుహను పేర్కొనాలి. ఫ్రాన్సునందలి లూర్దునగర గుహను సందర్శించలేకపోయినా, మన వూళ్ళలో నమూనాగా కట్టుకునే లూర్దుగుహ యెదుట భక్తిని ప్రదర్శించవచ్చు. మన వూరి గుహ యెదుటనే నిలుచుండి ఆనాడు మరియ బెర్నెదత్తుకిచ్చిన దర్శనాన్ని స్మరించుకొని మన పాపాలకు పశ్చాత్తాపపడి, మన అవసరాలను ఆ తల్లికి విన్నవించుకోవచ్చు.

మరియమాతనుగూర్చిన బైబులు వాక్యాలను చదువుకొని మననంజేసికొంటూ ప్రార్థించుకోవడంగూడ ఓ చక్కని భక్తిమార్గం. మరియ తాను స్వయంగా మననశీల - లూకా 2,18. సువిశేషకారులు ఆమెను పరమ పవిత్రమూర్తినిగా చిత్రించారు. మరియను ప్రస్తావించే సువిశేష వాక్యాలను ధ్యానించుకొనేవాళ్ళ హృదయం అనతికాలంలోనే భక్తి భావంతో నిండిపోతుంది.

మంచిమరణం దయచేయమనిగూడ మనం ఆ తల్లిని వేడుకొంటూండాలి. ఆమె మన రక్షణాన్ని కోరుకొంటుంది. కనుక ఈ భాగ్యాన్ని తప్పక ప్రసాదిస్తుంది. మంగళవార్త జపం రెండవభాగంలో శ్రీసభ ఈ మనవి చేర్చింది.

వేదశాస్త్రజ్ఞులు చాలామంది "మరియమాత భక్తులు నరకానికి పోరు, తప్పకుండ రక్షణం పొందుతారు" అని నుడివారు. అల్ఫోన్సస్ లిగోరి అనే భక్తుడు తాను వ్రాసిన మరియమాత మహిమలు అనే ఉద్గ్రంథాన్ని "మరియమాత భక్తులకు చేటులేదు" అంటూ ముగించాడు. ఈలాంటే, మనం పాపజీవితం జీవించినా మరియ మనలను అద్భుతంగా మోక్షానికి తీసికొని వెళ్తుందని భావం గాదు. ఆమె తన భక్తులు పాపపు బురదలో అడుగు పెట్టకుండా వుండేలా తోడ్పడుతుంది. ఒకవేళ బలహీనతవల్ల పాపంలో కూలిపోయినట్లైతే, వాళ్ళకు పశ్చాత్తాపం పుట్టించి ఆ బురదలోనుండి వెలుపలకు లాగుతుంది. వాళ్ళకు మంచి మరణం అనుగ్రహిస్తుంది. ఈ సత్యం మనకెంతైనా సంతోషాన్నీ ఉత్సాహాన్నీ కలిగించాలి. తల్లిలేని పిల్లలు దిక్కూమొక్కూ లేక బావురు మంటూంటారు. తల్లిగల పిల్లలకు అన్ని హంగులూ అమరుతాయి. మరియమాతను తల్లిగా అంగీకరించి ఆమెపట్ల

భక్తిభావంతో చరించేవాళ్ళ భాగ్యం అంతింతగాదు. ఆమెను తల్లిగా అగీకరించనివాళ్ళ దౌర్భాగ్యమూ అంతింతగాదు.

ఇక, మరియమాతపట్ల చూపే భక్తిక్రియలన్నిటిలోను హృదయం ప్రధానం. అనగా నిండు హృదయంతో ఆ తల్లిని పూజించాలి. ఈలా పూజించాలంటే మన రక్షణ చరిత్రలో ఆమె నిర్వహించిన పాత్రను చక్కగా అర్థంచేసికొనివుండాలి. ఆమె దేవమాత, సహరక్షకి. ఈ రెండు బిరుదాలను అర్థంజేసికున్న వాళ్ళు ఆమె స్థానమేంటో వెంటనే గ్రహిస్తారు. హృదయంలో భక్తి లేకుండా బయటకు మాత్రమే భక్తిక్రియలు చూపెదుతుంటే అవి కేవలం మూఢాచారాలే ఔతాయి. ఈ సందర్భంలో "భక్తి గలుగుకూడు పట్టెడైనచాలు" అనే వేమనవాక్యం స్మరింపదగ్గది.

ఇంకో విషయంగూడ. మనం దేవుణ్ణి పూజిస్తాం, ఆరాధిస్తాం. సృష్టి ప్రాణులైన పునీతులు దేవదూతలు మొదలైన వాళ్ళను ఆరాధించం, పూజిస్తాం. ఇక మరియమాతను పునీతుల కంటె అధికంగా పూజిస్తాం. కాని ఓ దేవుణ్ణి ఆరాధించినట్లు ఆరాధించం.

మరియను పూజించడంలో ప్రధానోద్దేశం, దేవుడు ఆమెకు అనుగ్రహించిన భాగ్యాలను స్తుతించడమే. ఆమె అంది "ఇకమీదట సకల తరాలవాళ్ళు నన్నుధన్యురాలినిగా భావిస్తారు. ఎందుకంటే దేవుడు నాకు మహత్తర కార్యాలు చేసాడు" అని. అలాగా దేవుని మహత్తర భాగ్యాలను పొందిన తల్లిని మనం స్తుతించవద్దా? ఆమె ధన్యురాలని ఎలుగెత్తి చాటవద్దా? మరియను పూజించడమంటే దేవుణ్ణి అతని క్రీస్తుని ఆరాధించడమే. ఓ పునీతురాలియందు ప్రతిఫలించిన ఆ ప్రభువు వరాలను కొనియాడ్డమే. అసలు పునీతులందుకూడ దేవుణ్ణే మహిమ పరుస్తుంటాంగదా? మరియకు భక్తి చూపే వాళ్ళు ఆ తల్లి పట్ల బిడ్డల్లాగ ప్రవర్తిస్తున్నారని రుజువు చేసికొంటారు. మరియ భక్తి యథార్థ క్రైస్తవ జీవితానికి కొలకర్ర, జీవగర్ర.

# 11. ఆదర్శ మాత

పూర్వాధ్యాయంలో మరియమాతపట్ల చూపవలసిన భక్తిని గూర్చి ముచ్చటించాం. మరియ క్రైస్తవులకు ఆదర్శంగా వుంటుంది. క్రైస్తవ సమాజంలోని గురువులూ మఠకన్యలూ గృహస్థులూ ఆమెను ఆదర్శంగా బెట్టుకుని జీవిస్తుంటారు. అదేలాగో మూడంశాల్లో పరిశీలించి చూద్దాం.

## 1. మరియ గురువులకు ఆదర్శం

మరియ గురువుల మాత. ఆమె గురుపట్టమనే దేవద్రవ్యానుమానం పొందలేదు. ఆ తల్లి గురుత్వం విశ్వాసుల గురుత్వానికి చెందింది. ఆ పునీతురాలు క్రీస్తు గురువుని

కని పెంచి పెద్దజేసింది. అతనికి విద్యాబుద్ధులూ దైవభక్తీ నేర్పింది. పరలోకంలోని తండ్రిని ఏలా ఆరాధించాలో బోధించింది. అలాగే మరియ గురువులకుకూడ మాతయై వాళ్ళకుకూడ విద్యాబుద్ధులూ దైవభక్తీ దైవారాధన నేర్పుతుంది. క్రీస్తు గురువునకు తల్లియైన మరియ ఆ ప్రధాన గురువుని అనుసరించే మానుష గురువులకుగూడ గారాబు తల్లి.

గొర్రెపిల్లను బలికి సిద్ధంజేసినట్లుగా మరియ క్రీస్తుని సిలువయాగానికి సిద్ధంజేసింది. కడన ఆ బలిమూర్తిని కల్వరి కొండమీద తండ్రికి సమర్పించింది. అంతమాత్రమే గాదు, క్రీస్తుతోపాటు తాను బలిమూర్తి అయింది. క్రీస్తుతో పాటు తన్నుతాను పరలోకపితకు సమర్పణం చేసికొంది. ఈ సమర్పణ కార్యంలో ఆమె గురువుకి తోడ్పడుతుంది. ఆమె గురువు హృదయంలో భక్తిభావాలు పుట్టించి అతడు యోగ్యంగా తన్ను తాను దేవునికి నివేదించుకొనేలా చేస్తుంది.

క్రీస్తు జననానికి మరియ భక్తిభావంతో తయారైంది. ఆ ప్రభుని ఆమె మనసార నమ్మింది. అందుకే ఎలిసబేత్తుకూడ "ప్రభువు పలుకులు విశ్వసించిన నీవు చాల ధన్యురాలవు" అని మరియను పొగిడింది. గురువుకూడ పీఠంమీద క్రీస్తు జన్మించేలా చేసేవాడు. అంచేత అతనికి గూడ మరియకున్న విశ్వాసమూ భక్తీ వుండాలి. మరియ తన వేడుకోలుద్వారా గురువు విశ్వాసుల హృదయాల్లో క్రీస్తుని పుట్టించేలా చేస్తుంది.

మరియ గొప్ప ప్రేషితురాలు. ఆమె పన్నెండు మంది ప్రేషితుల్లో ఒకతెగాదు. కాని ఆమె వస్తుతః ప్రేషితురాలు. ప్రేషితుల రాజ్ఞికూడ. ఆమె సాధించిన గొప్ప ప్రేషితకార్యం లోకానికి క్రీస్తుజ్యోతిని ప్రసాదించడం. అనగా క్రీస్తుని కనడం. తాను కన్న క్రీస్తుని ఆ విశ్వజనని రకరకాలరూపాల్లో ఆనాటి ప్రజలకు అందించింది. ఈ నాడుకూడ ఆ విజ్ఞాపనమాత మోక్షంనుండి విశ్వాసులకోసం ప్రార్థనచేస్తూ వాళ్ళకు క్రీస్తుని అందిస్తూనే వుంటుంది. ఇక, గురువుకూడ మరియలాగే క్రీస్తుని విశ్వాసులకు అందించేవాడు. గురువు మొదట క్రీస్తుని తాను పొందేలా, అటుతరువాత తానుపొందిన క్రీస్తుని విశ్వాసులకు అందించేలా తోడ్పడుతుంది మరియ.

## 2. మరియ మఠకన్యలకు ఆదర్శం

నరుడు నిర్దోషంగాను పవిత్రంగాను జీవించాలని భగవంతుని కోరిక. ప్రభువు కోరుకొన్నట్లుగా నిర్మలజీవితం జీవించిన పునీతురాలు మరియ. ఆమె యేనాడూ పాపపు బురదలో అడుగు పెట్టలేదు. మానవమాత్రుల్లో యింత నిర్మలంగా జీవించిన వ్యక్తి మరెవ్వరూ లేరు. అందుచేత మరియ ప్రభువుకి సర్వవిధాలా ప్రియపడింది. ఇక, మఠకన్యగూడ శరీరాన్నీ హృదయాన్నీ ప్రభువకే అంకితం జేసికొని ప్రభు సంబంధమైన

కార్యాల్లో నిమగ్నం కావాలి - 1కొ 7,34. పవిత్రజీవితం జీవించాలి. ఈలా నిర్మల జీవితం జీవించడంలో నిర్మలమాతయైన మరియ ఆమెకు తోడ్పడుతుంది. మరియ కేవలం మనకు ఆదర్శమూర్తి మాత్రమే గాదు, ఓ సజీవవ్యక్తి గూడ. కనుక ఆమె తన బిడ్డలమైన మనకు వరప్రసాదాలను ఆర్జించిపెడుతూ అన్ని విధాలా సాయపడుతూంటుంది.

పూర్వవేదకాలంలో "హనవిం" లేక "దీనులు" అనే భక్తులు ఉండేవాళ్ళు. వాళ్ళు ప్రభువుమీద ఆధారపడి జీవిస్తూండేవాళ్ళు. తరచుగా పేదజీవితం జీవిస్తూండేవాళ్ళు. బాధలకు గురౌతూండేవాళ్ళుగూడ. నూత్న వేదంలో మరియ ఈ దీనుల కోవకు చెందిన భక్తురాలు. అందుకే ఆమె మహిమ గీతికలో "ప్రభువు నా దీనత్వాన్ని కటాక్షించాడు" అని చెప్పుకొంది - లూకా 1, 48. తాను పూర్తిగా ఆ ప్రభువు మీద ఆధారపడి జీవించింది. ఈమె గొప్పతనమంతా ప్రభువు పెట్టిన భిక్ష. కావుననే ఆ పునీతురాలు సర్వశక్తిమంతుడు నాయెడల గొప్ప కార్యాలు చేసాడు అని పలికింది - లూకా 1,49. ఈ మరియలాగే మఠకన్యగూడ "దీనురాలు". ఆమె ప్రభువుమీద ఆధారపడి జీవిస్తూండాలి. తనకు సిద్ధించే కష్టాలనూ అపార్థాలనూ వినయంతో సహిస్తూండాలి. మరియనుజూచి, మరియ సహాయంతో, తానూ ఈ దీనత్వాన్ని అలవరచుకోవాలి.

మరియ ఇప్పటి మఠకన్యల్లాగ మూడు వ్రతాలు చేపట్టలేదు. ఐనా ఆమె మూడు వ్రతాలను వస్తుతః పాటించింది. "నీ మాట చొప్పుననే నాకు జరగాలి" అన్న వాక్యం ఆమె విధేయతకు నిదర్శనం. ప్రభువుకోసం ఆమె కన్యగా, పేదరాలుగా జీవించింది. ఈనాడు మఠజీవితంలో ప్రధానాంశం మూడు వ్రతాలనూ పాటించడం. ఈ జీవితం చాల కష్టమైంది. ప్రత్యేకమైన దైవానుగ్రహంలేందే ఈ ప్రయత్నంలో నెగ్గలేం. ఈ వ్రతజీవితంలో మరియ మఠకన్యకు ఆదర్శంగా వుంటుంది.

## 3. మరియ గృహస్థులకు ఆదర్శం

మరియ అంగీవేసికొని మఠజీవితం జీవించలేదు. బోలెడన్ని గొడవలతోగూడిన సంసారజీవితం జీవించింది. సంసార జీవితంలో మొదటి విషయం, భార్యాభర్తలు అనురాగంతోను ఒద్దికగాను జీవిస్తూండడం. మరియా యోసేపులు అలా జీవించారు. మరియ ఆత్మశక్తివలన అద్భుతంగా గర్భవతి అయింది. ఈ రహస్యం మొదట యోసేపుకి తెలియదు.. కనుక అతడు ఈ సంగతంతా విని బాధపడ్డాడు. కాని ఆమెపట్లమాత్రం కటువుగా ప్రవర్తించలేదు. మరియను రద్దిజేయకుండా పరిత్యాగ పత్రికనిచ్చి రహస్యంగా విడనాడదామనుకొన్నాడు - అంతే. మత్త 1,19. అనగా ఆమె పట్ల అతనికి ఎంతో గౌరవముండేది. ఆమె యోగ్యురాలనే అతని భావం. అలాగే మరియకూడ యెసేపుని

గౌరవాదరాలతో చూచేది. బాలయేసు కన్పించకుండాబోయి మళ్లా దేవాలయంలో కంటపడ్డప్పుడు ఆమె "బాబూ! నీవెక్కడున్నావు? మీనాన్న నేను పుట్టెడు దుఃఖముతో నీకోసం వెదకుతున్నాం గదా!" అంది –లూకా 2,48. ఈ వాక్యాన్ని బట్టే ఆమెకు భర్తపట్ల వున్న గౌరవం వెల్లడి ఔతుంది. కుటుంబజీవితంలో ఆలుమగలు ప్రేమభావంతోను పరస్పర గౌరవంతోను జీవించడానికి మరియ ఆదర్శంగా వుంటుంది. తాను గృహస్థప్రజలకు ఆ వరప్రసాదాన్ని ఆర్జించి పెడుతూందిగూడ.

తల్లిదండ్రులు పిల్లలను కని పెంచడంగూడ గొప్ప బాధ్యత. మరియ క్రీస్తుబిడ్డనుకని అనురాగంతో పెంచింది. యూదమత నియమాల ప్రకారం ఆ బిడ్డకు జరిపించవలసిన ఆచారాలన్నీ జరిపించింది. యెరూషలేము యాత్రా సందర్భంలో కుమారుణ్ణి కోల్పోయినపుడు ఆమెకు కడుపు తరుగుకొనిపోయింది. ఇక, ఆ కుమారుడుకూడ తల్లిదండ్రులకు విధేయుడై వర్తించాడు - లూకా 1, 51. మన కుటుంబాల్లో తరచుగా తల్లిదండ్రులకూ బిడ్డలకూ మధ్య బోలెడన్ని చిక్కులూ అపార్థాలూ వస్తూంటాయి. ఈ పట్టున తల్లిదండ్రులకూ బిడ్డలకూ తిరుకుటుంబమే ఆదర్శం. మరియ మన తల్లిదండ్రులకూ బిడ్డలకూ గూడ పరస్పర ప్రేమతో జీవించే భాగ్యాన్ని ఆర్జించి పెడుతుంది.

గృహిణికి దైవభక్తి చాలముఖ్యం. ఆమె భక్తురాలైతే కుటుంబమంతా భక్తిమంతంగా మెలుగుతుంది. మరియ ఈలాంటి భక్తురాలు. ఆమె ప్రభువుమీదనే హృదయం లగ్నంజేసికొని జీవిస్తూండేది. దేవాలయానికివెళ్ళి పూర్వవేదభగవంతుణ్ణి సేవించు కొంటూండేది. పరిశుద్ధాత్మవలన అంతరంగంలో ప్రబోధం చెందుతూండేది. పూర్వవేదం చదువుకొని ప్రభు ధర్మశాస్త్రం ధ్యానించుకొంటూండేది. మరియ మననమూర్తి, ధ్యానశీల. "ఆమె యీ విషయాలన్నీ మనసులో తలపోసికొంటూండేది" అన్న లూకా వాక్యమే ఇందుకు తార్కాణం - 2, 52. ఆ భక్తురాలు క్రైస్తవ గృహిణులకు కుటుంబభక్తిని నేర్పుతుంది. హృదయం భగవంతునిమీద లగ్నం చేసికోవడమూ ప్రభుగ్రంథాన్ని పఠించి ధ్యానం చేసికోవడమూ అనే భాగ్యాలను సంపాదించి పెడుతుంది.

యూదసమాజంలో మగవాళ్ళకుమాత్రమే ప్రాధాన్యముండేది. అలాంటి సమాజంలో ఆడవాళ్ళు తరుచుగా బాధలకూ చిక్కులకూ అపార్థాలకూ గురౌతుండేవాళ్ళు. మరియకు కూడ ఈ దుర్గతి తప్పలేదు. యోసేపు గర్భవతియైన మరియను శంకింపగా - అతడు తనపట్ల ఎంతమృదువుగా ప్రవర్తించినాగాని - ఆమెకు కొండంతబాధ కలిగివుండాలి గదా? మన భారతీయ సమాజంకూడ యూదసమాజంలాగే స్త్రీకి విలువనీయని సమాజం. ఈ సమాజంలో స్త్రీకి జరిగే అన్యాయాలూ అపచారాలూ అన్నీ యిన్నీకావు. మన దేశంలో ఆడవాళ్ళు కన్నీరుగార్చని యిండ్లు అరుదంటే అతిశయోక్తి

కాదేమో. ఈలాంటి పరిస్థితుల్లో మరియ క్రైస్తవ పురుషులకంటెగూడ క్రైస్తవ స్త్రీకి ఎక్కువ ఆదర్శంగా వుంటుంది. ఆమె పురుషుడుకాదు. స్త్రీ. ఆ మాతృమూర్తి స్త్రీ హృదయంతో తన కొమార్తెల మానసిక బాధలను అర్థం జేసికొంటుంది. తాను వాళ్ళపట్ల సానుభూతి జూపుతుంది. తన పుత్రికల బాధోపశమనానికి అవసరమైన వరప్రసాదాన్ని ఆర్జించి పెడుతుంది. కనుక క్రైస్తవ గృహిణి కష్టాల్లో ఆ తల్లివైపు దృష్టిమరల్చి ఆమె సహాయం అడుగుకోవాలి.

# 12. మరియమాత - సమైక్యత

మరియమాత ఈ ప్రపంచాన్నంతటినీ క్రీస్తుతో ఐక్యపరుస్తూంటుంది. విశ్వజనాన్ని, విశ్వమతాలనూ, క్రీస్తుతో జోడిస్తుంటుంది. ఈ యధ్యాయంలో క్యాథలిక్ ప్రోటస్టెంటు శాఖలకూ, హిందూ ముస్లిం శాఖలకు చెందినవాళ్ళను ఆ విశ్వజనని ఏలా ఐక్యపరుస్తుందో విచారించి చూద్దాం.

## 1. ప్రోటస్టెంటు శాఖలు

నేడు ప్రోటస్టెంటు శాఖలు చాలవున్నాయి. కాని మొదటి శాఖలు లూథరెన్, కాల్వినిష్టు శాఖలు రెండే. మరియమాత క్రైస్తవ శాఖలన్నిటినీ – అవి క్యాథలిక్ సమాజానికి జెందినా ప్రోటస్టెంటు సమాజానికి చెందినాసరే – క్రీస్తుతో ఐక్యపరుస్తుండాలి. కాని అనేక కారణాలవల్లా, అపార్థాలవల్లా ఆ తల్లి క్యాథలిక్ క్రైస్తవులకూ ప్రోటస్టెంటు క్రైస్తవులకూ విభజన కారణమైందిగాని ఐక్యతాకారణం కాలేదు. ఈ సమస్యను కొంచెం చారిత్రిక దృష్టితో తర్కించడం అవసరం.

క్యాథలిక్ క్రైస్తవులు మరియమాతనుగూర్చి విశ్వసించే అంశాలను ముందటి అధ్యాయాల్లో విచారించాం. ఇక 16వ శతాబ్దంలో ప్రోటస్టెంటు తిరుగుబాటు వచ్చింది. లూథరు కాల్విను మొదలైన నాయకులు చీలిపోయారు. ఆదిమ క్రైస్తవసమాజం క్యాథలిక్ సమాజంలో కొనసాగుతూవచ్చింది. చీలిపోయిన నాయకులు మాత్రం ఆదిమ క్రైస్తవ సమాజం విశ్వసించే సూత్రాలకు భిన్నమైన సూత్రాలను కొన్నిటిని తమ క్రొత్తశాఖల్లో ప్రవేశపెట్టుకున్నారు. ఈలా ప్రవేశపెట్టుకున్న సూత్రాల్లో ప్రస్తుతం మరియమాతకు సంబంధించిన అంశాలను మాత్రమే విచారించి చూద్దాం.

లూథరు కాల్వినుగూడ మరియమాత దేవమాత అని అంగీకరించారు. ఆమె పవిత్రురాలనీ, నిత్యకన్య అనీ భావించారు. కాల్వినుమాత్రం ఆమెకు జన్మపాపం సోకిందన్నాడు. ఆమె ఉత్థాపనాన్ని ఇద్దరూ అంగీకరించలేదు. ఆమె మనకోసం క్రీస్తుకు మనవిచేస్తుందనే అంశాన్ని కూడ ఇద్దరూ నిరాకరించారు.

మరియమాత విషయంలో క్యాథలిక్ క్రైస్తవులకీ ప్రోటస్టెంటు క్రైస్తవులకీ ప్రధానభేదం యిది. ముందటి అధ్యాయాల్లో చెప్పినట్లు క్యాథలిక్ క్రైస్తవులు ఆమె మన రక్షణంలో పాల్గొంది అంటారు. ఆమెను “రక్షణమాత” “సహరక్షకి” “మధ్యవర్తిని” అనే పేర్లతో పిలుస్తారు. కాని ప్రోటస్టెంటు క్రైస్తవులు ఈ విషయాన్ని అంగీకరించరు. వీళ్ళభావాల ప్రకారం మరియకూడ ఇతర శిష్యుల్లాంటిదే. వాళ్ళలాగ ప్రభుకరుణ స్వీకరించేదే. ఆమె ప్రభురక్షణానికి పాత్రురాలైంది అంతే. మరియ మన రక్షణంలో పాల్గొంది అంటే క్రీస్తు రక్షణం నాశమైపోతుంది. అతడు మనకు మధ్యవర్తి కాకుండాపోతాడు. కనుక మరియ క్రీస్తుతోకలసి మనలను రక్షించింది అనకూడదు. క్రీస్తుతో పనిచేసింది అనాలి. ఆమె క్రీస్తుచెంత నిలచి అతని మధ్యవర్తిత్వానికి సాక్ష్యంగా వుండిపోయిందిగాని, తాను స్వయంగా మధ్యవర్తిని కాలేదు.

కాని క్యాథలిక్ క్రైస్తవులు దీనినంగీకరింపరు. వాళ్ళ ప్రకారం యథార్థ మధ్యవర్తియేమో క్రీస్తే. కాని యీ మధ్యవర్తి మానవ మధ్యవర్తులనుగూడ తనతో జోడించుకొనే తన మధ్యవర్తిత్వాన్ని నెరపాడు. నరుని నరుడే రక్షించుకోవాలి అని దేవుని ఆశయం. కనుకనే దేవుడు నరుడై జన్మించింది. ఈలా నరుడైన దేవునితో మరియకూడ కలసిపోతుంది. దేవుని మధ్యవర్తిత్వం నరుల మధ్యవర్తిత్వాన్ని నిరాకరించదు. కరుణతో తనతోగూడ చేర్చుకుంటుంది. ఈలా చేర్చుకోవడం అవసరమైకాదు, ఔచిత్యం కోసం. కనుక మరియ క్రీస్తుచెంత నిలిచి అతని మధ్యవర్తిత్వానికి సాక్ష్యంగా వుండిపోవటం మాత్రమేగాదు, తాను స్వయంగా మన మధ్యవర్తినిగూడ.

ప్రోటస్టెంటు నాయకులు మొదటిరోజుల్లో మరియ మాతనుగూర్చి చాల విషయాలు అంగీకరించారు. లూథరుకి ఆమెపట్ల చాల భక్తీ అభిమానమూ వుండేవి. కాని క్రమేణ ప్రోటస్టెంటు శాఖలు “బైబులుమాత్రమే, దేవుడుమాత్రమే, వరప్రసాదం మాత్రమే” అనే వాదాన్ని లేవదీసారు. ఈ వాదం ప్రకారం బైబులులోలేని క్రైస్తవమత ఆధారాలన్నీ పోయాయి. కనుక పారంపర్యబోధ పోయింది. దేవుడుగాని పునీతులంతాపోయారు. వాళ్ళతోబాటు మరియమాత కూడ పోయింది. వరప్రసాదం కానిదంతా పోయింది. అనగా నరుల సహకారంగూడ పోయింది. ప్రోటస్టెంటులు మరియమాతను తూలనాడ్డం మొదలెట్టారు. అది చూచి క్యాథలిక్కులు ఆమెను అత్యధికంగా స్తుతించడం మొదలెట్టారు. ప్రోటస్టెంటులు ఆమెను పూజించడానికి ఆస్కారమేమిటి అన్నారు. క్యాథలిక్కులు పారపంర్యబోధ అన్నారు. ప్రోటస్టెంటులు ఆమెను కొనియాడితే క్రీస్తు మధ్యవర్తిత్వం పోతుంది అన్నారు. క్యాథలిక్కులు పోదు, ఇంకా అర్థవంతమౌతుంది అన్నారు. ఈలా నిన్నమొన్నటివరకూ ఈ ఉభయశాఖలవాళ్ళూ పోట్లాడుకొంటూనే వచ్చారు.

క్రైస్తవులను ఐక్యపరచవలసిన తల్లి ఈలా వాళ్ళ విభజనకు కారణం కావడం చాల దురదృష్టం.

వాటికన్ మహాసభ మొదట మరియమాతమీద గూడ ఓ చట్టం తయారుచేసింది. కాని ఆ చట్టంవలన ప్రోటస్టెంటులను రెచ్చగొట్టినట్లవుతుందని మళ్ళా దాన్ని ఉపసంహరించుకొంది. అందలి ముఖ్యాంశాలను శ్రీసభనుగూర్చిన చట్టంలోనే ఓ అధ్యాయంగా చేర్చింది. ఈ సభ మరియ మాతకు "మధ్యవర్తిని" అనే బిరుదంకూడ కొంచెం జంకుతూనేగాని వాడలేదు. అలా వాడిన తావుల్లోగూడ "మరియ మాత మధ్యవర్తిత్వం క్రీస్తు మధ్యవర్తిత్వానికి ఏమీ చేర్చదు. ఆ మధ్యవర్తిత్వం నుండి ఏమీ తొలగించదు" అని స్పష్టంగా చెప్పింది.

వాటికన్ ధోరణి ఈలా వుండగా మరియమాతను గూర్చిన ప్రోటస్టెంటు దైవశాస్త్రజ్ఞుల దృష్టికూడ ఇటీవల చాలవరకు మారిపోయింది. వాళ్ళు బైబులును జాగ్రత్తగా చదివి మరియ స్థానాన్ని గుర్తిస్తున్నారు. ఇప్పుడుభయ వర్గాలనుండి సమైక్యతా భావాలు పుట్టుకవస్తున్నాయి.

మరియమాత క్రైస్తవశాఖలకు ఐక్యత ప్రసాదించాలి అంటే మొదట ఈ శాఖలవాళ్ళు కొన్ని నూత్న దృక్పథాలు అలవరచుకోవాలి. ప్రోటస్టెంటులు క్యాథలిక్కులు కూడ తమ వైఖరిని మార్చుకోవాలి.

ప్రోటస్టెంటు శాఖలవాళ్ళు బైబులే కాకుండా పారంపర్య బోధనుగూడ గుర్తించాలి. క్రైస్తవమతం 16వ శతాబ్దంలో లూథరు తిరుగుబాటుతోనే పుట్టలేదు. ఆ మతానికి అంతకుముందే పదహారు వందల యేండ్ల జీవితచరిత్ర వుంది. ఆ పదహారు వందల యేండ్లలో క్రైస్తవ ప్రజలు మరియమాతను ఎలా పూజించారో ఎందుకు పూజించారో అర్థం చేసికోవాలి. బైబులు మరియమాతను గూర్చి అన్ని విషయాలూ చెప్పదు. అసలు దాన్ని వ్రాసినప్పటి పరిస్థితులువేరు. కాని బైబులుచెప్పిన విషయాలను జాగ్రత్తగా పరిశీలించి చూచినట్లయితే నేడు క్యాథలిక్ సమాజం మరియ మాతనుగూర్చి విశ్వసించే విషయాలు అంత అసందర్భంగా దోపవు. ఉదాహరణకు, నూత్నవేదమెక్కడాకూడా మరియ నిష్కళంకోద్భవి అని చెప్పదు. ఐనా క్యాథలిక్ శ్రీసభ అలా నమ్ముతుంది. ఈ నమ్మికకు ఆధారం లూకా 1, 28 వాక్యంలోని "దైవానుగ్రహ పరిపూర్ణురాలు" అనే మాటలో లేక పోలేదు. ఈలాగే మిగతా విషయాలు కూడాను.

క్యాథలిక్ క్రైస్తవులు మరియమాతను కొనియాడేపుడు ఎందుకు అలా కొనియాడుతున్నారో ప్రోటస్టెంటులకు వివరించి చెప్పగలిగి వుండాలి. ఈ విషయంలో ప్రోటస్టెంటులు ప్రశ్నించినా క్యాథలిక్కులు తరచుగా తృప్తికరమైన జవాబు

ఈయలేకపోతున్నారు. అంచేత వాళ్ళసందేహం ఇంకా బలపడుతూంటుంది. పైగా క్యాథలిక్కులు కొంతమంది క్రీస్తును మరియమాతను కలిపివేస్తుంటారు. క్రీస్తును ఆరాధించినా మరియను పూజించినా ఒకటే అనుకుంటూంటారు. ఇంకా కొంతమంది అజ్ఞానంవల్ల క్రీస్తును విస్మరించి మరియను మాత్రమే పూజిస్తుంటారు. ఈలా చేయడం తప్పు. క్రీస్తువేరు, మరియవేరు. వాళ్ళిద్దరూ చేసిన కృషికూడ వేరువేరు. మనలను రక్షించింది. క్రీస్తు. ఆ క్రీస్తుని బట్టి మరియమాత వచ్చింది. అంతేగాని, మరియమాతను బట్టి క్రీస్తు రాలేదు. కనుక మనం మొదట రక్షకుడైన క్రీస్తును ఆరాధించి ఆ పిమ్మట మరియమాతనుగూడ గౌరవించాలి. ఇది ప్రాచీన క్రైస్తవ సంప్రదాయం. మరియ మాతనేమో గౌరవించవలసిందే. కాని క్రీస్తునిబట్టి మాత్రమే. "ఇకమీదట సకలతరాలవాళ్ళు నన్ను ధన్యురాలినిగా భావిస్తారు. ఎందుకంటె సర్వశక్తిమంతుడు నాకు గొప్ప కార్యాలు చేసాడు' ' అన్న మరియ వాక్యంగూడ యిదే. వాటికన్‌సభ దృక్పథం వలననైతేనేమి, ప్రపంచమందలి వివిధ క్రైస్తవ శాఖల నాయకుల కృషివలన నైతేనేమి మరియమాత వివిధ క్రైస్తవ సంప్రదాయాల వాళ్ళను ఐక్యపరుస్తుందని విశ్వసిద్దాం.

## 2. హైందవ సంప్రదాయం

ఈ దేశంలో చాలమంది హిందువులు కన్యమరియను గౌరవిస్తుంటారు. మన ప్రాంతంలోనే చూచినట్లయితే గుణదలలో జరిగే లూర్దుమత తిరునాళ్ళలో చాలమంది హిందువులు పాల్గొని కానుకలు అర్పిస్తుంటారు. మరియమాత ప్రతిమనో, చిత్రాన్నో ఇండ్లల్లో వుంచుకొని ఆమెను గౌరవించే హిందూ కుటుంబాలుకూడ కొన్ని ఈ రచయితకు తెలుసు. ఇక హిందూమతంలో మరియలోలాగ కన్యాత్వమూ మాతృత్వమూ ఒకేవ్యక్తియందు కన్పించే దేవత ఎవరూలేరు. కాని తల్లిగానో కన్యగానో పరిగణింపబడే దేవతామూర్తులు మాత్రం చాలమంది వున్నారు. ఈ "కన్యలు" ఈ "అంబలు" మరియమాతను సూచిస్తుంటారు. వీళ్ళందరికీ ఆమె ప్రాతిపదికగా వుంటుంది. మరియ క్రైస్తవ ప్రజనేగాదు, సర్వమానవాళిని క్రీస్తుతో జోడిస్తుంది అన్నాం. అంబలనూ, కన్యలనూ గౌరవించే హిందూ ప్రజలను, హృదయశుద్ధితో భగవంతుని వెదకే జనులందరినీ, ఆ తల్లి తన చెంతకూ తన కుమారుని చెంతకూ చేర్చుకోవాలని మనవిచేద్దాం. చేర్చుకుంటుందని ఆశిద్దాం.

## 3. ముస్లిముల సంప్రదాయం

హిందూవుల్లాగే ముస్లిములు చాలమందిగూడ మరియను గౌరవిస్తుంటారు. మరియమాత గుళ్ళకువెళ్ళి ఆమెను పూజిస్తూంటారు. కొరాను ప్రకారం మరియ

పాపంలేకుండా జన్మించింది. పవిత్రురాలు. కన్యగానే బిడ్డను కంది. ఆ గ్రంథం ఓ తావులో "ఓ మిరియం! దేవుడు నిన్ను ఎన్నుకున్నాడు. పవిత్రపరచాడు. ప్రపంచంలోని స్త్రీలందరికంటెగూడ నిన్ను ధన్యురాలినిగా జేసాడు." అంటుంది - 3,41. కాని కొరాను క్రీస్తుని ఓ ప్రవక్తగానేగాని దేవునిగా అంగీకరింపదు. కనుక మరియనుగూడ దేవమాతగా అంగీకరింపదు. ఇప్పుడు ముస్లిము దైవశాస్త్రజ్ఞుల్లో చాలమంది కూడ నిష్ఠతో బైబులు చదువుతూన్నారు. అసలు ఆత్మశక్తి వల్ల అన్ని మతాలూ సమైక్యమైపోతూన్న రోజులివి. కనుక ఆ తల్లి ముస్లిము సోదరులనుగూడ క్రీస్తు చెంతకు చేర్చాలని ప్రార్థిద్దాం.

# 13. మరియమాత - శ్రీసభ

దేవుడు ప్రేమమూర్తి. అతడు ముగ్గురు వ్యక్తులతో గూడిన సమాజం. దేవుడు తన ప్రేమను మానవసమాజానికి అందించాలనుకున్నాడు, అందించాడు. కాని నరుడు దేవుని ప్రేమను ధిక్కరించాడు, పాపం కట్టుకున్నాడు. ఐనా భగవంతుడు కరుణతో పాపపు నరజాతిని రక్షింపబూనాడు. కాని నరజాతి రక్షణ నరజాతినుండే రావాలన్న తలంపుతో దేవుడు తన కుమారుణ్ణి నరుణ్ణిగా పంపగోరాడు. ఇక ఈ దేవుణ్ణి నరుణ్ణిజేసి మన సమాజంలోనికి తీసికొని రాదగిన తల్లి ఒకర్తె వుండాలి. దేవుడు ఎన్నుకున్న ఆతల్లే మరియ. ఈ యధ్యాయంలో రెండంశాలు విచారిద్దాం. మరియ మంగళగుణాలన్నిటికీ ఆమె మాతృత్వమే ఆధారం. మరియ మంగళగుణాలన్నీ శ్రీసభకూ, అనగా మనకూ, అక్షరాలా వర్తిస్తాయి.

## 1. దైవసంకల్పంలో మరియ

అనాదినుండి దేవుని రక్షణప్రణాళికలో క్రీస్తు ఉన్నాడు. మరియమాతా వుంది. క్రీస్తుదేహం గాబోయే శ్రీసభా వుంది. మరియద్వారాగాని దేవుడు మానవసమాజానికి తన కుమారుణ్ణి ప్రసాదించలేదు. ఆమెద్వారాగాని పరలోకపిత మానవసమాజంతో రక్షణ సంబంధం పెట్టుకోలేదు. సరే, భగవంతుని కోరిక ప్రకారం మరియ దేవుని కుమారుణ్ణి నరుణ్ణిజేసి మన మంటిమీదికి ప్రవేశపెట్టింది. ఈ మహత్తర కార్యంద్వారా ఆమె దేవమాత ఐంది. మరియ గుణాలన్నిటిలో శ్రేష్ఠాతిశ్రేష్టమైంది ఈ దైవ మాతృత్వమే. ఆమె గొప్పతనమంతా ఈ లక్షణంమీదనే ఆధారపడివుంది.

ఈ మరియ రక్షిత మానవ సమాజంలో మొదటి వ్యక్తి. రక్షిత మానవసమాజమే శ్రీసభ, క్రీస్తుదేహం. కనుక శ్రీసభకు మరియ ఆదర్శంగా వుంటుంది. పూర్వాధ్యాయాల్లో కన్యాత్వం, నిష్కళంకత్వం మొదలైన మరియ భాగ్యగుణాలను వివరించాం. ఈ

భాగ్యగుణాలన్నీ ఆమె దైవ మాతృత్వాన్ని బట్టి సిద్ధించినవే. ఈ విషయాన్ని కొంత సవిస్తరంగా విచారించి చూద్దాం.

మరియ దేవమాత కావాలి గనుకనే నిష్కళంకంగా జన్మించింది. పరమ పవిత్రుడైన దేవుడు ఈ మరియద్వారా పాపపు నరజాతిని సమీపింపబోతున్నాడు. అతన్ని మన మానుష కుటుంబంలో ప్రవేశపెట్టబోయే తల్లీ పవిత్రురాలై యుండాలి. సూర్యుడు భూమిమీద పడేట్లయితే ఆ భూమిని చేరకముందే నేలమీద తాను పడబోయేచోటిని కాల్చివేస్తాడు. అలాగే దేవుడుకూడ తాను మానవసమాజంలోకి దిగిరాకముందే, ఏ వ్యక్తిద్వారా అలా దిగిరానున్నాడో ఆ వ్యక్తిని తన ప్రేమాగ్నితో కాల్చి పునీతం జేసాడు. అందువలననే ఆమె నిష్కళంకగా జన్మించింది. నిష్కల్మషుడైన దేవునికి పుట్టువు ఈయడం కోసం మరియ నిష్కల్మషగా ఉద్భవించింది.

మరియ నిత్యకన్య అన్నాం. దేనికి? తన పూర్ణ హృదయాన్ని ప్రభువుకే సమర్పించుకోవడం కోసం. కన్యమరియ తన హృదయాన్ని దేవుడైన తన కుమారునికే అర్పించుకుంది. మరో కుమారుడు ఆమెకు పుట్టనూలేదు, ఆ తల్లి ప్రేమలో పాలుపంచుకోనూలేదు. కనుక ఆమె కన్యాత్వం గూడ దైవమాతృత్వం కోసమే.

మరియ సహరక్షకి అన్నాం. ఆమె దేవమాత కనుకనే సహరక్షకి ఐంది. దేవుని కుమారుని కని అతనికి మానుష దేహం ఇచ్చింది. ఈ దేహాన్నే క్రీస్తు సిలువమీద బలిగా అర్పిస్తాడు. అనగా ఆమె క్రీస్తుకు బలివస్తువును అందించింది. క్రీస్తును బలిమూర్తిగా సిద్ధం చేసింది. అటుపిమ్మట మరియ సిలువచెంత నిలుచుండి బాధననుభవిస్తూ క్రీస్తును అర్పించింది. క్రీస్తు స్వీయార్పణంతో తన ఆత్మార్పణను కూడా ఐక్యం చేసింది. ఈ సన్నివేశంలో సిలువచెంత నిలిచిన మరియ మానవులందరికి ప్రాతినిధ్యం వహిస్తుంది. కనుక, ఆమె సహకారం ద్వారా క్రీస్తు రక్షణం మరింతగా మానవులనుండి పుట్టే రక్షణమైంది. మానవుణ్ణి మానవుడే రక్షించుకోవడం దైవప్రణాళిక అన్నాంగదా! ఈలా మరియ దేవమాత కనుకనే మనకు సహరక్షకి కాగలిగింది.

క్రీస్తు ఉత్థానమై మోక్షరోహణం చేసాడు. క్రీస్తు రక్షణకార్యంలో పాల్గొనిన రక్షణమాతకుగూడ ఉత్థాపనం లభించింది. ఉత్థానక్రీస్తు మనకు వరప్రసాదం ఆర్జించి పెట్టాడు. ఆ వరప్రసాదాన్ని రక్షణమాత మనకు పంచిపెడుతూంటుంది. ఆమె వరప్రసాధాలమాత. క్రీస్తుతో పాటు ఆమెకూడ నిత్యం మనకోసం మనవి చేస్తుంటుంది. క్రీస్తుకు భౌతిక మాతయైన మరియ క్రీస్తు దేహమైన శ్రీసభకు జ్ఞానమాత ఔతుంది. ఆమె రెండవయేవ. జీవమిచ్చే యేవ. కనుక మరియ దైవమాతృత్వమే ఆమె ఉత్థాపనానికీ, వరప్రసాద ప్రదానానికీ, జ్ఞానమాతృత్వానికీ కారణం అని చెప్పాలి.

క్రీస్తు తన తండ్రిసమక్షంలో కూర్చుండి రాజుగా పరిపాలనం చేస్తుంటాడు. మరియగూడ ఆ క్రీస్తుతోపాటు తానూ రాజ్ఞిగా పాలనం చేస్తుంది. మనతరపున ఆమె చేసే వేడుదలే ఆమె రాచరికం. మరియ రాజ్ఞీత్వంకూడ ఆమె దైవమాతృత్వం యొక్క ఫలితమే. ఈ విధంగా మరియమాత మంగళగుణాలన్నీ ఆమె దివ్యమాతృత్వం వలననే సిద్ధించాయని చెప్పాలి. కనుక దేవుడు తన రక్షణ ప్రణాళికలోనే ఆమెను దేవమాతనుగా ఎన్నుకున్నాడు.

## 3. మరియ - శ్రీసభ

మనుష్యావతారం అంటే దేవుడు నరుడు గావడం మాత్రమేగాదు, నరులు ఆ దేవుని దేహం గావడంకూడా. అనగా క్రైస్తవసమాజం లేక శ్రీసభ ఏర్పడ్డంగూడ. ఈ శ్రీసభలో మరియ మొదటి వ్యక్తి. కనుక ఆమె శ్రీసభ కంతటికీ పోలికగా, ఆదర్శంగా వుంటుంది. ఇక మానుష క్రీస్తునకు అతని తల్లికీ ఏలాంటి మహిమాన్విత లక్షణాలు సిద్ధించాయో శ్రీసభకూ అలాంటి లక్షణాలే సిద్ధిస్తాయి. శ్రీసభ అంటే క్రైస్తవ ప్రజలమైన మనమందరమూను. కనుక మనకందరకూ క్రీస్తు మరియలకు ఒనగూడిన లక్షణాలే ఒనగూడుతాయి. మరియ మహిమలు ఆమెకోసం మాత్రమేగాదు, శ్రీసభ కోసమూ మనకోసమూను. మరియ గుణాలు శ్రీసభలోను మనలోను ఏలా ప్రతిఫలిస్తాయో విచారించి చూద్దాం.

మరియ ఓ మాతృమూర్తి. అదేవిధంగా శ్రీసభకూడ మాత. జ్ఞానస్నానంద్వారానే శ్రీసభ మనలను కంది. క్రైస్తవుడుకూడ ప్రేషితుడుగా వ్యవహరించినప్పుడల్లా క్రీస్తు బిడ్డలను కంటాడు. తల్లీ తండ్రీ ఔతాడు - గల 4,19.

శ్రీసభ మాతృత్వానికీ మరియ మాతృత్వానికీ, ఒక భేదం వుంది. శ్రీసభ క్రీస్తు దేహమైన క్రైస్తవులను మాత్రమే కనగలదు. ఈ దేహానికి శిరస్సైన క్రీస్తును కనలేదు. జ్ఞానదేహపు శిరస్సైన క్రీస్తును కనగల్గిన తల్లి మరియ ఒకర్తే. అది ఆమె సాధించిన మహాకార్యం. ఆమె మహత్వం కూడ అదే.

నిష్కల్మషుడైన దేవుణ్ణి మన మానుషజాతిలోనికి ప్రవేశపెట్టడంకోసం మరియ నిష్కల్మష కావలసివచ్చిందన్నాం. క్రీస్తు దేహమూ క్రీస్తుపత్నీ ఐన శ్రీసభకూడ నిష్కల్మష కావాలి - ఎఫే 5,27. శ్రీసభ సమస్తంగా తీసికొంటే నిష్కల్మష ఐనా వ్యస్తంగా తీసికొంటే, అనగా తన సభ్యులందు కల్మషగానే వుంటుంది. ఈ సభలో సంపూర్ణ నిష్కల్మష ఒకర్తే,

మరియ. కనుక పాపాన్ని జయించి నిష్కల్మషత్వాన్ని బడయడంలో ఆమె మనకూ శ్రీసభకూ ఆదర్శంగా వుంటుంది.

మరియ కన్య. మరియలాగే శ్రీసభకూడ కన్య - 2కొ 11,2. మరియలాగే శ్రీసభకూడ కన్యగావుండే పవిత్రాత్మ శక్తివలన జ్ఞానస్నానం ద్వారా మనలను కంటుంది. మరియ కన్యగా వుండి అవిభక్త హృదయంతో ప్రభువుకి అంకితమైంది.కాని శ్రీసభ, ఈసభ సభ్యులు అంతటి గాఢ హృదయంతో ప్రభువుకి సమర్పితులు కారు. కనుక ఈ సమర్పణ విషయంలోకూడ మరియ మనకు ఆదర్శంగా వుంటుంది.

నరులను నరులే రక్షించుకోవాలి అన్న భావంతో దేవుడు మరియను క్రీస్తుతో సహరక్షికిని చేసాదన్నాం. మరియలాగే శ్రీసభకూడ సహరక్షకి - కొలో 1-24. శ్రీసభ సంస్కారాలు, ఆరాధనా, ప్రేషితకార్యం ఇవన్నీ క్రీస్తు రక్షణాన్ని కొనసాగించడం కోసమేగదా! కాని మరియ క్రీస్తు పుట్టువునందు మరణంనందు సహరక్షికి ఐనంతగా శ్రీసభ తాను కాలేదు. ఈ రక్షణం విషయంలోకూడ మరియ శ్రీసభకు ప్రేరణంగా వుంటుంది.

క్రీస్తు మరియలు ఉత్థానమహిమ పొందారు. మరియలాగే శ్రీసభకూడ ఉత్థానభాగ్యం పొందుతుంది - 1కొ 15, 20-23. కాని ఈ భాగ్యం వెంటనే లభించదు. లోకాంతం వరకూ వేచివుండాలి. ఈ వరకే ఉత్థానమహిమను బడసిన మరియ ఇకమీదట ఉత్థానాన్ని పొందవలసిన శ్రీసభకు ప్రేరణంగా వుంటుంది.

క్రీస్తు మోక్షంలో వుండి మన తరపున తండ్రిని మనవి చేస్తూంటాడు - హెబ్రే 7,25. మనకు వరప్రసాదాలు ఇస్తూంటాడు. అలాగే మోక్షాన్ని చేరుకున్న శ్రీసభకూడా పునీతుల రూపంలో మనకోసం దేవుని మనవి చేస్తూంటుంది. కాని ఈ పునీతులందరికంటె కూడ మరియ అధికంగా విన్నపం జేస్తూ వీళ్ళందరికీ తాను విజ్ఞాపన విషయంలో ప్రేరణంగా వుంటుంది.

ఉత్థానక్రీస్తు రాజుగా పరిపాలనం జేస్తూంటాడు. శ్రీసభకూడ ఈ క్రీస్తు రాచరికంలో పాల్గొనాలి - 2 తిమో 2,12. మరియ రాజ్ఞీత్వం శ్రీసభ రాజ్ఞిత్వానికి ప్రేరణం.

సంగ్రహంగా చెప్పాలంటే మరియ శ్రీసభకు, అనగా మనకు ఆశగాను ఆదరువుగాను వుంటుంది. ఆమె మహిమను పొంది మోక్షంలోవుంది. మనమూ ఆ పదవిని పొందాలి. కాని ఇంకా పొందలేదు. అంచేత ఈ లోకంలో వున్నంత కాలం ఆమెవైపుచూస్తూంటాం. ఆమె వున్నచోటికి వెళ్ళాలని ఉవ్విళ్లూరుతుంటాం. ఆమె మనకు అండదండగా ఆదరువుగా ఉంటుంది.

క్రీస్తు మనకోసం ఏమి సాధించాడో, క్రీస్తునుండి మనం ఏమి సాధించ గోరుతుంటామో అదంతా మరియ ఈవరకే సాధించింది. కనుక ఆమె శ్రీసభకూ, క్రైస్తవ ప్రజలకూ ప్రేరణం. మాతృ ప్రతిని చూచి మరో ప్రతిని వ్రాస్తారు. మాతృచిత్రాన్ని చూచి మరో చిత్రాన్ని గీస్తాం. అలాగే మాతృకయైన మరియనుచూచి మనమూ ఆమెలాగే తయారు కాగోరుతాం. ఆమె శ్రీసభకు మాతృక, ఆదర్శం, పోలిక, ప్రాతిపదిక అంటే భావం యిదే.

మరియను ఎప్పుడూ శ్రీసభతో జోడిస్తుండాలి. ఆమెను అర్థం చేసికుంటే శ్రీసభను అర్థం చేసుకున్నట్లు. శ్రీసభను అర్థం జేసికుంటే ఆమెను అర్థం జేసుకున్నట్లు. ఇక మరియ శ్రీసభలను అర్థం జేసికుంటే క్రీస్తును అర్థం జేసుకున్నట్లు. క్రీస్తు రక్షణం మరియ యందు వ్యక్తిగతంగా, శ్రీసభయందు సామాజికంగా ఫలసిద్ధి నిస్తుంది. మరియయందు క్రీస్తురూపం సంపూర్ణంగా ప్రతిఫలించింది. అనగా ఆ విశుద్ధురాలు దేవుడు సంకల్పించుకున్న నరులు ఎలా నిర్మలంగా వుండాలో అలా వుండిపోయింది. కనుక దేవుడు సంకల్పించుకున్న క్రైస్తవ సమాజానికి - ఆ సంకల్పం ప్రకారం జీవించలేకపోతూన్న క్రైస్తవ శ్రీసభకు - ఆమె ఆదర్శంగా నిలుస్తుంది.

దేవుడు నరుల్లో ఎలా కన్పిస్తాడో, క్రీస్తు మానవుల్లో ఎలా ప్రతిఫలిస్తాడో చూడాలంటే మరియను చూడాలి. మంగళప్రదమైన ఆమె మహిమాన్విత గుణాలన్నీ మన మీద పనిచేస్తాయి. మనమూ ఆమె మహిమను పొందేలా చేస్తాయి. ఆమె శ్రీసభలో తొలివ్యక్తి. మనం మలివ్యక్తులం. అందుకే మనం ఆ యావలితీరాన్ని చేరుకోవాలంటే ఆమె సహాయం పొందుతూండాలి.

దేవుడు మానవులమధ్యలో జన్మించడానికీ, అలా జన్మించి మానవులను దేవుని బిడ్డలను చేయడానికి మరియ నుండి జన్మింపవలసి వచ్చింది - గల 4,5. కనుక ఆ తల్లి దేవమాత, మానవులమాత. ఆ పునీతమాతకు జోహారు!

# 2. విజ్ఞాన బోధనలు

## మనవిమాట

ఈ విజ్ఞానబోధనలను బైబులు భాష్యం 87-91 సంచికల్లో ప్రచురించాం. ఆ సంచికలనే ఇక్కడ కొలది మార్పులతో ఏక గ్రంథంగా ప్రచురించాం. ఈ పుస్తకంలో బైబుల్లోని విజ్ఞాన బోధనలను సంగ్రహంగా వివరించాం.

పూర్వవేదంలో విజ్ఞాన బోధనలు బాబిలోనియా ప్రవాసానంతరం 6వ శతాబ్దంనుండి ప్రచారంలోకి వచ్చాయి. దేవునిపట్ల భయభక్తులు చూపడమే విజ్ఞానం. నూత్నవేదంలో క్రీస్తే మన విజ్ఞానం. నేడు మనం దేవునినుండి విజ్ఞానాన్ని వరంగా పొందుతాం.

మనదేశంలో బోలెడంత విజ్ఞానవాఙ్మయం వుంది. ఈ సాహిత్యాన్ని అర్థంజేసికోవడానికి బైబులు విజ్ఞాన బోధనలు కొంతవరకు ఉపకరిస్తాయి. ఇంకా, నైతికంగా విశుద్ధ జీవితం గడపడానికి గూడ ఈ బోధనలు తోడ్పడతాయి.

ఈ పుస్తకంలోని విజ్ఞాన బోధనలను 40 అధ్యాయాలుగా విభజించాం. వీటన్నిటినీ నైతికవర్తనం, దుష్టవర్తనం అనే రెండు ప్రధానాంశాలక్రింద పొందుపరచాం. క్రైస్తవ భక్తులు అనుదినం ప్రార్థనం చేసికోవడానికీ, సచ్ఛీలం అలవర్చుకోవడానికీ ఈ పొత్తం ఉపకరిస్తుందని ఆశిస్తున్నాం.

## విషయసూచిక

### 1. నైతికవర్తనం

## 2. దుష్టవర్తనం

# 1. నైతిక వర్తనం

## 1. విజ్ఞాన గ్రంథాలకు పరిచయం

### 1. జ్ఞాన గ్రంథాలు

మామూలుగా పూర్వవేదంలో ఏడు గ్రంథాలను విజ్ఞాన గ్రంథాలు అని పిలుస్తారు. అవి యోబు, సామెతలు, ఉపదేశకుడు, సీరా జ్ఞానం, సొలోమోను జ్ఞానం, పరమగీతం, కీర్తనల గ్రంథం అనేవి.

### 2. యిస్రాయేలు విజ్ఞానానికి ఆధారం

యిస్రాయేలీయులకంటె ముందుగానే వారి యిరుగు పొరుగు దేశాలైన ఈజిప్టు, మెసపొటామియా, కనాను, అరేబియా మొదలైనవి విజ్ఞానాన్ని ప్రచారంలోకి తెచ్చాయి. యిస్రాయేలు రచయితలు ఈ దేశాల విజ్ఞానాన్ని కొంతవరకు వాడుకొన్నారు. వాళ్ళ సొంత విజ్ఞానాన్ని కూడ పెంపొందించుకొన్నారు. యూదులు మోషేను ధర్మశాస్త్రానికీ, దావీదును కీర్తనలకూ ఆధారం చేసినట్లే, సొలోమోను రాజును విజ్ఞానానికి ఆధారం చేసారు. యిర్మీయా ప్రవచనం 18,8 నుండి యూద సమాజంలో యాజకులకూ, ప్రవక్తలకూ, జ్ఞానులకూ సమానమైన హోదా వుండేదని తెలుస్తుంది.

### 3. అన్యజాతుల విజ్ఞానమూ, యూదుల విజ్ఞానమూ

అన్యజాతుల విజ్ఞానం కేవలం లౌకికమైంది. దానికి దేవునితో సంబంధంలేదు. మన దేశంలో పుట్టిన విజ్ఞానం కూడ ఈలాంటిదే. కాని యూదుల విజ్ఞానం పూర్తిగా మతపరమైంది. వాళ్ళ ఆలోచనల ప్రకారం, విజ్ఞానానికి మొదటి మెట్టు దైవభీతి.

### 4. విజ్ఞానమంటే యేమిటి?

జ్ఞానగ్రంథాలు జీవితం, మరణం, కష్టాలు, చెడ్డ, ప్రేమ, నరుడు భగవంతునితోను నరునితోను మెలిగే తీరు మొదలైన అంశాలను పేర్కొంటాయి. మంచి జీవితం ఏలా జీవించాలో, దానిద్వారా సుఖశాంతులూ విజయమూ ఏలా సాధించాలో చెప్తాయి. జీవితంలో ఎదురయ్యే నానా సమస్యలకు పరిష్కారాలు సూచిస్తాయి. రాజకీయాల్లో నేర్పు, కళల్లో ప్రావీణ్యం, బాలురకు విద్యగరపడం మొదలైన అంశాలనుకూడ ప్రస్తావిస్తాయి. నరునికి సామాన్య పరిజ్ఞానాన్ని నేర్పుతాయి. కాని ఈ యంశాలన్నిటినీ లౌకిక పద్ధతిలోకాక

ఆధ్యాత్మిక పద్ధతిలో నేర్పుతాయి. అన్నిటినీ దేవునితో ముడిపెడతాయి. ప్రభువుపట్ల భయభక్తులు చూపడం విజ్ఞానానికి మొదటిమెట్టు అని చెప్తాయి - సీరా 1, 14. సామె 1,7. ఎప్పుడూ వరప్రసాదం విజ్ఞానం కలసిపోతాయి. వరప్రసాదాన్ని కోల్పోయిన నరుళ్ళో విజ్ఞానం నిలువదు. దానికీ పాపులకూ చాల దూరం.

బైబులు విజ్ఞానాన్ని వివేకం, వివేచనం, గ్రహణశక్తి, సలహాను చేకోనడం అనికూడ పిలుస్తుంటుంది. ఆ విజ్ఞాన గుణానికి భిన్నమైంది పాపం, బుద్ధిహీనత, అజ్ఞానం, మూర్ఖత్వం, అహంకారం, దుష్టత్వం, అవహేళనం. ఈ పదాలను బట్టికూడ విజ్ఞాన స్వభావాన్ని కొంతవరకు గ్రహించవచ్చు.

ఈ విజ్ఞాన గ్రంథాలు ధర్మశాస్త్రం, నిబంధనం, ఎన్నిక, విముక్తి, దైవారాధనం మొదలైన పూర్వవేదంలోని ప్రధానాంశాలను ప్రస్తావించవు. కనుక యూదులు ఆదిపంచకానికీ, ప్రవక్తల గ్రంథాలకూ ఇచ్చిన విలువను ఈ పుస్తకాలకు ఈయలేదు. విజ్ఞానం ప్రధానంగా బాబిలోనియా ప్రవాసానంతరం (587) వృద్ధిలోకి వచ్చింది. మామూలుగా ఈ పుస్తకాలు వ్యక్తి బాగోగులనే కాని సమాజం బాగోగులను పట్టించుకోవు. ఐనా వీటి విలువను తక్కువగా అంచనా వేయకూడదు.

## 5. జ్ఞానులు

ఈ గ్రంథాలను చెప్పిన జ్ఞానులు తాత్వికులు, మానవతావాదులు. యాజకులు ధర్మశాస్త్రాన్ని బోధించి దేవాలయంలో ఆరాధనను నిర్వహించేవాళ్లు. ప్రవక్తలు దైవసందేశాన్ని తెలియజెప్పేవాళ్ళు. జ్ఞానులు కేవలం ఉపాధ్యాయులు. వాళ్లు తరతరాల మానవ జీవితాన్ని గూర్చిన తమ అనుభవాన్నీ విజ్ఞానాన్నీ మనకు అందించిపోయారు. కాని వారి బోధలు కేవలం లౌకికమైనవికావు, భగవత్ప్రేరితమైనవి. కావుననే వారి గ్రంథాలకు బైబుల్లో చోటు లభించింది. విజ్ఞాన బోధకుడైన జ్ఞానిని సీరా గ్రంథం 39, 1-11 చక్కగా వర్ణిస్తుంది.

విజ్ఞాన గ్రంథాల్లో మూడు ప్రధానాంశాలు కన్పిస్తాయి. 1. జ్ఞానులు తమ బోధలను సామెతలు సూక్తులు నీతివాక్యాల రూపంలో వెలయించారు. 2. వారి బోధల్లో దైవ ప్రేరణమూ కన్పిస్తుంది, సొంత ఆలోచనలూ అనుభవాలు కూడ కన్పిస్తాయి. కనుక ఈ గ్రంథాలను అన్య మతస్థులుకూడ పఠించి లాభం పొందవచ్చు. చాల తావుల్లో వీళ్ళ బోధలు మన దేశంలో వెలసిన పంచతంత్రం, హితోపదేశం, నీతిశాస్త్రాలు, నీతిశతకాలు మొదలైన పుస్తకాల స్థాయిలో వుంటాయి. ఇవి లౌకిక బోధలు మాత్రమే. 3. మతం ఓ సిద్ధాంతం మాత్రమే కాదు, ఆచరణం కూడ. కనుక ఈ పుస్తకాలు మతాచరణనుగూర్చీ, సత్ప్రవర్తనను గూర్చీ మాటిమాటికీ నొక్కి చెప్తాయి. అసలు ఈ గ్రంథాల్లో 75 శాతం నైతిక బోధలే వుంటాయి.

జ్ఞానులు తమ విజ్ఞానాన్ని రాజస్థానాల్లో, బళ్ళల్లో, కుటుంబాల్లో కూడ బోధించారు. విజ్ఞానాన్ని సాధించే మార్గాలు పఠనం, క్రమశిక్షణ, జ్ఞానుల సూక్తులను ఆలించడం మననం చేసికోవడం, దేవునికి ప్రార్థన చేయడం మొదలైనవి. విజ్ఞానానికి ఆధారం ప్రభువే. అతనినుండేగాని మనం జ్ఞానాన్ని సంపాదించలేం - సీరా 1,1. కావుననే సొలోమోను జ్ఞానం కొరకు ఈలా ప్రార్థించాడు

నీవు నీ జ్ఞానాన్ని దయచేస్తేనే తప్ప,
స్వర్గంనుండి నీ పవిత్రాత్మను పంపితేనే తప్ప,
నీ చిత్తాన్ని ఎవడు తెలిసికోగలడు?
ఈ రీతిగా నీవు దయచేసే జ్ఞానంద్వారా
భూమిమీది నరులు ఋజుమార్గంలో నడుస్తున్నారు
నీకు ప్రీతికరమైన కార్యమేమిటో తెలిసికొంటున్నారు
భద్రతను పొందుతున్నారు - సొలో జ్ఞాన 9, 17-18.

## 6. విజ్ఞానం ఓ దైవవ్యక్తి

ఈ గ్రంథాలు చాల తావుల్లో విజ్ఞానాన్ని ఓ దైవ వ్యక్తినిగా వర్ణిస్తాయి.

1) విజ్ఞానం మనకు ఓ ఆతిథేయ. ఆమె మనకు అందించే అన్నపానీయాలు విజ్ఞానమే.

రా, నేను తయారుచేసిన భోజనాన్ని ఆరగించు
నేను సిద్ధంచేసిన ద్రాక్షాసవాన్ని సేవించు
మూర్ఖత్వాన్ని విడనాడితే నీవు బ్రతికిపోతావు
విజ్ఞాన పథాన నడుస్తావు - సామె 9, 4-5.

2) ప్రభువు ఈ విజ్ఞానాన్ని ప్రప్రథమంలోనే సృజించాడు. అది శాశ్వతమైంది. ప్రభువు లోకాన్ని సృజించేపుడు ఆది వో శిల్పిలా అతని ప్రక్కన నిల్చుండి వుంది. దానిలో దైవత్వముంది.

ప్రభువు నన్ను ప్రప్రథమంలోనే సృజించాడు
తాను పూర్వమే కలిగించిన వాటన్నిటిలోను
నన్ను మొదటిదాన్నిగా చేసాడు
నేను ప్రధాన శిల్పివలె అతనిచెంత నిల్చివున్నాను
పసికందులాగ రోజురోజు అతనికి ఆనందం చేకూరుస్తూ
నిత్యం అతని సన్నిధిలో ఆటలాడుకొనేదాన్ని

అతడు చేసిన పుడమిమీద క్రీడిస్తూ
ప్రమోదంతో మానవాళిమధ్య వసించేదాన్ని - సామె 8, 30-31

3) అది యిస్రాయేలీయుల మధ్య వసిస్తుంది. విజ్ఞానమూ ధర్మశాస్త్రమూ వొకటే.
సర్వాన్ని కలిగించిన దేవుడు నాకాజ్ఞ యిచ్చాడు
సృష్టికర్త నేనెచట వసించాలో నిర్ణయించాడు
అతడు నీవు యాకోబు వంశజులమధ్య వసించు
యిస్రాయేలీయులు నీ ప్రజలౌతారని చెప్పాడు
ఈ విజ్ఞానం మోషే అజ్ఞాపించిన ధర్మశాస్త్రం
మహోన్నతుడైన ప్రభువు నిబంధన గ్రంథం
యిస్రాయేలీయులకు వారసంగా లభించిన ఆస్తి - సీరా 24, 8, 23.
ఈ విజ్ఞానం దేవుని ఆజ్ఞల గ్రంథం
శాశ్వతంగా నిల్చే ధర్మశాస్త్రం
దాన్ని పాటించేవాళ్ళు బ్రతుకుతారు
విడనాడేవాళ్ళు చస్తారు - బారూకు 4,1

4) సొలోమోను జ్ఞానగ్రంథం 7, 22-27 వచనాలు విజ్ఞానానికి దేవుని గుణాలను ఆరోపిస్తాయి. విజ్ఞాన వర్ణనలన్నింటిలోను ఈ భాగం పర్వత శిఖరం లాంటిది. ఈ జ్ఞానం దేవునికి ప్రతిరూపమే.

అది దైవశక్తియొక్క శ్వాసం
ప్రభువు మహిమయొక్క స్వచ్ఛమైన ప్రవాహం
మలినమైనదేదీ దానిలోనికి ప్రవేశింపలేదు
అది శాశ్వతజ్యోతికి ప్రతిరూపం
దేవుని క్రియాశక్తిని ప్రతిబింబించే నిర్మల ముకురం
అతని మంచితనానికి ప్రతిబింబం - 7,25-26

## 7. విజ్ఞానం క్రీస్తే

దైవగుణాలు కలిగిన ఈ విజ్ఞానం నూత్న వేదంలో క్రీస్తుగా అవతరించింది. పూర్వవేదం బోధించిన విజ్ఞానం క్రీస్తేనని చెప్తుంది నూత్నవేదం.

జ్ఞానగ్రంథకర్తల్లాగ క్రీస్తుకూడ సామెతలతోను సూక్తులతోను బోధించాడు. పర్వతప్రసంగమే ఇందుకు సాక్షి. అతడు జ్ఞానియైన సొలోమోనుకంటె గొప్ప జ్ఞాని - మత్త 12, 42. తన కోశాగారంనుండి నూతన, పురాతన వస్తువులను వెలికితెచ్చే ధర్మశాస్త్ర

బోధకుడు - 13, 52. అతడుశిష్యులకు వివేకాన్నిస్తాడు - లూకా 21,15. క్రీస్తు దేవుని వివేకం - 1 కొ 1,24. అదృశ్యుడైన దేవునియొక్క ప్రత్యక్ష రూపం. దేవుని సమస్త సృష్టిలో తొలుత జన్మించిన పుత్రుడు - కొలో 1,15. దేవుని మహిమయొక్క తేజస్సు, దేవునికి అచ్చమైన ప్రతిరూపం - హెబ్రే 1,3. ఆదిలో విజ్ఞానం దేవుని చెంత వున్నట్లే, వాక్కుకూడ దేవునిచెంత వుంది - యోహా 1,1. విజ్ఞానం మానవాళిమధ్య వసించినట్లే క్రీస్తుకూడ తన వారి వద్దకు విచ్చేసాడు -1,11. ఈ నూత్నవేద వాక్యాలన్నీ కూడ క్రీస్తుపూర్వవేదంలోని విజ్ఞానమేనని రుజువుచేస్తాయి.

## 8. క్రైస్తవుడూ విజ్ఞానం

క్రీస్తు దేవుని విజ్ఞానమని చెప్పాం. అతని శిష్యులమైన మనంకూడ ఈ విజ్ఞానాన్ని పొందుతాం. తండ్రే దీన్ని శిష్యులకు అనుగ్రహిస్తాడు. "తండ్రీ! విజ్ఞులకు వివేకులకు ఈ రహస్యాలను మరుగుపరచి వీనిని పసిబిడ్డలకు బయలు పరచావు - మత్త 11, 25. ఆత్మ మనకు విజ్ఞానపూర్వకమైన వాక్కును ప్రసాదిస్తుంది - 1కొ 12,8. ఈ విజ్ఞానం దేవుడు గోప్యంగా వుంచిన క్రీస్తు మనుష్యావతార రహస్యం. పౌలు లాంటి అపోస్తలులు ఈ రహస్యాన్ని మనకు బోధించారు-1 కొ 2,7. అది మన నైతిక జీవితానికిగూడ గుర్తు. జ్ఞానియైనవాడు సత్ప్రవర్తనంద్వారా తన జ్ఞానాన్ని రుజువు చేసికోవాలి - యాకో 3,13. వివేకం లేనివాడు దేవుణ్ణి అడుగుకొంటే అతడు వానికి విజ్ఞానాన్ని ప్రసాదిస్తాడు - యాకో 1,5.

ఈ విధంగా పూర్వవేదంలో మొదట నీతిబోధలతో ప్రారంభమైన విజ్ఞానం క్రమేణ దైవభీతి ఐంది. తర్వాత దైవభక్తి ఐంది. నూత్నవేదంలో క్రీస్తు అయింది. కడన క్రైస్తవులు పొందే వరమైంది.

## 9. రోజువారి జీవితంలో విజ్ఞానం

1. బైబుల్లో సామెతల గ్రంథం, సీరా గ్రంథం మొదలైన సామెతల పుస్తకాలున్నాయి. కాని మనదేశ భాషల్లో ప్రాచీన లిఖిత సాహిత్యంలో సామెతల గ్రంథాలు లేవు. సామెతలు మన ప్రాచీన ప్రజల్లో ముఖతః మాత్రమే ప్రచారంలో వుండేవి. ఈ మౌఖిక లోకోక్తులను మనదేశంలో 20వ శతాబ్దంలో గ్రంథాలుగా ప్రచురించడం మొదలెట్టారు. ఇప్పుడు తెలుగు సామెతలు సంపూర్ణంగా గ్రంథరూపంలో దొరుకుతాయి.

ఒక్క సామెతలేగాకుండ మనదేశంలో విజ్ఞానవాఙ్మయం బోలెడంత వుంది. నీతికథలు, నీతి శాస్త్రాలు, నీతి శతకాలు, పొడుపు కథలు మొదలైనవన్నీ ఈ శాఖకు చెందినవే. సంస్కృతంలో పంచతంత్రం, హితోపదేశం ప్రధానంగా విజ్ఞాన గ్రంథాలే.

తెలుగులో వేమన శతకం, సుమతీ శతకం బాగా ప్రచారంలోకి వచ్చాయి. మనదేశంలోని ఈ నీతివాఙ్మయ శాఖలను అర్థంజేసికోవడానికి బైబుల్లోని విజ్ఞానవాఙ్మయం కొంతవరకు తోడ్పడుతుంది.

2. బైబులు విజ్ఞానం మతపరమైంది. భగవంతుడు దాని కాశ్రయం. దైవభీతి విజ్ఞానానికి మొదటిమెట్టు అన్నాడు సామెతల గ్రంథకారుడు. నూత్నవేదంలో క్రీస్తు మనకు ఆదర్శజ్ఞాని. కాని మనదేశంలో పుట్టిన విజ్ఞానం కేవలం లౌకికమైంది. దానికి పరమాత్మునితో సంబంధంలేదు.

3. ఏ దేశాల్లో వర్ధిల్లినా విజ్ఞాన వాఙ్మయం ప్రయోజనం ఒక్కటే. నరుడు తన దుష్టవర్తనాన్ని మార్చుకొని సద్వర్తనాన్ని అలవర్చుకొనేలాచేయడం. విజ్ఞాన వాఙ్మయం అనే అద్దంలోకి చూచుకొని మన నైతిక రూపాన్ని మనం చక్కదిద్దుకోవాలి. ఈ పుస్తకంలోని 40 అంశాలూ ఇందుకు తోడ్పడేవే. మానవుడు విజ్ఞానం బోధించే ఆశయాలను సాధించడానికి జీవితాంతం కృషిచేస్తుండాలి.

భక్తుడు విజ్ఞాన వాక్యాలనూ సామెతలనూ వల్లెవేయడంతోనే సరిపెట్టుకోగూడదు. అతని జీవితమే ఓ విజ్ఞాన సూక్తిగా, ఓ మంచి సామెతగా రూపొందాలి. సజ్జనుడైన వాడే ప్రాజ్ఞుడు.

ఈ గ్రంథంలో విజ్ఞానబోధలను 40 అధ్యాయాలుగా విభజించాం. రానున్న పుటల్లో వీనిని క్రమంగా పరిశీలించి చూద్దాం.

# 2. బహుమానాలూ, శిక్షలూ

నరులు చేసే మంచిపనికి దేవునినుండి బహుమతి లభిస్తుంది. చెడ్డపనికి శిక్షపడుతుంది. ఈ బహుమతినీ దండననూ ఎవడూ తప్పించుకోలేదు.

ప్రభువు కృపాకోపాలు రెండూ ప్రదర్శిస్తాడు
అతడు క్షమించడానికీ కోపించడానికీగూడ సమర్థుడు
పాపాత్ముడు తాను దోచుకొన్నదానికి
శిక్ష అనుభవింపక తప్పదు
పుణ్యాత్ముడు పడిన శ్రమకూ ఫలితముంటుంది. - సీరా 16, 12-13
ప్రకృతిశక్తులుకూడ దేవుని ఆజ్ఞకు లొంగి దుష్టులను శిక్షిస్తాయి.
నిప్పు వడగండ్లు కరవు వ్యాధి
నరులను శిక్షించడానికే సృజింపబడ్డాయి
క్రూరమృగాలు తేళ్లు పాములు దుష్టుల పనిబట్టే కత్తులు

మొదలైనవి సంతోషంతో ప్రభువు ఆజ్ఞ పాటిస్తాయి
అవి ప్రభువుని సేవించడానికి సిద్ధంగా వుంటాయి
సత్వరమే అతని ఆజ్ఞను నెరవేరుస్తాయి - సీరా 39, 29-31

ఎంత కీడుకి అంత శిక్ష. అంటియోకసురాజు యూదులకు బద్ధశత్రువు. అతడు యూదులను హింసించడానికి యెరూషలేము వెళ్తూంటే దారిలో దేవుడే అతన్ని హింసించాడు. "అంటియోకసు రథాన్ని ఎక్కడా ఆపక ఎకాయెకిని యెరూషలేముకి తోలమని సారథిని ఆజ్ఞాపించాడు. నేను యెరూషలేము చేరగానే ఆ నగరాన్ని శ్మశానంగా మారుస్తానని మహాగర్వంతో శపథం చేసాడు. కాని ప్రభువు శిక్షకూడ తన వెంటనే వస్తూందని అతడు గ్రహించలేదు. అంటియోకసు పై మాటలు పలకగానే అన్నిటినీ గమనించే యిస్రాయేలు దేవుడు అతన్ని ఏదో గుర్తుతెలియని మహా రోగంతో పీడించడం మొదలెట్టాడు. అతని ప్రేగుల్లో ఘోరమైన బాధ పుట్టింది. ఆ బాధకు ఉపశాంతిలేదు. అనేకుల కడుపుకి చిచ్చుపెట్టినవానికి ఈ కడుపునొప్పి ఉచితమైన శిక్షేకదా!" - 2 మక్కబీయులు 9, 4-6.

కొంతమంది దేవుడే నరులచేత పాపం చేయిస్తాడనీ నరులకు స్వేచ్ఛ లేదనీ అనుకొంటారు. కాని ఇది పొరపాటు.

నేను పాపం చేయడానికి దేవుడే కారణమని చెప్పకు
తాను అసహ్యించుకొనేదాన్ని దేవుడేలా చేయిస్తాడు
దేవుడు నన్ను పెడత్రోవ పట్టించాడు అనకు
అతడు పాపాత్ముల్ని తనపనికి వాడుకోడు - సీరా 15, 11-12

మంచిని చేయడానికీ చెడ్డను మానుకోడానికీ గూడ నరునికి స్వేచ్ఛ వుంది. కనుక అతని పాపానికి అతడే బాధ్యుడు.

భగవంతుడు ఆదిలో నరుని చేసినప్పుడు
అతనికి తన నిర్ణయాలు తానే చేసికొనే స్వేచ్ఛనిచ్చాడు
నీవు కోరుకొంటే ప్రభువు ఆజ్ఞల్ని పాటించవచ్చు
అతన్ని అనుసరించాలో లేదో నిర్ణయించేది నీవే
ప్రభువు నిప్పూ నీళ్ళూగూడ నీముందు వుంచాడు
చేయి చాచి వీటిల్లో నీ కిష్టమొచ్చినదాన్ని తీసికో
మృత్యువు జీవంకూడ నరుని ముందట వున్నాయి
అతడు తాను కోరుకొన్నది తీసికోవచ్చు - సీరా 15, 14-17

పాపపుణ్యాల విషయం వచ్చినపుడు మన హృదయం ముఖ్యం. కీలకమంతా దానిలోనే వుంటుంది.

అన్నిటికంటె ముఖ్యంగా
నీ హృదయాన్ని పదిలం చేసికో
నీ జీవనగతికి ఆకరమదే
వెండి బంగారాలను కుంపటి పరీక్షిస్తుంది - సామెతలు 4, 23. 20,27

# 3. దయ

నరునికి దయాగుణం ఎంతో అవసరం. దయాపరుడు తన బానిసనుగూడ సొంత సోదరునిలా చూస్తాడు. తన భోజనాన్ని పేదలకు వడ్డిస్తాడు.

భక్తహీనుల పుత్రులకు పెద్ద కుటుంబాలు కలగవు
వాళ్ళు రాతిమీద మొలచిన మొక్కల్లాగ క్షీణిస్తారు
ఏటి వొడ్డున ఎదిగే తుంగ అన్నిటికంటె ముందుగా
కోసివేయబడినట్లే వాళ్ళూ నాశమౌతారు
కాని కరుణ భాగ్యవనం లాంటిది
దానం శాశ్వతంగా నిలుస్తుంది - సీరా 40 : 15-17
మంచివాడు తన దాసునిగూడ కరుణతో జూస్తాడు
నీ బానిసను నీవలె చూచుకో
వాణ్ణి నీ కష్టార్జితంతో కొనితెచ్చుకొన్నావుకదా!
అతన్ని నీ సోదరునివలె చూచుకో
నీవు నీకెంత అవసరమో వాడూ నీకు అంత అవసరం - సీరా 33,30-31
ఇంకా ఈ సందర్భంలో సామెతల గ్రంథం ఈలా వాకొంటుంది
తన భోజనాన్ని పేదలకుగూడ వడ్డించే కరుణామయుడు
దేవుని దీవెనలు పొందుతాడు
ప్రభువు పేదలకోపు తీసికొని
వాళ్ళను పీడించేవాళ్ళను పీడిస్తాడు - 22, 9.23.

# 4. దానం

దానం, ఉపవాసం, ప్రార్థనం యూదుల భక్తికి మూలస్తంభాల్లాంటివి. ప్రస్తుతం వీటిల్లో దానాన్నిగూర్చి చూద్దాం. తోబీతు తన కుమారుడు తోబియాకు ఈలా చెప్పాడు. "నాయనా! దేవునిపట్ల భయభక్తులు చూపేవారికి నీ సొత్తునుండి దానధర్మాలు చేయి. నీవు పేదలను అనాదరం చేయకుంటే దేవుడు నిన్ను అనాదరం చేయడు. నీకున్న దానినిబట్టి

నీవు దానంచేయి. నీకు ఎక్కువగావుంటే ఎక్కువగానే ఈయి. తక్కువగావుంటే తక్కువగానే ఈయి. ఈయడంలో మాత్రం ఎప్పుడూ వెనుకాడకు. ఇచ్చిన ఈవి ఆపత్కాలంలో పెద్ద నిధిలా సాయపడుతుంది. దానం మోక్షంలోని దేవునికి ఇష్టమైన కాన్క. కనుక దానం చేసేవాణ్ణి అతడు అంధకారబంధురమైన మృత్యులోకాన్నుండి రక్షిస్తాడు" - తోబీతు 4,7-11.

పేదలకు దానం చేయడంలో ఆలస్యం పనికిరాదు. పేదవానికి మరల రేపురా అని చెప్పకూడదు. దరిద్రుడు ధనికునిముందు మొరపడి అతన్ని శపిస్తే ఆ మొరను దేవుడు వింటాడు

నీకు శక్తివుంటే
ఇతరులు అడిగిన వుపకారం తప్పక చేసిపెట్టు
పొరుగువాడికి సత్వరమే
సాయంచేయగలవేని చేసిపెట్టు
మరలా రా రేపు చేసిపెడతానని జాప్యం చేయకు - సామె 3,27-28
నిరాశ చెందివున్నవాని బాధలు అధికం చేయకు
అతడు చేయిచాచి అడిగితే జాప్యం చేయకు
బిచ్చగాడు యాచించినప్పుడు నిరాకరించవద్దు
పేదవానినుండి మొగం ప్రక్కకు త్రిప్పుకోకు
దరిద్రునినుండి నీ చూపు మరల్పకు
అతడు నిన్ను శపించకుండా వుండేలా చూచుకో
హృదయవేదన భరింపజాలక
ఆ దరిద్రుడు నిన్ను శపిస్తే
ప్రభువు అతని మొర ఆలిస్తాడు - సీరా 4,3-5

పేదలకు చేసిన దానం ప్రభువుకి చేసినట్లే. అతడు ఆ సొమ్మును మనకు వడ్డీతోసహా చెల్లిస్తాడు. ఇది చాల మంచి భావం.

పేదలను ఆదుకొంటే ప్రభువుకే అప్పిచ్చినట్లు
ఆ యప్పును అతడు తప్పక తీరుస్తాడు - సామె 19,17.

దానమనేది పేదలకు అన్నంపెట్టడం, బట్టలీయడం, చనిపోయినవారిని పాతిపెట్టడం అని చాల రకాలుగా వుంటుంది. తోబీతు ఈలా చెప్పుకొన్నాడు. "షల్మనేసరు బ్రతికివున్నకాలంలో నేను మా జాతివారికి పెక్కు దానధర్మాలు చేసాను. వాళ్ళు ఆకలిగొనివస్తే నేను భోజనం పెట్టేవాణ్ణి. బట్టలులేనివారికి బట్టలిచ్చేవాణ్ణి. నీనివే పౌరులు మా జాతివారి శవాలను పట్టణ ప్రాకారం వెలుపల పారవేస్తే నేను వారిని పాతిపెట్టేవాణ్ణి" - తోబీ 1,16-17.

దానంవల్ల మనకు చాల లాభాలు చేకూరుతాయి. తోబీతు ఈలా చెప్పాడు. "ధనం కూడబెట్టుకొని దుష్టజీవితం జీవించడంకంటె చిత్తశుద్ధితో ప్రార్థన చేయడం మేలు. మంచి జీవితం గడుపుతూ దానధర్మాలు చేయడం మెరుగు. బంగారాన్ని కూడబెట్టుకోవడంకంటె దానం చేయడం మంచిది. దానం మిమ్ము మృత్యువునుండి కాపాడుతుంది. మీ పాపాలనెల్ల కడిగివేస్తుంది. దానం చేసేవాళ్ళు దీర్ఘాయుష్మంతులౌతారు" తోబీ 12, 8-9.

అనాథులకూ పేదలకూ చేసే దానధర్మాలను దేవుడు తన అంగుళీయాన్నిలా విలువతో చూస్తాడు

అనాథులకు తండ్రివలె వుండు
వితంతువులకు వారి భర్తవలె సాయం చేయి
అప్పుడు నీవు మహోన్నతుడైన దేవునికి పుత్రుడవౌతావు
అతడు నీ సొంతతల్లికంటెగూడ అధికంగా నిన్ను ప్రేమిస్తాడు
నరుడు పేదలకు చేసిన దానధర్మాలను
ప్రభువు తన అంగుళీయాన్నివలె విలువతో జూస్తాడు
నరుడు పేదలపట్ల చూపే కరుణను
ప్రభువు తన కంటిపాపనులాగ మన్ననతో జూస్తాడు - సీరా 4,10. 17,22

దానంద్వారా మనం పరలోకంలో నిధిని కూడబెట్టుకొంటాం. యుద్ధంలో డాలులా అది మనలను కాపాడుతుంది.

పేదసాదలను సానుభూతితో చూడు
వారిచే దీర్ఘకాలం బతిమాలించుకోకు
నీ కాసులను ఏ బండక్రిందనో దాచి
త్రుప్పుపాలు చేయడంకంటె
వానిని నీ పొరుగువాని కొరకో స్నేహితుని కొరకో
వెచ్చించడం మేలు
దైవాజ్ఞ సూచించినట్లే
దానధర్మాలనే నిధిని ప్రోగుజేసికో
ఆ నిధి నీకు బంగారంకంటె అధికంగా ఉపయోగపడుతుంది
పేదలకు ఇచ్చిందే నీవు భద్రపరచిన నిధి అనుకో
అది నిన్ను సకలాపదలనుండి కాపాడుతుంది

అది బలమైన డాలుకంటె, బరువైన ఈటెకంటె
అధికంగా నీ శత్రువులతో పోరాడి నిన్ను రక్షిస్తుంది - సీరా 29, 8-13
ఆపదలో తోబుట్టువులు సహాయులు
చెంతవుంటే బాగుంటుంది
కాని దానధర్మాలు చేయడంవలన సిద్ధించే సహాయం
అంతకంటె శ్రేష్ఠమైంది - 40, 24
ధర్మమార్గంలో డబ్బు కూడబెట్టి దానం చేసేవాడి సంపదలు స్థిరంగా నిలుస్తాయి
పాపమార్గంలో డబ్బు కూడబెట్టనివాడూ
నిర్దోషి ఐన ధనికుడు ధన్యుడు
ఆలాంటివాడు దొరికితే అతన్ని అభినందించాలి
అతడు ధనికులెవ్వరూ చేయని అద్భుతం చేసాడు
ఈ పరీక్షలో నెగ్గినవాడు నిక్కంగా గర్వించవచ్చు
పాపం చేయగలిగీ చేయనివాడు,
పరుని మోసగింపగలిగీ మోసగింపనివాడు
ఎవడైనా వుంటాడా?
ఆలాంటివాడు ఎవడైనా వుంటే
అతని సంపదలు స్థిరముగా నిల్చునుగాక
జనులెల్లరూ అతని మంచితనాన్ని సన్నుతింతురుగాక - 31, 8-11
ఇంకా, దానంవల్ల మన పాపాలు కూడ పరిహారమౌతాయి
నీళ్ళు మంటను చల్లారుస్తాయి
దానధర్మాలు పాపాలకు ప్రాయశ్చిత్తం చేస్తాయి - 3,30

ఈ సందర్భంలో తోబీతు గ్రంథంకూడ "దానం మీ పాపాలనెల్ల కడిగివేస్తుంది. మీరు దీర్ఘాయుష్మంతులౌతారు" అని చెప్తుంది - 12,9

తోడివాడు అక్కరలో వున్నపుడు అతనికి బదులీయాలి
తోడివాడు అక్కరలో వున్నపుడు కరుణతో అరువీయి
పొరుగువాడికి సాయపడినపుడు
ప్రభువు ఆజ్ఞలు పాటించినట్లే
తోడివాడు అవసరంలో వున్నపుడు సాయం చేయి
నీవు బాకీపడి వున్నపుడు వెంటనే ఋణం తీర్చు - సీరా 29, 1-2.

కొందరు వాగ్దానం చేసికూడ సాయం చేయరు. అలాంటివాళ్ళు ఏలా వుంటారు?

నరుడు వాగ్దానం చేసికూడ వస్తువులనీయకపోతే
మబ్బు గాలి ఆర్భాటం చేసికూడ
వాన కురవనట్లుగా వుంటుంది - సామె 25, 14
రోగులను పరామర్శించి వారికి ఊరట వాక్యాలు చెప్పాలి.
శోకతప్తులకు సానుభూతి చూపు
బాధార్తుల బాధల్లో పాలుపంచుకో
వ్యాధిగ్రస్తులను పరామర్శించడంలో అశ్రద్ధ చూపకు
అలాంటి సత్కార్యాలద్వారా
ప్రజల మన్నన పొందుతావు
ఒకదినం నీవూ మరణించి తీరుతావని
నీవు చేసే కార్యాలన్నిటిలోను గుర్తుంచుకో
అప్పుడు నీవు ఏనాడూ పాపం చేయవు - 7,34-35

మననుండి దానం పొందేవాళ్లు పేదలు, అనాథులు, వితంతువులు. వీళ్ళంటే ప్రభువుకి ఎంతో జాలి

ప్రభువు పేదలకు అన్యాయం చేయదు
బాధితులు మొర అశ్రద్ధ చేయదు
అనాథుని ప్రార్థనను అనాదరం చేయడు
వితంతువు వేడికోలును పెడచెవిని బెట్టడు
వితంతువు నేత్రాలవెంట కారే కన్నీళ్ళు
ఆమెను పీడించినవానిమీద నేరంతెచ్చి
దేవునికి మొరపెడతాయి - సీరా 35, 13-15
నరుడు కటువుగా గాక మృదువుగా మాట్లాడుతూ దానం చేయాలి.
మంచు కురిసినప్పుడు వేడిమి సమసిపోతుంది
నీవిచ్చే వస్తువుకంటెగూడ నీ మాటలు ముఖ్యం
కరుణగల వాక్యాలు ప్రశస్తదానంకంటె శ్రేష్ఠమైనవి
కాని ఉదార స్వభావుడు ఆ రెండిటినీ యిస్తాడు
మూర్ఖుడు ఏమీయీయక వచ్చిన వారిని అవమానిస్తాడు
అనిష్టంగా ఇచ్చినదాన్ని ఎవడు ప్రీతితో జూస్తాడు? - 18, 16-17

పేదలపట్ల మర్యాదగా మెలగాలి కూడ
పేదలు విన్నవించుకొనే సంగతులు విని
వారికి మర్యాదగా బదులు చెప్పు - 4,8

తోబీతుకూడ తన కుమారుణ్ణి ఈలా హెచ్చరించాడు. "ఆకలిగొన్నవారికి అన్నంపెట్టు. బట్టలు లేనివారికి బట్టలీయి. నీకు సమృద్ధిగా వున్న ప్రతి వస్తువు నుండి కొంత భాగం దానంగా ఈయి. ఇచ్చేదాన్ని ప్రీతితో ఈయి" - 4,16.

దేవునికి కానుకలు అర్పించేపుడు గూడ సంతోషంగాను, ఉదారంగాను ఈయాలి.
ప్రభువుకి ఉదారంగా కానుకలీయి
నీ తొలిఫలాలను అర్పించడంలో పిసినారివి కావద్దు
చిరునవ్వుతో నీ కానుకలు అర్పించు
సంతోషంగా నీ దశమభాగాన్ని ఈయి
మహోన్నతుడు నీకిచ్చినట్లే నీవూ అతని కీయి
నీ శక్తికొలది ఉదారంగా ఈయి
తనకిచ్చేవారిని ప్రభువు బహూకరిస్తాడు
అతడు నీకు పదిరెట్లు అదనంగా యిస్తాడు - 35, 9-11

# 5. సాంఘిక న్యాయం

పూర్వవేదం బోధించే గొప్ప ధర్మాల్లో సాంఘిక న్యాయం ఒకటి. అనగా పేదసాదలకు న్యాయం జరిగించడం. ఈ పట్టున సీరా గ్రంథం ఈలా చెప్తుంది.

నీవు పీడకుని బారినుండి పీడితుని విడిపించు
నీవు తీర్చే తీర్పులలో ఖండితంగా వుండు - 4,19.

పేదలకు అన్యాయంచేసి దేవునికి బలులర్పిస్తే అతడాబలులను స్వీకరింపడు. దరిద్రులకు అన్యాయంచేసి వారి నోటికాడి కూడు పడగొట్టకూడదు.

అన్యాయార్జితమైన పశువును బలిగా అర్పిస్తే
ఆ బలి దోషపూరితమైన దౌతుంది
దుష్టుల బలిని దేవుడు అంగీకరించడు
మహోన్నతుడు దుర్మార్గుల బలివలన సంతుష్టిచెందడు
పెక్కు బలులు అర్పించడం వలన

వారి పాపాలు తొలగిపోవు
పేదవాని పశువును అపహరించి బలిగా అర్పించడం
తండ్రి చూస్తుండగా కుమారుని చంపడం లాంటిది
పేదలకు అన్నమే ప్రాణం
ఆ యన్నాన్ని నాశం చేయడమంటే
పేదవాణ్ణి చంపడమే - సీరా 34, 18-22
ఇంకా ధర్మశాస్త్రాన్ని భక్తితో పాటిస్తే అన్ని బలులూ సమర్పించినట్లే
ధర్మశాస్త్రాన్ని పాటిస్తే చాల బలులు అర్పించినట్లే
ఉపకారికి ఉపకారం చేయడం
ధాన్యబలిని అర్పించడంతో సమానం
పేదలకు దానం జేయడం
స్తుతిబలిని అర్పించడం లాంటిది
పాపంనుండి వైదొలగితే ప్రభువు సంతసిస్తాడు
కిల్బిషాన్ని విడనాడడం
ప్రాయశ్చిత్త బలిని సమర్పించడంతో సమానం - 35, 1-3
దేవుడు న్యాయాన్ని ఖండితంగా పాటించేవాడు
దేవునికి లంచమిస్తే అంగీకరించడు
అన్యాయంగా ఆర్జించినదానిని ప్రభువుకి అర్పింపకు
అతడు న్యాయవంతుడు, పక్షపాతి కాడు
అతడు పేదలకు అన్యాయం చేయడు
బాధితుని మొర అశ్రద్ధ చేయడు - 35, 12-15

ఇంకా, దీనుని వేడికోలు దేవుని చెవిని పడితీరుతుంది. అతడు దీనుణ్ణి ఆదరించి దుష్టుణ్ణి శిక్షించితీరుతాడు.

దీనుని వేడికోలు మేఘమండలాన్ని దాటిపోతుంది
మహోన్నతుని సమక్షం చేరికాని అది ఆగదు
ప్రభువు జోక్యం జేసికాని
దీనాత్మునికి న్యాయం చేకూర్చి
దుష్టుని శిక్షించేవరకు అది అతన్ని వదలదు - 35, 17

యూదితు దేవుని న్యాయాన్నీ కరుణనీ ఈలా స్తుతించింది

నీవు సైనికులు సంఖ్యపైనగానీ
బలాఢ్యుల బలంపైన గాని ఆధారపడవు
నీవు వినయవంతుల దేవుడవు
పీడితులకు సహాయుడవు
దుర్బలులకు అండగా వుండేవాడవు
నిరాశ్రయులకు ఆశ్రయుడవు
నిరాశ చెందినవారికి ఆదరువవు - 9,11

బానిసలకు స్వేచ్ఛనీయడం గొప్ప దయ. యూదితు ఆలా చేసింది. "ఆమె చనిపోకముందు తన యాస్తిని తన దగ్గరి చుట్టాలకూ పెనిమిటి బంధువులకూ పంచియిచ్చింది. తన బానిసకు స్వేచ్ఛను ప్రసాదించింది" -16, 23-24. ఈ సందర్భంలో సీరా గ్రంథంకూడ ఈలా చెప్తుంది.

చిత్తశుద్ధితో పనిచేసే బానిసకుగాని
పూర్ణహృదయంతో శ్రమజేసే కూలివానికిగాని హాని చేయవద్దు
బుద్ధిమంతుడైన బానిసను
ఆత్మసమునిగా యెంచి అభిమానించు
అతనికి స్వాతంత్ర్యం దయచేయి - 7, 20-21

యజమానుడు తనకు కూలిచేసినవానికి వెంటనే కూలి చెల్లించాలి
నీవు పేదవాని బ్రతుకుతెరువును చెడగొట్టవద్దు
అతిన్ని ఆదుకొనడంలో ఆలస్యం చేయవద్దు - సీరా 4,1

ఈ సందర్భంలో తోబీతు తన కుమారుడు తోబీయాకు ఈలా చెప్పాడు. "నీకు పనిచేసినవారి కూలిని ఏరోజుకారోజు చెల్లించాలేగాని మరుసటిదినం వరకు అట్టిపెట్టుకోరాదు. నీవు ఈ నియమాన్ని పాటించి దేవుని గౌరవిస్తే అతడు నిన్ను బహూకరిస్తాడు" - 4,14.

మనం పేదసాదలను కాపాడాలని చెప్తూ సామెతల గ్రంథంకూడ ఈలా వాకొంటుంది

నీవు నోరులేనివారి పక్షాన మాటలాడు
నిస్సహాయుల కోపు తీసికో
అనాథుల పక్షాన వాదించు
వారికి న్యాయం కలిగేలా తీర్పుచెప్పు

పేదసాదలను అక్కరలోవున్న వారిని ఆదరించు
వారి హక్కులను నిలబెట్టు - 31, 8-9

ఈ సాంఘిక న్యాయాన్నిగూర్చి తోబీతు గ్రంథం సంగ్రహంగా ఈలా వాకొంటుంది. "ఇతరులు ఏలాంటి కార్యంచేస్తే నీకు అప్రియం కలుగుతుందో ఆలాంటి కార్యాన్ని నీవు ఇతరులకు చేయవద్దు." - 4,15.

# 6. విజ్ఞానం

జ్ఞానగ్రంథాలు చాలా తావుల్లో విజ్ఞానాన్ని గూర్చి మాట్లాడతాయి. కనుక మనం దాని స్వభావాన్ని కొంతవరకైనా గ్రహించి వుండాలి. ఇక్కడ జ్ఞానాన్ని గూర్చి ఐదంశాలు పరిశీలిద్దాం.

1) ఈ రచయితలు జ్ఞానానికి ఆతిథేయ, భార్య, వధువు, తల్లి అనే నానా వుపమానాలు వాడారు.

ఆమె ఆతిథేయయై నరులను తన అన్నపానీయాలు పుచ్చుకోవడానికి రమ్మని ఆహ్వానిస్తుంది. ఈ యన్నపానీయాలు విజ్ఞాన బోధలే

రా, నేను తయారుచేసిన భోజనాన్ని ఆరగించు
నేను సిద్ధంజేసిన ద్రాక్షాసవాన్ని సేవించు
మూర్ఖత్వాన్ని విడనాడితే నీవు బ్రతికిపోతావు
నీవు విజ్ఞానపథాన నడవాలి - సామె 9,5-6
నన్నభిలషించేవాళ్ళంతా నా చెంతకు రండి
మీ యాకలి తీర నా ఫలాలను భుజించండి
మీరు నన్ను స్మరించుకోగా నేను మీకు
తేనెకంటె తీయగా వుంటాను
నన్ను భుజించేవాళ్లు మరి యధికంగా భుజింపగోరుతారు
నన్ను పానం చేసేవాళ్ళు మరి యధికంగా పానంజేయగోరుతారు
- సీరా 4, 19-21

ఆమె తల్లిలా, ఎలప్రాయపు వధువులా వచ్చి భక్తునికి విజ్ఞానాన్నం పెడుతుంది
దైవభీతి కలవానిని ఆహ్వానిస్తుంది
అతనికి తెలివిడి అనే అన్నం పెడుతుంది
వివేకం అనే పానీయం అందిస్తుంది - సీరా 15,2-3

2) విజ్ఞానం ఓ దైవ వ్యక్తి. దాని పుట్టుక దివ్యలోకంలో. అది శాశ్వతంగా వుండేది. దేవుని లక్షణాలే దానికీ వుంటాయి.

కాలం కలగక మునుపే
ఆదిలోనే దేవుడు నన్ను చేసాడు
నేను కలకాలం వుండేదాన్ని - సీరా 24,9.
ప్రభువు నన్ను ప్రప్రథమంలోనే సృజించాడు
తాను పూర్వమే కలిగించినవాటన్నిటిలోను
నన్ను మొదటిదాన్నిగా చేసాడు
అతడు నన్ను మొట్టమొదటనే సృజించాడు
పుడమికంటె ముందుగా నన్ను పుట్టించాడు - సామె 9, 22-23

అది దేవుని శ్వాసం, లేక పలుకు. దేవునికి ప్రతిరూపం. అతనితోపాటు స్వర్గంలో వసించేది.

నేను మహోన్నతుడైన ప్రభువు పల్కిన వాక్కుని
పొగమంచువలె నేను భూమిని కప్పాను
అత్యున్నతమైన ఆకాశం నా నివాసస్థలం
నా సింహాసనం మేఘస్తంభంమీద వుండేది - సీరా 24, 3-4

విజ్ఞానం దైవశక్తియొక్క శ్వాసం
ప్రభువు మహిమయొక్క స్వచ్ఛమైన ప్రవాహం
మలినమైనదేదీ దానిలోనికి ప్రవేశింపలేదు
అది శాశ్వతజ్యోతికి ప్రతిరూపం
దేవుని క్రియాశక్తిని ప్రతిబింబించే నిర్మల ముకురం
అతని మంచితనానికి ప్రతిబింబం - సొలో జ్ఞాన 7, 25-26

అది దేవుని సింహాసనానికి ప్రక్కగా కూర్చుంటుంది. దేవునికి ప్రీతిపాత్రురాలవుతుంది.

దేవా! నీ సింహాసనం ప్రక్కన కూర్చుండివుండే
జ్ఞానాన్ని నాకు దయచేయి
నన్ను నీ తనయుల్లో ఒకణ్ణిగా స్వీకరించు - సొలో జ్ఞాన 9,4

అది దేవుని సన్నిధిలో వసించడంవల్ల
దాని కులీనత మరింత వన్నె కెక్కింది
అన్నిటికీ అధిపతియైన ప్రభువు దాన్ని ప్రేమించాడు - 8,3

దేవునికుండే లక్షణాలే జ్ఞానానికీ వుంటాయి. కనుకనే అది ఓ దైవవ్యక్తి. అది నరుల్లోకి ప్రవేశించి వారిని దేవుని స్నేహితులనుగాను ప్రవక్తలనుగాను మారుస్తుంది.

విజ్ఞానపుటాత్మ తెలివికలది, పవిత్రమైంది,
సూక్ష్మమైంది, చలనాత్మకమైంది, స్పష్టమైంది,
పరిశుభ్రమైంది, స్వచ్ఛమైంది, బాధింపరానిది,
మేలు చేసేది, చురుకైంది,
ఎదిరింప శక్యంకానిది, ఉపకారం చేసేది,
నరులతో స్నేహంచేసేది,
స్థిరమైంది, నమ్మదగినది, విచారానికి లొంగనిది,
సర్వశక్తి కలది, సర్వం పరీక్షించేది,
జ్ఞానాత్మకాలూ సూక్ష్మాలూ పునీతాలూ ఐన
ప్రాణులన్నిటిలోనికి ప్రవేశించేది,
జ్ఞానం కదలికకంటెగూడ త్వరగా కదులుతుంది
అది పవిత్రమైంది కనుక అన్ని వస్తువుల్లోకి ప్రవేశిస్తుంది.
అది దైవశక్తియొక్క శ్వాసం,
ప్రభువు తేజస్సు యొక్క స్వచ్ఛమైన ప్రవాహం,
మలినమైనదేదీ దానిలోనికి ప్రవేశింపలేదు,
అది శాశ్వత జ్యోతికి ప్రతిరూపం,
దేవుని క్రియాశక్తిని ప్రతిబింబించే నిర్మల ముకురం,
అతని మంచితనానికి ప్రతిబింబం,
అది వొంటిగా పనిచేసినా అన్నిటినీ నిర్వహిస్తుంది
తాను మారకుండానే అన్నిటినీ మారుస్తుంది
అది ప్రతితరాన కొందరు భక్తులలోనికి ప్రవేశించి
వాళ్ళను దేవునికి స్నేహితులనుగాను
ప్రవక్తలనుగాను మార్చివేస్తుంది
జ్ఞానాన్ని చేపట్టినవాణ్ణి మాత్రమే ప్రభువు ప్రేమిస్తాడు - సొలో జ్ఞాన 7, 22-28

3) విజ్ఞానంచేసే కార్యాలుకూడ బహుముఖంగా వుంటాయి. అది దేవుని సన్నిధిలో అటలాడుకొంటూంది. అతడు సృష్టిచేసేప్పుడు ఓ శిల్పిలా అతని ప్రక్కనే నిల్చివుంది. సంతోషంతో మానవాళి మధ్య వసిస్తూంది. విజ్ఞానం ధర్మశాస్త్రం ఒకటే

ప్రభువు నభోమండలాన్ని నిర్మించినపుడు
కడలికి చెలియలికట్టను చుట్టినపుడు
నేను ప్రధాన శిల్పివలె అతని చెంత నిల్చివున్నాను
పసికందులాగ రోజురోజు అతనికి ఆనందం చేకూరుస్తూ
నిత్యం అతని సన్నిధిలో ఆటలాడుకొనేదాన్ని
అతడు చేసిన పుడమిమీద క్రీడిస్తూ
ప్రమోదంతో మానవాళిమధ్య వసిస్తూండేదాన్ని - సామె 8, 30-31

నిర్మలమైన ప్రేమకి దైవభీతికీ విజ్ఞానం జనని. యిస్రాయేలీయులు విజ్ఞానవృక్షఫలాలు భుజిస్తారు. విజ్ఞానం వారి మధ్యనే వసిస్తుంది.

నిర్మలమైన ప్రేమకీ దైవభీతికీ
విజ్ఞానానికీ నిరీక్షణకూ నేను జనినిని
నేను శాశ్వతంగా మనేదాన్ని కనుక
దేవుడు తానెన్నుకొనిన ప్రజలందరికీ నన్ను దయచేసాడు
నన్నభిలషించేవాళ్ళంతా నా చెంతకు రండి
మీ యాకలితీర నా ఫలాలను భుజించండి - సీరా 24, 18-19

అపుడు సర్వాన్ని చేసిన దేవుడు నాకాజ్ఞ యిచ్చాడు
సృష్టికర్త నేనెచట వసించాలో నిర్ణయించాడు
అతడు నీవు యాకోబు వంశజుల నడుమ వసించు
యిస్రాయేలీయులు నీ ప్రజలౌతారని చెప్పాడు
పవిత్రమైన గుడారంలో నేను ప్రభువుని సేవించాను
అటుతర్వాత సియోను కొండమీద వసించాను
ప్రభువు తనకు ప్రీతికరమైన నగరాన
నాకు నివాసమేర్పరచాడు
యెరూషలేముమీద నాకు అధిపత్యం ఒసగాడు
అతడు తన సొంత ప్రజనుగా ఎన్నుకొని
ఆదరాభిమానాలతో చూచుకొనే జనుల నడుమ నేను స్థిరపడ్డాను - సీరా 24, 8-12

ఈ జ్ఞానమూ ప్రభువు ధర్మశాస్త్రమూ ఒకటే. మోషే ధర్మశాస్త్రమే జ్ఞానం అనడం పూర్వవేదంలో చాలా గొప్ప భావం.

ఈ విజ్ఞానం మోషే అజ్ఞాపించిన ధర్మశాస్త్రం
మహోన్నతుడైన ప్రభువు నిబంధన గ్రంథం
యిస్రాయేలు సమాజాలకు వారసంగా లభించిన ఆస్తి - సీరా 24, 23.
ఈ జ్ఞానం దేవుని ఆజ్ఞల గ్రంథం
శాశ్వతంగా నిల్చే ధర్మశాస్త్రం
దాన్ని పాటించేవాళ్ళు బ్రతుకుతారు
విడనాడేవాళ్ళు చస్తారు - బారూకు 4,1.

విజ్ఞానం లోకాన్ని క్రమపద్ధతిలో నడిపించి కాపాడుతుంది. ఆదాము కాలం నుండి నరజాతిని నడిపిస్తూ వచ్చింది. ఎప్పుడూ నరులను ఋజుమార్గంలో నడిపించి రక్షించేది అదే.

దాని మహాశక్తి ప్రపంచమంతట వ్యాపించివుంది
అది సమస్తాన్నీ క్రమపద్ధతిలో నడిపించి
సద్వినియోగం చేస్తుంది - సొలొ జ్ఞాన 8,1
ప్రభూ! నీవు నీ జ్ఞానాన్ని దయచేస్తేనేతప్ప,
నీ చిత్తాన్ని ఎవడు తెలిసికోగలడు?
ఈ రీతిగా నీవు దయచేసే జ్ఞానంద్వారా
భూమిమీది నరులు ఋజుమార్గాన నడుస్తున్నారు
నీకు ప్రీతికరమైన కార్యమేమిటో తెలిసికొని
భద్రతను పొందుతున్నారు - 9, 17-18

4) విజ్ఞానం మనకు ప్రసాదించిపెట్టే వరాలుకూడ చాల వున్నాయి. అది నరునికి అమూల్యమైంది

సింహాసనంకంటె కిరీటంకంటె గూడ అధికంగా
నేను జ్ఞానాన్ని అభిలషించాను
సంపదలు దానితో తులతూగలేవని గ్రహించాను
అమూల్యమణులేవీ దానికి సాటిరావని తెలిసికొన్నాను
జ్ఞానంతో పోలిస్తే ఈ లోకంలోని బంగారమంతా వట్టి యిసుకముద్ద
వెండి అంతా వట్టి మట్టిపెళ్ళ
నేను ఆరోగ్యంకంటె సౌందర్యంకంటె
జ్ఞానాన్ని ఎక్కువగా కోరుకొన్నాను

దాని కాంతి యేనాడూ తరగిపోదుకనుక
వెల్తురుకంటెగూడ దాన్ని అధికంగా అభిలషించాను
జ్ఞానం నా చెంతకు వచ్చినపుడు
సమస్త ప్రశస్త వస్తువులనుకూడ తీసుకవచ్చింది - సొలో జ్ఞాన 7,8-11

అది మనకు దీర్ఘాయువునీ ఆనందాన్నీ సంపదలనూ దయచేస్తుంది.
విజ్ఞానం కుడిచేత దీర్ఘాయువుంటుంది
ఎడమచేత సంపదలూ కీర్తీ వుంటాయి
అది నీ జీవితాన్ని ఆనందమయం చేస్తుంది
నీ మనుగడకు సంతృప్తినిస్తుంది
విజ్ఞానం తన్ను స్వీకరించేవారికి జీవవృక్షమౌతుంది
దాన్ని పొందేవాళ్లు సంతోషంతో జీవిస్తారు- సామె 3,16-18

దానివలన మనకు భద్రత కలుగుతుంది. అది మనలను ఉపద్రవాలనుండి కాపాడుతుంది

కుమారా! నీవు విజ్ఞానవివేకాలను అలవర్చుకో
వానిని ఏనాడూ అశ్రద్ధ చేయకు
అవి నీకు జీవాన్నిస్తాయి
నీ కంఠానికి అలంకార మౌతాయి
విజ్ఞానవివేకాలతో నీవు సురక్షితంగా నడుస్తావు
నీ యడుగులు ఎచ్చటా తడబడవు
నీవు శయనించేపుడు భయపడక నిశ్చింతగా నిద్రపోతావు
దుర్మార్గులకులాగా నీకు అకస్మాత్తుగా
ఏమి ఉపద్రవాలు వస్తాయో అని భయపడవు
నిన్ను కాపాడేవాడు ప్రభువు కనుక
అతడు నిన్నే బంధాల్లోను చిక్కుకోనీయడు - 3, 21-26

దానివల్ల మనకు సకల భాగ్యాలూ, న్యాయమూ సిద్ధిస్తాయి.
నా యొద్ద భోగభాగ్యాలు కీర్తిప్రతిష్ఠలు
అక్షయ సంపదలు నీతిన్యాయాలు వున్నాయి
మేలిమి బంగారంకంటె, మెరుగైన వెండికంటె
నే నొసగే ఫలాలు మిన్నయైనవి
నేను ధర్మపథాన నడుస్తాను
న్యాయమార్గాన సంచరిస్తాను - సామె 8, 8-20

అన్ని పుణ్యాలకు నిలయం విజ్ఞానమే. కనుక నరుడు దాన్ని సాధించాలి.

జ్ఞానానికి మించిన సంపదలేదు
అన్నిటిచేత పనిచేయించేది అదే
బుద్ధిశక్తి అభిలషించదగినదైతే
జ్ఞానానికి మించిన బుద్ధిశక్తి యేమి వుంది?
లోకంలోని వస్తువులనన్నిటిని నిర్మించిందదే
పుణ్యం కోరుకోదగినదైతే
పుణ్యాలన్నీ జ్ఞానంనుండే పుడతాయి
మితత్వం, న్యాయం, వివేకం, ధైర్యం
మొదలైన వాటినన్నిటినీ జ్ఞానమే మనకు బోధిస్తుంది
ఈ జీవితంలో వీటికంటె విలువైన వేవీలేవు - సొలొ జ్ఞాన 8, 5-7

5) జ్ఞానాన్ని ఆర్జించే మార్గమేమిటి? మొదట, పాపులకు విజ్ఞానం అబ్బదు
మూర్ఖులు విజ్ఞానాన్ని బడయలేరు
పాపాత్ముల కంటికి అది కన్పింపనైన కన్పింపదు
గర్వాత్ములకు అది దూరంగా వుంటుంది
అనృతవాదుల మనసులోకి అది ప్రవేశింపదు - సీరా 15, 7-8.

విజ్ఞానమంటే యేమోకాదు. దైవభయమే. భక్తులకు పుట్టువునుండే విజ్ఞానం లభిస్తుంది.

విజ్ఞానమెల్ల దేవునికి భయపడ్డమే
విజ్ఞానమెల్ల దైవాజ్ఞలను పాటించడమే
ప్రభువు సర్వాధిపత్యాన్ని గుర్తించడమే
ప్రభువుపట్ల భయభక్తులు చూపడం విజ్ఞానానికి మొదటి మెట్టు
భక్తులు మాతృగర్భంనుండే విజ్ఞానాన్ని పొందుతారు
దేవునికి భయపడ్డమే విజ్ఞానం, దుష్కార్యాలు విడనాడ్డమే వివేకం - సీరా 19,20. 1,14. యోబు 28, 28.

నరుడు ఎంత కృషైనాచేసి ఈ జ్ఞానాన్ని ఆర్జించాలి. విజ్ఞుల సూక్తులనుండి దాన్ని గ్రహించాలి.

కుమారా! బాల్యంనుండి ఉపదేశాన్ని నేర్చుకో
ముదిమి పైబడిందాకా విజ్ఞానాన్ని గడిస్తూండు

రైతు పొలందున్ని విత్తనాలు నాటినట్లే
నీవూ విజ్ఞానార్జన కొరకు కృషిచేయి
అప్పుడు నీకు చక్కని పంట లభిస్తుంది
నీవు విజ్ఞుల బోధలను అనాదరం చేయవద్దు
వారి సూక్తులను జాగ్రత్తగా పఠించు
వాని వలన నాగరికత అలవర్చుకొని
రాజులకు సేవలుచేసే విధానం నేర్చుకొంటావు - సీరా 6, 18-19. 8,8

విజ్ఞానానికి వెలకట్టలేం. విజ్ఞానవాక్కే సుభూషణం. దానివల్ల మన భవిష్యత్తు బంగారుబాట ఔతుంది.

బంగారంకంటె విజ్ఞానాన్ని ఆర్జించడం మెరుగు
వెండికంటె వివేకాన్ని బడయడం మేలు
సముద్రంవలె అగాధమూ, పారేయేరులా నిర్మలమై
నరుని పల్కులు విజ్ఞాన సంభరితాలై వుంటాయి
బంగారముంది ముత్యాలున్నాయి
కాని విజ్ఞానవాక్కే సుభూషణం
కుమారా! తేనెను భుజిస్తే తీయగా వుంటుంది,
మధుకోశంనుండి చిప్పిలే తేనె నాల్కకు రుచించినట్లే
విజ్ఞానం హృదయానికి ఇంపుగా వుంటుంది
దాన్ని పొందితే నీ భవిష్యత్తు బంగారుబాట ఔతుంది
- సామె 16,16. 18.4,20.15. 24,13-14

జ్ఞానం ఇంత విలువైంది కనుక భక్తులు దీన్ని గాఢంగా వాంఛించారు. సొలోమోను దీనికొరకు ప్రభువుని ప్రార్థించాడు.

ప్రభూ! నీ సింహాసనం కుడిప్రక్కనకూర్చుండివుండే
జ్ఞానాన్ని నాకు దయచేయి
నన్ను నీ తనయుల్లో ఒకనిగా స్వీకరించు
పరమ పవిత్రమైన మోక్షపదంనుండి,
మహిమాన్వితమైన నీ సింహాసనం నుండి
జ్ఞానాన్ని నా యొద్దకు పంపు
అది నాతోగలసి పనిచేయునుగాక

దాని సాయంతో నీకు ప్రీతి కలిగించేదేదో
నేను తెలిసికొందునుగాక - సొలో జ్ఞాన 9, 1-10

సీరాగూడ దీనికొరకు దేవునికి ప్రార్థన చేసాడు
నేను విజ్ఞానం కొరకు పోరాడాను
విశుద్ధ వర్తనాన్ని అలవర్చుకొన్నాను
దేవునికి ప్రార్థనచేసి
నేనెంతటి అజ్ఞానినో తెలియజేసికొన్నాను
కాని నేను విజ్ఞానాన్ని అభిలషించాను
నిర్మల హృదయాన్ని అలవర్చుకొని దాన్ని సాధించాను
దానిని ఆర్జించినప్పటినుండి వివేకవంతుణ్ణయ్యాను
ఇక నేను దానిని విడనాడను - సీరా 51, 19-20

ఈ భక్తుల్లాగే మనంగూడ జ్ఞానంకొరకు ప్రార్థిద్దాం. దేవునినుండి ఈ యమూల్యవరాన్ని పొందుదాం.

# 7. కొన్ని నైతిక విలువలు

జ్ఞాన గ్రంథాలు చాలా నైతిక విలువలను పేర్కొంటాయి. ప్రస్తుతానికి వాటిలో మూడింటిని పరిశీలిద్దాం. అవి పొదుపు, నిజాయితీ, నమ్మదగినతనం. మానవుడు పొదుపుగా జీవించాలి.

పంటలు పండిన కాలాన కరువును గుర్తుంచుకో
సంపదలు కలిగిన కాలాన పేదరికాన్ని స్మరించుకో
ఉదయ సాయంకాల మధ్యలోనే పరిస్థితులు మారవచ్చు
ప్రభువు తలపెట్టిన మార్పు అతి శీఘ్రంగా వస్తుంది - సీరా 18, 25-26

కనుక నరుడు దూబర ఖర్చులు మానాలి
సుఖభోగాలకు దాసుడివి కావద్దు
భోగజీవనంవలన అయ్యేఖర్చులు నిన్ను గుల్లజేస్తాయి
నీ చేత డబ్బులేనపుడు
బాకీలుజేసి విందులారగించి బిచ్చగాడివైపోవద్దు
అలా చేస్తే నీవు సంపన్నుడివి కాలేవు
చిన్న విషయాల్లో శ్రద్ధ చూపనివాడు
క్రమంగా నశిస్తాడు - 18, 32-19,1

మన జీవితంలో నిజాయితీ కూడ వుండాలి మనం వాడే తూకపురాళ్ళూ కొలమానాలూ సక్రమంగా వుండాలి.

నీవు నమ్మినదానికి కట్టుబడి వుండు
నీ పలుకుల్లో నిజాయితీ చూపెట్టు.
గొప్పవాడిలా తిరుగుతూ ఆకలితో చావడంకంటె
సామాన్యునిలా బ్రతుకుతూ
కడుపుకూడు సంపాదించుకోవడం మేలు.
సరియైన కొలమానాలూ పడికట్టురాళ్ళూ వాడాలి
పెద్దదో చిన్నదో వ్యాపారం చేసికోవాలి.
తూనికలు కొలతలు సక్రమంగా వుండాలని ప్రభువు కోరిక
సక్రమంగా సరుకులు అమ్మాలని అతని ఆశయం. - సీరా 5,10. సామె 12,9. సీరా 42,5. సామె 16,11

నరుల్లో నమ్మదగినతనం వుండాలి. స్నేహితుని రహస్యాలను వెల్లడి చేయకూడదు. సకాలంలో ఋణం తీర్చాలి. నమ్మదగినవాళ్ళంగా నటిస్తేనే చాలదు.

నీ స్నేహితుణ్ణి ప్రేమించి విశ్వసనీయుడివిగా మెలగు
అతని రహస్యాలను వెల్లడిచేస్తే
ఇక అతన్ని వదలుకోవలసిందే
నరుడు తన శత్రువుని నాశం చేసినట్లే
నీవుకూడ రహస్య ప్రకాశనంద్వారా
నీ స్నేహాన్ని నాశం చేసికొన్నావు
నీ చేతిలోని పక్షి జారిపోయినట్లే
నీ స్నేహితుడుకూడ తప్పించుకొన్నాడు
అతడు మరల నీకు చిక్కడు.
నీవు ఋణదాతకిచ్చిన మాట నిలుపుకొంటే
అతడు నీ యక్కరల్లో ఎల్లప్పుడూ సాయం చేస్తాడు
నీకు పూటకాపుగా వున్నవాని వుపకారాన్ని మరువకు
అతడు తన పరువుని పణంగాబెట్టి నిన్ను కాపాడాడు.
నీవు కరుణనూ విశ్వసనీయతనూ అలవర్చుకో
వానిని దండలాగ నీ మెడలో తాల్చు
నీ హృదయఫలకంపై వ్రాసికో.
అందరూ మేము నమ్మదగినవాళ్ళమేనని చెప్పుకొంటారు
కాని యథార్థంగా విశ్వసనీయులైనవాళ్లు ఎందరు? - సీరా 27,17-18. 29,3-15. సామె 3,3. 20,6

# 8. దేవునికి ఆరాధనలూ కానుకలూ అర్పించాలి

నరుడు దేవుణ్ణి ఆరాధించి కానుకలు అర్పించుకోవాలి. చేసిన మ్రొక్కుబడులు చెల్లించాలి. తనపొలంలో పండిన పంటనుండి తొలిఫలాలూ దశమభాగాలూ సంతోషంగా అర్పించాలి.

దేవునికి భయపడి యాజకులను గౌరవించు
విధ్యుక్తంగా వారి కీయవలసిన కానుకలు ఈయి
ప్రథమ ఫలాలు, పాపపరిహార బల్యర్పణాలు
బలిపశువు జబ్బ, పవిత్రార్పణలు ఈయి
కుమారా! నీవు నీ స్థితికి తగినట్లుగా భుజించు
ప్రభువుకి మేలి కానుకలు అర్పించు
దేవునికి మ్రొక్కిన మ్రొక్కులను వెంటనే తీర్చుకో
చనిపోయే సమయందాకా జాప్యం చేయకు
మ్రొక్కుబడి చేసేపుడు దాన్ని చెల్లించే వుద్దేశముండాలి
దేవుని సహనాన్ని పరీక్షింపకూడదు.
విమలాత్ముడు అర్పించిన బలిని ప్రభువు అంగీకరిస్తాడు
అతడు దాన్ని విస్మరింపడు
ప్రభువుకి ఉదారంగా కానుకలీయి
నీ తొలిఫలాలు అర్పించడంలో పిసినారివి కావద్దు
చిరునవ్వుతో నీ కానుకలను అర్పించు
సంతసంతో దశమభాగాలను ఈయి.
సీరా 7,31 14,11. 18,22-23. 35,7-9. 38,11.

మతం కేవలం కర్మకాండ కాకూడదు. అది హృదయగతమైన మతమై వుండాలి. దానికి వినయం అవసరం. ఈ వినయాన్ని అవర్చుకోవాలంటే నరుడు తన దారిద్ర్యాన్నీ, చావునీ స్మరించుకోవాలి. తన తప్పిదాలకు పశ్చాత్తాపపడాలి.

కుమారా! నీవు చేసే పనులన్నిటిలోను
వినయంతో మెలుగు
బహుమతు లిచ్చేవానికంటే గూడ
వినయవర్తనుని ప్రజలు అధికంగా మెచ్చుకొంటారు
నీవు ఎంత అధికుడివో అంత వినయవర్తనుడివి కా

అప్పుడు ప్రభువు మన్నన పొందుతావు
గొప్పవారు పేరుప్రసిద్ధులు కలవారు చాలమంది వున్నారు
కాని ప్రభువు వినయాత్ములకు
తన రహస్యాలు ఎరిగిస్తాడు
ప్రభువు మహా ప్రభావం కలవాడైనా
వినమ్రుల పూజలు అందుకొంటాడు
వ్యాధి అనే శిక్షకు గురికాకముందే
వినయాన్ని ప్రదర్శించు
తప్పు చేసినపుడు పశ్చాత్తాపపడు
ఉరుముకి ముందు మెరపు చూపట్టినట్లే
వినయవంతుని మంచిపేరు
అతనికి ముందుగా నడుస్తుంది
దుమ్మూ బూడిదా ఐన నరులు
ఏమి జూచుకొని గర్వపడాలి?
మనం బ్రతికివుండగానే మన శరీరం కుళ్ళిపోతుంది
నరుడు చచ్చాక అతనికి దక్కేది
పురుగులు ఈగలు మాత్రమే
మృత్యువు నీకోసం వేచివుండదు
నీవేనాడు పాతాళానికి పోతావో నీకే తెలియదు
వ్యాధి అనే శిక్షకు గురికాకముందే
వినయాన్ని ప్రదర్శించు
తప్పు చేసినపుడు పశ్చాత్తాపపడు
తన తప్పుని తా నొప్పుకొనేవాడు
శిక్షను తప్పించుకొంటాడు - సీరా 3,17-20. 18,21. 32,10. 10,9-11. 14,12. 18,21. 20,3.

## 9. దైవభక్తి

నరునికి దైవభక్తి వుండాలి. అతడు ప్రభువు పరీక్షకు సిద్ధంగా వుండాలి. స్వేచ్ఛతో దేవుణ్ణి సేవించాలి. దేవభీతి కలవారిని ప్రభువు ఆదుకొంటాడు. అతన్ని కాలుజారి పడనీయడు. దైవబలమే నిజమైన బలం. తల్లిదండ్రులు చిన్ననాటినుండే తమ బిడ్డలకు దైవభీతిని నేర్పాలి.

కుమారా! నీవు దేవుని సేవింప గోరితే
పరీక్షకు సిద్ధంగా వుండు
చిత్తశుద్ధితోను పట్టుదలతోను మెలగు
ఆపదలు వచ్చినపుడు నిబ్బరంగా వుండు
ప్రభువుని ఆశ్రయించు, అతన్ని విడనాడకు
అప్పుడు నీవు విజయాన్ని పొందుతావు
ప్రభువు దౌష్ట్యాన్ని పూర్తిగా అసహ్యించుకొంటాడు
దైవభీతికల నరుడు చెడ్డను అంగీకరింపడు
భగవంతుడు ఆదిలో నరుని చేసినప్పుడు
అతనికి తన నిర్ణయాలను తానే చేసికొనే స్వేచ్ఛ నిచ్చాడు
నీవు కోరుకొంటే ప్రభువు ఆజ్ఞలు పాటించవచ్చు. అతన్ని అనుసరించాలో లేదో నిర్ణయించేది నీవే
ప్రభువు నిప్పు నీళ్లుకూడ నీముందు పెట్టాడు
చేయి చాచి వాటిలో నీ కిష్టం వచ్చింది తీసికో
మృత్యువు జీవంకూడ నరుని ముందున్నాయి
అతడు తాను కోరుకొన్నది తీసికోవచ్చు.
నీ మరణ కాలంలో ప్రభువు నీపట్ల
ఆగ్రహం చూపకుండా వుండేలానూ
నీకు తీర్పుచెప్పేపుడు నీకు విముఖుడుగా
వుండకుండేలానూ జాగ్రత్తపడు
దైవభీతి కలవాళ్ళు జీవాన్ని పొందుతారు
వాళ్లు నమ్మిన దేవుడే వాళ్ళను కాపాడతాడు
దైవభీతి కలవాడు భయపడ నక్కరలేదు
ప్రభువుని నమ్మాడుగాన
అతడు పిరికివాడు కానక్కరలేదు
ప్రభువుని నమ్మినవాడు ధన్యుడు
ఏ దిక్కునుండి సహాయం లభిస్తుందో అతనికి తెలుసు
దేవుడు తన్ను ప్రేమించేవాళ్ళని
ఒక కంట కనిపెట్టి వుంటాడు
వారిని తప్పక ఆదుకొని శక్తితో సంరక్షిస్తాడు
వారిని వడగాలి నుండి

మధ్యాహ్నపు వేడినుండి కాపాడతాడు
వారిని కాలుజారి పడనీయడు, నాశమైపోనీయడు
వారికి సేదదీర్చి
వారి కన్నులలో కాంతిని నెలకొల్పుతాడు
ఆయురారోగ్యాలతో వారిని దీవిస్తాడు
ధనబలాల వలన ఆత్మవిశ్వాసం కలుగుతుంది
కాని ఆ రెండిటికంటె దైవభీతి మేలు
దైవభీతి కలవారికి వేరేమి అక్కరలేదు
ఇతరాధారాలేమీ అవసరంలేదు
దైవభీతి నానా లాభాలొసగే ఉద్యానవనం లాంటిది
దానికి మించిన సదాశ్రయం లేదు
దైవభక్తిలేని బిడ్డలు ఎంతమంది వున్నా
వారిని జూచి సంతృప్తి చెందవద్దు
ఆ బిడ్డల భవిష్యత్తు శుభప్రద మౌతుందనీ
వాళ్ళు దీర్ఘకాలం జీవిస్తారనీ ఆశింపవద్దు
వేయిమంది పుత్రులకంటె ఒక్కడు మెరుగు
భక్తిహీనులైన బిడ్డలను కనడంకంటె
అసలు బిడ్డలు లేకుండ చనిపోవడం మేలు
-సీరా 2, 1-3. 15, 13-17. 18,24. 34, 13-17. 40, 26-27. 16, 2-3.

మన పథకాలు మనకుండవచ్చుగాక. వాటిని సఫలం చేసేవాడు మాత్రం ప్రభువే. అతని దీవెన వల్లనే మనం విజయం పొందుతాం. ఈ జీవితంలో మనలను నడిపించేది అతడే.

నరుడు పథకాలను సిద్ధంచేసికోవచ్చుగాక
ప్రత్యుత్తర మిచ్చేది మాత్రం ప్రభువే.
నరుడు పథకాలను సిద్ధంజేసికోవచ్చుగాక
అతని కార్యక్రమాలను నడిపించేదిమాత్రం ప్రభువే.
నరుడు ప్రణాళికలను వేసికోవచ్చుగాక
దేవుని సంకల్పం నెరవేరి తీరుతుంది.
నరుడు గుర్రాన్ని యుద్ధానికి సిద్ధంచేయవచ్చుగాక
విజయాన్ని ఒసగేది మాత్రం ప్రభువే.

దేవుణ్ణి నీ కార్యక్రమాలను దీవించమని వేడుకొంటే
నీకు తప్పక విజయం కలుగుతుంది
నీకున్న సిరిసంపదలతో దేవుణ్ణి పూజించు
నీకు పండిన పంటలో మొదటిపాలు అతని కర్పించు
నరుణ్ణి నడిపించేవాడు ప్రభువే
లేకపోతే మనుజునికి త్రోవ యేలా తెలుస్తుంది?
– సామె 16, 1.9. 19,21. 21,31. 16,3. 3,8. 20,24

నరుడు దేవుణ్ణి నమ్మిజీవించాలి. మేలూ కీడూ కూడ అతనినుండే వస్తాయి. మన పనుల్లో దేవుణ్ణి నమ్ముకొంటే అతడు వాటిని సులభం చేస్తాడు. నరుడు ప్రభువు శిక్షను మనస్పూర్తిగా అంగీకరించాలి. అతనిపట్ల భయభక్తులు కలిగి జీవించాలి. ప్రభువు దివ్యనామమనే కోటలో దాగుకోవాలి.

ఒకడు బానిసలా శ్రమించి పనిచేసినా
ఎల్లప్పుడూ వెనుకబడుతూనే వుంటాడు
మరొకడు తెలివితక్కువవాడు,
అన్యుల సాయం కోరేవాడు,
శక్తిలేనివాడు, పరమదరిద్రుడు కావచ్చు
కాని ప్రభువు వాణ్ణి కరుణతో వీక్షించి
దీనావస్థ నుండి ఉద్ధరింపవచ్చు
అప్పుడతడు మళ్ళా ఔన్నత్యాన్ని పొందడంజూచి
అందరూ ఆశ్చర్యచకితు లౌతారు
మేలు కీడు, బ్రతుకు చావు, కలిమి లేమి
అన్నీ దేవునినుండే వస్తాయి
భక్తుడు దేవుని దీవెననే బహుమతిగా పొందుతాడు
ఆ దీవెన క్షణకాలంలోనే సత్ఫలితాన్నిస్తుంది.
నీ కార్యాలన్నిటిలో ప్రభువుని స్మరించుకో
అతడు నీ పనులను సులభతరం చేస్తాడు
కుమారా! ప్రభువు శిక్షణను తృణీకరించవద్దు
అతని మందలింపులను అశ్రద్ధ చేయవద్దు
తండ్రి తన కిష్టుడైన కుమారుణ్ణి శిక్షించినట్లే
ప్రభువు తనకు ప్రీతిపాత్రుడైన నరుణ్ణి చక్కదిద్దుతాడు.

దేవునిపట్ల భయభక్తులు కలవానికి చీకుచింత లేదు
అతని సంతతినిగూడ ప్రభువే రక్షిస్తాడు
దైవభయం జీవజలధారవంటిది
దానివలన మృత్యుపాశంనుండి తప్పించుకోవచ్చు.
ప్రభువు దివ్యనామం కోటలాంటిది
పుణ్యపురుషులు దానిలో ప్రవేశించి
రక్షణం పొందుతారు

ధనవంతులు మాత్రం తమ సంపద తమ్ము ఉన్నతమైన ప్రాకారంవలె సంరక్షిస్తుందని భ్రాంతి పడతారు - సీరా 11, 11-14.22. సామె 3,6. 11-12. 14,26-27. 18,10-11.

# 10. ఆత్మగౌరవాన్ని కాపాడుకో

నరుడు తన్నుతాను తక్కువగా ఎంచుకొని ఆత్మగౌరవాన్ని చెడగొట్టుకోగూడదు. తన్ను తాను నిందించుకోగూడదు. మాటామాటికి పొరుగువారి యింటికిబోయి చులకన కాగూడదు.

కుమారా! నీకు లభించిన అవకాశాలను
సద్వినియోగం జేసికో
కాని దుష్కార్యాలకు పూనుకోకు
నిన్నుజూచి నీవే సిగ్గుపడకు
వినయవర్తనం గౌరవాన్ని కీర్తిని తెచ్చిపెడుతుంది
కాని తన్నుతాను తక్కువగా ఎంచుకోవడం పాపహేతువు
ఇతరులపట్లగల మోజుచే
నీయాత్మ గౌరవాన్ని చెరచుకోవద్దు
నీ హక్కుని వదలుకొని స్వీయనాశాన్ని తెచ్చుకోవద్దు
కుమారా! ఆత్మాభిమానమూ వినయమూ కలిగివుండు
నీకు తగినట్లుగానే నిన్నునీవు గౌరవించుకో
తన్ను తాను నిందించుకొంటే ప్రయోజనం లేదు
ఆత్మగౌరవం లేనివాణ్ణి ఇతరులు గౌరవిస్తారా?
తేనెనుగూడ మితంమీరి భక్షింపరాదు
భక్షిస్తే వాంతి ఔతుంది

అట్లే పొరుగువాని యింటికిగూడ
మాటిమాటికి వెళ్ళరాదు
వెళ్తే అతనికి విసుగెత్తి నిన్ను చీదరించుకొంటాడు - సీరా 49, 22-22.10,2829. సామె 25, 16-17.

# 11. స్నేహధర్మాలు

స్నేహితుణ్ణి పరీక్షించి మరీ యెన్నుకోవాలి. మంచి స్నేహితుడు నిధిలాంటివాడు. ప్రాత మిత్రుణ్ణి వదలుకోరాదు. స్నేహితుణ్ణి అవమానిస్తే అతన్ని పోగొట్టుకొంటాం. మిత్రుడు మిత్రుని రహస్యాలు దాచాలి. దేవుని దీవెనవల్ల మన శత్రువులుకూడ మనకు మిత్రులౌతారు.

మృదుభాషణం వలన
చాలమంది స్నేహితులు కల్గుతారు
మర్యాదావర్తనం వలన మిత్రులు పెరుగుతారు
నీకు పరిచితులు చాలమంది వుండవచ్చుగాక
సలహాదారుణ్ణిగా మాత్రం
వేయిమందిలో ఒక్కణ్ణి ఎన్నుకో
పరీక్షించి చూచిన పిదపనేగాని
ఎవణ్ణయినా మిత్రునిగా అంగీకరింపకు
త్వరపడి యెవర్నీ నమ్మకూడదు
నమ్మదగిన స్నేహితుడు సురక్షితమైన కోటలాంటివాడు
ఆలాంటివాడు దొరికితే నిధి దొరికినట్లే
అతనికి వెలకట్టలేము
అతని విలువ అన్నిటిని మించింది
ప్రాతమిత్రుణ్ణి పరిత్యజింపవద్దు
క్రొత్త మిత్రుడు అతనికి సాటిరాడు
నూత్న మిత్రుడు నూత్న ద్రాక్షాసవం లాంటివాడు
ప్రాతపడిన పిదపగాని మధువు
సేవించడానికి యింపుగా వుండదు.
నీవు నీ స్నేహితునిమీద కత్తిదూసినా
నిరాశపడనక్కరలేదు, మరల సఖ్యం కలిగించుకోవచ్చు
అతనితో ఘర్షణకు దిగినా

చింతించనక్కరలేదు, మరలా రాజీపడవచ్చు
కాని అవమానం, అహంకారం,
రహస్యాలను బయలుపర్చడం, వెన్నుపోట్లు పొడవడం
అనేవాటిని ఏ మిత్రుడు సహించలేడు
రహస్యాలను వెలిబుచ్చేవాడు నమ్మదగనివాడు
అతనికి ఆప్తమిత్రులు దొరకరు
నీ స్నేహితుణ్ణి ప్రేమించి
విశ్వసనీయుడిగా మెలుగు
అతని రహస్యాలను వెల్లడిచేస్తే
ఇక అతన్ని వదలుకోవలసిందే.
ప్రభువు ఎవనివలన ప్రీతి జెందుతాడో
వానికి శత్రువులుకూడ మిత్రులయ్యేలా చేస్తాడు - సీరా 6, 5-8. 14-16. 9,10. 22,20-22, 16-17. సామె 16,7.

దుష్టునితో స్నేహం పనికిరాదు. కష్టాల్లో అతడు మనలను ఆదరించడు. ఆపదల్లో ఆదుకొనేవాడే నిజమైన మిత్రుడు.

కీలు ముట్టుకుంటే చేతులకు మురికి ఔతుంది
దుష్టులతో స్నేహంచేసేవాడు వారివంటివాడే ఔతాడు
సంపదల్లో మంచి మిత్రుణ్ణి గుర్తించలేం
కాని ఆపదల్లో చెడ్డమిత్రుణ్ణి గుర్తించవచ్చు
కష్టాల్లో మిత్రులుకూడ మనలను విడిచిపోతారు
కాని సంపదల్లో చెడ్డవారుకూడ మిత్రుల్లా నటిస్తారు
చెడ్డ స్నేహితుణ్ణి ఎప్పుడూ నమ్మరాదు
త్రుప్పు లోహాన్నిలాగే అతని దుష్టత్వం
మనలను నాశం చేస్తుంది
కొందరు మనం పచ్చగా వున్నపుడు మిత్రుల్లాగే కన్పిస్తారు
కాని ఆపదలు వచ్చినపుడు మనకు ఎదురుతిరుగుతారు
కాని కొందరు కష్టాల్లో మనలను ఆదుకొంటారు
శత్రువు మనమీదికి వచ్చినపుడు వానితో పోరాడతారు
నీ తరపున పోరాడిన నేస్తుని మరచిపోవద్దు

నీకు సంపదలబ్బినపుడు అతన్ని విస్మరించకు
కొందరు మిత్రులు మనకు కీడు దెస్తారు
కాని కొందరు సోదరులకంటె యెక్కువగా హితం చేకూరుస్తారు - సీరా 13,1. 12,8-10. 37,4-6. సామె 18,24.

# 12. వివాహ ధర్మాలు

పురుషునికి పెండ్లి ఆడుతోడూ అవసరం. భార్యభర్తకు సాయం చేస్తుంది.
స్త్రీ సౌందర్యం పురుషునికి ఆనందం కలిగిస్తుంది
నరుని కంటికి అంతకంటె యింపైనది లేదు
భార్యను బడసినవాడు అదృష్టాన్ని బడసినట్లే
ఆమె అతనికి సాయంజేసి అతన్ని ప్రోత్సహిస్తుంది
కంచెలేని స్థలాన్ని అన్యులు ఆక్రమించుకొంటారు
భార్యలేని పురుషుడు నిట్టూర్పులతో
ఊళ్ళ వెంట తిరుగుతాడు - సీరా 36, 22-25.

సొంత తెగనుండే పిల్లను దెచ్చుకొని పెండ్లిజేసికొంటే ఒద్దికగా సంసారం గడపవచ్చు. కనుక తోబీతు కుమారునికి ఈలా వుపదేశం చేసాడు. "నాయనా! మన తెగనుండే వొక పిల్లను పెండ్లిజేసికో. మన పూర్వులైన నోవా, అబ్రాహాము, ఈసాకు, యాకోబు మొదలైన వాళ్ళంతా వారి తెగకు చెందిన పిల్లలనే పెండ్లాడారు. కనుక దేవుడు వారికి సంతానాన్ని దయచేసాడు" - తోబీ 4,12-14.

గుణవతియైన భార్యను బడసినవాడు ధన్యుడు
ఆమె మూలాన అతని ఆయుస్సు రెండురెట్లు పెరుగుతుంది
సద్బుద్ధిగల భార్య భర్తకు పరమానందం కలిగిస్తుంది
అతడు శాంతిసమాధానాలతో జీవితం గడుపుతాడు
మంచి యిల్లాలు శ్రేష్ఠమైన వరం లాంటిది
దైవభీతి కలవారికేగాని ఆ వరం లభింపదు
యోగ్యురాలైన భార్యవలన భర్త ఆనందం చెందుతాడు
ఆమె సామర్థ్యం వలన అతడు బలాఢ్యుడౌతాడు
మిత భాషిణియైన భార్య దేవుడిచ్చిన వరమనాలి
ఆమె సంయమనానికి వెలకట్టలేం
శీలవతియైన భార్య మనోజ్ఞత అంతింతకాదు

ఆమె సచ్ఛీలాన్ని ఏ తక్కెడతోను తూయలేం
ఆకాశాన ఉదయభానుడు ప్రకాశించినట్లే
మంచి యిల్లాలు తాను చక్కగా
తీర్చిదిద్దుకొన్న యింటిలో వెలుగొందుతుంది
పవిత్ర దీపస్తంభంమీద దీపం వెలిగినట్లే
సుందరమైన తనువుమీద ఆమె మొగం ప్రకాశిస్తుంది
వెండి దిమ్మలమీద నిల్చిన బంగారు స్తంభాల్లాగే
బలమైన మడమలమీద ఆమె అందమైన కాళ్లు
వెలుగొందుతుంటాయి
నాయనా! దేశంలో సారవంతమైన క్షేత్రాన్ని వెదకి
దానిలో నీ సొంత బీజాలను వెదజల్లు
నీ మంచి విత్తనాలను నీవు నమ్మాలి
అప్పుడు నీ బిడ్డలు మంచి కుటుంబంలో పుట్టామని
విశ్వసించి పెరిగి పెద్దవారై వృద్ధిలోకి వస్తారు - సీరా 26,1-4. 13-21.

సామెతల గ్రంథం 31,10-31 ఆదర్శ గృహిణిని అతి మనోజ్ఞంగా వర్ణిస్తుంది. పాఠకులు ఈ భాగాన్నంతటినీ చదవాలి. స్థలాభావంవల్ల ఇక్కడ కొన్ని వాక్యాలు మాత్రమే ఉదాహరిస్తున్నాం.

యోగ్యురాలైన గృహిణి యెక్కడ దొరుకుతుంది?
ఆమె పగడాలకంటె విలువైంది
ఆమె పెనిమిటి ఆమెను విశ్వసిస్తాడు
ఆమెవలన అతనికి చాల లాభం కలుగుతుంది
ఆమె జీవించినంతకాలం అతనికి మంచినేగాని
చెడును తలపెట్టదు
ఆమె పెనిమిటి సభలో పెద్దవారిమధ్య కూర్చుండి
ఎల్లరి మన్నన పొందుతాడు
తళుకుబెళుకులు నమ్మరానివి, అందం నిల్చేదికాదు.
ప్రభువుపట్ల భయభక్తులుకల మహిళ మెచ్చుకోదగింది.

ఇంతవరకు గుణవతియైన భార్యనుగూర్చి వివరించాం. ఇక, దుష్టురాలైన భార్యకూడ వుంది. ఆమె పెనిమిటిని ధిక్కరిస్తుంది.

పెనిమిటిని గౌరవించే యిల్లాలిని
ఎల్లరూ వివేకవతిగా యెంచుతారు
కాని పొగరుబోతుతనంతో భర్తను ధిక్కరించేదాన్ని
ఎల్లరూ దుష్టురాలినిగా గణిస్తారు
యోగ్యురాలైన భార్యను బడసినవాడు ధన్యుడు
ఆమె వలన అతని ఆయుస్సు రెండంతలు పెరుగుతుంది - సీరా 26, 26.

ఇంకా చెడ్డభార్య సణుగుకొంటుంది, గయ్యాళితనం ప్రదర్శిస్తుంది. ఆమెతో కాపురం చేయడం కష్టం.

మూర్ఖుడైన పుత్రునివల్ల తండ్రి చెడతాడు
భార్య సణుగుడు ఇంటి కప్పునుండి కారే
నీటిబొట్లలా గుంటుంది.
గొణగే భార్యతో ఇంటిలో వసించడంకంటె
ఇంటిమీద ఒక ప్రక్కన పడివుండడం మేలు.
కోపంతో సణుగుకొనే భార్యతో
కాపురం చేయడంకంటె
ఎడారిలో వసించడం మేలు.
గయ్యాళి భార్య సణుగుడు
వానరోజున ఎడతెగకపడే చినుకుల్లా వుంటుంది
గాలిని ఆపడంగాని చమురును గుప్పిట బట్టడంగాని
ఎంత కష్టమో ఆమె నోరు మూయించడం అంత కష్టం - సామె 19, 13.21. 9,19. 27, 15-16.

తండ్రిగా, భర్తగా పురుషుని బాధ్యతలుగూడ గొప్పవి. కొమార్తెకు పెండ్లి చేసేవాడు దొడ్డకార్యం చేసినట్లే

కాని ఆమెను వివేగంగల యువకుని కీయాలి
నీ భార్య నీకు ప్రీతి కలిగించేదైతే విడాకులీయవద్దు
కాని నీకిష్టంగానిదైతే ఆమెను నమ్మవద్దు. - సీరా 7, 25-26
మగవాళ్ళు అతివలనుజూచి మతి గోల్పోగూడదు
స్త్రీ సౌందర్యానికి భ్రమసిపోవద్దు
అతివనుజూచి మతి గోల్పోవద్దు - సీరా 25, 21.

భార్యాభర్తల కలయికవల్ల పిల్లలు జన్మిస్తారు. తల్లిదండ్రులు తమ బిడ్డలను జాగ్రత్తగా పెంచి ప్రయోజకులను చేయాలి. విశేషంగా కుమారుడు బాలుడుగా వున్నపుడే తండ్రి వాడికి క్రమశిక్షణం నేర్పాలి. తండ్రి చనిపోయాక గూడ తన కుమారుల్లో జీవిస్తాడు.

ప్రేమగల తండ్రి తన కుమారుణ్ణి తరచుగా శిక్షించాలి
సుశిక్షితుడై పుత్రుడు పెరిగి పెద్దవాడైనప్పుడు
తండ్రి సంతోషపడతాడు
కుమారుణ్ణి క్రమశిక్షణకు గురిచేసే తండ్రి
సత్ఫలితాన్ని పొందుతాడు
అతడా పుత్రునిగూర్చి మిత్రులతో గొప్పలు చెప్పుకోగలడు
కుమారునికి విద్యగరపిన తండ్రి
తన శత్రువులకు అసూయ పుట్టిస్తాడు
అతడా పుత్రుని తలంచుకొని మిత్రులమధ్య
సగర్వంగా తిరుగుతాడు
తండ్రి చనిపోయినా చనిపోయినట్లు కాదు
అతని ప్రతిబింబమైన కుమారుడు మిగిలివున్నాడు కదా!
తండ్రి బ్రతికివున్నపుడు పుత్రునిజూచి ఆనందిస్తాడు
చనిపోయేపుడు నిశ్చింతగా చనిపోతాడు
కాని పుత్రుని చెడగొట్టే తండ్రి
వాని గాయాలకు కట్టు కడతాడు
వాడు ఏడ్చినపుడెల్ల అతని హృదయం కరుగుతుంది
చక్కగా తర్ఫీదు నీయని గుర్రం మొండిదౌతుంది
అదుపుమీరిన కుమారునికి పొగరెక్కుతుంది
గోముగా బెరిగిన బిడ్డడు కడన తండ్రికి నిరాశ కలిగిస్తాడు
తండ్రి పుత్రునితో ఆడిపాడెనేని
తర్వాత అతనికి దుఃఖం తప్పదు
బాల్యంలో బిడ్డడికి స్వేచ్ఛ ఈయరాదు
వాడి తప్పిదాలకు దండనం విధించి తీరాలి
కనుక శ్రమపడి నీ తనయునికి శిక్షణనీయి
లేకపోతే వాడు నీకు అపకీర్తి తెస్తాడు – సీరా 30, 1–13.

పిల్లవాణ్ణి శిక్షించడానికి బెత్తం వాడాలి. చిన్నపుడే బాలునికి మంచిమార్గంలో నడవడం నేర్పిస్తే పెద్దయ్యాక ఇక ఆ త్రోవ తప్పడు.

బెత్తంవాడని తండ్రి పుత్రుని ప్రేమించినట్లు కాదు
తనయుని ప్రేమించే తండ్రి వాణ్ణి శిక్షించితీరుతాడు
బాలుని హృదయంలో చాపల్యం
సహజంగానే వుంటుంది
బెత్తం ఉపయోగిస్తే అది తొలగిపోతుంది.
బాలుని శిక్షించడానికి వెనుకాడవద్దు
బెత్తంతో కొడితే వాడు చనిపోడు
బాలునికి తాను నడువవలసిన మార్గాన్ని గూర్చి బోధిస్తే
పెరిగి పెద్దవాడైన పిదపగూడ ఆ త్రోవను విడనాడడు - సామె 13,24. 22,15. 23,13. 22,6.

ఇప్పటిలాగే పూర్వంగూడ ఆడపిల్లలనుగన్న తండ్రి నానావిధాల ఆందోళనం చెందేవాడు.

తండ్రి కొమార్తనుగూర్చి ఆందోళనం చెందుతాడు
రేయి అతని కంటికి కూర్కురాదు
ఈ సంగతి కొమార్తెకు తెలియదు
దుహిత బాలికగావుంటే ఆమెకు పెండ్లికాదేమో అనీ
పెండ్లయితే ఆమె సుఖింపదేమో అనీ తండ్రి విచారిస్తాడు
పుత్రిక కన్యగావుంటే ఎవరైనా ఆమెను చెరుస్తారేమో అనీ
ఆమె పుట్టింటనే గర్భవతి ఔతుందేమో అనీ అతని భయం
ఆమెకు పెండ్లయితే శీలవతిగా వుండదేమో అనీ
లేదా సంతానం కలగదేమో అనీ అతని వగపు - సీరా 42, 9-10.

## 13. పెద్దలపట్ల గౌరవం

పెద్దలపట్ల మనకు గౌరవం వుండాలి. తల్లిదండ్రులు, జ్ఞానులు, వృద్ధులు, యజాకులు, వైద్యులు, అధికారులు మొదలైనవాళ్లు పెద్దలు. మొదట మనం తల్లిదండ్రులను గౌరవించాలి.

తండ్రిని గౌరవించేవాడు
తన పాపాలకు ప్రాయశ్చిత్తం చేసికొన్నట్లే
తండ్రిని సన్మానించేవాడు నిధిని చేకొన్నట్లే
తల్లిని సన్మానించే పుత్రుణ్ణి
అతని పుత్రులు సంతషపెడతారు
అతని ప్రార్థనను దేవుడు ఆలిస్తాడు
తండ్రిని ఆదరించేవాడు దీర్ఘాయుష్మంతుడౌతాడు
తల్లిని సంతోషపెట్టేవాడు దేవునికి విధేయుడైనట్లే
తండ్రి ఆశీస్సుల వలన
బిడ్డల గృహాలు వృద్ధిచెందుతాయి
తల్లి శాపాల వలన పిల్లల కొంపలు కూలిపోతాయి
పూర్ణహృదయంతో నీ తండ్రిని గౌరవించు
నిన్ను కన్నతల్లి పురిటి నొప్పులను మరచిపోకు
నీకు ప్రాణమిచ్చినవాళ్ళు నీ జననీజనకులు
వాళ్ళ ఋణాన్ని నీవెట్లు తీర్చుకొంటావు?
నీవు జనులమధ్య కూర్చుండివున్నపుడు మైమరచి
కామపుమాటలుపల్కి నీయవివేకాన్ని చాటుకోవచ్చు
ఆ సంగతి వింటే నీ తల్లిదండ్రులు
ఎంత బాధపడతారో వూహించు - సీరా 3,3-6.9. 7, 22-28. 23,14.
విశేషంగా ముసలివారైన తల్లిదండ్రులను ఎంతో ఆదరంతో జూడాలి.
నాయనా! వృద్ధుడైన నీ తండ్రిని బాగుగా జూచుకో
అతడు జీవించివున్నంతవరకు అతన్ని కష్టపెట్టకు
అతనికి మతి దప్పినా నీవతన్ని ఆదరంతో జూడు
నీవు బలంగాను ఆరోగ్యంగాను వున్నావు కనుక
అతన్ని ఆలక్ష్యం చేయకు
నీవు నీ జనకునిపై చూపిన కరుణను దేవుడు విస్మరింపడు
ఆ కరుణ నీ పాపాలకు ప్రాయశ్చిత్తం చేసిపెడుతుంది
తల్లిదండ్రులను శపించేవాని దీపం నడిచీకటిలో ఆరిపోతుంది - సీరా 3,12-14,సామె 20, 20.

తల్లిదండ్రులను గౌరవంతో చూడాలని చెప్తూ తోబీతు తోబియాకు ఇట్లు బోధించాడు. "నాయనా! నేను చనిపోయినప్పుడు నన్ను అన్ని మర్యాదలతో పాతిపెట్టు. నేను దాటిపోయిన తర్వాత మీయమ్మను గౌరవంతో జూడు. ఆమె బ్రతికియున్నంతకాలం ఆమెను పోషించు. ఆమె చనిపోయినపుడు నా ప్రక్కనే పాతిపెట్టు. నిన్ను గర్భాన మోసి కనినపుడు ఆమె యెన్ని అపాయాలకు గురైందో జ్ఞప్తికి తెచ్చుకో. కనుక ఆమె కోరినదెల్ల చేయి. ఎన్నడూ నీ తల్లి మనసు కష్టపెట్టకు" - తోబీ 4,3-4.

మాతా పితలనులాగే వృద్ధులనూ జ్ఞానులనూగూడ గౌరవించాలి. వారి బోధలను శ్రద్ధతో వినాలి.

వృద్ధుని చిన్నచూపు చూడవద్దు
మనమందరం ముసలివాళ్ల మౌతాంగదా!
విజ్ఞుల బోధను అనాదరం చేయవద్దు
వారి సూక్తులను జాగ్రత్తగా పఠించు
వాటి వలన నాగరికత అలవర్చుకొని
రాజులకు సేవలుచేసే విధానం నేర్చుకొంటావు
పెద్దవారి ఉపదేశాలను అనాదరం చేయవద్దు
వారు తమ పూర్వులనుండే వాటిని నేర్చుకొన్నారు
వారినుండి నీవు విజ్ఞానాన్ని గడిస్తావు
అవసరం వచ్చినపుడు జవాబు ఏలా చెప్పాలో
తెలిసికొంటావుగూడ - సీరా 8,6. 8-9.

యాజకులనుగూడ మన్ననతోజూచి వారి కీయవలసిన కానుకలను ఈయాలి.

దేవునికి భయపడే యాజకులను గౌరవించు
విధ్యుక్తంగా వారికీయవలసిన కానుకలు ఈయి
ప్రథమ ఫలాలు, బల్యర్పణం, పవిత్రార్పణం ఈయి - సీరా 7,21.

వైద్యులద్వారా, వారిచ్చే మందులద్వారా ప్రభువే వ్యాధులు నయం చేస్తాడు. కనుక వారిని సన్మానించాలి.

నీకు చికిత్స చేసినందుకు వైద్యుని సన్మానించు
ప్రభువే అతన్ని కలిగించాడు
వైద్యులద్వారా మహోన్నతుడే వ్యాధినయంచేస్తాడు
రాజులు ఆ వైద్యులను బహూకరిస్తారు

ప్రభువే భూమినుండి మందులు కలిగించాడు
బుద్ధిమంతుడు వాటిని తప్పక వినియోగించకుంటాడు
కుమారా! నీకు జబ్బుచేస్తే అశ్రద్ధ చేయకు
ప్రభుని వేడుకొంటే నీకు ఆరోగ్యం దయచేస్తాడు.
నీ తప్పిదాలను విడనాడి నిర్దోషివి కా
నీ హృదయంనుండి పాపాన్ని నిర్మూలించు
అటుపిమ్మట వైద్యుని పిలువు
ప్రభువే అతన్ని కలిగించాడు
నీ కవసరంవుంది కనుక అతన్ని నీ చెంతనే వుంచుకో
ఒక్కోసారి నీ యారోగ్యం అతని చేతిలో వుంటుంది
అతడు తాను రోగిబాధలను తొలగించి
వ్యాధిని కుదిర్చి ప్రాణాలు నిల్పడానికి
శక్తిని దయచేయమని దేవుని ప్రార్థిస్తాడు
సృష్టికర్తకు ద్రోహంగా పాపంచేసిన నరుడు
రోగియై వైద్యుని ఆశ్రయించడం న్యాయం – సీరా 38, 1–4. 9 – 25
ఆలాగే మంచివాడు అధికారంలో వున్న వారికి లొంగివుండాలి.
నీవు భక్తసమాజం మన్నన పొందు
అధికారంలో వున్నవారికి తలవొగ్గు – సీరా 4,7.

## 14. మంచి సలహాను పాటించాలి

మంచి సలహావల్ల చాల లాభాలున్నాయి. కనుక మనం దాన్ని పాటించాలి. మన హృదయంకూడ మనకు సలహా యిస్తుంది.

బుద్ధిమంతుడు ఇతరుల అభిప్రాయాలను వింటాడు
కాని భక్తిహీనులైన గర్వాత్ములు దేనికీ జంకరు
ఎవడైనా ఉపదేశం చేయగలడు
కొందరు స్వలాభం కొరకే సలహా యిస్తారు
సలహాయిచ్చే వానిని జాగ్రత్తగా పరిశీలించిచూడు
అతని కోరిక యేమిటో తెలిసికో
అతడు స్వార్థాన్ని ఆశిస్తూండవచ్చు
కడన నీకు అపకారం తలపెట్టవచ్చు

కాని భక్తిపరుడైనవాణ్ణి, దైవాజ్ఞలు పాటించేవాణ్ణి,
నీతో సమానమైన అభిరుచి కలవాణ్ణి,
నీ పతనాన్ని జూచి విచారించేవాణ్ణి, సలహా అడుగు
కడన నీ హృదయం చేసే ఉపదేశాన్నికూడ నమ్ము
దానికి మించిన సలహా లేదని తెలిసికో
బురుజుమీద కూర్చుండే ఏడ్గురు పహరావారికంటె
మన హృదయం మనకు ఎక్కువ తెల్పుతుంది
అన్నిటికంటె పైగా నిన్ను సత్యమార్గాన నడపమని
మహోన్నతుని ప్రార్థించు.
హితోపదేశంలేని ప్రజలు నశిస్తారు
చాలమందిహితోపదేశకులుంటే భద్రత కలుగుతుంది
పొగరుబోతుతనం తగవులు తెస్తుంది
విజ్ఞతగలవాడు సలహా అడుగుతాడు.
హితోపదేశంలేందే పథకాలు ఫలింపవు
చాలమంది హితబోధకులు ఉన్న చోట కార్యాలు నెరవేరుతాయి
- సీరా 32, 18.37, 7-8. 12-15. సామె 11,14. 13,10. 15,22.

కడన, తోబీతు కుమారునికి ఈలా బోధించాడు. "బుద్ధిమంతుల సలహాను పాటించు. మంచి ఉపదేశాన్ని ఎప్పుడూ పెడచెవిని పెట్టవద్దు" - 4,18.

# 15. దుష్టులూ సజ్జనులూ

అన్ని నీతిగ్రంథాలూ సజ్జనులనూ దుర్జనులనూ పేర్కొంటాయి. సత్పురుషులు దేవుని దీవెన వలన వృద్ధిలోకి వస్తారు. దుర్జనులు దేవుని శాపం వలన అణగారిపోతారు.

ద్వేషం వలన ఎవనికీ భద్రత కలుగదు
ధర్మం వలన నరుడు
వేళ్ళుపాతుకొన్న చెట్టులా నిలుస్తాడు
పుణ్యపురుషుని దీపం దేదీప్యమానంగా వెలుగుతుంది
దుష్టుని దివ్వె ఆరిపోతుంది.
ఆపదలు దుర్మార్గులవెంట బడతాయి
సత్పురుషులు శుభాలు పొందుతారు.
తానేమి చేయాలో తనకు తెలియడంలోనే

విజ్ఞుని విజ్ఞత యిమిడివుంది
కాని మూర్ఖుని అజ్ఞానం వాణ్ణి పెడత్రోవ పట్టిస్తుంది.
ప్రభువు దుష్టుని బలిని అసహ్యించుకొంటాడు
సజ్జనుని ప్రార్థన వలన ప్రీతి జెందుతాడు.
దుష్టుని పోకడలు ప్రభునికి నచ్చవు
అతడు ధర్మాత్ముణ్ణి మెచ్చుకొంటాడు.
ప్రభువు దుష్టునికి దవ్వుగా వుంటాడు
కాని అతడు సజ్జనుని వేడికోలును ఆలిస్తాడు.
మూర్ఖుడు నూరుదెబ్బలు కొట్టినా నేర్చుకోలేనంత
వివేకశీలి ఒక్కసారి మందలిస్తేనే నేర్చుకొంటాడు.
వినయమూ దైవభీతి కలవాడు
సంపదలూ గౌరవమూ దీర్ఘాయువూ పొందుతాడు
దుష్టుని త్రోవ ముండ్లతోను ఉరులతోను నిండి వుంటుంది
జీవితంపై ఆశకలవాడు ఆ త్రోవ త్రొక్కడు.
దుష్టునికి మంచిరోజులు లేవు
అతని దీపం గుప్పున ఆరిపోతుంది
సత్పురుషుడు దుష్టునికి చిక్కి భ్రష్టుడు కావడం,
చెలమ చెడిపోవడంలాంటిది,
బావి మలినం గావడంలాంటిది.
దుష్టులకు న్యాయమంటే యేమిటో తెలియదు
ప్రభువు భక్తులకు న్యాయం బాగా తెలుసు - సామె 12,3. 13,9.21. 14,8. 15, 8-9. 29. 17,28. 22,45. 24,20. 25,26. 28,5.

న్యాయనిర్ణయ దినాన దుష్టులు సజ్జనులను జూచి ఆశ్చర్యపోయి ఈలా తలుస్తారు.
పూర్వం మనం ఇతన్ని జూచి నవ్వాం
ఇతన్ని గేలిచేసాం, కాని మనమే పిచ్చివాళ్ళం
ఇతనిది వట్టి వెర్రిజీవితం అనుకొన్నాం
ఇతడు నికృష్టమైన చావు చస్తాడనుకొన్నాం
కాని ఇప్పుడితడు దేవుని పుత్రుడుగా
చలామణి ఔతున్నాడు
ప్రభువు భక్తుడుగా గుర్తింపు పొందుతున్నాడు

కాని మనం సత్యమార్గం నుండి వైదొలగాం
ధర్మజ్యోతి మనమీద ప్రకాశింపలేదు
నీతిసూర్యుని పొడుపుని మనం దర్శింపనేలేదు
మనం నడవని దుష్టమార్గాలు లేవు
త్రోవల్లేని యెడారులందెల్లా తిరుగాడాం
దైవమార్గాన్ని మాత్రం విస్మరించాం
మన అహంకారంవల్ల మనం పొముకొన్నదేమిటి?
మన సంపదల వలన మనకు ఒరిగిన దేమిటి?
అవియెల్ల యిపుడు నీడలా గతించాయి
వదంతుల్లాగ దాటిపోయాయి
మనం పుట్టగానే చచ్చాం
మనం చేసిన పుణ్యకార్యాలు ఏమీలేవు
మన దుష్టత్వమే మనలను నాశం చేసింది - సొలోమోను జ్ఞాన - 5,4 -13.

# 16. రాజకీయ, ఆర్థిక రంగాలు

ప్రభువే రాజులను నియమిస్తాడు. మంచిరాజు ప్రజలకు మేలు చేస్తాడు. చెడ్డరాజు కీడు చేస్తాడు.

విజ్ఞతగల పాలకుడు తన ప్రజలకు శిక్షణనిస్తాడు
అతని పరిపాలనం క్రమబద్ధంగా వుంటుంది
పాలకుడు ఏలాంటివాడో
ఉద్యోగులూ అలాంటివా రౌతారు
ప్రజలుకూడ అతనిలాంటివారే ఔతారు
విద్యారహితుడైన ప్రభువు ప్రజలను చెరుస్తాడు
పాలకులు విజ్ఞులైతే ప్రభుత్వం బాగుపడుతుంది
ప్రభువే లోకాన్ని పాలిస్తాడు
అతడు తగిన కాలంలో తగినవాణ్ణి పాలకుణ్ణి చేస్తాడు
ఆ పాలకుని విజయం ప్రభువు చేతిలో వుంటుంది
ఏ యధికారి కీర్తియైన ప్రభువుమీదనే ఆధారపడి వుంటుంది
గర్జించేసింహం, ఎరకొరకు తిరిగే ఎలుగూ ఏలాంటివో
పేదలపై అధికారం నెరపే దుష్టపాలకుడు అలాంటివాడు - సీరా 10, 1-5. సామె 28, 15.

యూదితు గొప్ప దైవభక్తి కలది. హొలోఫెర్నెసు అనే అస్సిరియా సైన్యాధిపతి బెతూలియా పట్టణాన్ని ముట్టడించడానికిరాగా ఆమె సాహసంతో వెళ్ళి ఆ సైన్యాధిపతి శిరస్సు తెగనరుక్కొని వచ్చింది. పౌరులందరికీ ఈలాంటి దేశభక్తి వుండాలి - యూది 12,8.

చాలామంది ధనాన్ని కూడబెడతారు. కాని దాన్ని సద్వినియోగం చేసికోవాలి. పిసినిగొట్టులు ఆలా చేసికోరు. కనుక వారు కూడబెట్టిన సొత్తును అన్యులు అనుభవిస్తారు. నరుడు ఉచితమైన సుఖాలను అనుభవించాలి.

తా ననుభవింపక సొమ్ము కూడబెట్టేవాడు
ఇతరుల కొరకే కూడబెడుతున్నాడు
అతని సొత్తుతో ఇతరులు హాయిగా బ్రతుకుతారు
తన కొరకు తాను ఖర్చుజేసికోనివానికంటె నికృష్టుడు లేడు
పిసినారితనానికి తగిన శిక్షే వుంది
లోభియైన నరుడు దుష్టుడు
అక్కరలో వున్న వారిని ఆదుకొనడు
అతడు తనకున్న దానితో తృప్తిజెందడు
దురాశ వలన అతని హృదయం కుదించుకొనిపోతుంది
పిసినారి కడుపునిండ తినడానికి ఇష్టపడడు
కనుక చాలినంత భోజనం సిద్ధంజేసికోడు
మృత్యువు నీ కొరకు వేచివుండదు
నీవేనాడు పాతాళం చేరుకొంటావో నీకే తెలియదు
ప్రతిదినం నీ వనుభవింపగలిగింది అనుభవించు
ఉచితాలైన నీవంతు సుఖాలను విడనాడకు
నీ సొత్తును ఇతరులకు వదలనేల?
నీవు కష్టపడి కూడబెట్టింది అన్యులు పంచుకోనేల? - సీరా 14, 4-6. 8-10. 12-16.

భక్తుడు తాను పేదవాడుగాని ధనికుడుగాని కాకుండ మధ్యస్థంగా జీవించాలని కోరుకొన్నాడు. ధనికుడైతే తాను దేవుణ్ణి పట్టించుకోకపోవచ్చు. పేదవాడైతే దొంగతనానికి పాల్పడవచ్చు. కనుక ఆ రెండింటికీ మధ్యలో వుండడం మంచిది.

దేవా! నేను నిన్ను రెండువరాలు అడుగుతున్నాను
నేను మరణించకముందే నాకు వీటిని ప్రసాదించు
నేనెంతమాత్రం అబద్ధాలు ఆడకుండా వుండేలా చేయి
నన్ను సంపన్నుణ్ణి చేయవద్దు, ధనికుణ్ణి చేయవద్దు
నాకు కావలసినంత తిండి మాత్రం దయచేయి
నీవు సంపదలిస్తే నిన్ను ధిక్కరించి
ప్రభువెవడని పల్కుతానేమో!
లేమి కల్గితే దొంగతనానికి పాల్పడి
నా దేవుడవైన నీకు అపఖ్యాతి తెస్తానేమో! - సామె 30, 7-9

# 17. నరుల్లో తేడాలు

అందరూ ఒకే రీతిగా వుండరు. నరుల్లో తారతమ్యాలుంటాయి. కుమ్మరి తన కిష్టమొచ్చినట్లుగా పాత్రలను చేస్తాడు. అలాగే ప్రభువు అధికులనూ అల్పులనూ గూడ చేస్తాడు.

అందరూ మట్టినుండి పుట్టినవాళ్ళే
ఆదాముకూడ అలా జన్మించినవాడే
ఐనా ప్రభువు వివేకంతో నరులమధ్య వ్యత్యాసం కలిగించి
వారికి భిన్న కార్యాలు ఒప్పగించాడు
అతడు కొందరిని దీవించి ప్రముఖులను చేసాడు
కొందరిని పవిత్రపరచి తనయెదుట నిల్పుకొన్నాడు
కొందరిని శపించి మన్ను గరిపించి స్థానభ్రష్టులను చేసాడు
మట్టి కుమ్మరి చేతిలో వుంది
అతడు దాన్ని తన యిష్టం వచ్చినట్లు మలుస్తాడు
ఆలాగే నరులుకూడ ప్రభువు చేతిలో వున్నారు
అతడు వారిని తన యిష్టంవచ్చినట్లు చేస్తాడు
మంచికి చెడ్డ, మృత్యువుకి జీవం, వ్యతిరేకాలు
ఆలాగే పాపికి పుణ్యాత్ముడు వ్యతిరేకి
మహోన్నతుడైన ప్రభువు కార్యాలను పరిశీలిస్తే

అవి పరస్పర విరుద్ధాలైన ద్వంద్వాల్లా కన్పిస్తాయి
నా మట్టుకు నేను పనివారిలో కడపటివాణ్ణి
నేను ద్రాక్షపండ్లు కోసే పనివారి వెనుక
పరిగలేరుకొనేవానివలె పని ప్రారంభించాను
కాని దేవుని దీవెనవల్ల ఆ పనివారినెల్ల మించాను
వారివలె నేను నా ద్రాక్షతొట్టిని రసంతో నింపాను
నా కొరకు మాత్రమే నేనీ శ్రమనంతా చేయలేదు
ఉపదేశాన్ని ఆశించేవాళ్ళందరి కొరకు ఈ కృషి చేసాను. - సీరా 33,10-17.

# 18. నరుడు తన్ను తాను అదుపులో పెట్టుకోవాలి

నరుడు తన్ను తాను అదుపులో పెట్టుకోవాలి. నగరాన్ని జయించడంకంటె తన్నుతాను గెల్వడం మేలు. వినయంతో మన దుర్గుణాలను మనం సవరించుకోవాలి.

ఓర్పుగలవాడు వీరునికంటె ఘనుడు
నగరాన్ని జయించడంకంటె
తన్నుతాను గెల్వడం లెస్స
తన్నుతాను అదుపులో పెట్టుకోలేనివాడు
ప్రాకారాలు లేనందున రక్షణను కోల్పోయిన
నగరంలాంటివాడు.
రేపటి దినాన్నిగూర్చి ప్రగల్భాలు పలకవద్దు
నేడేమి జరుగుతుందో నీకే తెలియదు
ఇతరులు నిన్ను పొగడవచ్చుగాని
నిన్ను నీవే పొగడుకోగూడదు
పరులు నిన్ను స్తుతించవచ్చుగాని ఆత్మస్తుతి కూడదు
రాయి బరువు, ఇసుక బరువు,
కాని మూర్ఖుని వలన కలిగే బాధ
వీటికంటె ఎక్కువ బరువు
కోపం క్రూరమూ వినాశప్రదమూ ఐంది
కాని అసూయ దానికంటె ఘోరమైంది - సామె 16,32. 25,28. 27, 1-4.

# 19. వయస్సుకంటె జ్ఞానం ముఖ్యం

ఎన్నేళ్లు జీవించామన్నది ముఖ్యంకాదు. ఎంత జ్ఞానంతో, ఎంత నిర్మలంగా జీవించామన్నది ముఖ్యం. సజ్జనుడు కొద్దికాలమే జీవించినా ఆ స్వల్పకాలంలోనే పరిపూర్ణతను పొంది దీర్ఘకాలం జీవించినవాడౌతాడు. ప్రభువు మంచివారిని చెడ్డనుండి కాపాడ్డంకోసం త్వరలోనే తీసుకపోతాడు.

దీర్ఘకాలం జీవించడంవల్లనే గౌరవం కలగదు
పెక్కేండ్లు బ్రతకడంవల్లనే జీవితం సార్థకంకాదు
జ్ఞానార్జనమే తల నరవడానికి గుర్తు
నిర్మల జీవితమే వృద్ధత్వానికి చిహ్నం
ప్రభువుకి ప్రీతికలిగించిన పుణ్యపురుషుడు ఒకడున్నాడు
దేవుడు అతన్ని ప్రేమించాడు
అతడు పాపాత్ముల నడుమ వసిస్తూంటే
ప్రభువు అతన్ని పరలోకానికి కొనిపోయాడు
చెడుగు ఆ సజ్జనుని మనస్సు పాడుచేసేదే
దుష్టత్వం ఆ సత్పురుషుని హృదయాన్ని చెరచేదే
కనుక ప్రభువు అతన్ని ముందుగానే తీసుకపోయాడు
చెడుగు నరులను మభ్యపెట్టి
వాళ్ళు మంచిని గుర్తించకుండా వుండేలా చేస్తుంది
వ్యామోహాలు మంచివారి హృదయాలనుగూడ చెరుస్తాయి
కాని ఆ సజ్జనుడు స్వల్పకాలంలోనే సిద్ధిని పొంది
దీర్ఘకాలం జీవించినవా డయ్యాడు
ప్రభువు సత్పురుషుని వలన ప్రీతిజెంది
అతన్ని పాప ప్రపంచం నుండి సత్వరమే కొనిపోయాడు
ప్రజలకు అతని మరణాన్నిగూర్చి తెలిసినా
వాళ్ళు విషయాన్ని అర్థం చేసికోలేదు
సత్యం వారి తలకెక్కలేదు
ప్రభువు తన భక్తులకు కృపను దయచేస్తాడనీ
వారిని కాచి కాపాడతాడనీ ప్రజలు గ్రహించలేదు
చనిపోయిన పుణ్యపురుషుడు

బ్రతికివున్న దుర్మార్గుని ఖండిస్తాడు
స్వల్పకాలంలోనే సిద్ధిని పొందిన యువకుడు
దీర్ఘకాలం జీవించే వృద్ధపాపిని గేలిచేస్తాడు - సొలోమోను జ్ఞాన 4,8-16

# 20. ధర్మశాస్త్ర బోధకుడు

ధర్మశాస్త్ర బోధకుడు మోషే ధర్మశాస్త్రాన్ని చక్కగా అధ్యయనంచేసి దాన్ని ప్రజలకు బోధిస్తాడు. అతడు ఎల్ల యెడలా జ్ఞానాన్ని వెదజల్లుతాడు. కనుక అతని జీవితం ధన్యమైంది. నేటి మన బోధకులుగూడ ఇతనిలా జీవిస్తే ఎంత బాగుంటుంది!

మహోన్నతుని ధర్మశాస్త్రాన్ని పఠించడంలో కాలంగడిపే
ధర్మశాస్త్ర బోధకుడు మాత్రం భిన్నమైనవాడు
అతడు పురాతన రచయితల జ్ఞానవాక్కులను పరిశీలిస్తాడు
ప్రవచనాలను పఠించడానికి కాలం వినియోగిస్తాడు
సుప్రసిద్ధుల సూక్తులను పదిలపరుస్తాడు
ఉపమానాలమీద నైపుణ్యంతో వ్యాఖ్య చెప్తాడు
సామెతల గూఢార్థాన్ని అర్థంచేసికొంటాడు
పొడుపు కథల మర్మాన్ని చర్చిస్తాడు
ప్రముఖులకు సేవలుచేస్తూ
రాజులతో కలసి తిరుగుతాడు
అన్యదేశాలలో సంచరించి
నరుల బాగోగులను పరిశీలిస్తాడు
వాడుక చొప్పన వేకువనే లేచి
తన్ను సృజించి దేవునికి జపం చేస్తాడు
మహోన్నతుడైన దేవుని ముందట గొంతెత్తి ప్రార్థనచేసి
తన పాపాలను మన్నింపమని వేడుకొంటాడు
ఆ మహాప్రభువు కరుణిస్తే
అతని హృదయం విజ్ఞానంతో నిండుతుంది
అతడు జ్ఞానవాక్కులను వెదజల్లుతూ
దేవునికి కృతజ్ఞతాస్తుతులూ చెల్లిస్తాడు
తన విజ్ఞానాన్నీ ఉపదేశాన్నీ అన్యులకు పంచిపెడతాడు
నిగూఢమైన దేవరహస్యాలను అర్థం జేసికొంటాడు

అతని విజ్ఞానాన్ని అనేకులు మెచ్చుకొంటారు
ఆ విజ్ఞానం ఏనాటికీ అంతరింపదు
భావితరాలవారు అతన్ని స్మరించుకొంటారు
అతని పేరు మాసిపోదు
అన్యజాతులు అతని విజ్ఞానాన్ని సన్నుతిస్తాయి
విద్వత్సభ అతన్ని కీర్తిస్తుంది
ముసలి ప్రాయందాకా జీవిస్తే అతడు సుప్రసిద్ధుడౌతాడు
కీర్తిని పొందకముందే గతించినా అతనికి కొరతలేదు.- సీరా 39, 1-11

# 21. ఈ జీవితం అశాశ్వతం

నరులు ప్రాతబట్టలా చినిగిపోతారు. చెట్టుమీది ఆకుల్లా రాలిపోతారు. ఈ జీవితం వ్యర్థమైంది. ఈ లోకంలో క్రొత్తయేమీలేదు. ఎప్పుడూ జరిగిందే జరుగుతూ విసుగు పుట్టిస్తుంది. ముసలితనంతో, ఆ తర్వాత వచ్చే చావుతో, అంతా గతిస్తుంది. గొర్రెలకాపరి గొర్రెలనులాగ, మృత్యువు మనలను ఇక్కడినుండి తోలుకొనిపోతుంది.

ప్రాణులన్నీ జీర్ణవస్త్రంలాగ శిథిలమైపోతాయి
పురాతన నియమం ప్రకారం
జీవకోటికి మృత్యువు తప్పదు
గుబురుగా ఎదిగిన చెట్టుమీద ఆకులు
కొన్ని పండి రాలిపోతూంటే
కొన్ని చిగుర్చుతూంటాయి
తరతరాల నరజాతికి ఈ గతే పడుతుంది
కొందరు చనిపోతూంటే మరికొందరు పుడుతూంటారు
నరుడు సాధించిన ప్రతి కార్యం నశిస్తుంది
ఆ కార్యాన్ని సాధించిన నరుడూ గతిస్తాడు. - సీరా 14, 17-19

ఉపదేశకుడు ఈ జీవితం వ్యర్థమని చెప్తున్నాడు. వ్యర్థం, అంతా వ్యర్థమే. నరుడు ఈ భూమిమీదపడే నానా పాట్లకూ ఫలిత మేముంది? - ఉప 1, 2-3.

ప్రతిదినం విసుగు పుట్టించేదే. ఈ విసుగుని వర్ణించడానికి మాటలు చాలవు. మన కండ్లు అవి చూచిన వస్తువులతోగాని, మన చెవులు అవి విన్న సుద్దులతోగాని సంతృప్తి చెందవు. పూర్వం జరిగిన కార్యాలే యిప్పుడూ జరుగుతున్నాయి. నరులు పూర్వం చేసిన పనులే మరల చేస్తున్నారు. లోకంలో క్రొత్త యేమీలేదు. ఇది క్రొత్తది అనే దాన్ని

దేన్నయినా తీసికోండి. అది మనం పుట్టక పూర్వం నుండి వున్నదేనని తెలుస్తుంది. ఆలాగే ఇక జరిగేవాటిని గూడ భావితరాలవారు గుర్తుంచుకోరు - ఉప 1,8-12.

కొన్ని యేండ్లయిన తర్వాత నరునికి వార్ధక్యం వస్తుంది. అపుడు
ఇంతవరకు నిన్ను కాపాడిన చేతులు వణకుతాయి
ఇంతవరకు బలంగావున్న నీ కాళ్ళు కూలబడతాయి
నీ పండ్లు రాలిపోతాయి
నీ కండ్లు వెల్తుర్ని సరిగా చూడలేవు
నీ చెవులు వీధిలో శబ్దాలను సరిగా వినలేవు
తిరుగటిరాయి చేసే శబ్దాలను వినలేవు
సంగీతాన్నీ పక్షుల కూతలను గ్రహించలేవు
అప్పుడు నీవు మెరకను ఎక్కలేవు
అటూయిటూ కదలడంగూడ ప్రమాదకరమే
నీ వెంట్రుకలు నరసి తెల్లనౌతాయి
నీవు కష్టంతోగాని అటూయిటూ కదల్లేవు
నీ యెదలోని కోర్కెలన్నీ సమసిపోతాయి.

అపుడు నరుడు తన శాశ్వత నివాసానికి వెడలిపోతాడు. అతని కొరకు శోకించేవారు వీధిలో అటూయిటూ తిరుగుతారు.

అపుడు వెండి గొలుసు తెగిపోతుంది
బంగారు దీపం క్రిందపడి పగిలిపోతుంది
బావిమీది గిలక విరిగిపోతుంది
నీటికుండ జారిపడి ముక్కలైపోతుంది

నరుని దేహం ఏ మట్టినుండి వచ్చిందో ఆ మట్టిలోనికి తిరిగి పోతుంది. అతని ప్రాణం మొదట దాన్ని దయచేసిన దేవుణ్ణి చేరుకొంటుంది. కనుక అంతా వ్యర్థమే. సర్వం వ్యర్థమేనని ఉపదేశకుడు వాకొంటున్నాడు - ఉప 12, 3-7.

ఏ శక్తీ మనలను మృత్యువునుండి కాపాడలేదు. మనమంతా జనులు చంపడానికి తోలుకొనిపోయే మృగాల్లా చావవలసిందే.

నరుని వైభవాలు అతని ప్రాణాలను కాపాడలేవు
అతడు వధకు గురియైన మృగంలా చావవలసిందే
మృత్యువే నరులకు కాపరియై
వారిని గొర్రెలనువలె పాతాళలోకానికి
తోలుకొనిపోతుంది - కీర్త 49, 12-14.

# 22. మృత్యుస్మరణం

మృత్యువుని ఎవడూ ఇష్టపూర్తిగా అంగీకరింపడు. కాని అందరమూ చావుకి లొంగవలసిందే.

ఓ మృత్యువా! ఆస్తిపాస్తులతో
హాయిగా కాలం గడిపేవానికి,
చీకూచింతా లేకుండ జీవిస్తూ
అన్నిట విజయం సాధించేవానికి,
కడుపునిండా తినగల శక్తికలవానికి,
నిన్ను గూర్చిన తలంపు ఎంత దుఃఖకరమైంది!
నాయనా! నీవు మృత్యుశాసనానికి భయపడనక్కరలేదు
నీ పూర్వులనూ నీ తర్వాతి వారినీ జ్ఞప్తికి తెచ్చుకో
ప్రభువు బ్రతికివున్నవారందరికీ మరణశిక్షవిధించాడు
మహోన్నతుని సంకల్పాన్ని కాదనడానికి నీవెవరివి?
నీవు జీవించేది పదేండ్లయినా, వెయ్యేండ్లయినా
మృత్యులోకంలో ఎవడూ పట్టించుకోడు - సీరా 41, 1-4.

దేవుడు మనలను చావడానికికాక, జీవించడానికే చేసాడు. మృత్యువు ఈ లోకంలో రాజ్యంచేయలేదు. పిశాచం నరుణ్ణిచూచి అసూయచెంది చావుని లోకంలో తెచ్చి పెట్టింది.

మృత్యువుని దేవుడు కలిగింపలేదు
ప్రాణులు చావడంజూచి అతడు సంతసింపడు
అతడు ప్రతి ప్రాణినీ జీవించడానికి సృజించాడు
అతడు చేసిన ప్రాణులన్నీ
ఆరోగ్యంతో అలరారుతున్నాయి
జీవులలో మరణకరమైన విషమేమీలేదు
మృత్యువు ఈ లోకంలో రాజ్యం చేయదు.
దేవుడు నరుణ్ణి అమరునిగా జేసాడు
అతన్ని తనవలె నిత్యునిగా జేసాడు
కాని పిశాచం అసూయ వలన
మృత్యువు లోకంలోనికి ప్రవేశించింది
పిశాచపక్షాన్ని అవలంబించేవారు చావుని

చవిజూస్తారు - సొలోమోను జ్ఞాన 1, 13-14. 2,24-24.
చనిపోయాకగూడ తన మంచిపేరును నిలబెట్టుకొనేవాడే గొప్పవాడు.
నరులు చనిపోయినవారికొరకు విలపిస్తారు
కాని దుష్టుల మరణానంతరం వారి పేరుకూడ మిగలదు
నీ కీర్తిని నిలబెట్టుకో
నీవు చనిపోయాకగూడ నీ మంచిపేరు నిల్చివుంటుంది
అది వేయి సువర్ణ నిధులకంటె ఎక్కువకాలం నిలుస్తుంది
నరుని మంచి జీవితం
కొన్నాళ్ళపాటు మాత్రమే కొనసాగుతుంది
కాని అతని సత్కీర్తి శాశ్వతంగా నిలుస్తుంది - సీరా 41, 12-13.

నరుడు తన మరణాన్ని నిత్యం గుర్తుంచుకోవాలి. ఆలా చేస్తే సులువుగా పాపం కట్టుకోడు.

ఓ దినం నీవు మరణించి తీరుతావని
నీవు చేసే కార్యాలన్నిటిలోను గుర్తుంచుకో
అప్పుడు నీవు ఎన్నడూ పాపం కట్టుకోవు - సీరా 7, 36.

# 23. ప్రభువు కరుణ

ప్రభువు మహాకరుణ కలవాడు. అతడు తాను కలిగించిన ప్రాణులను వేటినీ అసహ్యించుకోడు. అసహ్యించుకొనేవాడైతే వాటిని పుట్టించే వుండడు. ఒకవేళ పుట్టించినా, ఎంతోకాలం ఉనికిలో ఉంచడు. కనుక మనం పుట్టామంటే, ఇంకా బ్రతికి ఉన్నామంటే, మనపట్ల అతనికి యిష్టముందని అర్థం చేసికోవాలి. నాశంలేని దేవుని ప్రాణమే ప్రతిప్రాణిలోను నెలకొని వుంటుంది. ఇవి చాల ఉదాత్తమైన భావాలు.

ప్రభూ! నీ వన్నిటినీ చేయగలవు కనుక
అందరినీ దయతో చూస్తావు
నీవు నరుల తప్పిదాలను ఉపేక్షించి
వారికి పశ్చాత్తాపపడడానికి అవకాశమిస్తావు
ఉనికిలో ఉన్నవాటినన్నిటినీ నీవు ప్రేమిస్తావు
నీవు కలిగించినవాటిని వేటినీ అసహ్యించుకోవు
అసహ్యించుకొనే వాడివైతే వాటిని పుట్టించే వుండవు
నీవు సృజించందే ఏ ప్రాణి వునికిలో వుంటుంది?

నీవు అంగీకరించందే ఏ జీవి మనుతుంది?
అన్ని ప్రాణులూ నీవే గనుక
నీవు ప్రతీ ప్రాణినీ కృపతో జూస్తావు
నీవు బ్రతికివున్న ప్రాణులన్నిటినీ ప్రేమిస్తావు
నాశంలేని నీయాత్మే ప్రతి ప్రాణిలోను నెలకొనివుంది - సొలోమోను జ్ఞాన 11,23- 12,1.

# 2. దుష్టవర్తనం

## 24. మూర్ఖత్వం

ఇంతవరకు మనం నైతిక వర్తనాన్ని గూర్చి పరిశీలించాం. ఇకమీదట ఆ నైతిక వర్తనాన్ని గూర్చి విచారిద్దాం. మొదట మూర్ఖత్వాన్ని గూర్చి చూద్దాం. జ్ఞానానికి వ్యతిరేకమైంది మూర్ఖత్వం.

తోబీతు చెప్పినట్లు బుద్ధిమంతుడు జ్ఞానుల ఉపదేశాన్ని పాటిస్తాడు. "నాయనా! నీవు బుద్ధిమంతుల సలహాను పాటించు. మంచి ఉపదేశాన్ని ఎప్పుడూ పెడచెవిని పెట్టవద్దు" - 4,18. కాని దుష్టుడు ఉపదేశాన్ని వినడు.

మూర్ఖులకు విద్య గరపబూనడం
పగిలిపోయిన కుండపెంకులను అతికించడంలాగ,
గాఢనిద్రలో వున్నవాణ్ణి లేపజూడ్డంలాగ,
వ్యర్థమైన కార్యం
మూర్ఖునికి బోధించడం
నిద్రతో తూలేవానికి బోధించడం లాంటిది
అంతా విన్నాక అతడు నీవేమి చెప్పావని అడుగుతాడు - సీరా 22,7-8.
మందలింపును అంగీకరింపనివాడు
పాపపు త్రోవలో నడుస్తాడు
దైవభీతికలవాడు పరివర్తనం చెందుతాడు
మూర్ఖునికి విజ్ఞానం అర్థంపర్థంలేని మాటలప్రోగు
అది అతనికి కూలిపోయిన యింటిలా వుంటుంది
అజ్ఞానికి ఉపదేశాన్ని ఆర్జించాలంటే

కాలుసేతులకు సంకెళ్ళు పడినట్లుంటుంది - సీరా 2,16. 18-19.

మూర్ఖుడు క్రమశిక్షణకు లొంగడు. అది అతనికి రాతిబండలాగ బరువుగా వుంటుంది.

క్రమశిక్షణకు లొంగనివారికి
విజ్ఞానం కటువుగా వుంటుంది
మూర్ఖుడు దీర్ఘకాలం విజ్ఞానంతో మనలేడు
విజ్ఞానం పెద్ద బండవలె భారంగా కన్పింపగా
అతడు దాన్ని శీఘ్రమే అవతలికి నెట్టివేస్తాడు. - సీరా 6,20-21.

కనుక బాలునికి చిన్ననాటినుండే జ్ఞానాన్ని బోధించాలి.

తగని సమయంలో పిల్లలకు బుద్ధిచెప్పడం
శోకించేవారికి సంగీతం విన్పించడం లాంటిది
కాని పిల్లలను మందలించి క్రమశిక్షణ నేర్పడం
ఎల్లవేళలా మంచిదే
జ్యోతి ఆరిపోయింది కనుక మృతుని కొరకు విలపిస్తాం
వివేకం ఆరిపోయింది కనుక
మూర్ఖుని కొరకు విలపించాలి - సీరా 22, 6-11.

# 25. వాక్పారుష్యం

అన్ని ధర్మగ్రంథాలూ పరుషవాక్కును పరిహరించి మృదువాక్కును అలవర్చుకోమని చెప్తాయి. మొదట నరుడు నోటిని అదుపులో పెట్టుకోవాలి. లేకపోతే తోడిజనులు అతన్ని అసహ్యించుకొంటారు. అసలు అతని మాటలు వినరు.

నోటిని అదుపులో పెట్టుకొనేవాడు
ఆపదలనుండి తప్పించుకొంటాడు
వదరుబోతును జూచి అందరూ దడుస్తారు
నోటికి వచ్చినట్లు వాగుతాడని
ఎల్లరూ వాణ్ణి అసహ్యించుకొంటారు.
మూర్ఖుడు సుభాషితాన్ని పల్కినా ఎవరూ వినరు
అతడు అనుచితమైన కాలంలో దాన్ని పల్కుతాడు - సామె 21, 23. సీరా 9, 18. 20,20.

ఉత్తముడు మృదువాక్కులు పల్కాలి. జీవనమరణాలు కూడ నాలుక అధీనంలోనే వుంటాయి.

మృదువుగా మాట్లాడితే కోపం చల్లారుతుంది
కటువుగా పలికితే ఆగ్రహం హెచ్చుతుంది
కరుణాపూరితంగా మాట్లాడే జిహ్వా జీవవృక్షంలాంటిది
కటువుగా మాట్లాడే నాలుక
హృదయాన్ని వ్రయ్యలు చేస్తుంది
నాలుకనుబట్టే నరుని జీవితముంటుంది
జిహ్వానుబట్టే అతని జీవిత విధానముంటుంది
జీవమూ మరణమూకూడ నాలుక అధీనంలో వున్నాయి
నరుడు దాన్ని ఏలా వాడుకొంటాడో
ఆలాంటి ఫలితాన్నే పొందుతాడు - సామె 15, 1.4. 18,20 -21.

మూర్ఖుడు ఆలోచనలేని పల్కులు పల్కి అపఖ్యాతి తెచ్చుకొంటాడు. వాడి మాటలే వాణ్ణి నాశం చేస్తాయి.

అజ్ఞుడు ఆలోచనలేక నోటికి వచ్చినట్లు వదరుతాడు
జ్ఞాని చక్కగా ఆలోచించిగాని సంభాషించడు
నీ మాటల వలననే నీకు ఖ్యాతి అపఖ్యాతికూడ కలుగుతుంది
నీ నాల్క వలననే నీవు నాశం తెచ్చుకొంటావు - సీరా 21, 26. 5,13.

వాచాలత తప్పులకు దారితీస్తుంది. వదరుబోతు పలుకులు చెత్తలాగ విలువలేనివి.

అతిగా ప్రేలితే తప్పు దొరలక తప్పదు
మౌనం వహించేవాడు వివేకి
పుణ్యపురుషుని పల్కులు మంచి వెండి వంటివి
కాని దుష్టుని భావాలు చెత్తలాంటివి - సామె 10,19-20.

మితభాషణం భూషణం. నోటికి వచ్చినట్లు ప్రేలితే చెడ్డపేరు తెచ్చుకొంటాం.

కొందరు మితంగా మాటలాడ్డంచే జ్ఞానులనబడతారు
కొందరు అమితంగా మాటలాడ్డంచే
చెడ్డపేరు తెచ్చుకొంటారు
ఏమి మాటలాడాలో తెలియక
కొందరు మౌనంగా వుంటారు

ఎప్పుడు మాటలాడాలో తెలిసి
కొందరు మౌనం వహిస్తారు
జ్ఞాని తగిన సమయం లభించేవరకూ మౌనంగా వుంటాడు
కాని గొప్పలు చెప్పకొనే మూర్ఖునికి
ఉచితమైన సమయం తెలియదు
అమితంగా ప్రేలేవాణ్ణి జనం అసహ్యించుకొంటారు
మాటలాడ్డానికి తమకు అవకాశమీయనివాణ్ణి నరులు రోస్తారు - సీరా 20, 5-8.

వదరుబోతుతనం పనికిరాదు. మన సంభాషణం మన శీలాన్ని పట్టియిస్తుంది.
ఊపిన జల్లెడలో మట్టిపెళ్ళలు మిగిలినట్లే
నరుని సంభాషణంలో దోషాలు కన్పిస్తాయి
కుమ్మరి చేసిన కుండకు పరీక్ష ఆవం
అట్లే నరునికి పరీక్ష అతని సంవాదం
చెట్టు కాపునుబట్టి దానికెంత
పరామరిక జరిగిందో ఊహించవచ్చు
అట్లే నరుని మాటలతీరునుబట్టి
అతని శీలాన్ని గుర్తించవచ్చు
నరుని సంభాషణమే అతనికి పరీక్ష
కనుక ఏ నరుణ్ణీ అతడు మాటలాడక ముందు
స్తుతించవద్దు - సీరా 27, 4-7.

వదరుబోతులాగే వదరుబోతు భార్యకూడ నింద్యురాలు. అట్టిదానితో జీవించడమంటే ఆమెతో యుద్ధం చేయడమే.

వదరుబోతు భార్య యుద్ధారంభంలో ఊదే బూరలాంటిది
అట్టి భార్యను పొందినవాడు
పోరుననే జీవితం గడపాలి
తొట్టినుండి నీటిని కారనీయగూడదు
దుష్టురాలైన భార్యను నోటికి వచ్చినట్లు
వాగనీయకూడదు - సీరా 26,27. 25,25.

నాలుక వినాశకారి. లోకంలో కత్తివలన చచ్చినవారికంటె నాలుక వలన చచ్చినవాళ్ళే యెక్కువ.

కొరడాదెబ్బ ఒడలిమీద బొబ్బలు పొక్కిస్తుంది
కాని దుష్టజిహ్వ ఎముకలనుగూడ విరగగొడుతుంది
కత్తివాతబడి చాలమంది చచ్చారు
కాని నాలుకవాతబడి చచ్చినవాళ్లు ఇంకా యెక్కువ
నాలుక ఉపద్రవానికి లొంగనివాడు,
దాని ఆగ్రహానికి గురికానివాడు,
దాని కాడిని మెడమీద పెట్టుకొని మోయనివాడు
దాని గొలుసులచే బంధింపబడనివాడు - ధన్యుడు
నాలుక కాడి యినుప కాడి
దాని గొలుసులు ఇత్తడి గొలుసులు - సీరా 28,17-21.

పొలానికి కంచె వేసినట్లు, పెట్టెకు తాళం వేసినట్లు, బుద్ధిమంతుడు నోటికి గడె వేసికోవాలి.

నీ పొలానికి ముండ్లకంచె వేస్తావు కదా!
నీ ధనాన్ని పెట్టెలోబెట్టి తాళం వేస్తావు కదా!
అట్లే నీ ప్రతి పలుకుని తక్కెడలో బెట్టి తూయి
నీ నోటికి తలుపుపెట్టి గడె బిగించు
నీ నాలుక వలన నీవు నాశమైపోకుండేలా,
నీ పతనాన్ని ఆశించేవాని యెదుట
నీవు వెల్లకిలపడకుండేలా, జాగ్రత్తపడు.
కొందరి మాటలు బాకులవలె గుచ్చుకొంటాయి
కాని బుద్ధిమంతుల పలుకులు మందులా మేలు చేస్తాయి
- సీరా 28,17-21. 24-26. సామె 12,8.

కొందరికి చాడీలు చెప్పే దుర్గుణం వుంటుంది. కాని దీనివలన అవమానం తెచ్చుకొంటాం. బుద్ధిమంతుడు అసలు కొండాలు చెప్పకూడదు.

నీవు చాడీలు చెప్పడంలో దిట్ట వనిపించుకోవద్దు
నీ నాలుకతో ఉచ్చులు పన్నవద్దు
చోరులు అవమానానికి గురైనట్లే

అసత్యవాదులు తీవ్రనిందకు పాత్రులౌతారు.
నీ పొరుగువానిమీద చాడీలు చెప్పాలి అనుకోకు
నీ మిత్రునిమీద కొండాలు తలపెట్టకు
అసలు కొండాలు చెప్పవద్దు
వాటివలన ఏ ప్రయోజనమూ కలుగదు - సీరా 5,14. 7,12-13.

మనం విన్న రహస్యాలను దాచాలి. మూర్ఖులు రహస్యాన్ని దాచలేక ప్రసవవేదనపడే స్త్రీలాగా బాధపడతారు. రహస్యాన్ని దాచితే పొట్ట పిగిలిపోదు కదా!

నీవు విన్న సంగతిని ఇతరులకు చెప్పవద్దు
ఇతరులకు చెప్పకుండడం పాపహేతువైతేనేతప్ప
మిత్రులకుగాని శత్రువులకుగాని దాన్ని చెప్పవద్దు
నీ నుండి ఆ వర్తమానాన్ని విన్నవాడు నిన్ను శంకిస్తాడు
అటుపిమ్మట నిన్ను ద్వేషిస్తాడు కూడ
నీ వేదైన సంగతి వింటే
దాన్ని నీతోనే సమసిపోనీయి
భయపడకు, దానివలన నీ కడుపు పిగిలిపోదు!
మూర్ఖుడు తాను విన్న రహస్యాన్ని దాచలేక
ప్రసవవేదనను అనుభవించే స్త్రీలా బాధపడతాడు
తొడలో దిగబడిన బాణమెట్లో
మూర్ఖుని యెదలోవున్న రహస్యవార్తలట్లు
రహస్యాలను వెలిబుచ్చేవాడు నమ్మదగనివాడు
అతనికి ఆప్తమిత్రులు దొరకరు
నీ స్నేహితుని ప్రేమించి విశ్వసనీయుడివిగా మెలుగు
అతని రహస్యాలను వెల్లడిచేసావంటే
ఇక అతన్ని వదలుకోవలసిందే - సీరా 19,8-12. 27,16-17.

ఇతరులు చెప్పేది వినాలి. మధ్యలో అతని మాటలకు అడ్డురాగూడదు.
ఇతరులు చెప్పేది విన్నపిదపగాని జవాబు చెప్పవద్దు
మాటలాడేవానికి మధ్యలో అడ్డురావద్దు -సీరా 11,8.

ఇతరులమీద అపనిందలు మోపకూడదు. అలా మోపేవాళ్లు వ్యక్తులనూ కుటుంబాలనూకూడ నాశం చేస్తారు.

కల్లలాడేవాళ్లూ అపనిందలు పుట్టించేవాళ్లూ శాపగ్రస్తులు
అలాంటివాళ్ళు శాంతియుతంగా జీవించేవాళ్ళను నాశం జేస్తారు
అపదూరులు మోపేవాళ్లు చాలమందిని నాశంజేసి
తావునుండి తావుకు తరిమికొట్టారు
ఆ దుష్టులు బలమైన పట్టణాలను కూల్చివేసారు
ప్రముఖుల గృహాలను కూలద్రోసారు
ఇంకా వాళ్లు యోగ్యురాళ్ళయిన యిల్లాళ్ళకు
విడాకు లిప్పించి వారి కష్టార్జితాన్ని అపహరించారు
అపదూరులు మోపేవాని మాటలు నమ్మేవాడు
శాంతినీ విశ్రాంతినీగూడ కోల్పోతాడు - సీరా 28,13-16.

కొంతమంది సులభంగా దేవుని పేరుమీదిగా వొట్టుపెట్టుకొంటారు. ప్రభువు నామాన్ని అంత తేలికగా ఉచ్చరించ కూడదు.

నీవు వట్టు పెట్టుకోవద్దు
పరిశుద్ధుడైన ప్రభువు నామాన్ని
తేలికగా ఉచ్చరించవద్దు - సీరా 23,9.

అన్యులనుగూర్చి మనం వినే చెడ్డ వార్తలన్నీ నమ్మకూడదు. అసలు వాళ్ళు పాడుపని చేయకుండానే వుండవచ్చు.

నీ మిత్రుడు ఏదో పాడుపని చేశాడని వార్త పుడితే
అతన్నే అడుగు, అతడాలాంటి పనిచేసివుండకపోవచ్చు
ఒకవేళ చేసినా మళ్ళా దాన్ని చేయడు,
నీ ప్రక్కవాడేదో పాడుమాట చెప్పాడని వార్తపుడితే
అతన్నే అడుగు, అతడామాట చెప్పివుండకపోవచ్చు
ఒకవేళ చెప్పినా మళ్ళా ఆ మాట చెప్పడు,
నీ మిత్రునిగూర్చి యేదో వదంతి పుడితే
అతన్నే అడుగు, అది వట్టి అపనింద కావచ్చు
మనం విన్నదాన్నెల్ల నమ్మకూడదు
ఒక్కోసారి నరునికి నోరు జారవచ్చు
కాని అతడా మాటను
ఉద్దేశపూర్వకంగా అని వుండక పోవచ్చు - సీరా 19, 13-16.

పైన మనం మాటలద్వారా చేసే తప్పులను చాలచూచాం. ఏ నరుడూ తన నాల్కను పూర్తిగా అదుపులో పెట్టుకోలేదు. కనుక నోరు జారకుండావుండే వరప్రసాదం దయచేయమని మనం దేవుణ్ణి వేడుకోవాలి.

నా నోటికి ఎవరైన కావలి వుండి
విజ్ఞతతో నా పెదవులను మూయిస్తే ఎంత బాగుంటుంది!
అప్పుడు నేను తప్పులు చేయను
నా జిహ్వా నన్ను నాశం చేయదు.
నాకు తండ్రివీ నా జీవానికి కర్తవూ ఐన ప్రభూ!
నేను నా జిహ్వాకు లోపడకుండా వుండేలానూ,
నా నాలుక నన్ను నాశంచేయకుండా వుండేలానూ, అనుగ్రహించు - సీరా 27,27. 23,1.

# 26. ప్రేమలేని జీవితం వ్యర్థం

మనకు బడుగువర్గాలమీద ప్రేమ వుండాలి. బిచ్చగాడు దానం చేయమని అడిగితే మొగం ప్రక్కకు త్రిప్పుకోకూడదు. అప్పుడతడు మనలను శపించవచ్చు. పిసినిగొట్టయిన వాడు తాను తినడు, ఇతరులకు పెట్టడు. లోభివాని ఆశకు అంతంలేదు. ప్రియవాక్కులతో దానం చేయాలే గాని తిడుతూ ఈయకూడదు.

బిచ్చగాడు యాచిస్తే నిరాకరింపకు
పేదవానినుండి మొగం ప్రక్కకు తిప్పుకోకు
దరిద్రునినుండి చూపు మరల్చకు
అతడు నిన్ను శపించకుండా వుండేలా చూచుకో
హృదయవేదన భరించలేక ఆ పేదవాడు నిన్ను శపిస్తే
ప్రభువు అతని మొర ఆలిస్తాడు
పిసినిగొట్టుకి సిరిసంపదలు తగవు
లోభికి ధనంతో ఏమి ప్రయోజనం?
తాననుభవింపక సొమ్ము కూడబెట్టేవాడు
ఇతరుల కొరకే కూడబెడుతున్నాడు
అతని సొత్తుతో ఇతరులు హాయిగా బ్రతుకుతారు
తనకొరకు తాను ఖర్చుజేసికోనివానికంటె
నికృష్టుడు లేదు
పిసినిగొట్టుతనం తన శిక్షను తానే తెచ్చుకొంటుంది
లోభియైన నరుడు దుష్టుడు
అక్కరలో వున్నవారిని ఆదుకొనడు

అతడు తనకున్నదానితో తృప్తిజెందడు
దురాశ వలన అతని హృదయం కుదించుకపోతుంది
నాయనా! నీవు దానం చేసేపుడు
నిందావాక్యాలు పలుకవద్దు
ఇతరులకు ఇచ్చేపుడు మనసు నొప్పించవద్దు
మంచు కురిసినప్పుడు
ఎండ వేడిమి సమసిపోతుంది కదా!
నీవిచ్చే వస్తువులకంటెగూడ నీ మాటలు ముఖ్యం
కరుణామయ వాక్యాలు
ప్రశస్త దానంకంటె శ్రేష్ఠమైనవి
కాని ఉదార స్వభావుడు ఆ రెండిటినీ యిస్తాడు - సీరా 4,4-6. 13,3-4. 6-9. 18,15-17.

# 27. కొన్ని దుర్గుణాలు

మన జీవితంలో చిన్నచిన్న దుర్గుణాలు చాలవుంటాయి. వాటిని గూడ సవరించుకోవాలి. మనం వెలుపలి డాబును లెక్కచేయకూడదు. అనుచితమైన కోపం పనికిరాదు. పేదవాణ్ణి పీడించి అవమానిస్తే అతన్ని చేసిన దేవుణ్ణే అవమానించినట్లు.

అందంగా వున్నందువలన ఎవరినీ మెచ్చుకోకు
అందంగా లేనందువలన ఎవరినీ నిరాకరింపకు
రెక్కలతో ఎగిరే జీవుల్లో తేనెటీగ చాల చిన్నది
కాని దాని తేనె మహామధురంగా వుంటుంది
నీ నాణెమైన దుస్తులను జూచుకొని మురిసిపోవద్దు
గౌరవం అబ్బినపుడు పొగరుబోతువి కావద్దు.
అనుచితమైన కోపం తగదు
అది కోపిష్టినే నాశం చేస్తుంది
సహనవంతుడు తగిన సమయం కొరకు
ఓపికతో వేచివుంటాడు
కడన అతడు సంతోషం చెందుతాడు.
దేవుడు నరులు కోపించాలని కోరుకోడు
కనుక నరులు ఉగ్రులు కాకూడదు

విచారం వలన నరుడు
ప్రాయం రాకముందే ముసలివా డౌతాడు
అసూయ కోపం ఆయుస్సుని తగ్గిస్తాయి
అన్యునిపై కోపంతో మండిపడ్డం కంటె
అతన్ని మందలించడం మెరుగు.
పేదవాణ్ణి పీడించేవాడు
అతన్ని కలిగించిన సృష్టికర్తను అవమానిస్తాడు
దరిద్రుని గౌరవించేవాడు దేవుణ్ణి గౌరవిస్తాడు
పేదవాణ్ణి గేలిచేస్తే
అతన్ని సృజించిన దేవుణ్ణి గేలిచేసినట్లే.
– సీరా 11,24. 1,22–23. 10,8. 30,24. 20,2. సామె 14,31. 17,5.

# 28. పగను అణచుకోవాలి

పగ పాముపిషం లాంటిది. కనుక సజ్జనుడు దాన్ని అణచుకోవాలి. మనం పరుల తప్పులను మన్నించకపోతే దేవుడు తన తప్పులను మన్నించడు. ద్వేషం వలన తగాదాలూ, ప్రేమవలన క్షమాపణ సిద్ధిస్తాయి.

అపకారాలన్నిటిలోను
శత్రువు చేసే అపకారం గొప్పది
ప్రతీకారాలన్నిటిలోను
పగవాని ప్రతీకారం ఘోరమైంది
పాము విషాన్ని మించిన విషం లేదు
పగతుని కోపాన్ని మించిన కోపం లేదు
ప్రభువు నరుని పాపాలన్నీ గమనిస్తాడు
పగతీర్చుకొనే నరునిమీద తాను పగతీర్చుకొంటాడు
నీవు తోడినరుని అపరాధాలను మన్నిస్తే
నీవు మొరపెట్టినపుడు
దేవుడు నీ యపరాధాలను మన్నిస్తాడు
నీవుతోడి నరునిమీద కోపంగా వుంటే
నిన్ను క్షమించమని భగవంతుణ్ణి ఏలా అడుగుతావు?
తోడి నరుని మన్నింపనివాడు
తన తప్పిదాలను మన్నింపమని
దేవుణ్ణి ఏలా వేడుకొంటాడు?

నరమాత్రులైనవారు కోపాన్ని అణచుకోలేకపోతే
ఇక అతనితప్పిదాలను ఎవడు మన్నిస్తాడు?
ద్వేషం తగాదాలను కొనివస్తుంది
కాని ప్రేమ అపరాధాలను కప్పి పెడుతుంది - సీరా 25, 14-15. 28,1-5. సామె 10,12.

# 29. దురాశ తగదు

కొందరికి డబ్బే ఉరౌతుంది. పాపమార్గాన ధనం కూడబెట్టని ధనికుడు ధన్యుడు.

ధనాశ కలవాడు సత్పురుషుడు కాలేడు
డబ్బు చేసికోగోరేవాడు పాపం కట్టుకొంటాడు
డబ్బువలన చాలమంది నాశమయ్యారు
ధనంవలన వారు వినాశానికి చిక్కారు
ధనం వలన సమ్మోహితుడయ్యేవాడికి అది ఉరౌతుంది
మూర్ఖులు ఆ ఉరిలో తగులుకొంటారు
పాపమార్గాన డబ్బు కూడబెట్టనివాడూ,
నిర్దోషీ ఐన ధనికుడు ధన్యుడు
అలాంటివాడు దొరికితే అతన్ని అభినందించాలి
అతడు ధనికులెవ్వరూ చేయలేని అద్భుతాన్ని చేసాడు
ఈ పరీక్షలో నెగ్గినవాడు నిక్కంగా గర్వించవచ్చు
పాపం చేయగలిగీ చేయనివాడూ,
పరుని మోసగింపగలిగీ మోసగించనివాడూ,
ఎవడైనా వుంటాడా? - సీరా 31, 5-10.

# 30. నిజాయితీ లేకపోవడం

కొందరు దొంగలాభాలకు పాల్పడతారు. మరి కొందరు దొంగతూకాలకు పూనుకొంటారు. దేవుడు వాళ్ళను అసహ్యించుకొంటాడు. వేరుకొందరు గట్టురాళ్ళను పీకివేస్తారు. ఇంకా కొందరు లంచాలు పుచ్చుకొంటారు. అది అన్నిటినీ సాధించి పెడుతుంది. వేరుకొందరు ముష్టికి కూడ పాల్పడతారు. దానివలన గౌరవమర్యాదలు నశిస్తాయి.

వర్తకుడు దుష్కార్యం చేయకుండ వుండలేడు
ప్రతివ్యాపారి పాపానికి పాల్పడతాడు
లాభాన్ని గణించాలన్న పేరాసతో
చాలమంది పాపంజేసారు
ధనికుడు కాగోరేవాడు కండ్లు మూసికోవాలి
బిగించిన రెండు రాళ్ళ మధ్య
మేకు ఇరుకుకొని వున్నట్లే
క్రయవిక్రయాల నడుమ
అన్యాయం దాగుకొని వుంటుంది
నరుడు దైవభీతికి లొంగకపోతే
వాని యిల్లు వానిమీదనే కూలిపడుతుంది.
తప్పుడు తూనికలను ప్రభువు అసహ్యించుకొంటాడు
నిండు తూనికలవలన అతడు ప్రమోదం చెందుతాడు
పూర్వులు పాతించిన గట్టురాళ్ళను కదిలించకు
అనాథుల పొలాలను ఆక్రమించుకోకు.
లంచాలు అన్యాయాలు అడుగంటిపోతాయి
ధర్మం మాత్రమే నిలుస్తుంది
లంచం మంత్రంలాగ పనిచేస్తుంది
అది సాధించిపెట్టని కార్యంలేదు.
కుమారా! నీవు ముష్టి యెత్తుకొని బ్రతకవద్దు
తిరిపెంకంటె చావు మేలు
కూటికోసం ఇతరులమీద ఆధారపడేవాడి జీవితం
అసలు జీవితమే కాదు
అన్యుల కూడు తినేవాడు
తన్నుతాను మైలపరచుకొంటాడు
గౌరవమర్యాదలు కలవాడు ఆ పనికి పాల్పడడు
సిగ్గుసెరం లేనివాడు
బిచ్చమెత్తుకోవడం మంచిదే అంటాడు
కాని తిరిపెం అతని కడుపుకి చిచ్చుపెడుతుంది.

– సీరా 26,29. 27,1-3. సామె 11,1. 23,10. సీరా 40,12. సామె 17,8. సీరా 40, 28-31.

# 31. సోమరితనం

సోమరితనం చాలమందిని ఆవహిస్తుంది. కొందరికి మాటలెక్కువ, చేతలు తక్కువ. సోమరిపోతు చీమలను జూచి బుద్ధి తెచ్చుకోవాలి. పై అధికారి తనిఖీ చేయకపోయినా అవి నిరంతరం కష్టపడి పనిచేస్తుంటాయి. పని చేయనివాడు వినాశానికి తమ్ముడౌతాడు. వాడు బయట సింహముంది, కనుక నేను వీధిలోకి పోను అంటాడు. సోమరిపోతు పొలం పండదు. వాడు కంచంలోని అన్నాన్ని పైకెత్తి నోటిలో పెట్టుకోవడమనే చిన్నపని చేయడానికి గూడ ఇష్టపడదు.

మాటలలో దిట్టతనం జూపి
క్రియలో సోమరితనం జాప్యంచూపడం పనికిరాదు
ప్రగల్భాలు పల్కుతూ ఆకటితో చావడంకంటె
కష్టపడి పనిచేసి
నిండుగా తిండి సంపాదించుకోవడం మేలు.
సోమరీ! చీమలను జూడు
వాటి జీవితాన్ని జూచి బుద్ధి తెచ్చుకో
వాటికి నాయకుడు లేడు,
పర్యవేక్షకుడు లేడు, అధికారి లేడు
ఐనా అవి వేసవిలో ఆహారం చేకూర్చుకొంటాయి
కోతకాలంలో ధాన్యం చేకూర్చుకొంటాయి
సోమరీ! నీ వెంతకాలం పండుకొంటావు?
ఎప్పుడు నిద్రమేల్కొంటావు?
ఇంకా కొంచెంసేపు కన్నుమూసి
కొంచెం నిద్రించి
కొంచెం చేతులు ముడిచి
విశ్రాంతి తీసుకోగోరుతావు కాబోలు
కాని యింతలోనే దారిద్ర్యం
దోపిడికానివలె నీ మీదికి వస్తుంది
పేదరికం ఆయుధహస్తునివలె
నీ మీదికి ఎత్తివస్తుంది.
పనిచేయని సోమరిపోతు

వినాశమూర్తికి సాక్షాత్తు సోదరుడు.
బయట సింహముంది, అది నన్ను వీధిలో చంపుతుంది
అని సోమరిపోతు ఇల్లు కదలడు.
సోమరిపోతూ మూర్ఖుడూ ఐన ఓ నరుని
పొలం ప్రక్కగాను, ద్రాక్షతోట ప్రక్కగాను,
నేను నడచిపోయాను
ఆ పొలం నిండ ముండ్లు కలుపు ఎదిగి వున్నాయి
దాని చుట్టూరా వున్న రాతిగోడ కూలిపోయింది
నేనా పొలాన్ని జూచి ఆలోచించడం మొదలెట్టాను
ఆ చేనివైపు చూడగా నాకీ గుణపాఠం తట్టింది
కొంచెంసేపు నిద్రించు,
కొంచెంసేపు కునికిపాట్లు పడు,
కొంచెంసేపు చేతులు ముడుచుకొని విశ్రాంతి తీసికో
ఈ మధ్యలో దారిద్ర్యం దొంగలాగానూ
సాయుధుడైన దోపిడికానిలాగానూ వచ్చి
నీమీద పడుతుంది.
తలుపు బందుమీద తిరిగినట్లే
సోమరిపోతు పడకమీద దొర్లుతాడు
అతడు కంచంలో చేయి పెడతాడు కాని
అన్నం ఎత్తి నోట బెట్టుకోవడం కష్టమనుకొంటాడు
– సీరా 4,29. 10,27. సామె 6,6–11. 18,9. 22,13. 24, 30–34. 26, 14–15.

## 32. త్రాగుబోతుతనం

మద్యపానం గర్హింపదగింది. ఇనుముకి పరీక్ష కొలిమి. త్రాగి వాదులాడే వాడికి పరీక్ష వాడు త్రాగిన మద్యమే. మితంగా సేవిస్తే మధువు హానిచేయదు. కాని మితంమీరి త్రాగితే అది యెంతో కీడు చేస్తుంది. మద్యం పాములాగ కరుస్తుంది. పిచ్చి పుట్టిస్తుంది. కనుక బుద్ధిమంతుడు దాన్ని మితంమీరి త్రాగడు.

నీ గొప్పను నిరూపించుకోవడానికి
అమితంగా త్రాగకు
మధువు వలన చాలమంది నాశమయ్యారు

ఇనుం మనికికి పరీక్ష కొలిమి
త్రాగి వాదులాడే గర్వాత్ములకు పరీక్ష ద్రాక్షరసం
మితంగా సేవిస్తే ద్రాక్షారసం నరునికి నూత్నజీవాన్నిస్తుంది
మధువు లేకపోతే జీవితానికి విలువలేదు
నరుల ఆనందం కొరకే అది కలిగింపబడింది
తగిన కాలాన తగినంతగా సేవిస్తే
ద్రాక్షసవం ఆనందోల్లాసాలను చేకూరుస్తుంది
కాని మితంమీరి త్రాగితే అది
ద్వేషం కలహం పతనం తెచ్చి పెడుతుంది
త్రాగి మత్తెక్కివున్న మూర్ఖుడు
కోపంతో తనకు తానే కీడు చేసికొంటాడు
అతడు బలాన్ని కోల్పోతాడు, కొట్లాటకు దిగుతాడు.
పానపాత్రంలో ఎర్రగా నిగనిగలాడేదైనా,
సులువుగా గొంతులోకి దిగజారేదైనా
నీవు మద్యానికి భ్రమసిపోవద్దు
అంతా అయిన తర్వాత అది పాములా కరుస్తుంది
విషనాగంలా కాటువేస్తుంది
నీ కంటికి వింతదృశ్యాలు కన్పిస్తాయి
నీవు పిచ్చిమాటలు పల్కుతావు
నీకు సముద్రపు అలలమీద ఉయ్యాలలూగినట్లుగా,
ఓడమీది తెరచాప కొయ్యమీద
తూలియాడినట్లుగా తోస్తుంది - సీరా 31, 25-20. సామె 23,30-34.

తోబీతు కూడ తన కుమారుడు తోబియాకు "నీవు ద్రాక్షసారాయాన్ని తప్పత్రాగి మత్తుడివి కావద్దు. త్రాగుడు అనే వ్యసనానికి లొంగిపోవద్దు" అని హితవు చెప్పాడు - 4,15.

# 33. తిండిపోతుతనం

విందులు ఆరగించేపుడు జాగ్రత్తగా మెలగాలి. చాల మందికి కడుపు నిండినా కండ్లు నిండవు. ప్రక్కవారిని త్రోసుకొంటూ బోయి మనకు కావలసిన ఆహారపదార్థాలను తెచ్చుకోగూడదు. తిండిమీధి కోర్కెను కాస్త అదుపులో పెట్టుకోవాలి. ఆత్రంతో తినకూడదు. పంక్తినుండి అందరికంటె ముందులేస్తే మర్యాదగా వుంటుంది. మితంగా భుజిస్తే చక్కగా

నిద్రపడుతుంది. లేకపోతే ఎరక్కతిని అరక్క చావవలసి వస్తుంది. భోజనప్రీతివల్ల చాలమంది చచ్చారు. ఎప్పుడుగూడ ఎవరికి గిట్టే ఆహారమే వాళ్ళు తినాలి.

విందును ఆరగించడానికి కూర్చున్నపుడు
నోరు విప్పి చూడకు
ఇక్కడ ఎన్ని భోజనపదార్థాలున్నాయని
ఆశ్చర్యవచనాలు పల్కకు
దృష్టిదోషం చెడ్డదని తెలిసికో
సృష్టిలో కంటికంటె పేరాసకలది యేదీలేదు
కనుకనే అది మాటిమాటికి నీరు కార్చుతూంటుంది
నీ కంటికి కన్పించిన పదార్థాలన్నీ తీసికోవద్దు
వాటిని తీసికొనేప్పుడు తోడివారిని ప్రక్కకు త్రోయవద్దు
ఇతరుల కోరికలు నీ కోరికలవంటివే
కనుక ఇతరులను అర్థంచేసికొని ఆదరంతో మెలగు
నీకు వడ్డించిన భోజనాన్ని మర్యాదగా తిను
ఆత్రంతో తింటే యెల్లరికీ రోతపుట్టిస్తావు
భోజనంచేసి ముగించేవారిలో
నీవు మొదటివాడవైతే మర్యాదగా వుంటుంది
మితిమీరి తింటే జనులు నిన్ను మెచ్చరు
పదిమందితో కలసి భుజించేపుడు
అందరికంటె ముందుగా నీవు పదార్థాలు తీసికోవద్దు
మర్యాద తెలిసినవాడు స్వల్పంగా భుజిస్తాడు
కొద్దిగా తింటే నిద్రించేపుడు ఆయాసపడనక్కరలేదు
మితభోజనం వలన బాగుగా నిద్రపడుతుంది
వేకువనే ఉత్సాహంతో మేల్కొనవచ్చు
మితంమీరి తింటే కడుపునొప్పి
నిద్రపట్టకపోవడం దాపురిస్తాయి
కుమారా! ఈ జీవితయాత్రలో
నిన్ను నీవు పరీక్షించి చూచుకొంటూండు
నీకు గిట్టని భోజనపదార్థాలు తినకు
ప్రతిభోజనం ప్రతివానికీ సరిపడదు

అందరికి అదేరకపు అన్నం రుచించదు
విశిష్టాన్నాలమీద మక్కువ వదులుకో
ఎట్టి భోజనాన్నయినా మితంమీరి తినకు
అమితంగా తింటే రోగం వస్తుంది
భోజనప్రియత్వంవలన పిత్తం ముదురుతుంది
భోజనప్రీతి వలన చాలమంది చచ్చారు
కావున ఈ విషయంలో జాగ్రత్తగా వుండి
నీ ఆయుస్సును పెంచుకో
– సీరా 31, 12–20. 37, 27–31.

# 34. కలహాలు

సులభంగా తగాదాలకు దిగకూడదు. ఇతరుల మధ్య పోట్లాట పెట్టకూడదు. మొండివాడికి తగాదా లెక్కువ. కలహాలకు దూరంగా వుండేవాడు గొప్పవాడు. కట్టెలు మంటలను పెంచినట్లు కొండెగాళ్ళు కలహాలు పెంచుతారు. కనుక వాళ్ళను దూరంగా వుంచాలి.

కలహాలు పరిహరిస్తే నీ పాపాలు తగ్గుతాయి
దుష్టుడు స్నేహితులమధ్య తగాదాలుపెట్టి
కలసివున్నవారిని విడదీస్తాడు
కట్టె కొలది మంటలు
మొండితనం కొలది కలహాలు
నరుడు బలవంతుడూ ధనవంతుడూ ఐనకొలది
అతని కోపం రెచ్చిపోతుంది
దిడీలున పుట్టుకవచ్చిన కలహం ఉద్రేకాన్ని పెంచుతుంది.
త్వరపడి కలహించేవాళ్లు రక్తపాతానికి ఒడిగడతారు
నిప్పురవ్వమీద ఊదితే మంటలేస్తుంది
దానిమీద ఉమ్మివేస్తే అది ఆరిపోతుంది
ఈ రెండు క్రియలను మన నోటితోనే చేస్తాం
గర్వాత్ముల కలహాలు హత్యకు దారితీస్తాయి
వారి దూషణభాషణలను మనం వినలేం
అల్పుడు ఎవడైనా జగడాలు ఆడగలడు

తగాదాలకు దూరంగా వుండేవాడే ఘనుడు
కట్టెలు లేకపోతే మంటలు ఆరిపోతాయి
కొండెగాడు లేకపోతే కలహాలు అంతరిస్తాయి
నిప్పులకు బొగ్గులు, మంటలకు కట్టెలు,
జగడాలకు కలహప్రియుడు, అవసరం - సీరా 28, 8-12. 27,15. సామె 20,2. 26,20-21.

## 35. వ్యభిచారం

నరుల్లో కామాగ్ని ఎప్పుడూ కొలిమిలా మండుతూనే వుంటుంది. వ్యభిచారి నరుల కన్నుగప్ప జూస్తాడు. కాని దేవుని కన్ను కప్పలేడు. సూర్యునికంటె కాంతిమంతమైన నేత్రాలుకల దేవుడు పాపి పాపాలన్నీ గమనిస్తాడు. కనుక అతనికి శిక్ష తప్పదు.

కొలిమిలా మండే కామాగ్నిని ఎవరూ చల్లార్చలేరు
అది తన్నుతాను కాల్చివేసికొని ఆరిపోవలసిందే
కామవాంఛను తీర్చుకోడానికి జీవించే నరుని
కడన ఆ కామాగ్నే కాల్చి వేస్తుంది
ఆలాంటివాడు ప్రతిస్త్రీని కామిస్తాడు
ఆ దుష్టుడు జీవించి వున్నంతకాలం
అతని కామవాంఛ తీరదు
వివాహధర్మాన్ని మీరి వ్యభిచారానికి పాల్పడేవాడు
నన్నెవరు చూస్తారు?
ఇది చీకటివేళ, గోడలు అడ్డంగా వున్నాయి
ఎవరు నన్ను గమనించరు, నాకు భయమెందుకు?
మహోన్నతుడైన ప్రభువు నా దోషాలను పట్టించుకోడు అని అనుకొంటాడు
నరులు తన్ను చూస్తారేమో అనే అతని భయం
కాని ప్రభువు నేత్రాలు సూర్యునికంటె
పదివేలరెట్లు కాంతిమంతంగా వుంటాయనీ
అవి మనం చేసే ప్రతికార్యాన్నీ,
మన రహస్యాలన్నీ గమనిస్తాయనీ అతడెరుగడు
కనుక ఆ పాపి తానూహింపనప్పుడు పట్టువడి
బహిరంగంగా శిక్షను అనుభవిస్తాడు - సీరా 23, 16-21.

మగవాడు స్త్రీల విషయంలో జాగ్రత్తగా వుండాలి. అతనికి పరస్త్రీ సాంగత్యం తగదు. త్రోవలో అందగత్తె యెదురుపడితే అతడు తన చూపులను ప్రక్కకు త్రిప్పుకోవాలి. లేకపోతే స్త్రీ సౌందర్యం అతనిలో ఉద్రేకజ్వాలలను రగుల్కొల్పుతుంది.

నీవు అనురాగంతో జూచుకొనే భార్యను శంకించకు
శంకిస్తే, ఆమెను నీకు కీడుచేయ ప్రోత్సహించినట్లే
ఏ స్త్రీకి మనసిచ్చి దాసుడివి కావద్దు
పరకాంత సాంగత్యం పనికిరాదు
నీవు ఆమె వలలో చిక్కుకొంటావు
పాటకత్తెతో చెలిమి వద్దు
ఆమె నిన్ను బుట్టలో వేసికొంటుంది
కన్యవైపు వెర్రిగా జూడవద్దు
ఆమెకు నష్టపరిహారం చెల్లించవలసి వస్తుంది
వేశ్యకు హృదయం అర్పింపకు
నీ ఆస్తి అంతా గుల్లవుతుంది
నగర వీధుల్లో నడచేపుడు
నలువైపుల తేరిపారజూడవద్దు
నరసంచారంలేని తావుల్లోకి పోవద్దు
అందగత్తె ఎదురుపడినపుడు
నీ చూపులను ప్రక్కకు త్రిప్పుకో
పరకాంత సౌందర్యంమీదికి మనసు పోనీయకు
స్త్రీసౌందర్యం వలన చాలమంది తప్పుత్రోవపట్టారు
అది అగ్నిలా జ్వాలలను రగుల్కొల్పుతుంది
పరకాంత సరసన కూర్చుండి భోజనం చేయకు
ఆమెతో కలసి పానీయం సేవించకు
నీవు ఆమె ఆకర్షణకు లొంగిపోయి
ఉద్రేకానికి గురై స్వీయనాశం తెచ్చుకోవచ్చు – సీరా 9,1-19.

పురుషుడు మంచి పిల్లను పెండ్లిచేసుకొని ఆమెను కూడి సక్రమమైన సంతానాన్ని కనాలి. అతనికి వేశ్యాసాంగత్యం పనికిరాదు. మామూలుగా మంచివాడికి మంచి భార్యా, చెడ్డవాడికి చెడ్డభార్యా దొరుకుతారు.

నాయనా! నీవు యువకుడివిగా వున్నప్పుడు
నీ యారోగ్యాన్ని కాపాడుకో
అన్యకాంతలనుగూడి నీ బలాన్ని వమ్ముజేసికోకు
దేశంలో సారవంతమైన క్షేత్రాన్ని వెదకి
దానిలో నీ సొంత బీజాలను వెదజల్లు
నీ మంచి విత్తనాలను నీవు నమ్మాలి
అప్పుడు నీ బిడ్డలు
తాము మంచికుటుంబంలో పుట్టామని నమ్మి
పెరిగి పెద్దవారై వృద్ధిలోకి వస్తారు
ఉంపుడుకత్తె ఉమ్మివలె హేయమైంది
వ్యభిచారిణియైన భార్య తన ప్రియులకు చావు తెస్తుంది
దుర్మార్గునికి అతనికి తగినట్లే
భక్తిహీనురాలైన భార్య లభిస్తుంది
దైవభీతికల నరునికి భక్తిగల భార్య దొరుకుతుంది
సిగ్గుమాలిన భార్య తనకు తానే
అవమానం తెచ్చుకొంటుంది
కాని శీలవతియైన భార్య
తన భర్త యెదుటకూడ సిగ్గుపడుతుంది - సీరా 26, 19-24.

పురుషుడు స్త్రీ సౌందర్యాన్ని చూచి మతి పోగొట్టుకో గూడదు. తొలి పాపానికి స్త్రీయే కారణం. ఆ పాపంవల్లనే నరజాతికి చావు ప్రాప్తించింది.

స్త్రీ సౌందర్యానికి బ్రమసిపోవద్దు
అతివను జూచి మతి కోల్పోవద్దు
దుష్టురాలైన భార్యవలన భర్తకు
విషాదమూ విచారమూ హృదయవేదనా కలుగుతాయి
పాపం స్త్రీతోనే ప్రారంభమైంది
ఆమె మూలాన మనమందరం చావవలసి వచ్చింది. - సీరా 25,21-24.

పరస్త్రీ సాంగత్యం మొదట తేనెలా తీయగా వుంటుంది. అటుతర్వాత విషముష్టిలా చేదుగా వుంటుంది. ఆమె తన వెంటబోయేవాణ్ణి మృత లోకానికి గొనిపోతుంది. రంకులాడి దగ్గరికి వెళ్ళేవాడు ఆస్తి, గౌరవం, చివరకు ప్రాణాలు కూడ పోగొట్టుకుంటాడు. పురుషుడు సొంత భార్యతో సుఖమనుభవించాలికాని పరస్త్రీతో కాదు.

పరస్త్రీ పెదవులు తేనెలు ఒలుకుతుంటాయి
ఆమె మాటలు ఓలివు తైలంలా మృదువుగా వుంటాయి
కాని కడన ఆమె విషముష్టివలె చేదుగొల్పుతుంది
రెండంచుల కత్తిలాగ బాధ గొనితెస్తుంది
ఆ వనిత నిన్ను మృత్యులోకానికి చేర్చుతుంది
ఆమె నడచిన మార్గం పాతాళానికి పోతుంది
రంకులాడికి సాధ్యమైనంత దూరంగా వుండు
ఆమె యింటి గుమ్మంకూడ తొక్కవద్దు
ఈ యాజ్ఞ మీరితే నీ గౌరవాన్ని కోల్పోతావు
క్రూరులకు జిక్కి అకాలమృత్యువు వాతబడతావు
పరులు నీ సొత్తును స్వాధీనం చేసికొంటారు
నీవు శ్రమజేసి సంపాదించింది అన్యులపాలవుతుంది
నీవు మృత్యుశయ్యను చేరుతావు
నీ దేహం క్షీణించిపోతుంది
నాయనా! నీ సొంత బావినుండి మాత్రమే నీళ్లు త్రాగు
నీ జలధారనుండే స్వచ్ఛమైన నీరు సేవించు
నీ చెలమ నీటితో ఇతరుల పొలాలు తడపకు
నీ జలధారను వీధిలోనికి పారనీయకు
నీ జలాలు నీకేగాని అన్యులతో పంచుకోడానికికాదు
నీవు యౌవనంలో పెండ్లాడిన భార్యతో సుఖించు
ఆమె దీవెనలు పొందునుగాక
ఆ వనిత లేడిలా, దుప్పిలా
నీ కంటికి అందంగా కన్పించునుగాక
కుమారా! నీవు పరస్త్రీ వ్యామోహంలో తగుల్కోనేల?
అన్యస్త్రీ ఆలింగనంలో పరవశుడివి కానేల? - సామె 5, 3-5. 8, 11. 15 -20.

పురుషుడు పరకాంత సొగసుకి భ్రమసి పోగూడదు. ఆమెను తాకితే అగ్నిని తాకినట్లే. తోడినరులూ పరస్త్రీ భర్తకూడ వ్యభిచారిని చావమోదుతారు.

పరకాంత సొగసునకు నీవు భ్రమయవలదు
ఆమె కంటిచూపుకి నీవు సమ్మోహితుడివి కావద్దు

వేశ్యకు కొద్దిపాటి సొమ్ము చెల్లిస్తే చాలు
కాని పరుని భార్యతోడి రంకు
నీ యాస్తినంతటినీ అపహరిస్తుంది
నిప్పులను రొమ్ముమీద పెట్టుకొంటే బట్టలు కాలవా?
అగ్నిమీద నడిస్తే పాదాలు మాడవా?
అన్యుని భార్యను కూడేవాడూ అంతే
ఆమెను స్పృశిస్తే శిక్ష తప్పదు
దొంగ ఆకలితో పొట్టకూటికొరకు దొంగిలిస్తే
జనులతనిని అంతగా దూషించరు
కాని పరుని సతిని కూడేవానికి అసలు బుద్ధిలేదు
అతడు తన చావుని తానే తెచ్చుకొంటాడు
అతన్ని జనులు చావమోది అవమానిస్తారు
శాశ్వతమైన అపకీర్తి కలుగుతుంది
అసూయకు గురైన భర్త రౌద్రంతో మండిపడతాడు
కరుణమాని ప్రతీకారానికి పూనుకొంటాడు. - సామె 6,25 -35.

సామెతల గ్రంథం 7వ అధ్యాయం వారకాంత వలపు, యువకులు ఆమె వలలో చిక్కుకొని నాశంకావడం కన్నులకు కట్టినట్లుగా వర్ణిస్తుంది. పాఠకులు ఈ యధ్యాయాన్నంతటినీ చదువుకోవాలి. గ్రంథవిస్తరణభీతిచే ఇక్కడ ఈ యధ్యాయంలో చివరి వాక్యాలను మాత్రం ఉదాహరిస్తున్నాం.

ఇకనేమి, కోడె వధ్యస్థానానికి పోయినట్లే,
లేడి వుచ్చులలో తగుల్కొన్నట్లే
అతడు ఆ వారకాంత యింటికి బోయాడు
వాడిబాణం అతని గుండెలో గ్రుచ్చుకోనుంది
వలలో చిక్కుకోబోయే పక్షిలాగ
అతని ప్రమాదం అతనికే తెలియదు
కనుక కుమారా! నా పలుకులు ఆలించు
నా మాటలు శ్రద్ధగా విను
నీ హృదయాన్ని అట్టి వనితకు అర్పింపకు
నీవు ఆమె వెంట పోవద్దు
ఆ కాంత పూర్వం చాలమందికి ముప్పు తెచ్చింది

ఆమె చేతజిక్కి చచ్చినవాళ్ళు అనేకులున్నారు
ఆమె యింటికి పోవడమనగా పాతాళానికి పోవటమే - సామె 7, 22-27.

నరుడు తనంటతట తాను కామ వికారాన్ని అణచుకోలేడు. కనుకనే రచయిత భగవంతునికి ఈలా ప్రార్థన చేసాడు.

నాకు తండ్రివీ
నా జీవనానికి దేవుడవూ ఐన ప్రభూ!
అహంకారం నుండి నన్ను కాపాడు
నా హృదయంనుండి కామాగ్ని తొలగించు
నేను మోహానికి లొంగకుండేలానూ
సిగ్గుమాలి కామవికారానికి లోపడకుండేలానూ కరుణించు - సీరా 23, 4-6.

## 36. గర్వం

నరులకు సులభంగా అలవడే దుర్గుణం గర్వం. పాపంతో గర్వం ప్రారంభమైంది. గర్వాత్ముడు దేవుణ్ణి నిరాకరిస్తాడు. ప్రభువు రాజులను సింహాసనాలమీదినుండి కూలద్రోస్తాడు. వినయాత్ములను గద్దెనెక్కిస్తాడు.

సృష్టికర్తయైన ప్రభువుని విడనాడ్డం గర్వానికి తొలిమెట్టు
పాపంతో గర్వం ప్రారంభమౌతుంది
గర్వితులుగానే మనుగడ సాగించేవాళ్లు మహా దుష్టులౌతారు
ప్రభువు అట్టివారిని తీవ్రశిక్షకు గురిచేసి సర్వనాశం చేస్తాడు
అతడు రాజులను సింహాసనంనుండి కూలద్రోసి
వినయాత్ములను గద్దెనెక్కిస్తాడు - సీరా 10,12-14.

నరుడు ఆశాపాశాలకు లొంగకూడదు. వాటిల్లో గర్వంకూడ వొకటి. ఈ దుష్టశక్తులను తావిచ్చేవాళ్లు సమూలంగా ఎండిపోయిన చెట్టులా నాశమౌతారు.

ఆశాపాశాలకు తావీయకు
అవి నిన్ను ఎద్దుకొమ్ములతోవలె పొడుస్తాయి
నీవు ఎండిపోయి, ఆకులను పండ్లను కోల్పోయిన
చెట్టువంటివాడ వౌతావు
ఆశాపాశాల వలన నరుడు చెడతాడు
నీ శత్రువులు నిన్ను జూచి నవ్వుతారు - సీరా 6, 2-4.

మన సంపదలనూ గౌరవాలనూ అందమైన దుస్తులనూ జూచి మనం మురిసిపోకూడదు. మనం ఎప్పుడు పడిపోతామో మనకే తెలియదు. రాజులే బిచ్చగాళ్ళయ్యారు.

నీ నాణెమైన దుస్తులనుజూచుకొని మురిసిపోకు
నీకు గౌరవం అబ్బినపుడు పొగరుబోతువి కావద్దు
ప్రభువు అద్భుత కార్యాలు చేస్తాడు
వాటిని నరులు తెలిసికోలేరు
చాలమంది రాజులు గద్దెదిగి నేలమీద కూర్చున్నారు
ఎవరూ ఊహింపనివాళ్లు వచ్చి
ఆ రాజుల కిరీటాలు ధరించారు
పాలకులు చాలమంది అవమానం పొందారు
సుప్రసిద్ధులు చాలమంది
అన్యులశక్తికి లొంగిపోయారు - సీరా 11,4-6.

గర్వాత్ముడి లక్షణం ఆత్మస్తుతీ, పరనిందా. కాని యిది తగదు.

ఇతరులు నిన్ను పొగడవచ్చుగాని
నిన్ను నీవే పొగడుకోగూడదు
పరులు నిన్ను స్తుతించవచ్చుగాని
ఆత్మస్తుతి పనికిరాదు - సామె 27,2.

గర్వాత్ముడు డాబూ దర్పమూ ప్రదర్శిస్తాడు. "మింగమెతుకు లేదుగాని మీసాలకు సంపెంగనూనె" అన్నట్లుగా వుంటుంది అతని వాలకం.

నీవు పనిచేసేపుడు
నీ ప్రావీణ్యాన్ని ప్రదర్శింప నక్కరలేదు
ఇక్కట్టులలో వున్నపుడు డాబుసరి పనికిరాదు
ప్రగల్భాలు పలుకుతూ ఆకటితో చావడంకంటె
కష్టపడి పనిచేసి పొట్టనిండ తినడం మేలు - సీరా 10, 26 -27.

భవిష్యత్తులో మనకు ఏలాంటి దుర్గతి పడుతుందో మనకే తెలియదు. క్షణకాలంలోనే మన పరిస్థితి మారిపోతుంది. కనుక మనకు గర్వం పనికిరాదు.

నరుడు, ఇక శ్రమచేయడం చాలించి
నే నార్జించిన సొత్తుని అనుభవిస్తానని యెంచవచ్చు

కాని అతడు చావడానికీ
అతని సొత్తు ఇతరులపాలు కావడానికీ
ఇంకా యెన్నాళ్ళ వ్యవధి వుందో అతనికే తెలియదు కదా!
పాపాత్ముల విజయాలనుచూచి అసూయ చెందకు
దేవుని నమ్మి నీ పనులను నీవు శ్రద్ధగా జేయి
క్షణకాలంలోనే దరిద్రుని సంపన్నుని జేయడం
ప్రభువుకి కష్టంగాదు.
ఉదయసాయంకాల మధ్యలోనే పరిస్థితులు మారిపోవచ్చు,
దేవుడు తలపెట్టిన మార్పు అతిశీఘ్రంగా కలుగుతుంది
– సీరా 11, 19-21. 18,26.

# 37. అసూయ

దుష్టులు వృద్ధిలోకిరావడం చూచి మనం సహించలేం. అసూయపడతాం. కాని వాళ్ళు త్వరలోనే దేవుని శిక్షకు గురౌతారు. కనుక మన అసూయ నిరర్థకమైంది.

పాపి విజయాన్ని చూచి అసూయ చెందవద్దు
వాడికెట్టి వినాశం దాపురిస్తుందో నీ వెరుగవు
దుష్టులు అనుభవించే ఆనందాన్ని ఆశింపకు
బ్రతికి వుండగానే వారికి శిక్ష పడుతుంది – సీరా 9, 11-12.

నరునికి విచారమూ, కోపమూ, అసూయా పనికిరావు. సంతోషచిత్తత అతనికి మేలు చేస్తుంది.

విచారం వలన నరుడు
ప్రాయం రాకముందే ముసలివా డౌతాడు
అసూయ, కోపం ఆయుస్సుని తగ్గిస్తాయి
సంతోషచిత్తుడైన నరునికి బాగా ఆకలి వేస్తుంది
అతడు తృప్తిగా భుజిస్తాడు – సీరా 30, 24-25.

ఇంకా అసూయ ఎముకల్లోపుట్టే కుళ్ళులాంటిది. కనుక దాన్ని ఆవశ్యం వదులుకోవాలి.

శాంతగుణం వలన ఆయురారోగ్యాలు కలుగుతాయి
అసూయ ఎముకల్లో పుట్టిన కుళ్ళులాంటిది – సామె 14,30.

# 38. విగ్రహారాధనం

సొలోమోను జ్ఞానగ్రంథం ప్రకృతి శక్తుల ఆరాధనాన్ని తీవ్రంగా ఖండిస్తుంది. నరులు తమ చుట్టూవున్న సృష్టి వస్తువులనుచూసి వానిని చేసిన సృష్టికర్తను గుర్తించి వుండవలసింది. కార్యాన్నిచూచి కారణాన్ని తెలిసికోవచ్చు గదా! ప్రకృతి వస్తువులే అంత అందంగా వుంటే వాటిని చేసిన సృష్టికర్త ఇంకా యెంత సుందరంగా వుంటాడా అని వారు ఊహించి వుండవలసింది. ఐనా ఈ నరులు లోకస్వభావాన్ని గూర్చి సిద్ధాంతాలుచేసిన జ్ఞానులు. ఈలాంటివాళ్లు లోకనాథుని తెలిసికోలేకపోవడం ఆశ్చర్యకరం!

దేవుణ్ణి తెలిసికోలేనివాళ్ళు నిక్కంగా మందమతులు
వాళ్ళు తమచుట్టూవున్న సృష్టివస్తువులను చూచికూడ
సజీవుడైన దేవుణ్ణి గుర్తించలేదు
ఆ శిల్పి చేసిన వస్తువులను చూచిగూడ
అతన్ని తెలిసికోలేదు
వాళ్ళు అగ్ని, వాయువు, తుఫాను
నక్షత్రరాశి, ప్రవాహజలం, గగనజ్యోతులు
ఈ లోకాన్ని పాలించే దేవతలని యెంచారు
ఆ వస్తువుల సౌందర్యానికి ముగ్ధులై
అవి దేవతలని తలపోసారు
కాని ఆ వస్తువులను కలిగించిన ప్రభువు
వాటికంటె అధికుడనీ
సౌందర్యకారకుడైన ప్రభువు వాటిని సృజించాడనీ
వారు గ్రహించి వుండవలసింది
ఆ వస్తువుల శక్తినీ అవి పనిచేసే తీరునూ జూచి
ఆ జనులు ఆశ్చర్యపడితే, వానిని చేసిన దేవుడు
వాటికంటె శక్తిమంతుడని
వారు గ్రహించి వుండవలసింది కదా?
సృష్టి వస్తువుల మహత్వాన్నీ సౌందర్యాన్నీ చూచి
సృష్టికర్త యేలాంటివాడో గ్రహించవచ్చు
కాని ఆ ప్రజలు దేవుణ్ణి మక్కువతో వెదకడంలోనే
తప్పుత్రోవ పట్టివుండవచ్చును గనుక

వారినంతగా నిందింపనక్కరలేదేమో!
వాళ్లు తను చుట్టూవున్న సృష్టివస్తువులమధ్య జీవిస్తూ
వాటిని మాటిమాటికి పరిశీలించి చూస్తూ
వాటి అందానికి భ్రమసి
వెలుపలి ఆకారం వలన మోసపోయారు
ఐనా ఆ ప్రజల అవివేకాన్ని మన్నించరాదు
వాళ్ళు లోకస్వభావాన్ని గూర్చి
సిద్ధాంతాలు చేయగల్గిగూడ
లోకనాథుని తెలిసికోకపోవడానికి కారణమేమిటి? – సొలో జ్ఞాన 13,1-9.

ఈ పుస్తకం విగ్రహారాధనాన్ని గూడ నిశితంగా ఖండిస్తుంది. వడ్రంగి చెట్టును నరికి దాన్ని చెక్కి రోజువారి పనికి ఉపయోగపడే పనిముట్టును తయారుచేస్తాడు. మిగిలిన ముక్కలతో అన్నం వండుకొంటాడు. కాని ఆ ముక్కల్లోనే ఓ పనికిమాలిన ముక్కను తీసికొని దాన్ని మనుష్యాకృతిగల బొమ్మగానో, మృగరూపంలో వున్న బొమ్మనుగానో మలుస్తాడు. ఆ బొమ్మకు మెరుగులు దిద్ది, రంగులుపూసి దాన్ని గోడలోని గూటిలో పెడతాడు. అటుతర్వాత అతడు సిగ్గుసెరమూ లేకుండా ఆ నిర్జీవ ప్రతిమకు ప్రార్థన చేస్తాడు. జీవమేలేని ఆ బొమ్మ, శక్తిలేని ఆ బొమ్మ, అతనికేలా సహాయం చేస్తుంది? కనుక విగ్రహాల కొలువు వెర్రితనం.

నిర్జీవాలైన ప్రతిమలను నమ్మేవాళ్ళు
నిక్కంగా దౌర్భాగ్యులు.
వాళ్ళు నరమాత్రులు చేసిన వస్తువులను దైవాలని పిలుస్తారు
అవి వెండిబంగారాలతో
అందంగా మలచిన మృగరూపాలు
లేదా పూర్వమెవడో చెక్కిన నికృష్టశిలలు
నిపుణుడైన వడ్రంగి అనువైన చెట్టును నరికి
దాని బెరడునంతటిని ఒలిచివేసి
దాని మొండెంనుండి
రోజువారి పనులకు ఉపయోగపడే
పనిముట్టు నొకదాన్ని తయారుచేస్తాడు
మిగిలిన ముక్కలను వంటచెరకుగా వాడుకొని
అన్నం వండుకొని ఆరగిస్తాడు
కాని మిగిలిన వాటిల్లోనే

పనికిమాలిన ముక్క వొకటి అతని కంటబడుతుంది
అది వంకరపోయి ముళ్ళతో నిండివుంటుంది
అతడు దాన్ని తీరికవేళల్లో నేర్పుతో చెక్కి
మనుష్యాకృతిగల బొమ్మనుగా మలుస్తాడు
లేదా నీచమైన మృగంగా తయారుచేస్తాడు
ఆ బొమ్మకు ఎఱ్ఱరంగుపూసి దాని నెఱ్ఱెలు
కప్పివేస్తాడు
తరువాత గోడలో ఒక గూడు తయారుచేసి
ఆ గూటిలో ఇనుప చీలల్తో దాన్ని బిగగొడతాడు
అది జారిపడకుండేలా జాగ్రత్తపడతాడు
అది వట్టి బొమ్మ కనుక తనంతట తాను నిలువలేదనీ
ఇతరులు దాన్ని ఆదుకోవాలనీ అతనికి తెలుసు
ఐనా ఆ నిర్జీవ ప్రతిమకు ప్రార్థన చేయడానికి
అతనికి సిగ్గులేదు
తన పెండ్లి, పిల్లలు, సంపదలనుగూర్చి
అతడు దానికి మనవి చేస్తాడు
ఆ బొమ్మ సామర్థ్యం లేనిది
ఐనా ఆరోగ్యం కొరకు అతడు దానికి ప్రార్థనచేస్తాడు,
అది నిర్జీవమైంది
ఐనా జీవం కొరకు దానికి మనవి చేస్తాడు,
అది శక్తిలేనిది
ఐనా సహాయం కొరకు దానికి విన్నపాలు చేస్తాడు,
అది అడుగైన కదపలేనిది
ఐనా ప్రయాణసాఫల్యం కొరకు దానికి మనవిచేస్తాడు,
ఆ బొమ్మ చేతులకు శక్తిలేదు
ఐనా తనకు లాభం కలగాలనీ
తాను డబ్బు చేసికోవాలనీ
దానికి విజ్ఞాపనం చేస్తాడు - 13, 10-19.

ఈ గ్రంథకర్త మరొక తావులో విగ్రహాల పుట్టుకను గూర్చి యిలా చెప్పాడు. ఓ తండ్రి తన కొడుకు చనిపోతే దిగులుతో వాడి బొమ్మనుచేసి వాణ్ణి పూజించాడు. ఆ తండ్రి తర్వాత వచ్చిన నరులూ ఆలాగే ఆ కొడుకుని పూజించారు. ఈలా విగ్రహారాధనం

వాడుకలోకి వచ్చింది. ఇంకా, కళాకారులు రాజు బొమ్మను చేస్తారు. సామాన్య జనులు రాజుమీదగల గౌరవంచే దాన్ని ఆరాధిస్తారు. ఈలాకూడ విగ్రహాల కొలువు వ్యాప్తిలోకి వచ్చింది. నరమాత్రులు క్రమేణ దేవుళ్ళయ్యారు.

పూర్వం ఒక తండ్రి
తన పుత్రుడు తలవని తలంపుగా చనిపోగా
ఘోరవ్యాకులత నొంది వాని బొమ్మను చేసాడు
నిన్న చచ్చిన నరుణ్ణి నేడు దేవుణ్ణిచేసి పూజించాడు
అతడు తనక్రిందివారికీ ఆ దేవుణ్ణి పూజించే విధానమూ
రహస్యారాధన పద్ధతులూ నేర్పిపోయాడు
కాలక్రమేణ ఆ దుష్టకార్యం బలపడి
నియమంగా మారిపోయింది.
రాజుల శాసనంపై బొమ్మలు ఆరాధ్యదైవాలయ్యాయి
దూరంగా వున్న రాజును
తమ యెదుట గౌరవింపగోరిన ప్రజలు
అతని ఆకారాన్ని వూహించుకొని
ప్రతిమను తయారుచేస్తారు
దూరాన వున్నవాణ్ణి దగ్గరలో వున్నవాణ్ణిలాగ
ముఖస్తుతి చేయాలని వారి ఆశయం
ఈ బొమ్మలను చేసిన దురాశాపరుడైన కళాకారుడు
ఆ రాజునిగూర్చి యేమాత్రం తెలియనివాళ్ళనుగూడ
అతని ఆరాధనకు పురికొల్పుతాడు
అతడు రాజు మెప్పు పొందగోరి నేర్పుతో
రాజుకంటె అతని ప్రతిమను సుందరంగా మలుస్తాడు
సామాన్యులు ఆ ప్రతిమ సౌందర్యానికి మురిసిపోయి
పూర్వం తాము నరునిగా ఎంచి గౌరవించినవానినే
ఇపుడు ఆరాధించడానికి పూనుకొంటారు
ఈ రీతిగా ప్రజలు గోతిలో పడసాగారు
వాళ్ళు యాతనలు అనుభవించడం వల్లనో
లేక రాజాజ్ఞకు బద్ధులు కావడం వల్లనో
ఏ వస్తువుకీ చెల్లని దివ్యత్వాన్ని
ఓ కొయ్యకో బండకో అంటగట్టి
వాటిని పూజించడం మొదలెట్టారు - 14, 15-21.

ప్రజలు గోతిలో పడ్డానికీ, బంధాల్లో చిక్కుకోడానికీ విగ్రహాలు కారణమయ్యాయి. కనుక ప్రతిమలూ వాటిని చేసిన నరులూకూడ శాపగ్రస్తులౌతారు.

నరుడు చేసిన కొయ్య విగ్రహమూ
దాన్ని చేసిన నరుడూ శాపగ్రస్తులౌదురుగాక
అతడు నశ్వరమైన వస్తువుని జేసి
దాన్ని దేవుడని పిలుస్తున్నాడు
దుష్టులనూ వారు చేసిన దుష్టవస్తువులనూ గూడ
ప్రభువు ద్వేషిస్తాడు
పనివానినీ వాడు చేసిన పనినీగూడ దేవుడు శిక్షిస్తాడు
అన్యమతస్థుల విగ్రహాలకు దేవుడు తీర్పు తీరుస్తాడు
అవి ఆ దేవుడు కలిగించిన సృష్టివస్తువులైనా
హేయమైన వస్తువులయ్యాయి
ప్రజలు గోతిలో పడ్డానికీ,
మూర్ఖులు బంధాల్లో చిక్కుకోడానికీ, కారణాలయ్యాయి - 14, 8-11.

కుమ్మరిచేసే బొమ్మలను విగ్రహాలుగా భావించి కొల్చేవాళ్లు మూర్ఖులు. మనకు ఉపయోగపడే కుండలను తయారుచేసే మట్టితోనే అతడు బొమ్మనుకూడచేసి దానికి దేవుడని పేరు పెడతాడు. ఒకే మట్టినుండి పగిలిపోయే కుండనూ విగ్రహాన్నీ కూడ చేసేవాడు తాను చేసేపని తప్పని గ్రహించి తీరుతాడు. ఐనా ధనాపేక్షతో అతడు విగ్రహాలు చేస్తాడు. జనులు మూర్ఖులై వాటికి మ్రొక్కుతారు.

కుమ్మరి మెత్తని మట్టిని మలచి
మనకుపయోగపడే పరికరాలను చేస్తాడు
అతడు కొలదికాలం క్రితమే మట్టినుండి చేయబడినవాడు
కొలది కాలమయ్యాక, తనకీయబడిన ఆత్మను
తిరిగి దేవునికి ఒప్పగించవలసిన సమయం వచ్చినపుడు,
ఆ మట్టిలోనే కలసిపోతాడు
అలాంటివాడు ఆ మట్టినే తీసికొని
వ్యర్థప్రయాసతో నిరర్థకమైన దైవాన్ని మలుస్తాడు
ఆ కుమ్మరి కొలదికాలం మాత్రమే జీవించి
త్వరలోనే చనిపోయేవాడు
కాని అతడా విషయం ఏ మాత్రం తలపోయడు
అతని హృదయం బూడిదప్రోవు వంటిది,

అతని ఆశ మురికికంటె హేయమైంది,
అతని జీవితం మట్టికంటె నీచమైంగి,
అతడు క్రియాశీలకమూ ప్రాణమయమూఐన ఆత్మను
తనలోకి వూది
తన్న మలచిన దేవుని అర్థం చేసికోలేదు
అతడు నరజీవితాన్ని ఓ ఆటలా,
డబ్బు సంపాదించే అంగడిలా ఎంచాడు
దుష్టమార్గాన్ని అవలంబించైనా సరే
సొమ్ము జేసికోవాలని యెంచాడు
ఒకే మట్టినుండి విగ్రహాలనూ
పగిలిపోయే పాత్రలనుగూడ చేసేవాడు
తాను చేసే పని పాపకార్యమని
తప్పక గ్రహిస్తాడు కదా?- 15, 7-13.

విగ్రహాలు శక్తిరహితాలు. అవి కండ్లున్నా చూడలేవు. చెవులున్నా వినలేవు. కాళ్ళున్నా నడవలేవు. నరుళ్ళోనైన జీవముంటుంది కాని అతడు చేసే ప్రతిమల్లో అసలు జీవమే వుండదు. కనుక వాటిని పూజించడం వ్యర్థం.

విగ్రహాలు తమ కంటితో చూడలేవు
నాసికతో గాలి పీల్చుకోలేవు
చెవులతో వినలేవు
వ్రేళ్ళతో తాకి చూడలేవు
కాళ్ళతో నడవలేవు
నరమాత్రు డొకడు వాటిని చేసాడు,
తనలోని శ్వాసను ఎరువుతెచ్చుకొన్నవా డొకడు
వాటిని మలచాడు
ఏ నరుడూ తనకు సరిసమానమైన వేల్పును చేయలేడు
మర్త్యుడు తన పాపపు చేతులతో చేసే
బొమ్మలుకూడ చచ్చినవే
నరుడు పూజించే బొమ్మలకంటె నరుడే ఘనుడు
అతనిలో నైనా జీవం వుందికాని

అతడు కొలిచే బొమ్మలు మాత్రం ఏనాడూ జీవించవు
నరులు హేయమైన మృగాలనుగూడ,
వాటిల్లోను జ్ఞానం ఏమాత్రం లేనివాటినిగూడ,
పూజిస్తారు - 15, 15-29.
కీర్తన 115, 4-8 కూడ ఇదే ధోరణిలో విగ్రహాలు శక్తిరహితాలని వాకొంటుంది.

# 39. మూఢవిశ్వాసాలు

కొందరు కలలను నమ్మి మోసపోతారు. అరుదుగా దేవుడు పంపే కలలను నమ్మవచ్చుగాని అన్ని కలలను నమ్మకూడదు. అలాగే సోదె, శకునాలు కూడ వట్టి బూటకాలు.

మూర్ఖుడు లేనిపోని ఆశలవల్ల మోసపోతాడు
కలలవల్ల వారి ఆలోచనలు
రెక్కలు కట్టుకొని ఎగురుతాయి
స్వప్నాలను నమ్మడం నీడను పట్టుకోవడంలాంటిది
గాలిని తరమడం లాంటిది
అద్దంలో ముఖంలాగ
కలల్లో మన అనుభవాలే ప్రతిబింబిస్తాయి
కల్మషత్వంనుండి నిర్మలత్వం రాదు
నిజం కానిదానినుండి నిజమైంది రాదు
సోదె, శకునాలు, కలలు నిజంకావు
అవి ప్రసవవేదనల్లో వున్న స్త్రీ వూహల్లాగ
వట్టి వూహలు మాత్రమే
సర్వోన్నతుడు పంపే కలలను నమ్మవచ్చు
కాని వట్టికలలను విశ్వసింపకూడదు
స్వప్నాలవల్ల చాలమంది అపమార్గం పట్టారు
వాటిని నమ్మి చాలమంది నిరాశ చెందారు - సీరా 34, 1-7.

ఇంకా కొందరు మంత్రవిద్యలు, అపవిత్రారాధనలు, నరబలులు, రహస్యపూజలు మొదలైనవాటికి పాల్పడతారు. ఇవన్నీ మూఢాచారాలూ, హేయమైన కార్యాలూ.
పూర్వం నీ పవిత్ర దేశంలో నివసించేవాళ్లు
హేయమైన కార్యాలు చేసారు గాన
నీవు వారిని అసహ్యించుకొన్నావు

వాళ్ళు మంత్రవిద్యకూ అపవిత్రారాధనకూ పాల్పడ్డారు
క్రూరబుద్ధితో తమ శిశువులనే చంపారు
ఉత్సవాల్లో నరమాంసం నరరుధిరం ఆరగించారు
రహస్యారాధనలు జరపడానికి ఉపదేశం పొంది
ఆ యారాధనల్లో తమ బిడ్డలనే బలియిచ్చారు
నీవు మా పితరుల ద్వారా వారిని నాశం చేయించావు. - సొలో జ్ఞాన 12, 3-6.

# 40. పాపంచేయకూడదు

నరులు బాల్యంనుండి చెడ్డవైపునకే మొగ్గుతుంటారు. కడన దేవుని తీర్పునకు గురై శిక్షను అనుభవిస్తారు. ఐనా మనం ఓ దినం చనిపోతామని ఎల్లవేళలా గుర్తుంచుకొంటే పాపం చేయడానికి జంకుతాం. సజ్జనుడు పామునుండివలె పాపంనుండి దూరంగా పారిపోవాలి. పాపం కోరలు సింహం కోరల్లాగ ప్రాణాలు తీస్తాయి.

నరులు బాల్యంనుండి చెడ్డవైపునకే మొగ్గుతారు
వాళ్ళు తమ దుష్టహృదయాన్ని మార్చుకోరు
ప్రభువు కడన తీర్పుచెప్పి దుష్టులను శిక్షిస్తాడు
వారు తమ పాపాలకు తగిన ప్రతిఫలం అనుభవిస్తారు
ఓ దినం నీవు మరణించి తీరుతావని
నీవు చేసే కార్యాలన్నిటిలోను గుర్తుంచుకో
అప్పుడు నీవు ఎన్నడూ పాపం కట్టుకోవు
కుమారా! నీవీవరకే పాపం చేసివుంటే మళ్ళా చేయవద్దు
పూర్వం చేసిన తప్పులను మన్నించమని దేవుణ్ణి వేడుకో
సర్పంనుండిలాగ పాపంనుండి దూరంగా పారిపో
దాని దగ్గరికి పోయావంటే అది నిన్ను కాటువేస్తుంది
పాపం కోరలు సింహం కోరల్లాంటివి
అవి నరుల ప్రాణాలు తీస్తాయి
రెండంచుల కత్తి నయంగాని గాయాన్ని చేస్తుంది
దైవాజ్ఞమీరి చేసిన పాపంకూడ ఈలాగే చేస్తుంది. - సీరా 17, 16. 23. 7,36. 21, 1-3.

తోబీతు తన కొడుకు తోబియాకు ఈలా సలహా యిచ్చాడు. "నాయనా! నీ జీవితంలో ప్రతిదినం ప్రభువుని గుర్తుంచుకో. ఏనాడూ పాపం చేయకు. దేవుని ఆజ్ఞ మీరకు. ఎప్పుడూ సత్కార్యాలే చేయి. దుష్కార్యాలు మానుకో. నీవు సత్యవర్తనుడవైతే ప్రతికార్యంలోను నీకు విజయం చేకూరుతుంది" - తోబీ 4, 5-6. ఈ వాక్యాలు మనంకూడ పాటించదగ్గవి కదా!

# ప్రశ్నలు

1. విజ్ఞానం అంటే యేమిటి? బైబులు విజ్ఞానానికీ మన దేశంలో పుట్టిన విజ్ఞానానికీ తేడాయేమిటి? రోజువారి జీవితంలో విజ్ఞానం ప్రాముఖ్య మేమిటి?
2. నరులు చేసే మంచి చెడ్డలకు బహుమానమూ శిక్షా వున్నాయి - వివరించండి.
3. దానప్రాశస్త్యాన్ని తెలియజేయండి.
4. జ్ఞాన గ్రంథాలు పేర్కొనే సాంఘిక న్యాయాన్ని విశదీకరించండి.
5. విజ్ఞానాన్ని గూర్చిన ఐదంశాలను తెలియజేయండి.
6. పొదుపు, నిజాయితీ, నమ్మదగినతనం అనే మూడు నైతిక గుణాలను వివరించండి.
7. జ్ఞానగ్రంథాలు వర్ణించే దైవభక్తిని విశదీకరించండి.
8. స్నేహధర్మాలను పేర్కొనండి.
9. విజ్ఞానబోధల్లో తగిలే వివాహధర్మాలను విశదీకరించండి.
10. పెద్దలపట్ల గౌరవం జూపే తీరును తెలియజేయండి.
11. దుష్టులేలాంటివాళ్ళో సజ్జను లేలాంటివాళ్లో తెలియజేయండి.
12. ఈ జీవితం అశాశ్వతం - వివరించండి.
13. మృత్యుస్మరణను విశదీకరించండి.
14. వాక్పారుష్యాన్ని వివరించండి.
15. సోమరితనాన్ని వివరించండి.
16. తిండిపోతుతనాన్ని గూర్చి తెలియజేయండి.
17. వ్యభిచారాన్నీ కామవికారాన్నీ గూర్చిన విజ్ఞాన బోధలను ఉదాహరించండి.
18. గర్వంతో పాపం ప్రారంభమైంది - వివరించండి.
19. జ్ఞానగ్రంథాలు విగ్రహాల కొలువును నిరసించిన తీరును తెలియజేయండి.
20. పాపాన్ని ఎందుకు మానుకోవాలి?

# 3. భక్త విజయం

## మనవిమాట

"భక్త విజయం" అనే ఈ గ్రంథంలో అబ్రాహాము, సమూవేలు మొదలైన భక్తుల కథలను వివరించాం. బైబుల్లోని భక్తిమంతమైన అధ్యాయాలను కొన్నిటిని ఎన్నుకొని వాటిమీద వ్యాఖ్య చెప్పాం. ఈ కథలను పూర్వమే బైబులు భాష్యం 102-105 సంచికల్లో ప్రచురించాం. ప్రతి కథలోను సందర్భం, వివరణం, ప్రార్థనాభావాలు అనే మూడంశాలు వుంటాయి.

ఇక్కడ చేర్చిన 17 కథల పవిత్ర గ్రంథాన్ని చదువుకొని భక్తితో మననం జేసికోవడానికి ఉద్దేశింపబడినవే. ఈ గ్రంథంద్వారా మన పాఠకులు బైబులుతో పరిచయం కలిగించుకొని దైవానుభూతిని పొందుతారని ఆశిస్తున్నాం. ఇది మూడవ ముద్రణం.

## విషయ సూచిక

# 1. ఈసాకు బలి - ఆది 22,1-19

## 1. సందర్భం

అబ్రాహాము సారా ముసలివాళ్ళయ్యాక ఈసాకు పుట్టాడు. అప్పుడు అబ్రాహాముకి నూరేండ్ల వయస్సు. తల్లిదండ్రులు ఈసాకుని అల్లారుముద్దుగా పెంచారు. ఆ బాలుడు పాలు త్రాగడం మానినరోజున అబ్రాహాము గొప్ప విందు చేయించాడు. ఈసాకుకి ముందే అబ్రాహాముకి హాగారు వలన యిష్మాయేలు కలిగాడు. కాని సారా ప్రేరణంవలన, దేవుని అనుమతిపై, అబ్రాహాము ఈ తల్లీబిడ్డలను ఇంటినుండి వెళ్ళగొట్టాడు. ఇక ఇంటిలో మిగిలివున్న బిడ్డడు ఈసాకు వొక్కడే. కనుక అబ్రాహాము ఆదరణ ఆప్యాయత ప్రేమ ఆ బిడ్డడిపైనే కేంద్రీకృతమయ్యాయి. ఈ దశలో దేవుడు అబ్రాహాముని పరీక్షించాడు. అనగా దేవుడు అబ్రాహాముకి తనమీద యెక్కువ ప్రేమో లేక ఈసాకుమీద యెక్కువ ప్రేమో తెలిసికోగోరాడు. అబ్రాహాము తన కొరకే తన్ను సేవిస్తున్నాడో లేక తన వరాల కొరకు తన్ను సేవిస్తున్నాడో తెలిసికోగోరాడు. ప్రభువు ఆ భక్తుని విశ్వాసాన్ని పరీక్షించాడు.

## 2. వివరణం

అతడు రాత్రి కలలో అబ్రాహాముతో మాట్లాడాడు. నీవు గాఢంగా ప్రేమించే యేకైక కుమారుని మోరీయా కొండమీద నాకు దహనబలిగా అర్పించాలని చెప్పాడు. ఈ ప్రదేశం తర్వాత యెరూషలేం నగరమౌతుంది. ఈసాకుని బలిగా అర్పింపబోయే తావుననే షుమారు 900 ఏండ్ల తర్వాత సొలోమోను రాజు దేవాలయం కడతాడు. ప్రస్తుతం ఇదంతా దట్టమైన అరణ్యం. ఆ రోజుల్లో ఆ దేశంలో వసించే ఆదిమజాతి ప్రజలైన కనానీయులు తమ పిల్లలను మోలెకు దేవతకు దహనబలిగా అర్పించేవాళ్ళు. అబ్రాహాముకి ఈ సంగతి తెలుసు. కాని దేవుడు తన కుమారునే యిలాగ బలియీయమని అడుగుతాడని కలలోగూడ ఊహించలేదు. కనుక దేవుని ఆజ్ఞను వినగానే అబ్రాహాముకి పిడుగు పడినట్లయింది. ప్రభువు యిష్మాయేలుని బలిగా ఈయమంటే అబ్రాహాముకి అంత బాధ కలిగేది కాదు. కాని దేవుడు ఈసాకునే బలిగా కోరుకుతున్నాడు. ఈ ఈసాకు ద్వారానే తన సంతానం తామరతంపరగా పెరుగుతుందని దేవుడు అతడికి పూర్వమే ప్రమాణం చేసాడు. మరి యిప్పుడు ఆ బిడ్డడు పోతే ఆ వాగ్దానం ఏలా నెరవేరుతుంది?

అబ్రాహాము ప్రాచీన తరానికి చెందినవాడు. అప్పుడు జనసంఖ్య లేదు. కనుక ఆ కాలంలో భగవంతుడు అన్ని దేశాల్లోను అన్ని జాతుల్లోను తల్లిదండ్రులకు సంతానంమీద కోరిక పుట్టించాడు. ఇప్పుడు మనం జనసంఖ్య విస్తారంగా పెరిగిపోయిన రోజుల్లో వున్నాం. కనుక ఈ కాలంలో దేవుడు తల్లిదండ్రులకు సంతానం వద్దనే కోరికను పుట్టిస్తున్నాడు.

ఆ ప్రాచీన కాలానికి చెందిన అబ్రాహాము తన ఏకైక కుమారుణ్ణి ఏలా త్యాగం చేయగలడు? ముసలివాడు ఊతకర్రమీద ఆధారపడి నడచినట్లుగా అబ్రాహాము ఈసాకు మీద ఆధారపడి జీవిస్తున్నాడు. ముసలివాని చేతిలోనుండి ఊతకర్రను లాగివేస్తే అతడు ఏమౌతాడు?

ఈ విధంగా ఈసాకుని బలియీయడం అబ్రాహాముకి అన్ని విధాల కష్టమైంది. కనుక అతని దుఃఖమూ మానసిక వేదనా అంతాయింతా కాదు. ప్రభువు ఆజ్ఞ అతని విశ్వాసానికి నిజంగా పరీక్ష.

మనమైతే అమ్మో యెంత దొంగదేవుడు! బిడ్డణ్ణి యిచ్చినట్లేయిచ్చి మళ్ళా తీసికొనిపోతాడా అని భగవంతుణ్ణి తిట్టేవాళ్ళమే. కాని అబ్రాహాము మహా భక్తుడు. ప్రభువుని పూర్ణహృదయంతో ప్రేమించిన మహానుభావుడు. ప్రభువు ఆజ్ఞ రాత్రి కలలో విన్పించింది కదా! ఇక ఆలస్యం చేయడానికి వీల్లేదు. సత్వరమే దేవుని ఉత్తరువుని పాటించాలి. కనుక అతడు తెల్లవారకముందే లేచాడు. గాడిదను ప్రయాణానికి సిద్ధంజేసాడు. దహనబలికి కట్టెలు చీల్చి మోపు కట్టాడు. కుమారుణ్ణీ ఇద్దరు సేవకులనూ తీసికొని మోరీయా కొండకు బయలుదేరాడు. మూడురోజులు ప్రయాణంచేసి ఆ కొండను చేరాడు. సేవకులను కొండ క్రిందనే ఉండమని చెప్పి కుమారునితో తాను కొండ ఎక్కడం ప్రారంభించాడు.

ఈసాకు కట్టెలమోపు మోసికొని కొండ యెక్కుతూన్నాడు. అతడు భావికాలంలో ఇంకో కట్టెలమోపు మోసికొనిపోయే క్రీస్తుకి చిహ్నంగా వుంటాడు. అబ్రాహాము నిప్పూ కత్తీ తీసికొని పోతూన్నాడు.

ఈలా తండ్రీ కొడుకులు కొండ యెక్కుతూండగా ఈసాకు నాన్నా! నిప్పూ కత్తీ వున్నాయి. అసలు దహనబలికి గొర్రెపిల్ల యేదీ అని అడిగాడు. ఆ ప్రశ్న బయటికి అమాయకంగా కన్పిస్తుంది. కాని ఆ పసివాడి ప్రశ్నవల్ల అబ్రాహాము గుండె తరుగుకొనిపోయింది. అతడు నాయనా నీవే బలిపశువౌతావురా అని ఈసాకుతో చెప్పాలి. కాని యేతండ్రి తన కుమారునితో అలా చెప్పగలడు? ఏ తండ్రి తన సొంత చేతులతోనే కుమారుని బలియీయగలడు? కనుక అబ్రాహాము తన దుఃఖాన్ని గుండెల్లోనే దాచుకొని నాయనా దహనబలికి కావలసిన గొర్రెపిల్లను దేవుడే సమకూరుస్తాడు అని బదులు చెప్పాడు.

అంతలో తండ్రీ కొడుకులు కొండశిఖరాన్ని చేరుకొన్నారు. అక్కడ అబ్రాహాము రాళ్ళతో బలి వేదికను నిర్మించి దానిపై కట్టెలు పేర్చాడు. కుమారుని బంధించి కట్టెలపైనుంచి చంపడానికి కత్తిదూసాడు. ఇప్పుడు ఈ కథ చదువుతూన్న మనకు ఈసాకు ఎటూ చనిపోడని తెలుసు. కాని అబ్రాహాముకి ఈ సంగతి తెలియదు. అతడు కుమారుడు బలిఔతాడన్న భావంతోనే అతన్ని చంపడానికి కత్తి యెత్తాడు. అతడు తన ప్రాణంకంటెగూడ ఈసాకుని అధికంగా ప్రేమించాడు. కాని ఈసాకుకంటెగూడ దేవుణ్ణి అధికంగా ప్రేమించాడు. కనుక దేవుని ఆజ్ఞను పాటించి ఈసాకుని బలియీయడానికి వెనుకాడలేదు.

కాని అబ్రాహాము కత్తిని చేపట్టగానే ప్రభువు ప్రత్యక్షమై ఓయీ! చిన్నవాణ్ణి చంపకు. నీకు అత్యంత ప్రీతిపాత్రుడైన యీసాకుని నాకు బలియీయదానికి నీవు వెనుకాడలేదు. కనుక నీవు దైవభీతి కలవాడవని రుజువైంది. నీవు నా యాజ్ఞను పాటించి నాకు విధేయుడవయ్యావు. నేను నీ విశ్వాసాన్ని పరీక్షించాను. ఆ పరీక్షలో నీవు నెగ్గావు. అదే చాలు. నేను నీ కుమారుని చావును కోరను అని చెప్పాడు.

తర్వాత అబ్రాహాముకి ప్రక్క పొదలో కొమ్ములు చిక్కుకొని వున్న పొట్టేలు కన్పించింది. అతడు ఈసాకుని విడిపించి అతనికి బదులుగా ఆ పొట్టేలిని తీసికొనివచ్చి దేవునికి బలిగా అర్పించాడు. యూదులు దేవళంలో తమ తొలిచూలు మగబిడ్డను దేవునికి కానుకగా సమర్పించేవాళ్లు. ఓ గొర్రెపిల్లనో లేక ఓ జత పావురాళ్ళనో దేవునికి కానుకగా అర్పించి ఆ బిడ్డణ్ణి మళ్ళా విడిపించుకొని పోయేవాళ్ళు. తర్వాతికాలంలో భక్తిలేని యూదరాజులు కొందరు తమ బిడ్డలనే బాలుదేవతకు బలిగా అర్పించారు. యూదులకు ఈ కార్యం ఎంతమాత్రం తగదనీ, పితరుడైన అబ్రాహాము బిడ్డణ్ణి కాక గొర్రెపిల్లను దేవునికి బలిగా అర్పించాడు చూడండనీ రచయిత ఆనాటి యూదులను హెచ్చరిస్తున్నాడు.

ఈసాకు నాయనా దహనబలికి గొర్రెపిల్ల యేదీ అని అడిగినప్పుడు అబ్రాహాము దాన్ని దేవుడే సమకూరుస్తాడని చెప్పాడు కదా! కనుక అబ్రాహాము ఆ మోరీయా ప్రాంతానికి "దేవుడే సమకూరుస్తాడు" అనే అర్థమొచ్చే పేరుపెట్టాడు. కనుక ఈ సంఘటనాన్ని పురస్కరించుకొని "కొండమీద దేవుడే సమకూరుస్తాడు" అని యూదుల భాషలో ఓ సామెత ఏర్పడింది.

నీ సంతతిని లెక్కకందని రీతిగా విస్తరిల్లజేస్తానని ప్రభువు పూర్వమే అబ్రాహాముకి ప్రమాణం చేసాడు. ఆ వాగ్దానాన్ని ఇక్కడ మళ్ళా పునరుద్ఘాటించాడు. ఆకాశంలోని నక్షత్రాల్లాగ, సముద్రం వొడ్డునవుండే యిసుక ముక్కల్లాగ, నీ సంతానాన్ని అసంఖ్యాకంగా పెంచుతానని దేవుడు అతనికి మళ్ళీ వాగ్దానం చేసాడు. భూమిమీది ప్రజలు నా నుండి దీవెనలు కోరుకొనేపుడు, నీకు కలిగినట్టే తమకూ శుభాలు కలగాలని కోరుకొంటారు అని చెప్పాడు. అనగా అబ్రాహాము భక్తకోటికి ఆదర్శమౌతాడు.

ఆ పిమ్మట అబ్రాహాము సంతోషంతో కొండదిగి వచ్చాడు. సేవకులతో కలసి పూర్వం తాను విడిదిచేస్తూన్న బేర్షబాకు తిరిగి వెళ్ళాడు.

## 3. ప్రార్థనా భావాలు

1. అబ్రాహాము విశ్వాసానికి పెట్టింది పేరు. ఈ గుణం అతనిలో మూడుసార్లు వెల్లడియైంది. మొదటి పర్యాయం, దేవుడు అతన్ని పిల్చినపుడు. కాల్దియా దేశంలో దేవుడు తన్ను పిలువగానే అబ్రాహాము తన సొంత దేశాన్నీ చుట్టపక్కాలనూ వదలిపెట్టి ఈ క్రొత్త దేవుని వెంటబడివచ్చాడు – ఆది 12,1. రెండవ పర్యాయం,

ముసలిప్రాయంలో దేవుడు అతనికి సంతానాన్ని కలిగిస్తానని చెప్పినప్పుడు. ఆ భక్తుడు తానూ సారా వృద్ధులైయున్నాకూడ దేవుని ప్రమాణం ప్రకారం తమకు బిడ్డడు పుడతాడని నమ్మాడు. ఆ నమ్మకాన్ని జూచి దేవుడు అబ్రాహామును పుణ్యపురుషునిగా గణించాడు - 15,4-6. మూడవ పర్యాయం, దేవుడు ఈసాకుని బలియీయమని అడిగినప్పుడు - 22,2. ఈ భక్తుని నుండి ప్రేరణం పొంది నేడు మనమూ విశ్వాస పుణ్యాన్ని అధికంజేసికోవాలి. అబ్రాహాములాగే నేడు మనంకూడ మన విశ్వాసాన్ని క్రియాపూర్వకంగా నిరూపించుకోవాలని చెప్తుంది యాకోబు జాబు - 2,21-22. నీతిమంతులు భక్తి విశ్వాసాలవలన జీవిస్తారని చెప్తుంది హబక్కూకు ప్రవచనం 2,4. కనుక మన జీవితంలో విశ్వాసపుణ్యానికి ఎంతో ప్రాముఖ్యముంది. ఆ పుణ్యానికి ప్రేరణంగా వుండేవాడు అబ్రాహాము.

2. అబ్రాహాము గాఢంగా ప్రేమించిన ఏకైక కుమారుడు ఈసాకు - ఆది - 22,2. 12,16. అలాంటి కుమారుణ్ణి దేవుని కొరకు త్యాగం చేయడానికి అతడు వెనుకాడలేదు. ఈ రీతిగానే పరలోకంలోని తండ్రికి క్రీస్తుకూడ ఏకైక కుమారుడు. ఆ క్రీస్తుని మనకొరకు త్యాగం చేయడానికి తండ్రికూడ వెనుకాడలేదు - యోహా 3,16. ఇంకా, కట్టెల మోపు మోసికొనిపోయే ఈసాకు మరో కట్టెలమోపు మోసుకొనిపోయే క్రీస్తుకి చిహ్నంగా వుంటాడు అని చెప్పాం-ఆది 22,6. క్రీస్తు మోసికొనిపోయిన సిలువ రెండుకొమ్మలు ఒకదానిమీద వొకటి అంటగట్టగా ఏర్పడినది. కనుక అదికూడ కట్టెలమోపే. ఈలా ఈసాకు సూచించే క్రీస్తు నూత్న వేద ప్రజలమైన మనకు పరిపూర్ణ రక్షణాన్ని ప్రసాదించాలని అడుగుకొందాం.

3. దేవుడు అబ్రాహామును పరీక్షించాడు. అతడు తన భక్తులందరినీ పరీక్షిస్తూనే వుంటాడు. మోక్షంలోని దేవదూతలూ, ఏదెను తోటలోని ఆదిదంపతులూ, యోబు, యూదా మొదలైనవాళ్ళంతా పరీక్షకు గురైనవాళ్ళే. మనకుగూడ ఈ జీవితంలో పరీక్షలూ శోధనలూ తప్పవు. వాటిల్లో విజయాన్ని సాధిస్తేనేగాని మనం మోక్షానికి అర్హులంకాము. లేకపోతే దేవుడు మనకు వట్టినే మోక్షాన్ని ఇచ్చినట్లవుతుంది. అర్హత లేకపోయినా మనం స్వర్గాన్ని సంపాదించినట్లవుతుంది. కనుక శోధనల్లో మనం మన విశ్వాసాన్ని రుజువు చేసికోవాలి. ఈ శోధనల్లో దేవుని వరప్రసాదం మనతో వుంటుంది. ఈ బలంతోనే మనం ఈలోకంలో ఎదురయ్యే ప్రలోభాలను జయించాలి - 1కొ 10,13.

4. అబ్రాహాముకి తన ప్రాణంకంటెగూడ మిన్నయైన వాడు ఈసాకు. ముసలివాడు ఊతకర్రమీద ఆధారపడి నడిచినట్లుగా అతడు ఈసాకుమీదనే ఆశలన్నీ పెట్టుకొని జీవిస్తున్నాడు. అలాంటి ఈసాకుని దేవుడు బలియీయమని అడిగాడు. ఆ ప్రభువు

మననుండిగూడ త్యాగాలు కోరతాడు. అతడు మనకు ప్రీతిపాత్రులైనవారిని తీసికొని పోవచ్చు. మన ఆరోగ్యాన్నీ ధనాన్నీ ఉద్యోగాన్నీ ఇంకా మనకిష్టమైన వాటినీ తీసికొనిపోవచ్చు. ఈలాంటప్పుడు మనం అతనిమీద సుమ్మర్లు పడకూడదు. అబ్రాహాములా మన ఈసాకుని మనం - అనగా మనకిష్టమైనవాటిని - దేవునికి సమర్పించడానికి సిద్ధంగా వుండాలి. మన చిత్తప్రకారంగాక దేవుని చిత్తప్రకారం జీవిస్తుండాలి. చివరకు మనకు అత్యంత ప్రీతిపాత్రమైన ప్రాణాన్నిగూడ దేవుని చేతుల్లోకి అర్పించుకోవాలి.

# 2. సంసోను మరణం
# న్యాయాధి 16,4-31

## 1. సందర్భం

సంసోను న్యాయాధిపతుల్లో వొకడు. యిస్రాయేలీయులను ఫిలిస్టీయుల బారి నుండి కాపాడినవాడు. అతడు చాలకాలం గొడ్రాలుగావున్న తల్లికి దైవానుగ్రహంవల్ల జన్మించినవాడు. చిన్నప్పటినుండి నాజరేయ వ్రతాన్ని పాటించి అసాధారణమైన దైవబలాన్ని పొందినవాడు. కాని అతడు స్త్రీలోలత్వం వలన తన వ్రతాన్ని భంగం చేసికొన్నాడు. తనలోని దైవబలాన్ని కోల్పోయి శత్రువులకు లొంగిపోయాడు. కట్టకడన తన తప్పులకు పశ్చాత్తాపపడి మరల దైవబలాన్ని పొంది శత్రువులను నాశంజేసాడు. వీరమరణం చెందాడు. సంసోను కథలు యిస్రాయేలు జానపద గాథలకు చెందినవి. చాలయేండ్లు పల్లెల్లో ప్రచారంలో వున్న యీ కథలు తర్వాత బైబుల్లో కెక్కాయి.

## 2. వివరణం

ఇక్కడ మన మెన్నుకొనిన వేదపఠనంలో రెండు భాగాలున్నాయి. 4-22 వచనాలు సంసోను డెలీలాను మోహించడాన్ని గూర్చి. 23-31 వచనాలు అతని మరణాన్ని గూర్చి.

తిమ్నాతు యువతితోను గాసా వేశ్యతోను కొంతకాలం గడిపినపిదప సంసోను సొరేకు లోయకు చెందిన డెలీలాను మోహించాడు. అంతకుముందే అతడు సింహాన్ని గొర్రెపిల్లనులాగ చంపాడు. గాడిద దౌడ యెముకతో వేయిమంది ఫిలిస్టీయులను వధించాడు. ఆ రోజుల్లో ఫిలిస్టీయులు యిస్రాయేలీయులకు ప్రబల శత్రువులు. వారి బారినుండి యిస్రాయేలీయులను కాపాడ్డమే సంసోను ముఖ్య బాధ్యత.

ఫిలిస్టీయ సర్దారులు ఐదుగురు. సంసోను విచిత్ర బలానికి కారణమేమిటో వీళ్ళకు అంతుబట్టలేదు. అతనిలో యేదో మాంత్రికశక్తి పనిచేస్తుందనుకొన్నారు. వాళ్ళు తమ జాతి ఆడపడుచైన ఢెలీలాకు లంచంపెట్టి ఆమె ద్వారా సంసోనును లొంగదీసు

కోవాలనుకొన్నారు. ఐదుగురు కలసి 56వేల వెండికాసులు లంచంగా యిచ్చారు. ఆరోజుల్లో అది చాల పెద్ద సొమ్ము.

డెలీలా సంసోనుని మభ్యపెట్టి అతని విచిత్ర బలానికి కారణమేమిటని అడిగింది. అతడు పచ్చిపచ్చిగావున్న అల్లెత్రాళ్ళతో నన్ను కట్టివేస్తే నా బలంపోతుందని చెప్పాడు. ఆమె అలాగే చేసింది. కాని సంసోను ఆ యల్లెత్రాళ్లను నిప్పంటుకొనిన నారత్రాళ్ళనులాగ త్రెంచివేసాడు. డెలీలా నవ్వులపాలయింది.

ఆమె మళ్ళా నీబల రహస్యమేమిటో చెప్పమని సంసోనుని నిర్బంధం చేసింది. అతడు క్రొత్తతాళ్ళతో కడితే నా బలం పోతుందని చెప్పాడు. ఆమె అలాగే చేసింది. కాని సంసోను ఆ త్రాళ్లు దారాల్లాగ త్రెంచివేసాడు. డెలీలాకు రెండవసారి ఆశాభంగం కలిగింది.

ఆమె మళ్ళా నీ యద్భుత శక్తికి కారణమేమిటో చెప్పమని అతన్ని పీడించింది. అతడు నాయేడు జడలను పడుగులాగ నేసి మేకుకి అంటగడితే నాబలం పోతుందని చెప్పాడు. డెలీలా అలాగే చేసింది. కాని అతడు తలతో ఒక్క వూపు వూపగా మేకు వూడివచ్చింది. జడలుకూడ విడిపోయాయి. ఈలా సంసోను మూడుసార్లు డెలీలాను ఆటలు పట్టించాడు.

కాని డెలీలా సంసోనుని వదలిపెట్టలేదు. నీ బలరహస్యాన్ని తెలియజేస్తేనేకాని నీకు నాపట్ల ప్రేమవుందని రుజువుకాదు అని అతనిని తొందరపెట్టింది. సంసోను డెలీలా పోరు పడలేక విసిగిపోయి చివరికి తన బలరహస్యాన్ని చెప్పివేసాడు. నేను చిన్నప్పటినుండి నాజరేయ వ్రతాన్ని చేపట్టి నా తలజుట్టు కత్తిరించుకోకుండా జీవించాను. ఈ జుట్టుని కత్తిరిస్తే నా బలం పోతుంది అని తన మర్మాన్ని తెలియజేసాడు.

యథార్థంగా సంసోను బలం అతని జట్టులో లేదు. అతడు చేపట్టిన నాజరేయ వ్రతంలో వుంది. ఈ వ్రతాన్ని పూనినవాళ్ళు మద్యం సేవించరు. తలజుట్టు కత్తిరించుకోరు. దైవసేవలో కాలం గడుపుతారు. నూత్నవేదంలో స్నాపక యోహాను ఈలాంటివాడే. ఇక్కడ సంసోను తన రహస్యాన్ని తెలియజేయడంవల్ల తన వ్రతభంగానికి తానే కారకుడయ్యాడు. తన అజాగ్రత్తవల్ల తానే నాశమయ్యాడు.

డెలీలా సంసోనుని మభ్యపెట్టి తన వొడిలో నిద్రబుచ్చి అతని జడలు ఏడింటిని కత్తెర వేయించింది. దానితో అతని బలం పోయింది. ఆ యింటిలోనే ఓ మూలన దాగుకొని వున్న ఫిలిస్తీయ దొరలు వచ్చి అతనిమీద పడ్డారు. అతడు పూర్వంలాగ తన బలాన్ని ప్రదర్శించి శత్రువులనుండి తప్పించుకొందామనుకొన్నాడు. కాని ఆ బలం అతనిలో వుంటేగా! ఈ సందర్భంలో బైబులు "ప్రభువు తన్ను విడనాడాదని సంసోనుకి తెలియదు" అని చెప్తుంది – 16,21. ఇది బైబుల్లోని అతి దయనీయమైన వాక్యాల్లో వొకటి. తానెంతటి దీనావస్థలో వున్నదికూడ సంసోనుకి అర్థంకాలేదు.

జుట్టు పోవడంతోనే సంసోనికి వ్రతభంగమైంది. దానితో స్వీయశక్తికూడ నశింపగా అతడు దుర్బలుడయ్యాడు. ఫిలిస్తీయులు అతనిని బందీనిచేసి కండ్లు పెరికివేసి గాసాకు కొనిపోయి చెరలో వేసారు. గానుగ మానుకి కట్టివేసి అతనిచే ఆమాను తిప్పించారు. ఈ పని గాడిదో యెద్దో చేస్తుంది. అనగా సంసోను పశువులాంటివాడై పోయాడని భావం. ఈ విధంగా అతడు స్త్రీలోలత్వం వలన తన జుట్టూ, బలమూ, కండ్లూ, స్వేచ్ఛా, వ్రతమూ అన్నీ కోల్పోయాడు. ఎంతటి వీరునికి ఎంత దుర్గతి! నరులు ఎంతటి వున్నత స్థాయిలో వుంటారో వారి పతనం గూడ అంత తీవ్రంగా వుంటుంది.

ఫిలిస్తీయుల దేవుడు డాగోను. వాళ్ళు ఆ డాగోనే సంసోనుని తమచేతికి పట్టియిచ్చాడనుకొని పొంగిపోయారు. కృతజ్ఞతాపూర్వకంగా డాగోను దేవళంలో ఉత్సవం జరపబూనారు. ఆ పండుగలో వాళ్ళు సంసోనుని వీరకార్యాలు చేసిచూపించమన్నారు. అతడు బందీగావుండే, బంధింపబడిన యెలుగుబంటిలాగ వాళ్ళముందు వీరకార్యాలు చేసాడు. ఆ తమాషా చూచి ఫిలిస్తీయులు ఆనందించారు.

డాగోను దేవళం రెండు పెద్ద స్తంభాలమీద నిల్చివుంది. మీది అంతస్తులో మూడువేలమంది ఫిలిస్తీయులు కూర్చుండి సంబరం జూస్తున్నారు. సంసోను క్రింద రెండు స్తంభాలమధ్య నిలచివున్నాడు. అతడు తనకు జరుగుతూన్న అవమానాన్ని భరించలేకపోయాడు. తన దుర్గతికి తానే కారకుడనని గ్రహించాడు. తన తప్పుకి పశ్చాత్తాపపడ్డాడు. తన పాపాన్ని మన్నించమని ప్రభువుని వేడుకొన్నాడు. ఫిలిస్తీయులను నాశం జేయడం అతని బాధ్యత. డాగోను దేవళాన్ని కూలద్రోస్తే వాళ్లు పెద్ద పెట్టున చస్తారు. అప్పుడు అతని బాధ్యత తీరుతుంది. కనుక అతడు ప్రభువుకి మనవి చేసాడు. నా తప్పిదాన్ని మన్నించి నాకు మళ్ళా పూర్వబలాన్ని ఒక్కసారి దయచేయమని వేడుకొన్నాడు. దేవుడు అతని వేడికోలు ఆలించాడు.

చెరలో వున్నప్పటినుండి సంసోను జుట్టు మళ్ళా పెరుగుతూ వచ్చింది. అనగా అతని పూర్వబలం తిరిగి రాజొచ్చింది. ఈలా దైవాశీర్వాదంతో బలాఢ్యుడైన సంసోను రెండు స్తంభాలమీద రెండు చేతులుమోపి వాటిని బలంగా ముందుకి త్రోసాడు. ఆ త్రోపుకి దేవళం పెళ్ళున కూలి నేలపైబడింది. పైనున్నవాళ్లూ క్రిందివాళ్లూ అందరూ చచ్చారు. ఈ విధంగా శత్రువులమీద పగతీర్చుకొని సంసోనుకూడ మరణించాడు.

ఈ సందర్భంలో బైబులు "సంసోను బ్రతికివుండగా చంపినవారికంటె చనిపోతూ చంపినవారే అధికులు" అని చెప్తుంది – 16,30. ఫిలిస్తీయులనుండి యిస్రాయేలీయులను కాపాడ్డానికే ప్రభువు సంసోనును ఎన్నుకొన్నాడు. కనుక వాళ్ళను నాశం చేయడం అతని పూచీ. ఈ కార్యాన్ని అతడు చనిపోతూ అధికంగా సాధించాడు. అతనిది వీరమరణం. శత్రువులను నాశంచేయడానికి అతడు స్వీయప్రాణాలనే అర్పించాడు. ఆ రీతిగా అతడు

దైవభక్తుడుగా మరణించాడు. అతని వీరమరణంద్వారా యిస్రాయేలీయులకు శత్రువులనుండి విముక్తి కలిగింది.

### 3. ప్రార్థనా భావాలు

1. సంసోను దేవుని అనుగ్రహంవల్ల జన్మించినవాడు. దేవుడతనికి విచిత్రమైన బలాన్ని దయచేసాడు. యిస్రాయేలీయులకు న్యాయాధిపతినిగా నియమించాడు. ఇన్ని ప్రత్యేక వరప్రసాదాలు వున్నా అతడు స్త్రీలోలుడై చెడిపోయాడు. శత్రువులకు చిక్కి అవమానాలకు లోనై దయనీయమైన చావు చచ్చాడు. కామం చాల చెడ్డ పాపం. దానివల్ల ఉచితానుచితాలు మరిచి పశువుల్లా ప్రవర్తిస్తాం. దైవశిక్షకు గురౌతాం. ఈ దుర్గుణానికి లొంగకుండా వుండే భాగ్యం కొరకు వేడుకొందాం.
2. సంసోను చివరి క్షణంలోనైనా కన్నుతెరచి తన తప్పులను మన్నించమని దేవుని ప్రార్థించాడు. ప్రభువు అతని తప్పిదాలను మన్నించి పూర్వపు బలాన్ని దయచేసాడు. ఆ బలంతో అతడు శత్రువులను హతమార్చాడు. కాని దాగోను దేవాలయాన్ని కూల్చి శత్రువులను చంపేపుడు తానుకూడ చనిపోతానని అతనికి బాగా తెలుసు. ఐనా తనజాతి శ్రేయస్సు కొరకు అతడు స్వీయప్రాణాలను సమర్పించడానికి వెనుకాడలేదు. అతనిది వీరమరణం. జీవితంలో పెద్ద పొరపాట్లు చేసినా కడన భక్తితో మరణించడం గొప్ప భాగ్యం. ఈ భాగ్యం కొరకు వేడుకొందాం.
3. నూత్నవేదంలో హెబ్రేయుల జాబు సంసోనుని భక్తిమంతుల్లో వొకనిగా పేర్కొంటుంది-11,32. పాపపు జీవితం గడిపినా ప్రభువుకి మొరపెట్టి ప్రభువుని నమ్మి చనిపోవడం వల్లనే అతడు భక్తిమంతుడయ్యాడు. ఈ భక్తి మనకుకూడ అలవడాలని వేడుకొందాం.

# 3. సమూవేలుకి పిలుపు - 1 సమూ 3

### 1. సందర్భం

ఎల్కానా భార్య అన్నా. ఆమెకు చాలయేండ్లపాటు సంతనాం కలగలేదు. కనుక ఏటేట షిలో. దేవళానికి వెళ్ళి ప్రభువుని ప్రార్థించేది. ఓసారి ఆమె దేవాలయానికి వెళ్ళి ప్రభూ! నాకు ఒక మగబిడ్డను ప్రసాదించావంటే వాణ్ణి ఆమరణాంతం నీ సేవకే సమర్పించుకొంటానని మొక్కుకొంది. అన్నా కోరినట్లే దేవుడు ఆమెకు ఓ బిడ్డను దయచేసాడు. అన్నా అతనికి సమూవేలు అని పేరు పెట్టింది. మూడేండ్ల యీడున ఆ

బాలుని షిలో దేవళంలో కానుకగా అర్పించింది. అప్పుడు షిలోలో పెద్ద గురువు ఏలీ. అతని కుమారులు ఫీనెహాసు హోఫ్నీకూడ అక్కడే యాజకులు. సమూవేలు ఈ దేవళంలోనే పెరుగుతూ కోవెలలో ఏలీకి సహాయం చేస్తూండేవాడు.

## 2. వివరణం

సమూవేలుకి ఇంచుమించు 12 ఏండ్ల యీడు వచ్చినప్పుడు దేవాలయంలో దేవుడు దర్శనమిచ్చాడు. ఆ రోజుల్లో యిస్రాయేలు ప్రజలు దేవుని సందేశం వినాలని ఉవ్విళ్ళూరిపోతున్నారుగాని ఆ సందేశాన్ని తెలియజెప్పే ప్రవక్తలెవరూ లేరు. ఏలీ యాజక కుటుంబం పాపకార్యాల్లో మునిగి తేలుతూంది. ఆ కుటుంబాన్ని జూచి ప్రభువు ప్రజల మీద కోపించి వారికి తన దివ్యవాణిని విన్పించలేదు.

అప్పటికే యేలీ ముదివగ్గు. అతనికి కంటిచూపుగూడ మందగించింది. ఓనాటిరాత్రి అతడు దేవళంలోని మధ్య భాగంలో పండుకొని నిద్రిస్తూన్నాడు. సమూవేలు గర్భాగారంలో మందసంవద్ద పండుకొని నిద్రపోతూన్నాడు. మందసం కొయ్యపెట్టె. దానిలో ప్రభువు మోషేకు వ్రాసియిచ్చిన రెండు రాతిపలకలు వుండేవి. ఈ పెట్టె పూర్వవేదకాలంలో దైవసాన్నిధ్యం. ఈ పెట్టెదగ్గర రాత్రంతా దీపం వెలుగుతుండేది. ఆ దీపంలో చమురు ఐపోయినప్పుడల్లా మళ్ళా చమురు పోవడం సమూవేలు పని. అందుకే అతడు గర్భాగారంలో పండుకొని వున్నాడు. ఆ రాత్రి వేకువజామున ప్రభువు సమూవేలుని పేరుపెట్టి పిల్చాడు. బాలుడు గబాలున లేచి యేలీయొద్దకు పరుగెత్తుకొని వెళ్ళి అయ్యా పిల్చావా ఇదిగో వచ్చాను అన్నాడు. ఏలీ నాయనా నేను నిన్ను పిలువలేదు వెళ్ళి పండుకో అన్నాడు. ఈ విధంగా మూడుసార్లు జరిగింది. సమూవేలుకి ఇంకా ప్రభువునిగూర్చి తెలియదు. అనగా ప్రభువు అతన్నింకా తన ప్రవక్తనుగా చేసికోలేదు. అతనికింకా దేవునితో సన్నిహితమైన సంబంధం కలగలేదు. కనుక సమూవేలు మూడుసార్లు ఏలీయే తన్ను పిలుస్తున్నాడనుకొని పొరపాటుపడ్డాడు.

మూడవసారి యేలీకి అర్థమైంది. అపరాత్రిలో దేవళంలో పిల్లవాణ్ణి ఎవరు పిలుస్తారు? దేవుడే పిల్చివుండాలి. కనుక అతడు సమూవేలుతో నాయనా ఆ స్వరం నీకు మళ్లా విన్పిస్తే "అయ్యా! నీ దాసుణ్ణి సెలవీయి. నేను నీవు చెప్పినట్లే చేస్తాను అని పల్కు. ఆ స్వరం నీతో చెప్పిన సందేశాన్ని తెల్లవారిన తర్వాత నాకు తెలియజేయి" అని బోధించాడు.

ప్రభువు రాత్రి దేవళంలో నాల్గవసారి సమూవేలూ అని పిల్చాడు. బాలుడు వెంటనే లేచి అయ్యా నీ దాసుణ్ణి సెలవీయి. నేను నీవు చెప్పినట్లే చేస్తాను అని పల్కాడు. దేవుడు అతనికి తన సందేశం విన్పించాడు. ఆ సందేశం ఇది. ఏలీ కుమారులిద్దరు పరమ దుర్మార్గులు. వాళ్ళు దేవళంలో చేసే ఆగడాల వల్ల దేవునికి అపకీర్తి కలుగుతూంది. ఏలీ వాళ్ళను అదుపులో పెట్టలేదు. కనుక ప్రభువు ఆ కుటుంబాన్ని సమూలంగా

నాశంచేయబోతున్నాడు. ఇక ఏలాంటి బలులర్పించినా అవి ఏలీ కుటంబపు పాపాలకు ప్రాయాశ్చిత్తం చేయలేవు.

ఉదయాన్నే సమూవేలు కోవెల తలుపులు తీసి దేవాలయం మధ్యభాగంలోకి వచ్చాడు. అక్కడ యేలీ అతన్ని కలసికొని బాబూ! దేవుడు నీకు ఏమి సందేశం చెప్పాడో తెలియజేయమన్నాడు. సమూవేలు మొదట దడిసాడు. కాని యేలీ ఒట్టుపెట్టుకొని అడిగినందున దేవుడు తనకు వివరించిన ఉదంతమంతా తెలియజేసాడు. ఏలీ వినయంతో దేవుని చిత్తానికి లొంగాడు. నాయనా! నీతో మాట్లాడింది ప్రభువే. అంతా ఆయన సంకల్పించుకొన్నట్లే జరుగుతుంది. ప్రభువుకి అడ్డురావడానికి నేనెవణ్ణి అన్నాడు.

పై దర్శనంలో ప్రభువు సమూవేలుని గూర్చి యేమీ చెప్పలేదు. ఐనా ఆ దర్శనంలోనే అతడు దేవుని ప్రవక్త అయ్యాడు. ఇక దేవుడు అతనిద్వారా మాటలాడ్డం మొదలెట్టాడు. కనుక సమూవేలు పలికిన పలుకులన్నీ నెరవేరాయి. కావున ఉత్తరాదినుండి దక్షిణాది వరకు గల యిస్రాయేలు ప్రజలంతా సమూవేలు దేవుని ప్రవక్త అయ్యాడని గ్రహించారు. అటుతరువాత ప్రభువు షిలో దేవళంలో సమూవేలుకి చాలసార్లు దర్శనమిచ్చాడు. చాలసారులు అతనికి తన సందేశాన్ని విన్పించాడు. ఆ సందేశాన్ని సమూవేలు ప్రజలకు తెలియజేస్తుంటేవాడు. ఈ విధంగా ఏలీ కాలంలో ప్రజలతో మాటలాడ్డం మానివేసిన ప్రభువు, ఇప్పుడు సమూవేలు ద్వారా మళ్ళా మాటలాడ్డం మొదలెట్టాడు. అతని ద్వారా యావే దివ్యవాణి దేశంలో పుష్కలంగా విన్పించింది.

ఆ రోజుల్లో యిస్రాయేలీయులకు ప్రబల శత్రువులు ఫిలిస్టీయులు. వారికీ వీరికీ యుద్ధం జరిగింది. ఆ యుద్ధంలో ఏలీ కుటుంబమంతా నాశమైంది. ఏలీకి బదులు సమూవేలే షిలో దేవళంలో యాజకుడయ్యాడు. అతడు యాజకుడు, ప్రవక్త, న్యాయాధిపతి, యుద్ధవీరుడు. యిస్రాయేలీయులను చాల యేండ్లపాటు దైవమార్గంలో నడిపించిన మహాభక్తుడు.

యిస్రాయేలు దేశంలో మొదట రాజపదవిని నెలకొల్పినవాడు సమూవేలే. అతడు మొదట సౌలుని రాజుగా అభిషేకించాడు. ఆ రాజు దేవుని మాట వినక భ్రష్టుడైపోతే సమూవేలు దావీదుని రెండవరాజుగా అభిషేకించాడు. తన తల్లి అన్నా కోరుకొన్నట్లే అతడు ఆమరణాంతం దేవుని సేవకుడుగానే జీవించాడు - 1సమూ 1,11. పూర్వవేదంలోని మహాభక్తుల్లో సమూవేలు ఒకడు.

## 3. ప్రార్థనా భావాలు

1. సమూవేలు ఆలించిన మొదటి దైవోక్తి ఏలీ కుటుంబం వినాశాన్ని గూర్చి. ఏలీ పాప కుటుంబం యుద్ధంలో నాశమైంది. తర్వాత ఏలీకి బదులుగా సమూవేలే దేవళంలో యాజకుడయ్యాడు. అపవిత్రుడైన గురువుకి బదులుగా పవిత్రుడైన శిష్యుడు వచ్చాడు.

ఎప్పుడు కూడ పాపపు మూకకు దేవుడు మొదట శిక్షాప్రవచనాలు విన్పిస్తాడు. ఆ మీదట రక్షణ ప్రవచనాలు విన్పిస్తాడు. ఏలీ జీవితంలో ఈలాగే జరిగింది. నేడు మన జీవితంలోను ఈలాగే జరుగుతుంది. కనుక మొట్టమొదట మనం దేవుని యెదుట మన పాపాలకు పశ్చాత్తాపపడాలి. పశ్చాత్తాపానంతరంగాని అతని రక్షణను పొందలేం.

2. దేవుడు సమూవేలుని పిల్చిన తీరుగూడ మననం జేసికోదగ్గది. అతడు పూర్వం తన భక్తులను నేరుగా పిల్చాడు. సమూవేలు యెషయా యిర్మియా పౌలు మరియ మొదలైనవాళ్ళను దర్శనాల ద్వారా ప్రత్యేకంగా పిల్చాడు. కాని నేడు మన పిలుపు ప్రత్యక్షంగా గాక పరోక్షంగా వుంటుంది. అనగా మన హృదయంలో ఓ విధమైన కోరిక పుట్టించి ఆ కోరికద్వారా దేవుడు మనలను తన సేవకు పిలుస్తాడు. ఈ పిలుపు కొందరి విషయంలో ఐతే, గురు కన్యాజీవితాలు గడపడానికి. మరికొందరి విషయంలో ఐతే, భక్తిగల సంసారజీవితం గడపడానికి. ఐనా ఈ రెండూ దైవపిలుపులే. ఈ రెందురకాల పిలుపుల్లోను మనకు దైవదర్శనాలు కలగవు. హృదయంలో పుట్టే కోరికలు చాలు. ఆ సమూవేలులాగే మనంకూడ నేడు మన జీవితంలో దేవుని పిలుపుని ఆలించాలని వేడుకొందాం.

3. సమూవేలు రాత్రి గర్భాగారంలో దైవమందసం వద్ద పండుకొని వుండగా అతనికి దేవుని స్వరం విన్పించింది. దైవమందసం దైవసాన్నిధ్యం. దైవోక్తులు విన్పించే తావు. సమూవేలు పవిత్రమైన వాతావరణంలో వున్నప్పుడు అతనికి దేవుని పల్కులు విన్పించాయి. నేడు మనకుగూడ దేవుడు తన సందేశాన్ని విన్పిస్తాడు. అతడు మన అంతరాత్మలో మాటలాడతాడు. కాని అతని స్వరాన్ని వినాలి అంటే మన తరపున మనం పవిత్రమైన వాతావరణంలో వుండాలి. బైబులు పఠించాలి. ప్రార్థన చేసికోవాలి. దేవళానికి వెళ్ళి దేవుణ్ణి పూజించుకోవాలి. దేవద్రవ్యానుమానాలను స్వీకరించాలి. సోదరప్రేమతో సేవాభావంతో జీవించాలి. ఈలా దేవునితో పరిచయం కలిగించుకొని పవిత్ర వాతావారణంతో జీవిస్తుంటే మనకు దైవస్వరం విన్పిస్తుంది. కేవలం లౌకిక జీవితము గడిపేవాళ్ళకు దేవుని స్వరం విన్పించదు. దేవునివల్ల ప్రభావితులం కావాలి అంటే మొదట మనకు అతనిమీద భక్తి కుదరాలి.

4. సమూవేలు దైవసందేశాన్ని విన్పింపగా యేలీ ఆయన చేయదలుచుకొన్న కార్యం చేయునుగాక అన్నాడు. అతడు తన కుటుంబం నాశంగావడానికి సమ్మతించాడు. దేవునిమీద సుమ్మర్లు పడలేదు. దేవుని చిత్తాన్ని గుర్తించి ఆ చిత్తప్రకారం జీవించడం యూదుల ముఖ్యభక్తి. మనంకూడ ఈ భక్తిని అలవర్చుకోవాలి. మన చిత్తప్రకారం మనం జీవించక దేవుని చిత్తప్రకారం జీవించడం అలవాటు చేసికోవాలి. జీవితంలో ఆయా ముఖ్య నిర్ణయాలు చేసికొనేపుడు దేవుణ్ణి సంప్రతించి చూడాలి.

5. ఇది చాల మంచి కథ. కథ జరిగిన స్థలం దేవాలయం. సమయం ప్రశాంతమైన వేకువవేళ. నిశ్శబ్ద వాతావరణం. దైవసందేశాన్ని విన్నది నిర్మల మనస్కుడైన పసిబాలుడు. మాట్లాడినది ప్రభువు. ఈలా కథంతా పవిత్రమైన వాతావరణంలో జరిగిపోయింది. కనుక మనం ఈ సంఘటనను బైబులునుండి పదేపదే చదువుకొని పవిత్రమైన దేవుని సందేశాన్ని వినడానికి సిద్ధంకావాలి. ప్రభువు దివ్యవాణి ఆనాడు సమూవేలుని వలె నేడు మనలనుగూడ ప్రభావితులను జేస్తుంది.

# 4. ప్రభువు సౌలుని నిరాకరించడం - 1సమూ 15

## 1. సందర్భం

ప్రభువు సౌలుని మొదటి రాజుని చేసాడు. కొంతకాలమయ్యాక సౌలుకి పొగరెక్కి దేవుని ఆజ్ఞను ధిక్కరించాడు. దేవుడు అతని రాజపదవినుండి త్రోసివేసాడు. అవిధేయత పెద్ద పాపమని సౌలుకథ తెలియజేస్తుంది.

## 2. వివరణం

సమూవేలు సౌలు దగ్గరికి వచ్చి "పూర్వం నేనే నిన్ను రాజునిగా అభిషేకించానుకదా! కనుక నీవు నా పలుకులు ఆలించు. అమాలెకీయులను సర్వనాశం చేయమని ప్రభువు నిన్ను ఆజ్ఞాపిస్తున్నాడు. నీవు వాళ్ళను శాపంపాలుచేయాలి" అని చెప్పాడు. శాపం పాలుచేయడమంటే యుద్ధంలో గెల్చినవాళ్ళు ఓడిపోయినవాళ్ళను స్త్రీలు పిల్లలతోసహా వధించడం. వారి పశువులను ఆస్తులను నాశంచేయడం. ఇది క్రూరకార్యం కాదా? ప్రాచీనకాలంలో కనాను దేశానికి చుట్టుపట్ల వసించే జాతులన్నీ యుద్ధంలో ఓడిపోయిన తమ శత్రువులను శాపంపాలుచేసి నాశం చేసేవి. కనుక ఇక్కడ యావే ప్రభువుకూడ ఈ పద్ధతినే అనుసరించాడు.

అమాలెకీయులు యిస్రాయేలీయులకు పూర్వం శత్రువులు. యూదులు ఐగుప్తునుండి తరలివచ్చేపుడు ఈ ప్రజలు వారికి కీడు చేసారు. కనుక ప్రభువు వాళ్ళను నాశం చేయగోరాడు - ద్వితీ 25,17-19. సౌలు ఈ కార్యాన్ని నెరవేర్చడానికి అంగీకరించాడు.

ఆ రోజుల్లో కేనీయులనే మరోజాతివాళ్ళుకూడ అమాలెకీయులతో కలసి జీవిస్తుండేవాళ్ళు. ఈ కేనీయులు యిస్రాయేలీయులకు మిత్రులు. కనుక సౌలు మొదట వాళ్ళను అమాలెకీయులనుండి విడదీసి ప్రక్కకు పంపాడు. ఆ రీతిగా వాళ్ళు చావుని తప్పించుకొన్నారు.

సౌలు యద్ధంలో అమాలెకీయులను ఓడించి చంపివేసాడు. కాని వారి రాజైన అగాగును మాత్రం చంపలేదు. తన విజయచిహ్నాంగా అతన్ని బ్రతికి వుండనిచ్చాడు. ఇంకా సౌలు అనుచరులు అమాలెకీయుల బక్కగొడ్లనుచంపి పేసి బలిసినవాటిని మిగుల్చుకొన్నారు. కనుక సౌలు అతని సైనికులు అమాలెకీయులను శాపంపాలు చేయాలి అన్న యావే ఆజ్ఞను ఖండితంగా పాటించలేదు. తమకు లాభంగా వున్నంతవరకు శత్రువుల పశువులను దక్కించుకొన్నారు.

కావున ప్రభువు సమూవేలుకి ఫిర్యాదు చేసాడు. సౌలు నా యాజ్ఞలను ధిక్కరించాడు. నేనతన్ని రాజుని చేసినందులకు విచారిస్తున్నాను అన్నాడు. సౌలుని క్షమించమని సమూవేలు రాత్రంతా ప్రభువుకి మొరపెట్టాడు. కాని ప్రభువు అతని వేడికోలు ఆలించలేదు.

సమూవేలు సౌలుని చూడబోయి గిల్గాలు పుణ్యక్షేత్రంలో అతన్ని కలసికొన్నాడు. సౌలు నేను యావే ఆజ్ఞ పాటించి అమాలెకీయులను నాశంచేసానని డంబాలు పల్కాడు. కాని ప్రవక్త అతన్ని నిలదీసి మీరు శత్రువుల పశువులనుండి బలసిన యెడ్లను గొర్రెలను దక్కించుకొన్నారు. మరి ప్రభువు ఆజ్ఞను పాటించిందెక్కడ అని ప్రశ్నించాడు. కాని రాజు మేము వీటిని ప్రభువుకి బలి యీయడానికే అట్టిపెట్టుకొన్నామని బూకరించాడు.

ఆ మాటలకు సమూవేలు కోపం తెచ్చుకొని రాజుతో "వట్టి బలులవలన యావేకు ప్రీతి కలుగుతుందా? విధేయత వలన కాదా? బలులకంటె విధేయత గొప్పదికాదా? గర్వంతో దేవునిమీద తిరుగుబాటుచేస్తే సోదె చెప్పించుకొన్నంత పాపం. విగ్రహాలను పూజించినంత నేరం. నీవు యావే ఆజ్ఞను త్రోసిపుచ్చావు కనుక ప్రభువు నీ రాజపదవిని త్రోసివేసాడు" అని పల్కాడు.

ప్రవక్త చెప్పినట్లు, బలికంటె విధేయత గొప్పది. ఎందుకంటె బలి వట్టి బాహ్యక్రియ. హృదయంలో భక్తి లేకున్నా దాన్ని సమర్పించవచ్చు. కాని హృదయంలో భక్తిలేందే విధేయత చూపలేం. కనుక సౌలు బలి అర్పించడానికి పూనుకోవడంకంటె దేవునిపట్ల విధేయత చూపడం లెస్స.

అసలు దేవుడు సౌలుని బలి సమర్పించమని కోరనే లేదు. అమాలెకీయులను శాపంపాలు చేయమన్నాడు అంతే. సౌలు ఈ యాజ్ఞను మీరాడు. అతడు దేవుణ్ణి తనకిష్టమెచ్చిన పద్ధతిలో పూజించవచ్చుననుకొన్నాడు. అనుచరుల మన్ననను సంపాదింపగోరి వారిని తమ యిష్టం వచ్చినట్లు చేయనిచ్చాడు. అది అతని తప్పు.

సౌలు దేవుని ఆజ్ఞమీరి అతని మీద తిరుగుబాటు చేసాడు. తన్ను పైకి తీసికొనివచ్చిన దేవునిపట్ల గర్వాన్ని ప్రదర్శించాడు. ఈ యహంకారం విగ్రహాలను పూజించినంత పాపం. సోదె చెప్పించుకొన్నంత నేరం.

సౌలు ప్రభువుని నిర్లక్ష్యంచేసి అతని ఆజ్ఞను త్రోసి వేసాడు. యావేకూడ సౌలుని రాజపదవినుండి త్రోసి వేసాడు. ఇక అతనికి బదులుగా దావీదు రాజవుతాడు.

ఈ 15వ అధ్యాయాన్ని కూర్చిన రచయిత రెండు సంప్రదాయాలను ఒకదాని ప్రక్కన ఒకటి చేర్చాడు. 24-29 వచనాల ప్రకారం సమూవేలు సౌలుతో బలికి వెళ్ళలేదు. 30-31 వచనాల ప్రకారం వెళ్లాడు.

మొదట తొలి సంప్రదాయాన్ని చూద్దాం. ప్రవక్త చీవాట్లు పెట్టగా కట్టకడన సౌలు తన తప్పుని ఒప్పుకొన్నాడు. సైనికులకు మోమోటపడి వారు పశువులను దక్కించుకోడానికి అనుమతినిచ్చానని అంగీకరించాడు. తనతోపాటు బలినర్పించడానికి ప్రవక్తను గిల్గాలునకు రమ్మని వేడుకొన్నాడు. ప్రవక్త అతని వేడుకోలును తిరస్కరించి ప్రక్కకు తొలగిపోతూండగా సౌలు అతని అంగీ చెంగును పట్టుకొన్నాడు. ఈలా చేయడం సౌలు అణకువకు చిహ్నం. ప్రవక్తను బతిమాలడానికి గురుతు. కాని ప్రవక్త గబాలున వెళ్ళిపోబోగా అతని అంగీ చెంగు చినిగింది. ఈలా చినగడం సౌలు రాజ్యం చినిగిపోయిందనడానికి గుర్తు. కనుకనే ప్రవక్త యిక్కడ "ప్రభువు యిస్రాయేలు రాజ్యాన్ని నీ చేతినుండి లాగివేసి నీకంటె యోగ్యుడైన వాడికి ఇచ్చివేసాడు" అని చెప్పాడు. ఈ యోగ్యుడైనవాడు దావీదే.

ఇస్రాయేలీయులకు దీపమైన ప్రభువు రాజ్యపదవిని నెలకొల్పినందులకు విచారించలేదు. అది యికమీదట దావీదుద్వారా కొనసాగుతుంది.

ఇక రెండవ సంప్రదాయం ప్రకారం (30-31) తన వెంట గిల్గాలు బలికిరమ్మని రాజు సమూవేలుని బతిమాలాడు. యిస్రాయేలు పెద్దలముందు తన పరువు నిలబెట్టమని వేడుకొన్నాడు. సమూవేలు అలాగే గిల్గాలుబలిలో పాల్గొన్నాడు.

ఈ యధ్యాయం చివరలో అమాలెకీయుల రాజయిన అగాగు మరణవృత్తాంతం వస్తుంది. అతడు సౌలు తన్ను చంపలేదు కనుక మరణాన్ని తప్పించుకోవచ్చుననుకొన్నాడు. మరణభయం తీవ్రత తగ్గిందనుకొన్నాడు. కాని సమూవేలు అతన్ని గిల్గాలు బలిపీఠం దగ్గరికి రప్పించాడు.

అతనితో "ఓరి! పూర్వం నీ కత్తివలన చాలమంది తల్లులు తమ బిడ్డలను కోల్పోయారు. ఇప్పుడు నా కత్తివలన నీతల్లికూడ తన బిడ్డణ్ణి కోల్పోతుంది" అన్నాడు. బలిపీఠం ముందట, యావే యెదుట, అతన్ని బలిపశువును లాగ ముక్కలు ముక్కలుగా నరికివేసాడు. ఈలా సౌలు చేయవలసిన పనిని ప్రవక్తే చేసి ముగించాడు.

తర్వాత సౌలు గిల్బోవా యుద్ధంలో ప్రాణాలు కోల్పోయాడు. ఆ పిమ్మట దావీదు రాజయ్యాడు. ఈ రీతిగా సమూవేలు ప్రవచనం నెరవేరింది.

## 3. ప్రార్థనా భావాలు

1. సౌలు దేవుని ఆజ్ఞను మీరాడు. అతడు ఆగాగుని చంపలేదు. బలిసిన పశువులను వధింపలేదు. దేవుడు అడగక పోయినా బలిని అర్పించడానికి పూనుకొన్నాడు. తన అనుచరుల వత్తిడికి లొంగిపోయాడు. ప్రభువుకి అవిధేయుడయ్యాడు. అతన్ని పూర్ణహృదయంతో సేవించలేదు. ఈలాంటి అరకొర భక్తి దేవునికి నచ్చదు. కనుకనే ప్రభువు అతన్ని రాజపదవినుండి త్రోసివేసాడు. నేడు మన భక్తి, మన విధేయత ఏలా వున్నాయి? అతడు ఎన్నో సారులు మనలను మన స్థానంనుండి త్రోసివేయవలసింది కదా!

2. ప్రవక్త దేవుని స్థానంలో వుండేవాడు. దేవుని చిత్తాన్ని ప్రజలకు తెలియజెప్పేవాడు. కనుక అతని ఆజ్ఞ మీరితే దేవుని ఆజ్ఞ మీరినట్లే. కావుననే మన కథలో రాజు ప్రవక్త ఆజ్ఞ మీరగా దేవుడు తన ఆజ్ఞమీరినట్లే భావించాడు. అతన్ని రాజపదవినుండి త్రోసివేసాడు. రాజుల గ్రంథాల్లో తరచుగా రాజులకీ ప్రవక్తలకీ ఘర్షణలు వస్తుంటాయి. రాజులు ప్రవక్తల ఆజ్ఞలు మీరి పాపం కట్టుకొంటారు. కాని నేడు మనం మన పెద్దల ఆజ్ఞలను ఎంతవరకు పాటిస్తున్నాం? వారి ద్వారా విన్పించే దేవుని మాటలను ఎంతవరకు లెక్క చేస్తున్నాం?

3. దేవుడు సౌలుని రాజపదవినుండి త్రోసివేసాడు. ఇది ఘోరమైన కార్యం. ఇక ప్రభువు సౌలుని మన్ననతో జూడడు. అతనికి బదులుగా దావీదుని ఆదరిస్తాడు. సౌలు మొదటి రాజయి పాముకుందేమిటి? దేవుని ఆదరాన్ని కోల్పోవడం, అతనిచే తిరస్కరించబడ్డం, ఎంత దౌర్భాగ్యం! కాని మనం పాపకార్యాలు చేసినపుడు దేవుడు మనలను మాత్రం త్రోసివేయడం లేదా? పాపం వలన దేవుని ఆదరాభిమానాలను కోల్పోయి మనంమాత్రం దౌర్భాగ్యులం కావడంలేదా?

4. సౌలు అనుచరులు వత్తిడికి లొంగిపోయాడు. వాళ్ళు బలసిన పశువులను దక్కించుకొంటూంటే చూస్తూ వూరకున్నాడు. అతడు అనుచరుల అభిమానాన్ని సంపాదింపగోరి దేవుని అభిమానాన్ని కోల్పోయాడు. మనంకూడ మనకిష్టులైన వారి అభిమానాన్ని పొందగోరి చేయరాని పనులు చేస్తాం. చేయవలసిన పనులు చేయం. దీనివలన దేవునికి కోపం రప్పిస్తాం. అతని అభిమానాన్ని కోల్పోతాం. ఇది పరమ దౌర్భాగ్యం.

# 5. దావీదుకు అభిషేకం

# 1సమూ 16,1-13

## 1. సందర్భం

సౌలు అవిధేయుడై దేవుని ఆజ్ఞ మీరాడు. కనుక దేవుడు అతన్ని రాజపదవినుండి త్రోసివేసాడు. అతనికి బదులుగా దావీదుని రెండవరాజుగా ఎన్నుకొన్నాడు. నేను ఈషాయి కొడుకుల్లో ఒకణ్ణి రాజుగా ఎన్నుకున్నాను, నీవు వెళ్ళి అతనికి అభిషేకంచేయి అని సమూవేలు ప్రవక్తను బేత్లెహేముకి పంపాడు.

## 2. వివరణం

సౌలు అంటే సమూవేలుకి ఇష్టం. అతడు రాజపదవిని కోల్పోవడంజూచి సమూవేలు బాధపడ్డాడు. పైగా సమూవేలు రెండవరాజుకి అభిషేకం చేయబోతున్నాడని తెలిస్తే సౌలు ఊరకుంటాడా? కనుక సమూవేలు భయపడ్డాడు.

ప్రభువు సౌలుకి ఉపాయం చెప్పాడు. నీవు ఓ ఆవు పెయ్యను తోలుకొనిపో. బలిని అర్పించేవాడిలాగ బేత్లెహేం వెళ్ళు. విందు సందర్భంలో నేనెన్నుకొన్నవాణ్ణి రాజుగా అభిషేకించు. సౌలుగాని మరెవ్వరుగాని ఈ రహస్యాన్ని తెలిసికోలేరు అని చెప్పాడు.

యీషాయికి ఎన్మిదిమంది కొడుకులు. దేవుడు వాళ్ళల్లో ఎవణ్ణి రాజుగా ఎన్నుకొన్నాడో ప్రవక్తకు తెలియదు. అతడు దేవుని ఆజ్ఞప్రకారం తైలపు కొమ్మును తీసికొని ఆవుపెయ్యను తోలుకొని బేత్లెహేముకి వచ్చాడు.

సమూవేలుని చూడగానే ఆ వూరి పెద్దలకు భయం వేసింది, అతని వాక్కు దీవెననూ శాపాన్ని గూడ తెచ్చిపెడుతుంది. ఇప్పుడు అతడు బెత్లేహేము వాసులను దీవించడానికి వచ్చాడా లేక శపించడానికి వచ్చాడా? పైగా అతడు రాజులను చేసేవాడు, రాజులను కూలద్రోసేవాడు. అతని వల్ల ఈ గ్రామానికి ఏమి కీడు రానున్నదో!

సమూవేలు పురజనులకు భయపడవద్దని చెప్పాడు. మీరందరూ స్నానంచేసి శుద్ధిని పొంది బలికిరండని వారిని ఆహ్వానించాడు. యీషాయినీ అతని కుమారులనూ స్నానంతో శుద్ధిచేయించి ఆవుపెయ్యను బలియీయడానికి పూనుకొన్నాడు.

రెండవరాజును అభిషేకించే సమయం వచ్చింది. యీషాయికి ఎన్మిదిమంది కొడుకులు. వారిలో ఎవరిని రాజుగా అభిషేకించాలా అని సమూవేలు ఆలోచిస్తున్నాడు.

పెద్దకొడుకు ఎలీయాబు. అతడు రూపసి. పొడుగరి. సౌలుకీ అతనికీ ఆకారంలో పోలికలున్నాయి. పైగా యూదుల సంప్రదాయం ప్రకారం, ఇంటిలో పెద్ద కొడుక్కి కొన్ని ప్రత్యేక హక్కులుంటాయి. తండ్రి ఆస్తిలో అతనికి రెండువంతులు వస్తుంది. తండ్రి ఇంటివద్ద

లేనప్పుడు అతడు తండ్రి స్థానాన్ని పొంది తమ్ముళ్ళను ఆజ్ఞాపిస్తాడు. కనుక దేవుడు పెద్దకొడుకైన యెలీయాబునే రాజుగా ఎన్నుకొనివుండాలనుకొని సమూవేలు అతనికి అభిషేకం చేయబోయాడు. కాని దేవుడు సమూవేలుని వారించి నరులైతే వెలుపలి రూపాన్ని జూచి మురిసిపోతారు. నేనైతే హృదయాన్ని పరిశీలిస్తాము. ఈ యెలీయాబు నాకు నచ్చలేదని చెప్పాడు. తర్వాత ఇతర కుమారులైన అబీనాదాబు, షమ్మా మొదలైనవాళ్ళంతా పుట్టుక క్రమంలో సమూవేలు దగ్గరికి వచ్చారు. కాని ప్రభువు వాళ్ళనెవరినీ ఎన్నుకోకపోవడంచే సమూవేలు వారికి అభిషేకం చేయలేదు.

ప్రవక్తకు అనుమానం కలిగింది. ప్రభువు ఈ యేడ్గురు కొడుకుల్లో ఎవరినీ ఎన్నుకోలేదు. కనుక యీషాయికి ఇంకా కొడుకులు వుండివుండాలి. అందుచే ప్రవక్త నీ కుమారులంతా వీళ్లేనా అని అడిగాడు. తండ్రి అయ్యా! కడగొట్టువాడు ఇంకొకడున్నాడు. వాడు ఇంటిపట్టునలేడు. పొలంలో గొర్రెలు మేపుకొంటున్నాడు అని చెప్పాడు. ప్రవక్త అతన్ని శీఘ్రమే పిలిపింపమని తండ్రిని ఆదేశించాడు. తండ్రి పిలుపుపై దావీదు పొలంనుండి ఇంటికి వచ్చాడు.

దావీదు చూడ్డానికి ఆకర్షణీయంగా వున్నాడు. అతడు రాగానే ప్రభువు సమూవేలుతో నేను కోరుకొన్నవాడు ఇతడే అని చెప్పాడు. కనుకనే సమూవేలు విందు సమయంలో అన్నల యెదుట దావీదుకు ఏకాంతంగా అభిషేకం చేసాడు. అనగా పొట్టేలు కొమ్ముకివున్న బిరడాను తొలగించి దానిలోని ఓలివు చమురుని దావీదు తలపై కుమ్మరించాడు. యిస్రాయేలు ప్రజల రాజులకీ యాజకులకీ తైలాభిషేకం చేసేవాళ్ళు. దీనివల్ల అభిషిక్తునికి దైవశక్తి లభించేది. ఇక్కడ ఈ యభిషేకం ద్వారానే దావీదు రెండవ రాజయ్యాడు. వెంటనే దేవుని ఆత్మ దావీదు మీదికి దిగివచ్చింది. ఈ యాత్మ యుద్ధాత్మ. ఆ రోజుల్లో యిస్రాయేలుకు ప్రబల శత్రువులు ఫిలిస్టీయులు. యిస్రాయేలు రాజు వారితో యుద్ధాలు చేయాలి. కనుక ఈ యాత్మ దావీదుకి యుద్ధాల్లో నేర్పు ధైర్యసాహసాలూ దయచేసింది.

ఈ యభిషేకం సమూవేలు దావీదుకి బెత్లెహేమున రహస్యంగా చేసింది. దీన్ని గూర్చి ఇతరుల కెవరికీ తెలియదు. తార్వత యూదీయులూ యిస్రాయేలీయులూకూడ దావీదుకి హెబ్రోనున బహిరంగంగా అభిషేకం చేస్తారు - 2సమూ 2,4. 5,3. ఈ యభిషేకాలన్నీ ముగిసాక, సౌలు గిల్బోవా యుద్ధంలో చనిపోయాక, ఇంకా చాలయేండ్ల తర్వాతగాని దావీదు రాజ్యపాలనానికి పూనుకోలేదు.

## 3. ప్రార్థనా భావాలు

1. ప్రభువు ఎన్నిక ఆశ్చర్యకరంగా వుంటుంది. అతడు ఏడ్గురు అన్నలను కాదని దావీదునే ఎన్నుకొన్నాడు. ప్రవక్త వచ్చినప్పుడు దావీదు ఇంటిపట్టునగూడ లేడు. కనుక అతనికి రాజయ్యే అవకాశం చాల తక్కువ. ఎలీయాబుకి ఈ యవకాశమెక్కువ. కాని దైవనిర్ణయం తప్పుతుందా? ప్రభువు కయీనుని కాదని హేబెలునీ, ఏసావుని కాదని యాకోబునీ ఎన్నుకొన్నాడు. అతడు తన కిష్టమొచ్చిన

వారిని పిలుస్తాడు. నేడు మన పిలుపుగూడ ఈలాగే ఆశ్చర్యకరంగా వుంటుంది. యోగ్యులు ఎందరో వుండగా అతడు మనలనే తన సేవకు పిల్చాడు. కనుక మనం భక్తిభావంతో ఆ ప్రభువుకి వందనాలు చెప్పుకోవాలి.

2. ఎలీయాబు పెద్దకొడుకు, రూపసి, పొడుగరి. అన్నివిధాల రాజు కాదగినవాడు. కాని దేవుడు అతన్ని ఎన్నుకోలేదు. ప్రభువు హృదయాలు చూచేవాడు. ఎలీయాబు హృదయం అతనికి నచ్చలేదు. నరులమైన మనం వెలుపలి రూపాన్ని చూచి భ్రమసిపోతాం. ఆకారాలు, అందచందాలు, కులం, అధికారం, డిగ్రీలు, మాటతీరు మొదలైనవాటిని చూచి మనం నరులకు విలువనిస్తాం. కాని దేవుని దృష్టిలో ఇవెందుకూ కొరగావు. హృదయాలకు విలువనిచ్చే దేవునికి మన హృదయం నచ్చుతుందా? మనం తోడి నరులను మెప్పిస్తుంటామా లేక దేవుణ్ణి మెప్పిస్తుంటామా? దేవుళ్ళాగే మనంకూడ అంతరంగానికి విలువనీయవద్దా?

3. దావీదు అభిషేకం పొందగానే దేవుని ఆత్మ అతని మీదికి దిగివచ్చింది. ఆయాత్మ యుద్ధబలాన్ని ఇచ్చే ఆత్మ అని చెప్పాం. నాడు యిస్రాయేలీయులకు ముఖ్యంగా కావలసింది ఫిలిస్టీయులతో పోరాడే రాజు. కనుక ఆత్మ దావీదుకి ఆ సామర్థ్యాన్ని ఇచ్చింది. నేడు ఆత్మ మనకుకూడ మన అంతస్తుకి తగిన వర ప్రసాదబలాన్ని దయచేస్తుంది. ఆయాత్ముడు గురువుకీ, ఉపదేశికీ, మఠకన్యకీ సంఘపెద్దకీ ఉపాధ్యాయునికీ ఎవరికి కావలసిన బలాన్ని వాళ్ళకు దయచేస్తాడు. మన తరపున మనం వినయంతో మనకు కావలసిన వరప్రసాదాన్ని ఆయాత్మ నుండి అడుగుకోవాలి.

# 6. దావీదు గొల్యాతు
# -1 సమూ 17,1-11. 32-54

## 1. సందర్భం

దావీదు వీరకృత్యాలు ఎన్నో ప్రసిద్ధిలోకివచ్చాయి. కాని వాటిల్లో గొల్యాతు కథకు వచ్చిన ప్రసిద్ధి దేనికీ రాలేదు. ఈ జీవితంలో మన గొల్యాతులు మనకుంటారు. ఆ దావీదులాగే మనంకూడ దైవబలంతో మన గొల్యాతులను గెల్వాలి.

## 2. వివరణం

యిస్రాయేలీయులకు ప్రబల శత్రువుల ఫిలిస్టీయులు. వారినిబట్టే కనాను దేశానికి "పాలస్టీనా" అని పేరు వచ్చింది. ఓసారి ఎఫేసు దమ్మీము వద్ద యూదులకు ఫిలిస్టీయులకూ

యుద్ధం జరిగింది. ఉభయ సైన్యాలు ఆవైపు కొండపైనీ ఈవైపు కొండపైనీ బారులు తీర్చాయి. మధ్యలో లోయ వుంది.

యిస్రాయేలీయుల రాజు సౌలు. ఫిలిస్టీయుల నాయకుడు గొల్యాతు. ఈ గొల్యాతు తొమ్మిదగుల ఎత్తునవుండి రాక్షసుళ్ళాగ కన్పించేవాడు. అతని తలకు కంచుటోపీవుంది. రొమ్ముకు కవచంవుంది. కాళ్ళకు పదత్రాణాలు వున్నాయి. భుజంమీద యీటె, చేతిలో బాకూ వున్నాయి. ఓ బంటు డాలు మోస్తూ అతనికి ముందుగా నడుస్తూంటాడు.

గొల్యాతుకి వొళ్ళంతా ఆచ్ఛాదనముంది. నొసటిమీద మాత్రం ఏమీలేదు. కనుక నొసటిమీద కొడితేనేగాని వాడు చావడు.

గొల్యాతు ముందుకివచ్చి యిస్రాయేలు సైన్యం నుండి ఎవరైనా ఒక వీరుడు వచ్చి తనతో పోరాడవచ్చునని సవాలు చేసాడు. యిస్రాయేలీయుల వీరుడు గెలిస్తే ఫిలిస్టీయులంతా యిస్రాయేలీయులకు బానిసలౌతారనీ, తాను గెలిస్తే యిస్రాయేలీయులంతా ఫిలీస్టయులకు బానిసలౌతారనీ పందెం వేసాడు. ఉభయ పక్షాల సైనికులు యుద్ధం చేస్తే చాలమంది చస్తారు. ఈ పద్ధతిలో ఐతే ఎవడో ఒక్క వీరుడు మాత్రమే చనిపోతాడు. అధిక ప్రాణనష్టం జరుగదు. కనుక ఉభయ పక్షాలు ఇద్దరు వీరులు మాత్రమే పోరాడే పద్ధతిని అంగీకరించాయి. కాని ఫిలిస్టీయునితో పోరాడగల మెనగాడెవడు యిస్రాయేలీయుల పక్షాన కన్పించలేదు. వాళ్ళంతా గొల్యాతుని చూచి భయపడ్డారు.

అప్పుడు దావీదనే బాలుడు సౌలు దగ్గరికివచ్చి రాజా! మనవారి పక్షాన నేను గొల్యాతుతో పోరాడగలను మీరేమీ భయపడనక్కరలేదు అన్నాడు. సౌలు దావీదుతో నాయనా! నీవు ఏనాడు యుద్ధంలో పాల్గొనని బాలుడివి. అతడు చాల యుద్ధాల్లో పోరాడి ప్రావీణ్యం గడించిన మహావీరుడు. నీవు అతనితో ఏలా పోరాడతావు అన్నాడు.

దావీదు రాజా! నేను సైనికులతో పోరాడని మాట నిజమే. కాని వన్యమృగాలతో పోరాడి అనుభవం గడించాను. మాతండ్రి గొర్రెలుకాస్తూ చాలసార్లు సింహాలతో ఎలుగుబంట్లతో పోరాడి వాటిని మట్టుపెట్టాను. వన్యమృగాల వాడి గోళ్ళనుండి నన్ను రక్షించిన దేవుడు సున్నతి సంస్కారంలేని ఈ ఫిలిస్టీయుని బారినుండి తప్పక కాపాడతాడు. సజీవుడూ శక్తిమంతుడూ ఐన ప్రభువు సైన్యాలను సవాలు చేయడానికి వీడు ఏపాటివాడు అన్నాడు.

ఆ మాటలాలించి సౌలు యిస్రాయేలీయుల తరపున గొల్యాతుతో పోరాడ్డానికి దావీదుకి అనుమతి నిచ్చాడు. ఆ రాజు దావీదుచేత తన ఆయుధాలను ధరింపజేసాడు. కాని దావీదు గొర్రెలు కాచుకొనే బాలుడు. ఆయుధాలకు అలవాటు పడినవాడు కాడు. కనుక అతడు వాటితో నడవలేకపోయాడు. పైగా గొల్యాతు ఈ ఆయుధాలవల్ల చావడు. అందుచే దావీదు వాటిని తొలగించివేసాడు.

దావీదు ఆయుధం ఒడిసెల. అతడు ఏటినుండి నున్నని రాళ్లు ఐదేరుకొని సంచిలో వేసికొని కఱ్ఱ చేతబట్టుకొని గొల్యాతు మీదికి పోయాడు. ఫిలిస్తీయుడు తన బంటు డాలు మోస్తూ ముందు నడువగా దర్పంతో దావీదు మీదికి వచ్చాడు.

గొల్యాతు యిస్రాయేలీయుల పక్షంనుండి సౌలు రాజో లేక మరో మహావీరుడో తనతో పోరాడ్డానికి వస్తాడనుకొన్నాడు. తీరాచూస్తే ఓ పసివాడు తనమీదికి వస్తున్నాడు. ఇది ఫిలిస్తీయునికి అవమానమనిపించింది. అతడు దావీదుతో ఓరీ! నీవు కఱ్ఱనెత్తుకొని కుక్కమీదికి వచ్చినట్లుగా నా మీదికి వస్తున్నావా? నాతో పోరాడ్డానికి నీకెన్ని గుండెలు? నేను నిన్ను చంపి వన్యమృగాలకు ఆహారంగా వేస్తాను అన్నాడు.

దావీదు ఓయి! నీవు కత్తి యీటె బాకు మొదలైన ఆయుధాలతో నామీదికి వస్తున్నావు. కాని నేను మా దేవుని పేరుమీదిగా నీపైకి వస్తున్నాను. నీది మానుషబలం, నాది దైవబలం. నేను నిన్ను చంపి నీ శవాన్ని ఆకాశపక్షులకు మేతగా వేస్తాను. యిస్రాయేలీయులు కొలిచే దేవుడొకడు ఉన్నాడు. అతడు ఆయుధాలద్వార విజయాన్ని ప్రసాదించడు. ఈ యుద్ధం మా దేవునిది. అతడు తన్ను నమ్మినవాళ్ళకు ఉచితంగానే గెలుపును దయచేస్తాడు అని పల్కాడు.

ఈలా ఫిలిస్తీయుడు దావీదు తమతమ సేనలను దాటివచ్చి రెండు కొండల నడుమనున్న లోయలో ఒకరినొకరు ఎదుర్కొన్నారు. దావీదు కొంచెం దూరం నుండే ఒడిసెలతో రాయి విసిరి ఫిలిస్తీయుని నొసటిపై కొట్టాడు. అక్కడ అచ్ఛాదనమేమీలేదు. కనుక ఆ రాయి ఫిలిస్తీయుని నొసటిని చీల్చుకొని లోపలికి పోయింది. దానితో గొల్యాతు మొదలు నరికిన తాటిచెట్టులాగ గభీలున నేలపైన కూలాడు. అతడు స్పృహతప్పి పడిపోయాడుకాని ఇంకా చావలేదు.

దావీదు సాహసంతో ఫిలిస్తీయుని కత్తిని లాగుకొని దానితోనే అతనిని పొడిచి చంపాడు. అతని తలను తెగనరికాడు. ఫిలిస్తీయ సైనికులు తమ వీరుడు కూలడం చూచి గుండెలు చెదరి పారిపోయారు. యిస్రాయేలీయులు వారిని వెన్నాడి దొరికినవారిని దొరికినట్లుగా వధించారు. ఫిలిస్తీయుల శిబిరం నుండి కొల్లసొమ్ము దోచుకొన్నారు. ఈ రీతిగా వాళ్ళు శత్రువుమీద మహావిజయం సాధించారు.

## 3. ప్రార్థనా భావాలు

1. ఈ కథలో పసివాడైన దావీదు మహావీరుడైన గొల్యాతుని గెల్చాడు. ఇక్కడ దావీదు చిన్న రాజ్యమైన యూదాను సూచిస్తాడు. గొల్యాతు యూదామీదికి దండెత్తి వచ్చిన పెద్ద రాజ్యాలను సూచిస్తాడు. శతాబ్దాల పొడుగునా ఈజిప్టు, అస్సిరియా, బాబిలోనియా, పర్షియా, గ్రీసు, రోము మొదలైన పెద్దరాజ్యాలు యూదులను

నాశంజేయ జూచాయి. యూదా చిన్న రాజ్యమైనా దైవబలం కలది. దైవరక్షణం కలది. కనుక అది నాశమైపోలేదు. దేవుని నమ్మినవాళ్లు చిన్నవాళ్ళయినా సరే ఓడిపోరు. దావీదు చిన్నవాడే కావచ్చు. గొల్యాతు పెద్దవాడే కావచ్చు. కాని గొల్యాతుకంటె పెద్దవాడైన దేవుడు దావీదుని కాపాడాడు. ఈలాగే మనకుకూడ ప్రభువు అండాదండా లభించాలని వేడుకొందాం.

2. ఈ జీవితంలో మన గొల్యాతులు మనకుంటారు. ఈ గొల్యాతులు మన అపజయాలు, భయాలు, పిరికితనం, వ్యాధిబాధలు, నిరుత్సాహం, దారిద్ర్యం మొదలైన నానారూపాల్లో వుంటాయి. కాని వాటిది కేవలం లౌకిక బలం. మనలను కాపాడేదా దైవబలం. దైవబలం ముందు లౌకికబలమెంత? దేవుణ్ణి నమ్మిన భక్తుడు కలకాలం గెలుస్తాడు. ఈ దృష్టితో జూస్తే, బైబులు బోధ అంతాగూడ ఈ దావీదు కథలో ఇమిడివుంది.

3. గొల్యాతుకి కత్తి, బాకు, ఈటె, మొదలైన భయంకరాయుధాలు వున్నాయి. దావీదు ఆయుధం చిన్న ఒడిసెల మాత్రమే. ఈ చిన్న ఒడిసెలతోనే అతడు మహాయుధాలు కల వీరుణ్ణి గెల్చాడు. అసలు దావీదు ఆయుధం ప్రభువు దివ్యనామమే. అతడు గొల్యాతుతో "నేను సైన్యాలకు అధిపతియైన యావే పేర నీ మీదికి దండెత్తి వచ్చాను" అన్నాడు - 45. నేడు మనకుకూడ ఆ ప్రభువు నామమే, అతనిమీద నమ్మకమే ఆయుధం.

4. దావీదు దేవుణ్ణి నమ్మినతీరును మనం జాగ్రత్తగా మననం చేసికోవాలి. అతని వాక్యాలు ఈనాడు మనకూ ప్రేరణం పుట్టిస్తాయి. ఎలుగుబంటులూ సింహాల వాడిగోళ్ళ నుండి నన్ను రక్షించిన ప్రభువు ఈ ఫిలిస్టీయునినుండి కాపాడకపోడు - 37. నేను యావే పేర యుద్ధానికి వచ్చాను-45. యావే కత్తి బల్లాలవలన విజయాన్ని ప్రసాదించదు. ఈ యుద్ధం యావేది-47. ఈ వాక్యాల్లో ఎంత నమ్మకం కన్పిస్తుందో చూడండి! పూర్వం ఓ కీర్తనకారుడు

కొందరైతే రథాలనూ గుర్రాలనూ నమ్మారు
మేమైతే ప్రభువుని నమ్మాం

అని పాడాడు-20,7. ఈ వాక్యం దావీదుకు అక్షరాల వర్తిస్తుంది. అది నేడు మనకూ వర్తించాలి.

# 7. నాతాను ప్రవచనం

# 1రాజుల దినచర్య 17

## 1. సందర్భం

గిల్బోవా యుద్ధంలో ఫిలిస్టీయులు సౌలుని వధించారు. సౌలు కుమారుడు ఈష్బోషెతు యిస్రాయేలు పదకొండు తెగలకు రాజయ్యాడు. యూదా తెగమాత్రం దావీదును రాజుగా ఎన్నుకొని అతనికి అభిషేకం చేసింది. పదిన్నరయేండ్లపాటు దావీదు ఈష్బోషెతు వైరిరాజులుగా పరిపాలించారు. అటుతర్వాత శత్రువులు ఈష్బోషెతును వధించారు. ఆ పిమ్మట యిస్రాయేలు తెగలన్నీవచ్చి దావీదుని దేశానికంతటికి రాజునుగా హెబ్రోనున అభిషేకించాయి. తదనంతరం దావీదు రాజధానిని యెరూషలేముకి మార్చాడు. మందసాన్ని ఆ నగరానికి తోడ్కొని వచ్చాడు. శత్రువులు చాలవరకు లొంగిపోయారు. ఇక అతనికి యెదురులేదు.

## 2. వివరణం

ఈలాంటి పరిస్థితుల్లో దావీదు నేనైతే దేవదారు కొయ్యతో నిర్మించిన సుందరమైన ప్రాసాదంలో వసిస్తున్నాను. ప్రభువు మందసం మాత్రం దిక్కుమొక్కు లేకుండా ఓ డేరాలో పడివుంది. ప్రభువు సాన్నిధ్యానికి నా మేడను మించిన మందిరాన్ని కడతాను అనుకొన్నాడు. ఆ యాలోచనను నాతాను ప్రవక్తకు తెలుపగా అతడు నీవు కట్టగోరిన దేవాలయాన్ని కట్టు అని చెప్పాడు.

కాని ఆ రాత్రే ప్రభువు వాణి నాతానుతో దావీదు దేవాలయం కట్టగూడదని చెప్పింది. నాతాను ఆ సంగతిని ప్రవచన రూపంలో దావీదుకి తెలియజేసాడు. దాని వివరణమిది. ప్రభువు ఎడారి కాలంలో యిస్రాయేలీయులతో ప్రయాణం చేసినంతకాలం తనకు దేవాలయం కట్టమని ప్రజానాయకులను అడగలేదు. ఆ కాలమంతా ప్రభువు మందసం గుడారంలోనే వుండిపోయింది. యిస్రాయేలీయులు కనాను దేశంలో స్థిరపడిన పిదపగూడ దేవుడు తనకు దేవళం కట్టమని న్యాయాధిపతులను కోరలేదు.

ప్రభువు అల్పుడైన దావీదుని ఆదరించాడు. అతడు పొలంలో గొర్రెలు మేపుతూండగా దేవుడు అతన్ని పిలిపించి రాజుని చేసాడు. అతడు చేసిన యుద్ధాల్లో అండగా వుండి అతనికి విజయాన్ని ప్రసాదించాడు. ప్రపంచంలోని మహారాజులకు అబ్బే కీర్తి దావీదుకి గూడ లభించేలా చేసాడు. ఇవి ప్రభువు దావీదుకి చేసిన వ్యక్తిగతమైన వుపకారాలు.

ప్రభువు యిస్రాయేలు సమాజానికి గూడ ఎన్నో వుపకారాలు చేసాడు. వారికి కనాను దేశాన్ని నివాసస్థానం చేసాడు. ఆ దేశపు ఆదిమవాసులు వారికి లొంగిపోయేలా చేసాడు.

దావీదు ప్రభువుకి మందిరాన్ని కట్టాలని కోరుకొన్నాడు కదా! ఈ కోరికకు దేవుడు ఎంతో సంతోషించాడు. దావీదు తనకు దేవాలయం కట్టకపోయినా కట్టినట్లే భావించాడు. కనుక అతడు దావీదుని బహూకరింపగోరాడు. ఆ బహుమానమేమిటంటే, దేవుడు దావీదుకి ఓ మందిరాన్ని కట్టిపెడతాడు. ఆ మందిరం దావీదు రాజవంశమే. దావీదు వంశంలో పుట్టినవాళ్ళు ఎడతెగకుండా యెరూషలేములో పరిపాలనం చేస్తారు. అతని రాజవంశం కలకాలం కొనసాగుతుంది. కడన ఆ రాజవంశంనుండే మెస్సీయా పుడతాడు. ఆ ప్రభువు రాజ్యానికి అంతమే వుండదు. ఆ క్రీస్తుద్వారా దావీదు రాజవంశం శాశ్వతంగా నిల్చిపోతుంది.

దావీదుకి బదులుగా అతని కుమారుడు సొలోమోను దేవాలయం కడతాడు. దావీదే ఎందుకు మందిరాన్ని కట్టగూడదంటే, అతడు చాల జాతులతో యుద్ధాలుచేసి రక్తాన్ని అపారంగా ఒలికించాడు. అతని చేతులు మలినమయ్యాయి. అలాంటి మలిన హస్తాలతో అతడు దేవునికి మందిరాన్ని కట్టగూడదు. ఆ పని సొలోమోను చేస్తాడు. – 1రాజుల దినచర్య 22,6-10.

ప్రభువు ఈ సొలోమోనుని కుమారునిలాగ ఆదరిస్తాడు. సౌలులాగాక సొలోమోను దేవుని మన్ననను పొందుతాడు. ఇది నాతాను దావీదుకి చెప్పిన ప్రవచనం. ఈ ప్రవచనం ప్రకారం మెస్సీయా దావీదు వంశంలో జన్మిస్తాడు. అతడు రాజుగా అవతరిస్తాడు.

పూర్వం సీనాయి కొండదగ్గర ప్రభువు యిస్రాయేలీయులందరితోను నిబంధనం చేసికొన్నాడు. తాను వారిని కాచి కాపాడతానని బాసచేసాడు. ఐతే దావీదు కాలంనుండి ఈ సీనాయి నిబంధనం దావీదు కుటుంబానికి పరిమితమై పోయింది. అనగా యికమీదట దావీదు కుటుంబంద్వారా, ఆ కుటుంబంలో జన్మించే మెస్సీయా ద్వారా, ప్రభువు యిస్రాయేలీయులను ఉద్ధరిస్తాడు. ఈ ప్రవచనంతో మొదలుపెట్టి ప్రవక్తలు 500ఏండ్లపాటు మెస్సీయా దావీదు కుటుంబంలోనే జన్మిస్తాడని ప్రవచనాలు చెప్తూవచ్చారు. వాళ్ళు చెప్పినట్లే తర్వాత వెయ్యేండ్లకు క్రీస్తు దావీదు కుమారుడుగా బేత్లెహేములో జన్మించాడు.

నాతాను ప్రవచనం దావీదుకి పరమానందం కలిగించింది. తన రాజవంశం శాశ్వతంగా కొనసాగడం, తన కుమారుడు సొలోమోను యెరూషలేములో దేవాలయం కట్టడం సామాన్య భాగ్యాలా! అతడు దైవమందసాన్ని పెట్టివుంచిన గుడారంలోనికి వెళ్ళి ప్రభువుకి కృతజ్ఞతావందనాలు చెల్లించాడు. ప్రభూ! నీవు నన్నింతగా పట్టించుకోడానికి నేనేపాటివాణ్ణి? మా కుటుంబమేపాటిది? నీవు నన్నింతగా ఆదరించి పెద్దజేయాలా? అని వ్యక్తిగతంగా వందనాలు అర్పించాడు.

ప్రభువు యిస్రాయేలు సమాజానికంతటికీ గూడ వుపకారాలు చేసాడు. అతడు ఐగుప్తులో ఆ ప్రజల కొరకు ఎన్నో అద్భుతాలు చేసాడు. వారిని ఫరో బానిసంనుండి

విడిపించి కనాను దేశానికి తీసికొని వచ్చాడు. వారితో ఒప్పందం చేసికొన్నాడు. తాను వారికి దేవుడూ, వారు అతనికి భక్తులూ అయ్యారు. ఈ ఉపకారాలకు దావీదు ప్రభువుకి సమాజపరంగా వందనాలు అర్పించాడు. అతని ప్రార్థన మనకుగూడ కృతజ్ఞతాభావాన్ని నేర్పిస్తుంది.

## 3. ప్రార్థనా భావాలు

1. మెస్సీయా రాజుగా వస్తాడు, దావీదు కుటుంబంలో పుడతాడు అని యూదులు శతాబ్దాల పొడుగునా ఉత్సాహంతో ఎదురుచూస్తూ వచ్చారు. వాళ్ళ ప్రవక్తలు ఈ యంశాన్ని పురస్కరించుకొని ఎన్నో ప్రవచనాలు చెప్పారు. మెస్సీయా రాజు అనే ప్రవచనాలకు నాతాను సందేశమే ఆధారం. ఐతే క్రీస్తుపూర్వం 587లో బాబిలోనియా ప్రవాసంతో దావీదు వంశం అంతరించింది. ఆ పిమ్మట దావీదు వంశపు రాజులు లేరుకాని దావీదు కుటుంబం మాత్రం కొనసాగింది. యోసేపు ఈ దావీదు కుటుంబానికి చెందినవాడే. అతని పెంపుడు కొడుకే క్రీస్తు. యోసేపు ద్వారా క్రీస్తు దావీదు కుటుంబానికి చెందినవాడయ్యాడు. దావీదు కుమారుడయ్యాడు. ఈ క్రీస్తురాజు రాజ్యానికి అంతం ఉండదు. అతడు శాశ్వతంగా రాజు - లూకా 1,32-33. దావీదు రాజవంశం ఏనాడో అంతరించినా అది క్రీస్తుద్వారా శాశ్వతంగా కొనసాగిపోతుంది. ఆ ప్రభువు నాడు యిస్రాయేలీయులకూ నేడు మనకూగూడ రక్షణాన్నిచ్చేవాడు. క్రీస్తు మనలను సంపూర్ణంగా రక్షించాలని ప్రార్థిద్దాం.

2. దావీదు మందిరం కట్టకపోయినా దేవుడు అతని మంచి కోరికను మెచ్చుకొన్నాడు. తానే అతనికి ఓ మందిరాన్ని కట్టిపెడతానని వాగ్దానం చేసాడు. దేవుడు దావీదుకి కట్టిపెట్టే మందిరం అతని రాజవంశమే. ఆ వంశంనుండే మెస్సీయా ఉద్భవిస్తాడు. అతనిద్వారా దావీదు రాజవంశం అవిచ్ఛిన్నంగా కొనసాగుతుంది. ఈ దావీదులాగే మనకు గూడ మంచి కోరికలుండాలి. మంచి కోరికలు ప్రార్థనల్లాంటివి. మంచికోరికలంటే యేమిటివి? మతం వ్యాప్తిచెందాలి. గురువులు మఠకన్యలు పవిత్రంగా జీవించాలి. ప్రజల్లో భక్తివిశ్వాసాలు పెరగాలి. పాపం అంతరించాలి. దేవుని చిత్తమైతే మనచుట్టూవున్న అన్యమతస్థులుకూడ ప్రభువు శిష్యులు కావాలి. అతని బోధలను ఆలించాలి. చాలమంది యువతీయువకులు దైవసేవలో చేరాలి. ఈలాంటి భక్తిగల కోరికలను మనం నిరంతరం కోరుకొంటూండాలి. వీటిని

దేవుడు ప్రార్థనలుగానే భావిస్తాడు. పూర్వం మన ప్రాంతంలో వేదబోధ చేసిన విదేశ గురువులకూ మతకన్యలకూ ఎన్ని భక్తిగల కోరికలుండేవో! ఆనాటి వాళ్ళకోరికల ఫలితంగానే ఇప్పుడు మనం క్రైస్తవులమయ్యాం. ప్రభువు నేడు మనకుగూడ భక్తిగల కోరికలు పుట్టించాలని అడుగుకొందాం.

3. ఈ యధ్యాయంలో దావీదు వ్యక్తిగతంగాను యిస్రాయేలు సమాజం తరపునాను సమర్పించిన కృతజ్ఞతా ప్రార్థనం చాల భక్తిమంతమైంది. అతన్నిచూచి మనంకూడ భక్తితో కృతజ్ఞతా ప్రార్థనం చేయడం నేర్చుకోవాలి. ఆ ప్రభువు కరుణవల్ల మనకు విద్య వుద్యోగం పరపతి కుటుంబం పిల్లాజల్లా ఇల్లూవాకిలీ ఆరోగ్యం శాంతి మొదలైన నానా భాగ్యాలు సిద్ధించాయి. క్రైస్తవ విశ్వాసం, తిరుసభ దేవద్రవ్యానుమానాలు బైబులు గ్రంథం మరియమాత మొదలైన ఆధ్యాత్మిక వరాలు ఎన్నో లభించాయి. వీటన్నిటికి గాను మనం ప్రభువుకి వందనాలు చెప్పుకోవద్దా?

4. దావీదు ప్రభువుకి దేవాలయం కట్టాలనుకొన్నాడు. తాను వసించే మేడకంటె పెద్దభవనం నిర్మించాలనుకొన్నాడు. అతని దేవాలయభక్తి అపారమైంది. తర్వాత సొలోమోను దేవాలయం కట్టించాడు. అది ఆనాటి గొప్ప భవనాల్లో ఒకటిగా రూపొందింది. యూదులు సంవత్సరం పొడవునా ఈ దేవళానికి యాత్రచేస్తుండేవాళ్ళు. దానిపట్ల అపారమైన భక్తి చూపేవాళ్ళు. నేడు మన గ్రామంలో, విచారణలో వుండే దేవాలయంపట్ల మనకు నిజమైన భక్తి వుండాలి. ప్రార్థనకూ పూజకూ మనం ఆ మందిరానికి వెళ్తూండాలి. దాన్నిచూచి గర్వించాలి. కాని మన దేవాలయ భక్తి ఏపాటిది?

# 8. దావీదు పాపం

# 2సమూ 11,2-12,14

## 1. సందర్భం

దావీదు యిస్రాయేలు రాజులందరిలోను గొప్పవాడు. ప్రభువుకి అమితంగా ప్రీతి కలిగించినవాడు. అలాంటివాడే స్త్రీ వ్యామోహానికి లొంగి పాపంలో పడిపోయాడు. దీన్నిబట్టి మన బలహీనతలను మనం ఏనాడూ విస్మరించకూడదని అర్థం జేసికోవాలి. హీబ్రూ రచయితలు దావీదుని ఉత్తమ రాజునిగా చిత్రించారు. ఐనా వాళ్ళు అతని బలహీనతను కప్పిపెట్టలేదు. వారిలాగే మనంకూడ సత్యప్రీతిని అలవర్చుకోవాలి.

## 2. వివరణం

అది యుద్ధకాలం. దావీదు సైన్యాధిపతియైన యోవాబు రెండవ అమ్మోనీయుల యుద్ధాన్ని నడిపిస్తూ రబ్బా పట్టణంలో వున్నాడు. దావీదు యెరూషలేమున వున్నాడు. ఒకనాటి సాయంకాలం అతడు రబ్బా యుద్ధాన్ని గూర్చి ఆలోచిస్తూ తన మేడమీద పచార్లు చేస్తున్నాడు. ప్రక్కింటి ఆడగూతురు బెత్షెబా స్నానం చేసికొంటూ అతని కంటబడింది. ఆమెను చూడగానే రాజుకి మతిపోయింది. అతను బెత్షెబాను గూర్చిన వివరాలు అడగ్గా ఆమె ఊరియా భార్య అని తెలిసింది. ఈ వూరియా హిత్తీయుడు. దావీదుకి అంగరక్షకుడు. ముప్పదిమంది వీరుల్లో ఒకడు.

దావీదు కామవికారానికి లొంగి బెత్షెబాను ప్రాసాదానికి రప్పించుకొని ఆమెతో పాపంచేసాడు. ఆ పాపఫలితంగా ఆమెకు గర్భం కలిగింది. ఆమె గర్భవతి ఐనప్పటినుండి రాజు పన్నాగాలకు పూనుకొన్నాడు. బత్షెబా తనవలనగాక తన భర్తయైన ఊరియావల్లనే గర్భవతి ఐనట్లుగా నిరూపించాలని అతని తపన.

కనుక అతడు రబ్బాలో అమ్మోనీయులతో పోరాడుతూన్న ఊరియాను యెరూషలేముకి పిలిపించాడు. అతని నుండి యుద్ధవార్తలు విన్నాడు. సాయంకాలం అతన్ని యింటికి పొమ్మన్నాడు. అతడు ఆ రేయి ఆలిని కూడతాడని భర్తవల్లనే బెత్షెబాకు గర్భం కలిగినట్లుగా ప్రచారం చేయవచ్చునని దావీదు తలంపు.

కాని వూరియా ఆ రాత్రి యింటికి పోనేలేదు. రాజు మేడ ముందటనే అంగరక్షకుల ప్రక్కన పండుకొని నిద్రించాడు. దావీదు నీవు మీ యింటికేల పోలేదని ప్రశ్నింపగా వూరియా ప్రభూ! దైవమందసంతోపాటు యిస్రాయేలు సైనికులుకూడ గుడరాంలోనే పడివున్నారు. యుద్ధకాలంలో యోవాబు అతని అంగరక్షకులు బయటనే నిద్రిస్తున్నారు. ఈలాంటి పరిస్థితుల్లో నేను హాయిగా తిని త్రాగి ఆలిని కూడతానా? నేను అలాంటిపని చేసేవాణ్ణికాదు అన్నాడు.

యిస్రాయేలు సంప్రదాయం ప్రకారం యుద్ధం పవిత్రమైంది. కనుక యుద్ధకాలంలో సైనికులకు భార్యా సంగమం నిషిద్ధం - 1సమూ 21,4-5. ఇక్కడ అన్యజాతివాడైన హిత్తీయుడు ధర్మశాస్త్ర నియమాలను జాగ్రత్తగా పాటించాడు. అతని శీలం గొప్పది. భక్తుడైన దావీదు మాత్రం ధర్మశాస్త్ర నియమాలను మీరాడు. ఇది విడ్డూరం.

ఘళ్ళా రెండవసారి దావీదు వూరియాను అతని ఇంటికి పంపగోరాడు. కనుక ఆ మరునాడు అతన్ని తనతోపాటు భోజనానికి ఆహ్వానించి తప్పత్రాగించాడు. మధుపానం లైంగికవాంఛలను రెచ్చగొడుతుంది. ఐనా వూరియా లొంగలేదు. ఆ రేయికూడ అతడు యింటి వెళ్ళక రాజు అంగరక్షకుల ప్రక్కనే పండుకొని నిద్రపోయాడు.

ఇక దావీదు వూరియాను ఏలాగైన వదలించుకొని బత్షెబాను పెండ్లిచేసికోవాలనుకొన్నాడు. కనుక అతడు యోవాబుకి ఓ జాబు వ్రాసి దాన్ని వూరియా చేతనే పంపాడు. దానిలో "నీవు పోరు భీకరంగా జరిగే తావున వూరియాను మొదటి వరుసలో పెట్టించు. శత్రువులువచ్చి అతనిమీద పడినప్పుడు మీరతన్ని ఆదుకోవద్దు" అని వ్రాసాడు. ఊరియా ఈ జాబుని సేనాధిపతి దగ్గరికి తీసికొనిపోవడం వలన తన చావుకబురుని తానే మోసికొనిపోయి నట్లయింది. యుద్ధంలో మొదటి వరుసలో వున్నవాళ్ళకు అపాయమెక్కువ. ప్రాణాలకు తెగించి పోరాడే శూరులనే మొదటి వరుసలో వుంచుతారు.

జాబును చూడగానే యోవాబుకి దావీదు కుట్ర అర్థమైంది. అతడు రాజు చెప్పినట్లే చేయగా వూరియా యుద్ధంలో చనిపోయాడు. యోవాబు రాజునొద్దకు దూతనంపి యుద్ధవార్తలు చెప్పించాడు. తాము శత్రువుల నగరమైన రబ్బాను ముట్టడిస్తుండగా యిస్రాయేలు వీరులు కొందరు మరణించారనీ వారిలో ఊరియాకూడ వున్నాడనీ చెప్పించాడు. దావీదు దూతతో యుద్ధంలో ఎవరు చస్తారో ఎవరు బ్రతుకుతారో చెప్పలేం. జరిగినదానికి చింతించవద్దు. మీరు యుద్ధాన్ని ఇంకా తీవ్రంచేసి రబ్బా పట్టణాన్ని జయించండి అని చెప్పాడు. రాజుకి కావలసింది వూరియా చావు. అతనితోపాటు ఇంకా కొందరు వీరులు కూలినా దావీదుకి చింతేమీ లేదు.

వూరియా పోయాడు కను బెత్షెబా దావీదుకి సొంతమైపోయింది. రాజు తలచుకొంటే దెబ్బలకు కొదవా? అతడు ఆమెను తన మేడకు రప్పించుకొని పెండ్లి చేసికొన్నాడు. అటుపిమ్మట ఆమె బిడ్డను కంది. ఇక్కడ దావీదు కేవలం కామతృప్తికొరకే బత్షెబాను పెండ్లి చేసికొన్నాడు అనుకోగూడదు. పెనిమిటి పోయాడు కనుక దిక్కులేని బత్షెబాను ఆమె బిడ్డణ్ణి కాపాడ్డానికి అతడు ఆమెను పరిణయమాడాడు అని చెప్పాలి.

కాని దావీదు చేసిన ఈ దుష్కార్యం యావేకు కోపం కలిగించింది. అతడు ఓ పేదవాణ్ణి అన్యాయంగా చంపించి అతని భార్యను అపహరించాడు. కాని మోషే ధర్మశాస్త్రం ప్రకారం యిస్రాయేలీయులను నడిపించే ప్రభువు రాజు అధర్మాన్ని ఏలా సహిస్తాడు? కనుక అతడు దావీదుని చీవాట్లు పెట్టడానికి తన భక్తుడైన నాతాను ప్రవక్తను పంపాడు. ప్రవక్తలు ప్రభువు సందేశాన్ని ప్రజలకు ఎరిగించేవాళ్లు. తాము ప్రభువుకి నోరై మాటలాడేవాళ్ళు.

దావీదు సామాన్యుడు కాదు, రాజు. కనుక ప్రవక్త అతన్ని నేరుగా మందలించకూడదనుకొన్నాడు. ఓ కథ ద్వారా అతని అంతరాత్మకు ప్రబోధం కలిగించాలనుకొన్నాడు. కావున నాతాను దావీదుకి ఈ కథ చెప్పాడు. అయ్యా! ఎంత అన్యాయం జరిగిందో చూచావా! ఓ నగరంలో ఓ పేదవాడూ ఓ ధనికుడూ వసిస్తున్నారు.

ధనికునికి చాల పసులమందలున్నాయి. పేదవానికి ఒక్కటే గొర్రెపిల్ల. అతడు ఆ గొర్రెపిల్లను అల్లారుముద్దుగా పెంచుకొనేవాడు. సరే, ఓ దినం ధనికుని యింటికి చుట్టమొచ్చాడు. అతడు తన పశువులన్నిటినీ భద్రంగా అట్టిపెట్టుకొని పేదవాని గొర్రెపిల్లను లాగుకొనివచ్చి చుట్టానికి విందు చేయించాడు-అని కథ ముగించాడు.

ఈ కథవిన్న దావీదుకి వొళ్ళు మండింది. అతడు కోపంతో ఆ ధనికుడు పేదవాడికి నాల్గురెట్లు నష్టపరిహారం చెల్లించాలని అన్నాడు. మోషే ధర్మశాస్త్రమే పూర్వం ఈ నియమం చేసింది - నిర్గ 22,1.

ఈ కథలో నాతాను ఉద్దేశించిన పేదవాడు అతని గొర్రెపిల్ల, వూరియా అతని భార్య బత్షెబాను. కనుక ప్రవక్త దావీదు జవాబునందుకొని అతనితో నేను చెప్పిన దుష్టుడైన ధనికుడవు నీవే సుమా! ప్రభువు ఈలా అంటున్నాడు. నీకు ఇందరు భార్యలు ఉన్నారు కదా! సౌలు చనిపోయినపుడు అతని భార్యలను కూడ నీ వశం జేసానుగదా! నీవు ఈ స్త్రీలందరితోను సుఖించవచ్చుకదా! అన్నెంపున్నెం ఎరుగని వూరియాను చంపించి అతని యాలిని నీ యాలిని చేసికొంటావా? ఈ దుర్మార్గానికిగాను నీకు రెండు శిక్షలు పడతాయి. నీవు వూరియా-మీదికి కత్తి యెత్తావు కనుక, కత్తి నీ కుటుంబాన్ని విడువదు. నీ కొడుకులు చాలమంది అంతఃకలహాలతో చస్తారు. నీవు వూరియా భార్యను చెరిచావు కనుక నీ భార్యలను నీ కుమారుడే చెరుస్తాడు అని చెప్పాడు.

దావీదు రాజు, న్యాయాధిపతి కూడ. దేశంలో న్యాయాన్ని కాపాడవలసిన రాజే ధర్మాన్ని చెరిస్తే ఇక దిక్కెక్కడిది? కంచే చేనుమేస్తే కాపేమి చేయగలడు? కనుక ప్రభువు దావీదుకి ఈ శిక్షలు విధించాడు.

పై శాపం ప్రకారం తర్వాత దావీదు కుటుంబంలో అంతఃకలహాలు చెలరేగాయి. ప్రవక్త నుడివినట్లుగా అతడు నాల్గువంతులు నష్టపరిహారం చెల్లించవలసి వచ్చింది. బత్షెబాకు దావీదు వలన కలిగిన మొదటిబిడ్డడు పురిటిలోనే పోయాడు. దావీదు కుమారులు అమ్మోను, అబ్షాలోము, అదోనియా శత్రువుల వాతబడి దారుణమైన చావు చచ్చారు. ఇంకా, అబ్షాలోము తండ్రిమీద పగబట్టి పట్టపగలే, అందరూ చూస్తుండగానే తండ్రి భార్యలను చెరిచాడు - 16,22. నాతాను ప్రవచనం ఈలా నెరవేరింది.

ఇక్కడ నాతాను చెప్పిన పేదవాని గొర్రెపిల్ల అనే కథ బైబుల్లోని ప్రశస్తకథల్లో వొకటి. అన్యాపదేశంగా వుండే ఈ కథ నేటికీ మనకు ప్రేరణం పుట్టిస్తుంది. ప్రవక్తలు మాటనేర్పరులు.

దావీదు నాతాను పలుకులన్నీ సావధానంగా విన్నాడు. పూర్వం చాలమంది దుష్టరాజులు ప్రవక్తలకు ఎదురుతిరిగారు. వాళ్ళ నోళ్ళు మూయింపజూచారు. కాని దావీదు

అలా చేయలేదు. అతడు మంచి రాజు, బలహీనత వల్ల పాపంలో పడిపోయినా, తన తప్పుని తెలిసికొని పశ్చాత్తాపపడ్డాడు. అతడు వినయంతో నేను యావేకు ద్రోహంగా పాపం చేసాను. ప్రభువు నా తప్పిదాన్ని మన్నించాలని వేడుకొంటున్నాను అన్నాడు. నాతాను రాజుతో నీవు సద్బుద్ధితో పశ్చాత్తాపపడ్డావు కనుక ప్రభువు నీ దోషాలన్నీ మన్నించానడు. ఈ పాప ఫలితంగా నీవు చావవుగాని నీ వలన బత్షెబాకు కలిగిన బిడ్డడు చనిపోతాడు అని చెప్పాడు. తర్వాత అలాగే జరిగింది.

పూర్వం సౌలు పాపంజేయగా ప్రభువు అతన్ని నాశంజేసాడు. రెండవ రాజయిన దావీదు పాపంజేస్తే దేవుడు అతన్నెందుకు వదలివేసాడు? దావీదునీ అతని అనుయాయులనూ కరుణిస్తానని ప్రభువు పూర్వం మాటయిచ్చాడు. ఈ అనుయాయులనుండే తర్వాత మెస్సీయా ఉద్భవిస్తాడు. కనుక దేవుడు తన ప్రమాణాన్ని నిలబెట్టుకోగోరి ఇక్కడ దావీదుని నాశం చేయలేదు - 7,14-15.

## 3. ప్రార్థనా భావాలు

1. ప్రజల దృష్టిలో దావీదు గొప్పవాడు, శూరుడు. అతని కీర్తికీ విజయాలకూ అంతులేదు. కాని దేవుని దృష్టిలో అతడు దుర్మార్గుడు. పేదవానిని చంపి వాని గొర్రెపిల్లను అపహరించిన దుష్టుడు. కనుక అతనికి శిక్షలు పడ్డాయి. ఒకసారి లోకం మనలను మెచ్చుకొంటుంది. ఇరుగుపొరుగువాళ్ళు మనలను మంచివాళ్ళమని పొగుడుతారు. వాళ్ళ మాటలు విని మనంకూడ మురిసిపోతాం. కాని నరులు మనలను మెచ్చుకొంటేచాలదు. వాళ్ళకు మన రహస్యకార్యాలు తెలియవు కదా! దేవుడు మనలను మెచ్చుకోవాలి. అప్పుడే మనకు విలువ. అందరి హృదయాలు న్యాయాన్యాయాలు తెలిసిన దేవుడు మనలను అంగీకరిస్తే అప్పుడు మనకు నిజమైన గుర్తింపు. కనుక మనమెప్పుడుకూడ నరుల దృష్టిలో కాక దేవుని దృష్టిలో ఏలా చలామణి ఔతున్నామా అని పరిశీలించి చూచుకోవాలి.

2. నేను చెప్పిన దుష్టుడవు నీవే అని ప్రవక్త పలికిన వాక్యం దేవుని వాక్యం. కనుకనే అది దావీదుకి పశ్చాత్తాపం పుట్టించింది. ప్రభువు వాక్యం నేడు మనకుకూడ పశ్చాత్తాపం కలిగిస్తుంది. మనం వేదవాక్యం చదువుకొనేప్పుడు అది మన తప్పిదాలకు మనలను ఖండిస్తుంది. మన దోషాన్ని ఎత్తిచూపుతుంది. న్యాయాధిపతిలాగ మనకు తీర్పు చెప్తుంది - హెబ్రే 4,12. కనుక భక్తుడు తరచుగా బైబులు చదువుకొని ఆ వేదవాక్యం కలిగించే ప్రేరణం ద్వారా తన హృదయాన్ని శుద్ధిచేసుకోవాలి - యోహా 15,3.

3. 11,6-17 వచనాల్లో దావీదు వూరియామీద కుట్రలు పన్నాడు. ఎన్నో వంచనలకు పాల్పడ్డాడు. అబద్ధాలు ఆడాడు. మోసాలు చేసాడు. వ్యభిచార పాపంలో చిక్కుకొన్నవాళ్ళు నేడూ ఈలాగే కపటంగా ప్రవర్తిస్తారు. వాళ్ళను నమ్మకూడదు.

4. నాతాను కథ వినగానే దావీదుకి కోపంవచ్చింది. అతడు పేదవాని గొర్రెపిల్లను అపహరించిన దుర్మార్గుడు నాల్గువంతులు నష్టపరిహారం చేయాలి అని అరచాడు. అతనికి ఇతరుని తప్పు బాగా తెలియవచ్చింది. తన తప్పు మాత్రం తెలియలేదు. మనమూ ఇతరుల తప్పులను తీవ్రంగా ఖండిస్తాం. మన పాపాలను మాత్రం గుర్తించం. కాని యెదుటివాని కంటిలోని నలుసును గమనించి మన కంటిలోని దూలాన్ని చూడకుండావుంటే యేమి లాభం? - మత్త 7,3-5.

5. నాతాను మందలించగానే దావీదు తన తప్పుని వొప్పుకొన్నాడు. నేను ప్రభువుకి ద్రోహంగా పాపంచేసాను అని అంగీకరించాడు. ఇది మంచివాళ్ళ లక్షణం. దుర్మార్గులు తమ తప్పుని తాము ఒప్పుకోరు. హేబెలుని చంపిన కయీను తన అపరాధాన్ని అంగీకరించలేదు. దేవుడు నీ తమ్ముడు ఎక్కడున్నాడని ప్రశ్నింపగా అతడు వాడికి నేనేమైనా కాపలా వున్నానా అని అడిగాడు - ఆది 4,9. పాపం చేసినపుడు మనం దావీదులా ప్రవర్తించాలిగాని కయీనులా ప్రవర్తించకూడదు.

పాపం కట్టుకోకూడదు. కాని బలహీనతవల్ల పాపంలో పడిపోయినపుడు ఈ దావీదు కథ మనకు పాఠం నేర్పుతుంది. ప్రేరణం పుట్టిస్తుంది. విశేషంగా పాపుల కొరకే దీన్ని బైబుల్లో చేర్చారు.

# 9. సొలోమోను స్వప్నం

# 1రాజు 3,4-27

## 1. సందర్భం

దావీదు చివరిరోజుల్లో అతని కుటుంబంలో అంతఃకలహాలు పెచ్చు పెరిగాయి. అతని కుమారుల్లో ఎవరు రాజు కావాలనే సమస్య ఎదురైంది. పెద్దవాడైన అదోనియా తాను రాజు కావాలని పట్టుపట్టాడు. సైన్యాధిపతియైన యోవాబు అతన్ని సమర్థించాడు. కాని ప్రవక్త నాతాను యాజకుడైన సాదోకు చిన్నవాడైన సొలోమోనుని రాజుని చేయగోరారు. కడన దైవచిత్త ప్రకారం దావీదు గీహోను చెలమచెంత సొలోమోనుకే రాజ్యాభిషేకం చేయించాడు. తండ్రి అనంతరం అతడు రాజ్యం చేయడం మొదలుపెట్టాడు.

## 2. వివరణం

సొలోమోను గిబ్యోను పుణ్యక్షేత్రానికి వెళ్ళి దహనబలులు అర్పిస్తుండేవాడు. ఓసారి అతడు అక్కడ బలిని అర్పించడానికి వెళ్ళగా దేవుడు రాత్రి కలలో కన్పించి నీకేమి వరం కావాలో కోరుకొమ్మన్నాడు. సొలోమోను ప్రభూ! నీవు మా తండ్రి దావీదుని కరుణతో ఆదరించావు. అతడు తన తరపున తాను నిన్ను పూర్ణహృదయంతో సేవించాడు. అతని కుమారుడనైన నేను ఒడుదుడుకులన్నీ తప్పించుకొని ఇప్పుడు రాజునయ్యాను. నీవు ఈనాడు నన్ను సింహాసనంమీద కూర్చోబెట్టావనగా మా తండ్రి దావీదుని కరుణించినట్లే. కాని నేను ప్రాయంలో చిన్నవాణ్ణి. మా తండ్రి దావీదు అనుభవం నాకు లేదు. ఈ ప్రజలు అసంఖ్యాకంగా వ్యాపించి వున్నవాళ్ళు. వీళ్ళను పరిపాలించే సామర్థ్యం నాకులేదు. కనుక వీరిని చక్కగా పాలించడానికి నాకు వివేకవిజ్ఞానాలను ప్రసాదించు అని వేడుకొన్నాడు.

ఆ రోజుల్లో రాజు న్యాయాధిపతిగూడ. ప్రజలు తగాదాలతో రాజు దగ్గరికి వస్తారు. అతడు న్యాయబుద్ధితో తీర్పు చెప్పాలి. ధర్మశాస్త్రంలోని ఆదేశాల ప్రకారం దోషిని శిక్షించి నిర్దోషిని వదలిపెట్టాలి. కనుక సొలోమోను న్యాయాధిపతిగా సక్రమమైన పద్ధతిలో ప్రజలకు తీర్పుచెప్పే వివేకాన్ని ప్రసాదించమని దేవుణ్ణి అడుగుకొన్నాడు. న్యాయాధిపతిగా తన బాధ్యతను తాను నిర్వహించే తెలివిని ప్రసాదించమని దేవుణ్ణి వేడుకొన్నాడు.

మామూలుగా పూర్వవేద ప్రజలు దేవుణ్ణి నాల్గువరాలు కోరుకొన్నారు. అవి దీర్ఘాయువు, సంతానం, సిరిసంపదలు, శత్రువుల మీద విజయం. కాని సొలోమోను ఈ వర్గాల్లో దేనినీ అడుగుకోలేదు. తన కొరకు ఏమీ అడగలేదు. ప్రజలందరి శ్రేయస్సుకోరి చక్కగా తీర్పుచెప్పే వివేకాన్ని మాత్రం అడుగుకొన్నాడు. మంచి తీర్పులు చెప్పడం అతని బాధ్యత. కనుక అతడు తన బాధ్యతను తాను నిర్వర్తిస్తే చాలు అనుకొన్నాడు.

సొలోమోను మనవి ప్రభువుకి ఎంతో ప్రీతి కలిగించింది. అతడు నీవు నీ స్వార్థానికి ఏమీ కోరుకోక ప్రజలను న్యాయబుద్ధితో పరిపాలించే వివేకవరం మాత్రం అడిగావు. తప్పక ప్రసాదిస్తాను. వివేకరంగంలో నీలాంటివాడు నభూతో నభవిష్యతి. నీవడగకున్నా సిరిసంపదలూ కీర్తి ప్రతిష్ఠలుకూడ నీకిస్తున్నాను. నీ తండ్రి దావీదులాగ నీవు నా యాజ్ఞలు పాటిస్తూ నాకు నమ్మినబంటువై వుంటే నేను నీకు దీర్ఘాయువుగూడ ప్రసాదిస్తాను అని చెప్పాడు.

అంతట సొలోమోను నిద్రమేల్కొని దేవుణ్ణి సేవించి యెరూషలేముకి తిరిగివచ్చాడు. అంతకుముందే దావీదు మందసాన్ని యెరూషలేమున గుడారంలో పెట్టించాడు. సొలోమోను దానిముందు దహనబలులు అర్పించాడు. కొలువుకాళ్ళకు విందుజేయించి ప్రభువు తనకు కలలో కన్పించిన వైనాన్ని తెలియజేసాడు.

ప్రభువు సొలోమోనుకి విజ్ఞాన వరాన్ని ప్రసాదించాడు కదా! అది వెంటనే అతనిలో పనిజేయడం మొదలుపెట్టింది. ఆ రాజు తన విజ్ఞానాన్ని రుజువు చేసికొనే అవకాశంగూడ వెంటనే దొరికింది.

ఓరోజు ఇద్దరు వేశ్యలు జగడమాడుకొని రాజు దగ్గరికి తీర్పుకు వచ్చారు. మొదటియామె రాజుతో ఈలా చెప్పింది. దొరా! మేమిద్దరం ఒకే యింటిలో వసిస్తున్నాం. ఈమెకూ నాకూ మూడురోజుల తేడాతో మగబిడ్డలు పుట్టారు. ఒకరేయి ఈమె నిద్రమంపులో తన బిడ్డడిమీదికి పొరలి వాణ్ణి చంపివేసింది. కాని తెలివితో ఆరాత్రే తన బిడ్డణ్ణితెచ్చి నా ప్రక్కలో పరుండబెట్టి నా కుమారుణ్ణి తీసుకవెళ్ళి తన ప్రక్కలో పండబెట్టుకొంది. నేను ఉదయాన్నే శిశువుకి పాలీయబోగా వాడు చనిపోయి వున్నాడు. జాగ్రత్తగా పరిశీలించి చూచి వాడు నా బిడ్డడు కాదని తెలిసికొన్నాను అని చెప్పింది. వెంటనే రెండవవేశ్య అందుకొని ఏలికా! బ్రతికివున్నవాడు నా బిడ్డడు. చచ్చినవాడు ఆమె బిడ్డడే అని పలికింది. మొదటి వేశ్య రెండవ వేశ్యకు అడ్డువచ్చి బ్రతికి వున్నవాడు నావాడు, చచ్చినవాడే నీవాడు అని వాదించింది.

రాజు ఇరువురి వాదాన్ని విన్నాడు. దేవుడిచ్చినవరం అతన్ని ప్రేరేపించింది. అతడు నిజమైన తల్లిని గుర్తుపట్టే విధానాన్ని మనసులోనే ఊహించుకొన్నాడు. బయటికి ఏమీ చెప్పకుండా, బ్రతికివున్న బిడ్డణ్ణి రెండు ముక్కలుగా నరికి ఇద్దరికి చెరియొక ముక్కనివ్వమని సేవకుణ్ణి ఆజ్ఞాపించాడు. బంటు కత్తి తీసికొని అలాగే నరకబోగా కన్నతల్లికి కడుపు తరుగుకొనిపోయింది. ఆమె ప్రభూ! బిడ్డను చంపవద్దు. వాణ్ణి ఈమెకు ఈయండి. నా బిడ్డడు ఎక్కడవున్నా ఫర్వాలేదు. వాడు బ్రతికివుంటే చాలు అంది. కాని రెండవ తల్లి ఈబిడ్డడు ఎవరికీ దక్కకూడదు. వీణ్ణి రెండు ముక్కలుగ నరికివేయవలసిందే అని అసూయతో పలికింది. వారి మాటలనుబట్టే సొలోమోను ఎవరు నిజమైన తల్లో, ఎవరు దొంగ తల్లో నిర్ణయించాడు. నిజమైనతల్లి తన బిడ్డడు చనిపోవదానికి ఒప్పుకోదు కదా! కడుపుతీపి ఆమెకు అడ్డువస్తుంది కదా! ఈవిధంగా సొలోమోను తెలివితో నిజమైన తల్లిని గుర్తుపట్టి బిడ్డణ్ణి ఆమెకే యిప్పించాడు.

అంతవరకు యిస్రాయేలు పెద్దలకు సొలోమోను సామర్థ్యం తెలియదు. వాళ్ళు మన రాజు కుర్రవాడు. ఇతనికి దావీదుకున్న అనుభవం లేదు. ఇతడు ప్రజలను చక్కగా పరిపాలించగలడా అని శంకిస్తున్నారు. ఈ తీర్పు విన్న తర్వాత వాళ్ళకు సొలోమోనుమీద నమ్మకం కుదిరింది. వాళ్లు ఇతడు తండ్రిని మించిన తనయుడు అనుకొన్నారు. అతన్ని చూచి భయపడ్డారు. భగవంతుడు అతనికి ప్రసాదించిన విజ్ఞాన వరాన్ని గుర్తించి విస్తుపోయారు.

# 3. ప్రార్థనా భావాలు

1. యూదుల దృష్టిలో మోషే ధర్మశాస్త్రానికి ప్రసిద్ధి. సొలోమోను విజ్ఞానానికి ప్రసిద్ధి. విజ్ఞానమంటే యేమిటి? దేవునిపట్ల భయభక్తులు చూపడం విజ్ఞానానికి మొదటిమెట్టు అంటుంది సామెతలగ్రంథం 9,10. కనుక విజ్ఞానమంటే దైవభీతీ, దైవభక్తి. దీన్నే మనం నూత్నవేదంలో వరప్రసాదం అంటాం. ఈ వరంతో మంచిచెడ్డలను గుర్తిస్తాం. చెడ్డను విసర్జించి మంచిని సాధిస్తాం. యోగ్యరీతిని ప్రవర్తించి విజయాన్ని చేపడతాం. ఇహలోక వస్తువులకంటె పరలోక వస్తువులమీద అధికప్రీతిని చూపుతాం. సంగ్రహంగా చెప్పాలంటే, వివేకంతో మంచి జీవితం గడపడమే విజ్ఞానం. ఈ వరం సొలోమోనుకిలాగే మనకుకూడ అత్యవసరం. కనుక అతనిలాగే మనంకూడ దేవునినుండి ఈ భాగ్యాన్ని అడుగుకోవాలి.

2. ప్రజలకు మేలు కలిగేలా పరిపాలించడం, వారికి న్యాయబుద్ధితో తీర్పుచెప్పడం సొలోమోను బాధ్యత. ఈ స్వీయ బాధ్యతలను సక్రమంగా నిర్వహించడానికి అతడు విజ్ఞాన వరాన్ని అడుగుకొన్నాడు. ఎవరి బాధ్యతలను వాళ్లు తృప్తికరంగా నిర్వహించాలి. వృత్తి ధర్మాన్ని సక్రమంగా పాటిస్తే దేవుణ్ణి ఆరాధించినంత. ఈనాడు మనం మన బాధ్యతలను ఏలా నిర్వహిస్తున్నాం? తల్లిదండ్రులంగా, పెద్దలంగా, ఉపదేశులంగా, ఉపాధ్యాయులంగా, మఠకన్యలంగా, గురువులంగా మన బాధ్యతలను మనం సక్రమంగా నిర్వహిస్తున్నామా? ఈ విషయంలో సొలోమోను మనకు ప్రేరణంగా వుంటాడు.

3. ప్రభువు సొలోమోనుతో నీవు నా యాజ్ఞలను పాటించి నాకు విధేయుడవైతే నేను నీకు దీర్ఘాయువును గూడ ప్రసాదిస్తాను అని చెప్పాడు. కాని విజ్ఞానవరాన్ని బడసిన సొలోమోనే దేవుని ఆజ్ఞలను పాటించలేదు. అతడు మోషే ధర్మశాస్త్రాన్నిమీరి వివిధ జాతుల ఆడపడుచులను పెండ్లి చేసికొన్నాడు. వాళ్ళకు పుట్టింటి దేవుళ్లుండేవాళ్లు. సొలోమోను ఈ రాణులకు వశుడైపోయి వాళ్ళు కొలిచే దేవతలను కొలిచాడు. వాళ్ళకు దేవళాలు కట్టించాడు. విగ్రహారాధనలో పడిపోయాడు. తన తండ్రియైన దావీదులాగ పూర్ణహృదయంతో దేవుణ్ణి సేవించలేదు. కనుక దేవుడు సొలోమోను మీద కోపించి అతని రాజ్యాన్ని రెండు ముక్కలుగా చీల్చివేసాడు. ఒక ముక్కకు అతని కుమారుడు రాజుకాగా మరో ముక్కకు అతని బానిస యరోబాము రాజయ్యాడు- 1రాజు 11,1-12. అతడు ప్రభువుని త్యజించాడు కనుక ప్రభువు అతన్ని త్యజించాడు. సొలోమోనువంటి జ్ఞాని పడిపోతే ఇక మనబోటివాళ్ళం నిలువగలమా? ఆ రాజులాగే మనంకూడ మన అంతస్తుని

మరచి దేవునికి ద్రోహం చేస్తాం. కనుక సౌలు చెప్పినట్లుగా మనం భయంతో వణకుతూ మన రక్షణకార్యాన్ని సాధించాలి - ఫిలి 2,12. నిల్చివున్నవాడు పడిపోకుండా వుండేలా జాగ్రత్తపడాలి - 1కొరి 10,12. కావున భయభక్తులతో దేవుణ్ణి కొలిచే భాగ్యాన్ని అడుగుకొందాం.

# 10. రాజ్య విభజనం

# 1రాజు 11,26-12, 24

## 1. సందర్భం

సొలోమోను గొప్ప రాజు. వైభవంగా యిస్రాయేలీయులను ఏలాడు. కాని అతడు విగ్రహారాధకుడు. కనుక ప్రభువు అతనిపై కోపించి అతని రాజ్యాన్ని రెండు భాగాలుగా విభజించాడు. చరిత్రను మన జీవితంలోని సంఘటనలను నడిపించేది ప్రభువే.

## 2. వివరణం

సొలోమోను రాజు వెట్టిచాకిరివారిని నియమించి ఎప్పుడూ భవనాలు కట్టిస్తూండేవాడు. అతడు ఆ చాకిరివారికి యరోబాము అనే సేవకుణ్ణి నాయకుణ్ణిచేసాడు. దైవప్రేరణం వల్ల ఈ సేవకుడే సొలోమోనుకి ప్రబల శత్రువు అయ్యాడు.

ఓసారి అహీయా ప్రవక్త యెరూషలేము ప్రక్కన వున్న పొలంలో ఈ యరోబామును కలసికొన్నాడు. అప్పుడు ప్రవక్త కొత్త అంగీని ధరించి వున్నాడు. అతడు ఆ యంగీని పంద్రెండు ముక్కలుగా చించి పదింటిని యరోబాముకిచ్చి నీవు వీటిని తీసికో అన్నాడు. దీని భావమిది. సొలోమోను రాజ్యంలో పంద్రెండు తెగల యిస్రాయేలీయులున్నారు. వారిలో యూదా బెన్యామీను అనే రెండు తెగలవారికి మాత్రమే ఇకమీదట సొలోమోను వారసులు రాజులౌతారు. తతిమ్మా పది తెగలు చీలిపోయి కొత్త రాజ్యమౌతాయి. వీటికి యరోబాము అతని అనుయాయులు రాజులౌతారు.

ప్రవక్తలు తమ బోధలను నటించి చూపించేవాళ్ళు. ఈ సంఘటనం అలాంటి నటనాత్మకమైన బోధ. అహీయా ప్రవక్త సొలోమోనుకి విరోధి. ఆ రాజు ప్రభువు ధర్మశాస్త్రాన్ని మీరడం జూచి అహీయా మరికొందరు ప్రవక్తలు అతన్ని ఎదిరించారు. సొలోమోను అన్యజాతుల దైవాలను పూజించి ప్రభువుకి ద్రోహం చేసాడు. కనుక దేవుడు అతని రాజ్యాన్ని రెండు ముక్కలు చేసాడు. ఈ సంగతిని అతడు తన భక్తుడైన ప్రవక్తద్వారా ముందుగానే ఎరిగించాడు.

సొలోమోను విగ్రహారాధకుడైనా అతని తండ్రి గొప్ప దైవభక్తుడు. ఏకైక హృదయంతో, అనన్య చిత్తంతో యావేను కొల్చినవాడు. కనుక ప్రభువు తనకు దావీదుపై గల ఆదరభావంచే రాజ్యవిభజనాన్ని సొలోమోను కాలంలో జరిగించనన్నాడు. ఆ కార్యం సొలోమోను కుమారుడైన రెహబాము కాలంలో జరుగుతుందని చెప్పాడు.

యరోబాము సొలోమోనుమీద చిన్న తిరుగుబాటు చేసాడు. ఆ రాజు అతన్ని చంపజూచాడు. కాని అతడు ఈజిప్తుకి పారిపోయి షీషకు ఫరో మరుగుజొచ్చాడు. సొలోమోను చనిపోయేవరకు అక్కడే వున్నాడు. ఈ షీషకు రెహబాము కాలంలో యూదామీదికి దండెత్తివచ్చి అతన్ని కొల్లగొట్టాడు.

కాని సేవకుడైన యరోబాము ఏలా రాజయ్యాడు? సొలోమోను చనిపోగా అతని కుమారుడు రెహబాము రాజ్యానికి వచ్చాడు. అతని పట్టాభిషేకం షెకెము పుణ్యక్షేత్రంలో జరిగింది. సొలోమోను చనిపోయాడని తెలిసి యరోబాము యూదాకు తిరిగివచ్చాడు. అక్కడ రెహబాము పట్టాభిషేకానికి వచ్చిన యిస్రాయేలు పెద్దలందరు అతనితో అయ్యా! మీ నాయన పెద్ద భవనాలు కడుతూ మాచేత వెట్టిచాకిరి చేయించుకొన్నాడు. మామీద పెద్ద పన్నులు విధించాడు. ఈ భారాన్ని మేమిక మోయలేం. నీవైనా ఈ బరువుని తగ్గించవా అని అడిగారు.

రెహబాము తన తండ్రికి సేవలు చేసిన వృద్ధులను పిలిపించి ప్రజలు నన్నీలా అడుగుతున్నారు. నేను వారికేమి సమాధానం చెప్పాలి అని ప్రశ్నించాడు. ఆ వృద్ధులు నీవు ఈ పెద్దలకు ప్రీతి కలగేలా మాటలాడు. వాళ్ళు జీవితాంతం నీకు లొంగివుంటారు అని చెప్పారు.

కాని రెహబాము ఆ వృద్ధుల సలహాను పాటించలేదు. తనతో పెరిగిన యువకులను ఆలోచనం అడిగాడు. వాళ్ళు దుష్టాలోచనం చెప్పారు. ఆ దుష్టసలహా ప్రకారం అతడు యిస్రాయేలు పెద్దలతో పరుషంగా మాటలాడాడు. నేను మా తండ్రి మీపై మోపిన భారాన్ని ఇంకా రెండంతలు చేస్తాను. అతడు మిమ్ము శిక్షించినదానికంటె నేను రెండంతలు అదనంగా శిక్షిస్తాను అన్నాడు.

ప్రభువు తన భక్తుడైన అహీయా ప్రవక్తద్వారా సెలవిచ్చినట్లే యరోబామును రాజును చేయగోరి రెహబాముకి ఈ దుర్బుద్ధి పుట్టించాడు-12,14.

రాజు ఈలా మూర్ఖంగా మాట్లాడితే ప్రజానాయకులు సహిస్తారా? వాళ్ళు రోషం తెచ్చుకొని రెహబాముమీద తిరుగుబాటు చేసారు. తమలో తాము మనమిక దావీదు వంశజులతో కలసి వుండవద్దు. మనదారి మనం చూచుకొందాం అనుకొన్నారు. కనుక ఉత్తరానవున్న పది తెగల యిస్రాయేలీయులు యూదా బెన్యామీను గోత్రాలనుండి విడిపోయి

స్వతంత్రరాజ్యాన్ని ఏర్పరచుకొన్నారు. రెహబాము తన సైన్యాధిపతి అదోరాముని ఉత్తరపు తెగల మీదికి పంపాడు. కాని వాళ్ళతన్ని వధించారు. రాజుకూడ యెరూషలేముకి పారిపోయి ప్రాణాలు దక్కించుకోవలసి వచ్చింది. ఉత్తర తెగవాళ్ళు యరోబాముని రాజుగా ఎన్నుకొన్నారు. అతడు సమరియా పట్టణాన్ని రాజధానిగా జేసికొని ఉత్తర రాజ్యాన్ని పాలించడం మొదలుపెట్టాడు. దక్షిణాన యెరూషలేమునుండి రెహబాము రెండు తెగల వాళ్ళను పాలించాడు.

అటుపిమ్మట రెహబాబు ఉత్తరరాజ్యం వాళ్ళను లొంగదీసుకోవడానికై పెద్ద సైన్యంతో యుద్ధానికిపోయాడు. కాని షెమయా అనే ప్రవక్త ప్రభువు పంపగా వచ్చి రెహబాముతో ఈ రాజ్య విభజనం ప్రభువు సంకల్పం వలన జరిగింది. కనుక మీరు మీ సోదరులైన ఉత్తరాది తెగల వారిమీదికి పోకండి అని చెప్పాడు. రెహబాము యుద్ధం చాలించి వెనుకకు వచ్చాడు.

ఈ విధంగా సొలోమోను విగ్రహారాధనం వలన, రెహబాము మూర్ఖత్వం వలన యిస్రాయేలు రాజ్యం రెండు భాగాలుగా చీలిపోయింది. ఇది ప్రభువు నిర్ణయించిన కార్యం ప్రవక్తలు దీన్ని ముందుగానే తెలియజేసారు. అంతా వాళ్లు చెప్పినట్లే జరిగింది.

రాజ్యవిభజనం క్రీస్తుపూర్వం 931లో జరిగింది. 722లో ఉత్తర రాష్ట్రం అస్సిరియా రాజుకు చిక్కి నాశమైపోయింది. అంతవరకు, అనగా 209 యేండ్లకాలం ఆ రెండు రాజ్యాలు పరస్పరం పోట్లాడుకొంటూ వచ్చాయి.

## 3. ప్రార్థనా భావాలు

1. చరిత్రగతిని నడిపించేవాడు ప్రభువు. అతడు సొలోమోను పాపాలకు శిక్షగా యిస్రాయేలు రాజ్యాన్ని విభజించాలనుకొన్నాడు. ఆ సంగతిని అహీయా ప్రవక్తద్వారా ముందుగానే ఎరిగించాడు. సొలోమోను సేవకుడైన యరోబాముని రాజుని చేసాడు. రెహబాము ఉత్తర రాజ్యం మీదికి దండెత్తబోతూంటే షమయా ప్రవక్తద్వారా ఆ ప్రయత్నాన్ని వారింపజేసాడు. ఈ యంశాలనుండి మనం చరిత్రగతిని నడిపించేవాడు ప్రభువేనని అర్థంజేసికోవాలి. అతడు నేడు మన జీవితంలోని సంఘటనలనుగూడ నడిపిస్తూంటాడు. అతని అనుమతి లేనిదే మనకు మంచీ జరగదు, చెడ్డా జరగదు. దేవుణ్ణి ప్రేమించేవాళ్ళకు అన్నీ అనుకూలంగానే జరిగిపోతాయి-రోమా 8,28. కనుక భక్తిమంతులు తమ జీవితంలో జరిగే ప్రతిసంఘటనంలోను దేవుని హస్తాన్ని దర్శిస్తారు.

2. రెహబాము సన్నిహితులు అతనికి దుష్టసలహా చెప్పారు. దానివలన అతడు యిస్రాయేలు పెద్దలపట్ల మూర్ఖంగా ప్రవర్తించి రాజ్యవిభజనకు కారకుడయ్యాడు. మనం ఎవరికీ దుష్టాలోచనలు కలిగించకూడదు. ఇతరులు మనకు దుష్టాలోచనలు పుట్టిస్తే వాటి ప్రకారం నడవకూడదు. మనం ఇచ్చే సలహాకాని, పొందే సలహాకాని దేవుడు ఆమోదిస్తాడా అని పరిశీలించి చూచుకోవాలి. భక్తులు ఇతరులకు మంచి సలహాలనిచ్చి లోకానికి ఎంతో మేలు చేసారు. దుష్టులు దుష్ట సలహాలనిచ్చి ఎంతో కీడుకూడ చేసారు.

3. సొలోమోను మహాజ్ఞాని. ఐనా అతడు విగ్రహారాధనకు పాల్పడి యిస్రాయేలు రాజ్యానికి వినాశం తెచ్చిపెట్టాడు. అతడు మోషే ధర్మశాస్త్రాన్ని మీరి అన్యజాతుల ఆడపడుచులను వివాహం చేసికొన్నాడు. వారి దైవాలను తానూ ఆరాధించి పాపం కట్టుకొన్నాడు - 11,2-4. అతనిపై కోపించి ప్రభువు రాజ్యాన్ని విభజించాడు. నేడు మనం విగ్రహాలను కొలవకపోయినా లోకవస్తు వ్యామోహాల్లో పడిపోతుంటాం. ధనం, పదవులు, పేరుప్రతిష్ఠలు మొదలైన వాటిని ఆర్జించటానికి నానా గడ్డీ తింటాం. ఈ వ్యామోహాలు మనలను నాశంజేస్తాయి. సృష్టి వ్యామోహాల్లో జిక్కి సృష్టికర్తను విస్మరించకుండా వుండేవాడు ధన్యుడు.

4. ప్రవక్తలు తమ బోధలను నటించి చూపించారన్నాం. ఆహీయా తన అంగీని ముక్కలుగాచించి యిస్రాయేలు రాజ్యం రెండు భాగాలుగా చీలిపోతుందని చెప్పాడు. ఈ పద్ధతి నూత్నవేదంలోకూడ కన్పిస్తుంది. క్రీస్తు అంజూరాన్ని శపించడం నటనాత్మకమైన బోధ -మత్త 21,19. ఈ యంజూరం యిస్రాయేలు నాయకులకు గుర్తు. క్రీస్తు బోధలను నిరాకరిస్తే వాళ్ళు ఆ చెట్టులా ఎండిపోతారని భావం. అగబు ప్రవక్త పౌలు నడికట్టుతో తన కాలుసేతులు బంధించుకోవడం నటనాత్మకమైన బోద - అ.చ.21,10-11. ఇక్కడ యూదులు పౌలుని బంధించి రోమీయులకు అప్పగిస్తారని భావం. పూర్వవేద ప్రవక్తలు మన నూత్నవేదపు అర్చ్యశిష్టుల్లాంటివాళ్ళు. భగవంతుణ్ణి బాగా అనుభవానికి తెచ్చుకొన్న భక్తులు. రాజుల గ్రంథాలు మాటిమాటికీ ప్రవక్తలను పేర్కొంటాయి. ప్రభువు వారిద్వారా మాటలాడతాడని చెప్తాయి. బైబుల్లోని వారి బోధలను చదువుకొని నేడు మనంకూడ ప్రేరణం పొందాలి.

# 11. సారెఫతు వితంతువు

## 1రాజు 17

### 1. సందర్భం

అహాబురాజు క్రీస్తుపూర్వం 871-52 వరకు ఉత్తర రాజ్యమైన సమరియాను ఏలాడు. ఆ దేశాన్ని పాలించిన సమర్థులైన రాజుల్లో అతడూ వొకడు. ఆ రాజు సీదోను రాజు కొమార్తెయైన యెసెబెలును పెండ్లాడాడు. సీదోను రాజ్యంలో ప్రజలు బాలుని కొల్చేవాళ్లు. కనుక ఆ రాణి తన పుట్టింటి మతాన్ని యిస్రాయేలు దేశానికిగూడ తీసికొని వచ్చింది. ఆ రోజుల్లో యిస్రాయేలు చుట్టపట్లవున్న కనానీయ జాతులన్నీ ఈ దేవుణ్ణే కొల్చేవి. కనుక యావేపట్ల భక్తిలేని యూదులు చాలమంది ఈ బాలు ఆరాధనలో పడిపోయారు. ఆ రోజుల్లో ఇది పెద్ద సమస్య ఐంది. అహాబు రాజు ఆర్థిక రాజకీయ విషయాలేగాని మతవిషయాలు పట్టించుకొనేవాడు కాదు. ఈలాంటి పరిస్థితుల్లో ప్రభువు ఏలీయా ప్రవక్తను తన సేవకు పిల్చాడు. ఈ ప్రవక్త బాలు ఆరాధనను నిరసించి యావే మతాన్ని నిలబెట్టడానికి కంకణం కట్టుకొన్నాడు. అతడు యావే ప్రభువుపట్ల మహాభక్తీ ఆసక్తీ కలవాడు. పూర్వవేదంలోని భక్తాగ్రేసరుల్లో వొకడు. ఈ కథలోను రాబోయే కథల్లోనుగూడ మనం ఏలీయా చరిత్రను చూస్తాం.

యేలీయా అతని శిష్యుడైన యెలీషా కథలు యిస్రాయేలీయుల జానపద గాథలకు సంబంధించినవి. హీబ్రూ రచయితలు నిష్కపటులైన పల్లె ప్రజలను ఉద్దేశించి మొదట ఈ కథలను చెప్పారు.

### 2. వివరణం

ఈ యధ్యాయంలో రెండు భాగాలున్నాయి. మొదటిది, అనావృష్టి వస్తుందని యెలీయా ముందుగానే రాజుకి తెలియజేయడం-1-7. రెండవది, వితంతువు కథ 8-24.

మొదట అనావృష్టి కథను చూద్దాం. ఏలీయా రాజు దగ్గరికి వెళ్ళి నేను బాలుని నిరాకరించి యావే ప్రభువుని కొల్చే ప్రవక్తనని చాటిచెప్పుకొన్నాడు. దేశంమీదికి కరువు వస్తుందనీ, తాను కురవమంటేనేగాని వాన కురవదనీ ఖండితంగా చెప్పాడు. యావేమతానికీ బాలు మతానికీ బద్ధవైరం. బాలు వర్షానికీ పైరుపంటలకీ జంతుగణాభివృద్ధికీ నరసంతానానికీ అధిపతియని అతని భక్తుల నమ్మకం. ఏలీయా నేను దేశంమీదికి కరువు తెప్పిస్తాను, మీరు కొల్చే బాలు నిజంగా దేవుడైతే వాన కురిపించమనండి చూద్దాం అని రాజుని సవాలు జేసాడు. అసలు అహాబు విగ్రహారాధన పాపంవల్లనే కరువు వచ్చిందని ఎత్తిపొడిచాడు.

ప్రవక్త నేను ఆజ్ఞాపిస్తే తప్ప ఈ దేశంలో వాన కురవదని అన్నాడు. ప్రవక్త వాక్కులోని శక్తి అమోఘమైంది. ఈ యధ్యాయంలో యావే ఆరాధనం, ప్రవక్త వాక్కులోనిశక్తి అనే రెండంశాలూ ముఖ్యమైనవే.

తన శాపవాక్యాలతో దేశంమీదికి కరువును రప్పించినందుకు రాజు ఏలీయాను చంపజూచాడు. కనుక ప్రవక్త పారిపోయి కెరీతువాగు పారే అరణ్యప్రాంతంలో తలదాచుకొన్నాడు. ప్రభువు తన ప్రవక్తను కాపాడతాడు కదా! కనుక దేవుని ఆజ్ఞపై రోజూ రేపూమాపూ కాకులు అతనికి రొట్టెలు కొనివచ్చేవి. ఆ కరవుకాలంలో ప్రవక్త ఆ రొట్టెను తిని, ఆ వాగులోని నీళ్లు త్రాగి తన ప్రాణాలు నిల్పుకొన్నాడు. పూర్వం ప్రభువుయిస్రాయేలు ప్రజలనుగూడ ఈ రీతినే ఎడారిలో అద్భుతంగా దయచేసిన ఆహారంద్వారా కాపాడాడని చదువుతున్నాం - నిర్గ 16,8. సరే, కొంతకాలానికి కరవు ముదరగా కేరీతు వాగుకూడ వట్టిపోయింది.

ఇక, రెండవభాగం సారెపతు వితంతువు కథ. ప్రభువు ఏలీయాను కెరీతువాగు నుండి సీదోను దేశంలోని సారెఫతు నగరంలో వసించే ఓ వితంతువు దగ్గరికి పంపాడు. ఈ దేశంలో బాలుని కొల్చేవాళ్ళని చెప్పాం. యావే యిస్రాయేలు దేశంలోలాగే ఇక్కడకూడా అనావృష్టిని కలిగించాడు. ఐనా అతడు తన భక్తురాలైన వితంతువునీ ఆమె కుమారునీ మాత్రం చావునుండి కాపాడగోరాడు.

ప్రవక్త నగర ద్వారంవద్ద ఆ పేదరాలిని కలిసికొని అమ్మా! నాకు కొంచెం మంచినీళ్ళూ ఓ రొట్టా తీసికొనిరా అని చెప్పాడు. ఆమె నాయనా! ఈ కరవు కాలంలో రొట్టె లెక్కడివి? మా యింటిలో యింకా పిడికెడు గోదుమ పిండీ, కొంచెం ఓలివు నూనే మిగిలివున్నాయి. వాటితో చివరిరొట్టె కాల్చుకొని నేనూ నా కుమారుడూ తింటాం. ఆ మీదట కరువు వాతబడి చస్తాం అంది.

ఆ మాటలకు ప్రవక్త తల్లీ! నీవూ నీ కుమారుడూ భుజించకముందు నాకొక రొట్టె చేసిపెట్టు. ప్రభువు నిన్ను కరుణిస్తాడు. నీకు యావే దీవెన యిది. ప్రభువు ఈదేశంలో వాన కురిపించేవరకు మీ కుండలోని పిండిగాని, పిడతలోని నూనెగాని తరగిపోవు అని చెప్పాడు.

ఆ వితంతువు ప్రవక్తమాట నమ్మింది. ముందుగా అతనికి రొట్టెజేసిపెట్టింది. తర్వాత తనూ తన కుమారుడూ రొట్టె కాల్చుకొని భుజించారు. ఈలా ఆ కరవు కాలమంతా గడచిపోయింది. మొదట తన వాక్కుతో వానను ఆపివేసిన ప్రవక్త ఇప్పుడు మళ్ళా అదే వాక్కుతో ఆహారాన్ని కూడ సృజించాడు. ప్రభువే తన ప్రవక్త వాక్కుద్వారా పనిచేస్తుంటాడు. ఇక్కడ అహాబు విగ్రహారాధనం కరువుని తెచ్చిపెడితే, ప్రవక్త భక్తీ వితంతువు విశ్వాసం ఆహారాన్ని చేకూర్చిపెట్టాయి.

ఈ కథ ఈలా వుండగా ఇంకో సంఘటనం జరిగింది. వితంతువు ఏకైక కుమారుడు జబ్బుపడి చనిపోయాడు. ఆమె ప్రవక్తను నిష్ఠురాలాడింది. అయ్యా! నీవు దైవభక్తుడివి కదా! నీవు నా రహస్యపాపాలను నీ దేవునికి తెలియజేసావు. అతడు నాపై కోపించి నా కుమారుణ్ణి చంపివేసాడు చూడు అంది.

ప్రవక్త బాలుని మృతదేహాన్ని తన గదిలోనికి తీసికొనిపోయాడు. ఆ శవంపై బోరగిలపడి తన శ్వాసను దానిలోనికి వూదాడు. ఆ బాలుని బ్రతికించమని దేవునికి మనవిచేసాడు. ప్రవక్తవాక్కు శక్తిమంతమైనది కదా! దేవుడు అతని మొరవిని చనిపోయిన బిడ్డణ్ణి బ్రతికించాడు. అతడు ప్రాణాలు తీసేవాడూ తిరిగి యిచ్చేవాడూ కూడ. నూత్నవేదంలో పౌలుకూడ ఇదే పద్ధతిలో త్రోయపట్టణంలో ఐతుకు అనే యువకుణ్ణి బ్రతికించాడని చదువుతున్నాం - అ.చ. 20,9-10.

వితంతువు చనిపోయిన బిడ్డడు మళ్ళా బ్రతకడం జూచి పరమానందం చెందింది. ఆమె ప్రవక్త వాక్కులోని శక్తిని గుర్తించింది. అతడు కొలిచే యావే ప్రభువుని విశ్వసించింది.

## 3. ప్రార్థనా భావాలు

1. ప్రభువు తన భక్తులందరినీ ఆహారంతో పోషిస్తాడు. అతడు ప్రాణిపోషకుడు. ఆకాశ పక్షులను పోషించే ప్రభువు తనకు పోలికగావుండే నరులకు తిండి పెట్టడా? కనుక మనం ఆందోళనం చెందకూడదు - మత్త 6,25-26.

2. రాజులు మొదలైన చారిత్రక గ్రంథాలను వ్రాసిన హీబ్రూరచయితలకు ప్రవక్తల వాక్కులంటే పరమగౌరవం. ఈ యధ్యాయం ఏలీయా వాక్కులోని శక్తిని మూడు పర్యాయాలు పేర్కొంటుంది. అతని మాటపై దేశంలో వాన కురవడం ఆగిపోయింది-1. అతని వాక్కు వితంతువు కుటుంబానికి ఆహారం చేకూర్చి పెట్టింది -14. అతని పలుకు పోయిన పిల్లవాడి ప్రాణాన్ని మళ్ళా తీసుకువచ్చింది-22. ఈ ప్రవక్తల వాక్కులనే యిప్పుడు బైబుల్లో మన కొరకు పదిలపరచి వుంచారు. కనుక మనం వాటిని భక్తిభావంతో చదువుకోవాలి.

3. సీదోను వితంతువు విశ్వాసం మెచ్చుకోదగింది. ఆమె ప్రవక్త వాక్యాన్ని నమ్మి మొదట అతనికి రొట్టెజేసి పెట్టింది. తత్ఫలితంగా ఆమెకు రోజురోజు రొట్టె లభించింది. దైవభక్తునిపట్లగల నమ్మకంద్వారా ఆమె ఆహారం సంపాదించుకొంది. క్రీస్తుకూడ ఆమె విశ్వాసాన్ని పొగడాడు-లూకా4,25. ఈమెలాగే మనంకూడ విశ్వాసాన్ని పెంచుకోవాలి.

4. ఆ వితంతువు మొదట ప్రవక్తకు భోజనం పెట్టింది. తర్వాత తాను తింది. దైవభక్తునిపట్ల ఆమె చూపిన శ్రద్ధా గౌరవమూ ఆలాంటివి. మనంకూడ మన

ప్రేషిత సేవలో మొదట దేవుని ప్రజల అక్కరలు తీర్చాలి. ఆ పిమ్మట మన అక్కరలు తీర్చుకోవాలి. మొదట దైవసేవ, అటుపిమ్మట మన అక్కరలూ సుఖాలూ మొదలైనవి. భక్తిలేని గురువు మఠకన్య ఉపదేశి మొదలైన దైవసేవకులు మొదట తమ అవసరాలను తీర్చుకొంటారు. దేవుని ప్రజలను పట్టించుకోరు. కాని భక్తిగల దైవసేవకులు ఆ సారెఫతు విధవలాగే మొదట విశ్వాసుల అవసరాలను తీరుస్తారు.

# 12. కర్మేలు కొండమీద ఏలీయా

## 1రాజు 18

### 1. సందర్భం

కర్మేలు కొండమీద యావేకి బాలుకీ పోటీ జరిగింది. ఆ పోటీలో యావే గెల్చి బాలు ఓడిపోయాడు. ఏలీయా సమరియా దేశంలో యావేమతాన్ని పునరుద్ధరించాడు. యిస్రాయేలీయులను మళ్ళా ప్రభువు దగ్గరకి రాబట్టాడు. భగవంతునిపట్ల భక్తీ ఆసక్తీ వున్న నాయకులందరికీ అతడు ప్రేరణంగా వుంటాడు.

### 2. వివరణం

మూడేండ్లపాటు ఉత్తర రాష్ట్రమైన సమరియాలో కరువు వికటాట్టహాసం చేసింది. ఆమీదట ప్రభువు క్షామాన్ని తొలగించాలనుకొన్నాడు. తన ప్రవక్తను అహాబు రాజు దగ్గరికి పంపాడు.

దారిలో ప్రవక్త అహాబు ముఖ్యమంత్రియైన ఓబద్యాను కలసికొన్నాడు. ఇతడు యావేభక్తుడు. యెసెబెలు బారినుండి యావే ప్రవక్తలను కాపాడినవాడు. అప్పుడు ఓబద్యా దేశంలోని వాగుల్లోను చెలమల్లోను ఏపాటి నీరు మిగిలివుందా అని పరిశీలించి చూస్తున్నాడు. నీరు చాలినంత లేకపోతే కొన్ని పశువులను చంపవలసి వుంటుంది.

ప్రవక్త ఓబద్యాను రాజుకి తన సమాచారం తెలియజేయమన్నాడు. మంత్రి దడిసాడు. ఎందుకంటే ఏలీయా ఒక్కతావులో వుండడు. ప్రభువు ఆత్మ అతన్ని చోటునుండి చోటుకి త్రిప్పుతూంటుంది. ఏలీయా పలానాచోట వున్నాడని ఓబద్యా రాజుకి చెప్తే, కడన అతడు ఆ తావులో కన్పించకపోతే రాజు కోపంతో ఓబద్యానే చంపివేయవచ్చు. ఆ రాజు ఏలీయాకోసం అంతటా వెతికిస్తున్నాడు. దేశం మీదికి అనావృష్టిని తీసుకొచ్చింది ప్రవక్తే కనుక అతన్ని పట్టుకొని చంపించాలని ప్రయత్నం చేస్తూన్నాడు.

కడన రాజు ఏలీయాను కలసికొన్నాడు. ఈ దేశానికి నీపీడ పట్టింది అని అతడు ప్రవక్తను నిందించాడు. అనగా ఏలీయా బాలు దేవతను అవమానించాడు కనుక

ఆ దేవుడు వానను ఆపివేసాడని రాజు భావం. దేశానికి నా పీడ కాదు నీ పీడే పట్టిందని ప్రవక్త రాజుని నిందించాడు. అనగా రాజు బాలుని కొల్చినందున యావే వానను ఆపివేసాడని ప్రవక్త భావం.

ప్రవక్త రాజుని సవాలు చేసాడు. నీ రాణి పోషించే 450 మంది బాలు ప్రవక్తలనీ యిస్రాయేలు ప్రజలనీ కర్మెలు కొండమీదికి తీసికొనిరా. అక్కడ ఏ దేవుడు నిజమైనవాడో నేనే నిరూపిస్తాను అన్నాడు. రాణి ఈ ప్రవక్తలను రాజు కోశాగారంలోని ధనంతో పోషిస్తూంది. రాజు ప్రవక్త సవాలుని అంగీకరించాడు. కర్మెలు కొండమీద ఇద్దరు దేవుళ్ళకూ పోటి జరగబోతూంది.

రాజూ బాలు ప్రవక్తలూ యిస్రాయేలీయులూ ఏలీయా అంతా కర్మెలు కొండమీద పోగయ్యారు. ఈ కొండమీదనే ఏలీయా చాలాకాలం ఏకాంతంగా వసించాడు. అది దైవసాన్నిధ్యానికి నిలయం. అతడు ప్రజలను ఈలా షరతు పెట్టాడు. "మీరు ఇప్పటివరకు బాలునీ యావేను కూడ పూజిస్తున్నారు. ఇకమీదట ఎవరో వొక దేవుణ్ణి మాత్రమే ఎన్నుకోండి. ఏలా ఎన్నుకోవాలి? బాలు ప్రవక్తలను ఒక యెద్దుని కోసి దాని మాంసాన్ని బలిపీఠంమీద పెట్టమనండి. నేనూ ఒక యెద్దుని కోసి దాని మాంసాన్ని బలిపీఠంమీద పెడతాను. ఇద్దరమూ మా దేవుళ్ళకు ప్రార్థన చేస్తాం. ఏ దేవుడు నిప్పునిపంపి బలిపీఠంమీది మాంసాన్ని దహిస్తాడో అతడే నిక్కమైన దేవుడు. మీరు ఇకమీదట అతన్ని మాత్రమే కొల్వాలి సుమా" అన్నాడు. ప్రజలంతా ఆ షరతుని అంగీకరించారు.

మొదట బాలు ప్రవక్తల వంతు. వాళ్ళు ఎద్దునికోసి మాంసం పీఠంపై పేర్చి వాళ్ళ దేవుణ్ణి ఆవాహనం చేసారు. ఉదయం నుండి సాయంకాలందాకా పెద్ద శబ్దంతో బాలుకి ప్రార్థన చేసారు. కాని ఆ దేవుడు పలకలేదు వులకలేదు. ఏలీయా వాళ్ళను వేళాకోళం చేసాడు. మీ బాలు ఏదో ఆలోచనలోనో పనిలోనో పడివుండవచ్చు. లేదా ప్రయాణంలోనో నిద్రలోనో మునిగివుండవచ్చు. ఇంకా పెద్దగా అరవండి. అతనికి విన్పిస్తుంది అని యెగతాళి చేసాడు. బాలు ప్రవక్తలు ఆవేశం తెచ్చుకొని ఇంకా పెద్దగా అరుస్తూ ప్రార్థనలు చేసారు. తమ శరీరాలను కత్తులతో కోసుకొని నెత్తురు కార్చుకొన్నారు. ఐనా వారి దేవత నుండి ఏ జవాబూ రాలేదు.

తరువాత ఏలీయా వంతు వచ్చింది. అతడుకూడ కొండపైన బలిపీఠం కట్టించాడు. ఎద్దుని కోయించి మాంసాన్ని పీఠంపై పేర్పించాడు. పన్నెండు కడవల నీళ్లు తెప్పించి పీఠంపై కుమ్మరించాడు. అది తడిసి ముద్దయి పోయింది. ఆ నీళ్ళు పీఠంనుండి క్రిందికి కారి దానిచుట్టూ వున్న కందకాన్ని నింపాయి. అలా జలమయమైవున్న బలివేదికమీది మాంసాన్ని దేవుడు అగ్నితో కాల్చివేయాలి.

పూర్వం మోషేకూడ యిస్రాయేలు ప్రజలను సీనాయి కొండదగ్గర ప్రోగుజేసి అక్కడ ఓ బలిపీఠాన్ని కట్టించాడు. కోడె నెత్తుటిని ఆ బలిపీఠం మీద చల్లి దేవునితో నిబంధనం చేయించాడు - నిర్గ 24,4-8. కనుక ఇక్కడ కర్మెలు కొండమీది యేలీయా ఆ సీనాయి కొండమీది మోషేను జ్ఞప్తికి తెస్తాడు.

ఏలీయా బాలు ప్రవక్తలకంటె భిన్నంగా జపించాడు. ప్రభూ! నీవు యిస్రాయేలుకి దేవుడివి. నీకొరకే నేను ఈ శ్రమంతా పడుతున్నాను. నా మొర ఆలించి అగ్నిని పంపు. అవిశ్వాసంతో నీ చెంతనుండి వెళ్ళిపోయిన ఈ ప్రజలను మళ్ళా నీ దగ్గరికి రాబట్టుకో అని మనవిచేసాడు. అతడు సంగ్రహంగాను నిమ్మళంగాను ప్రార్థించాడు. బాహ్యాడంబరం ఏమీ లేదు.

అది యిస్రాయేలీయులు సాయంకాలం ప్రభువుకి బలులు అర్పించే సమయం. ఏలీయా ప్రార్థన చేసాడో లేదో దేవుడు పంపిన అగ్ని దిగివచ్చి ఎద్దు మాంసాన్నీ కట్టెలనూ కందకంలోని నీటినీగూడ దహించి వేసింది. ఆ యగ్నినిజూచి ప్రజలు ఆశ్చర్యపోయారు. సాష్టాంగపడి దండం పెట్టారు. యావే ఒక్కడే నిక్కమైన దేవుడని అరచారు. దానితో దొంగ దేవుడెవరో యథార్థమైన దేవుడెవరో తేలిపోయింది. పోటీలో యావే గెల్చాడు.

బాలు ప్రవక్తలను పారిపోనీయకుండా పట్టుకొండని యేలీయా ప్రజలను ఆజ్ఞాపించాడు. వాళ్ళు 450 మందినీ బంధించారు. ఏలీయా వాళ్ళందరినీ వధించాడు. బాలు తన భక్తులను కాపాడలేకపోయాడు. నేడు మనం ఏలీయా అంతమందిని చంపటం హింసకాదా అని ప్రశ్నిస్తాం. కాని ఆ రోజుల్లో పరిస్థితి వేరు. యావే బాలు దేవరల మధ్య పోటీ ఓ యుద్ధంలాంటిది. ఆకాలంలో పోరులో గెల్చినవాళ్ళు ఓడిపోయినవాళ్ళను చంపేవాళ్ళు. కనుక ఇక్కడ యావే భక్తులు బాలు భక్తులను చంపారు. ఇంకా, ప్రజలను అపమార్గం పట్టించే కపట ప్రవక్తలను పట్టి చంపివేయాలని మోషే ధర్మశాస్త్రం ఆజ్ఞాపిస్తుంది - ద్వితీ 13,5. ఏలీయా ఇక్కడ ఈ యాజ్ఞనుకూడ పాటించాడు.

బాలుతో పోటీ ముగిసింది. ప్రజలు దేవుడు పంపిన నిప్పునీ, కపట ప్రవక్తల నెత్తుటినీ చూచి యావే వొక్కడే దేవుడని నమ్మారు. అతనివద్దకు తిరిగివచ్చారు. కాని అహాబు ఇంకా యావేచెంతకు తిరిగిరాలేదు. అతడు బాలు ఓటమిని చూస్తూ వూరకుండిపోయాడు. మరి అతన్ని గూడ ప్రభువు దగ్గరికి రాబట్టడం ఏలా? వర్షంద్వారా.

కొండమీద బలి సమర్పిస్తున్నారు కనుక ఇంతవరకు అందరూ ఉపవాసం చేసారు. ఇప్పుడు ఆ బలి ముగిసింది. కనుక ప్రవక్త రాజుతో నీవువెళ్ళి భోజనం చేయవచ్చు అని చెప్పాడు. తానేమో తలను కాళ్ళమధ్య పెట్టుకొని గాఢమైన ప్రార్థనలో మునిగిపోయాడు. ఆ ప్రార్థనం వానకొరకే.

అతడు సేవకునితో నీవు సముద్రంవైపు పారజూడు. మబ్బేమైనా లేచిందేమో చూడు అన్నాడు. సేవకుడు ఆరుసార్లు సాగరంవైపు చూచినా మేఘమేమీ కన్పించలేదు. కాని ఏడవసారి

చూచేప్పటికల్లా మూరెడంత మబ్బు తునక కన్పించింది. కాని ఆ చిన్న మబ్బులో దేవుని హస్తం వుంది. కనుక అది అంతై యింతై మహా మేఘమై ఆకాశాన్నంతటినీ ఆవరించి కుంభవర్షం కురిపించింది. మూడేండ్ల తర్వాత దేశంలో కరువు తొలగిపోయింది. ఈ వానను కురిపించింది బాలుకాదు, యావే. బాలు వానదేవుడుగా ప్రసిద్ధిపొందినా శక్తి లేనివాడు. భూమ్యాకాశాలనూ ప్రకృతి శక్తులనూ నడిపించేదీ శాసించేదీ యావే ప్రభువు వొక్కడే.

అహాబుకి విషయం అర్థమైంది. యావే శక్తీ బాలు అశక్తీ తెలిసింది. అతడు రథమెక్కి ఆవానలోనే తన రాజధానియైన యెస్రెయేలుకు తిరిగిపోయాడు. అంతలోనే ప్రభువు ఆత్మ ఏలీయాను ఆవేశించింది. అతడు మహావేగంగా పరుగెత్తి రాజు రథం కంటె ముందుగానే యెస్రెయేలును చేరుకున్నాడు. కర్మెలు కొండకీ ఈ నగరానికీ 17 మైళ్ళ దూరం. అంతదూరమూ అతడు ఆత్మశక్తితో పరుగెత్తాడు. అతడు వార్తావహుడుగా వెళ్లి బాలు వోడిపోయాడనీ యావే గెల్చాడనీ రాజధాని నగరంలోని పౌరులకు చాటిచెప్పాడు అనుకోవాలి.

## 3. ప్రార్థనా భావాలు

1. ఏలీయా జీవితాంతం బాలు ఆరాధనను ఎదిరించి నిల్చిన భక్తుడు. ఏకైక హృదయంతో యావేను కొల్చినవాడు. ఈనాడు మనం బాలు దేవతనీ విగ్రహాలనూ కొలవం. కాని మన శోధన మరోరూపంలో వుంటుంది. మనం కొల్చేది లోకవస్తువుల్ని. ప్రభువు ఇద్దరు యజమానులను సేవించవద్దని ఆదేశించాడు. ఈ యిద్దరు యజమానులు దేవుడూ లోకవస్తువులూను - మత్త 6,24. మామూలుగా మనం కొల్చే లోకవస్తువులు సుఖభోగాలు డబ్బు పదవి అధికారం పేరుప్రతిష్ఠలు మొదలైనవి. నరులంతా వీటికోసమే ప్రాకులాడుతూంటారు. మనం వీటిల్లోపడి దేవుణ్ణి పూర్తిగా విస్మరిస్తాం. ఇంత అవివేకం మరొకటిలేదు.

2. ఏలీయాకు నిజదేవునిపట్ల వున్న ఆసక్తిని మనం ఎంతైనా మెచ్చుకోవాలి. యిస్రాయేలీయులు సీనాయి దగ్గర యావేతో నిబంధనం చేసికొన్నవాళ్లు. అతని ప్రజలు, అతన్ని పూజించే భక్తులు. ఐనా వాళ్లు మూర్ఖులై యావేను విడనాడి బాలు దగ్గరికి వెళ్ళిపోయారు. వాళ్ళను మళ్ళా ప్రభువు దగ్గరికి రాబట్టిందాకా ఏలీయాకు విశ్రాంతి లేదు. యిస్రాయేలు దేశంలో యావే మతాన్ని పునరుద్ధరించిందాకా అతనికి నిద్రలేదు. ప్రేషిత సేవలో మనకుకూడ ఈ ప్రవక్తకున్న ఆసక్తి వుండాలి. ప్రజలను క్రీస్తు దగ్గరికి తీసికొని వచ్చిందాకా మనంకూడ నిద్రపోకూడదు.

3. ఏలీయాలాంటి ఆధ్యాత్మిక నాయకులు మన ప్రజలకు ఎప్పుడూ అవసరమే. జనులు తెలియక దేవునికి దూరంగా వెళ్ళిపోతారు. ఈ లోకమే, ఇక్కడి ఆకర్షణలే చాలు అనుకొంటారు. అలాంటివాళ్ళను నిరంతరమూ మళ్లా దేవుని దగ్గరికి తీసికొని వస్తూండాలి. మామూలుగా మన క్రైస్తవ సమాజంలో ఆధ్యాత్మిక నాయకులు గురువులు మఠకన్యలు ఉపదేశులు ఉపాధ్యాయులు మొదలైనవాళ్లు. ఈ నాయకులు ఏలీయాలాంటి మహాభక్తులనుచూచి ప్రేరణం తెచ్చుకోవాలి. ఈ పాపపు లోకంలో ఆధ్యాత్మిక విలువలకు సాక్ష్యంగా నిలువాలి.

# 13. హోరేబు కొండమీద యేలీయా

## 1రాజు 19

### 1.సందర్భం

ఏలీయా బాలు ప్రవక్తలను చంపినందున యెసెబెలు రాణి అతనిమీద పగతీర్చుకోగోరింది. ప్రవక్త ఆ రాణికి దడిసి పారిపోయాడు. నిరుత్సాహంతో యావే మతాన్ని పునరుద్ధరించే కార్యక్రమాన్ని ఆపివేద్దామనుకొన్నాడు. చనిపోదామనికూడ తలంచాడు. హోరేబు కొండమీద ప్రభువు అతనికి దర్శనమిచ్చి ఓదార్చి తిరిగి పూర్వపు పనిమీద పంపాడు. జీవితంలో కష్టాలనూ ఆటంకాలనూ ఎదుర్కొని నిరుత్సాహం చెందేవాళ్ళకు ఏలీయా విషాదగాథ ప్రేరణం పుట్టిస్తుంది.

### 2. వివరణం

బాలు ప్రవక్తలు ఓడిపోవడం, అద్భుతంగా వాన కురవడం అహాబు చూచాడు. ఐనా అతడు బాలు మతాన్ని విడనాడలేదు. యెసెబెలు రాణి ఏలీయాను 24 గంటల్లోనే చంపిస్తానని శపథం చేసింది. యావేపట్ల యిస్రాయేలీయుల విశ్వాసం చూద్దామా అంటే అదీ అంతంతమాత్రమే. అసలు వాళ్ళు నమ్మతగినవాళ్ళు కాదు. కనుక అతడు ప్రాణాలు కాపాడుకోగోరి యెస్రెయేలు నుండి పారిపోయాడు.

ప్రవక్త నిరుత్సాహం చెందాడు. విషాదానికి గురయ్యాడు. బేర్షబ పట్టణం వరకు వెళ్ళి సేవకుణ్ణి అక్కడే వదలివేసి, శోకంతో నరుల సాహచర్యాన్ని వదలివేసి, ఆహారంకూడ మానివేసి, యాత్రికుడై ఏకాంతంగా అరణ్యంలోకి వెళ్ళిపోయాడు. అక్కడ ఓ రేగుచెట్టుక్రింద చతికిలబడి ఆ తావులోనే ప్రాణాలు విడిస్తే బాగుంటుందికదా అనుకొన్నాడు. తన పూర్వులైన మోషే సమూవేలు మొదలైన భక్తులంతా యావే మతాన్ని నిలబెట్టలేకపోయారు. కన్ను

మూసారు. తాను వాళ్ళకంటె గొప్పవాడు కాదు. కనుక తానూ ఓటమిని అంగీకరించి కన్నుమూస్తే బాగుంటుంది- ఇవి యేలీయా విషాద భావాలు.

పూర్వం కష్టాల్లో యిస్రాయేలు భక్తులు చాలమంది ఈలాగే భావించారు. ప్రజలు మాటవినక తనమీద ఎదురుతిరిగితే మోషే ప్రాణాలు విడువగోరాడు - నిర్గ 32,32 చూపుకోల్పోయిన తోబీతు యూతనలకు తట్టుకోలేక చనిపోగోరాడు-3,6. నీనివే పట్టణం నాశం కాలేదని బాధపడి యోనా ప్రాణాలు వదలివేయగోరాడు-4,3. దుర్మార్గులైన ప్రజలు పెట్టే బాధలు భరించలేక యిర్మీయా అసువులుబాయగోరాడు - 20,14. బాధలు ఎదురైనపుడు నేడు మనమూ ఈలాగే చేస్తాం.

కాని ప్రభువు ఆపదలు వచ్చినపుడు తన భక్తులను వదలివేయడు కదా! అతడు ప్రవక్తకు దారిజూపడానికి ఓ దేవదూతను పంపాడు. ఆ దూత ప్రవక్తకు ఆహారమూ నీళ్లూ అందించాడు. అతనిచే రెండుసార్లు భోజనం చేయించాడు. హోరేబుకు వెళ్ళమని సలహా యిచ్చాడు. ప్రవక్త ఆ ఆహారబలంతో నలభైరోజులు నడచి హోరేబు కొండను చేరుకొన్నాడు.

అది దేవుని కొండ, పుణ్యక్షేత్రం. పూర్వం మోషే ఇక్కడే యావేను దర్శించాడు. యావే మతం ఇక్కడే ప్రారంభమైంది. ఆ మోషే పిలుపునీ ఉద్యమాన్నీ ఇప్పుడు ఏలీయా కొనసాగించాలి. ఆనాడు మోషేకు దయచేసిన బలాన్నీ ప్రేరణనీ ప్రభువు ఇప్పుడు ఏలీయాకుకూడ ప్రసాదిస్తాడు. హోరేబు కొండమీది యేలీయా అదే కొండమీది మోషేను జ్ఞప్తికి తెస్తాడు.

ఏలీయా రాత్రి ఆ కొండలోని ఓ గుహలో నిద్రించాడు. ప్రభువు పూర్వం మోషేనుగూడ కొండనెర్రెలో పెట్టి వుంచినట్లుగా చదువుతున్నాం - నిర్గ 23,22. ప్రభువు వాణి యేలీయాను నీవిక్కడ ఏం చేస్తున్నావు? యిస్రాయేలు దేశంలో వుండవలసిన వాడివి ఇక్కడున్నావేమి అని ప్రశ్నించింది. ప్రవక్త దేవునికి మూడంశాలను గూర్చి ఫిర్యాదు చేసాడు. 1. తాను యావేను మాత్రమే కొలిస్తే యిస్రాయేలీయులు బాలుని కొల్చారు. 2. వాళ్లు యావే బలిపీఠాలను కూలద్రోసి అతని ప్రవక్తలను పట్టి చంపారు. 3. కడన ఆ ప్రజలు తన్ను కూడ చంపివేయజూస్తున్నారు. తానుకూడ పోతే యిక యావే మతాన్ని నిలబెట్టే దిక్కు వుండదు. ఇది ప్రవక్త ఆవేదన.

ప్రభువు వాణి యేలీయాను గుహనుండి కొండమీదికి ఎక్కిరమ్మంది. అతడు కొండశిఖరం ఎక్కాడు. అక్కడ పెనుగాలి, భూకంపం, అగ్నిజ్వాలలు మొదలైన భయంకర దృశ్యాలను చూచాడు. పూర్వం ఈలాంటి భీకర దృశ్యాల్లోనే హోరేబు కొండమీద దేవుడు మోషేకు దర్శనమిచ్చాడు-నిర్గ 19,16-19. కాని యిప్పుడు ఈ యద్భుత సంఘనటల్లో దేవుడు లేడు. అవి కేవలం అతని ఆగమనాన్ని సూచించేవి మాత్రమే.

ఈ సంఘటనలు ముగిసాక ఓ మెల్లని స్వరం విన్పించింది. ప్రభువు మృదువైన స్వరంతో యావే అనే తన పేరుని విన్పించాడు. ప్రవక్తనుగూడ పేరెత్తి పిల్చాడు - 13. ఇదే దైవసాక్షాత్కారం. ఈ యధ్యాయమంతటిలోను ముఖ్యమైన వాక్యం ఇదే. అది దేవుని స్వరమని యేలీయా వెంటనే గుర్తించాడు. కనుకనే అతడు భయభక్తులతో తన అంగీ చెంగుతో ముఖాన్ని కప్పుకొన్నాడు. అపవిత్రుడైన నరుడు మహాపవిత్రుడైన దేవుణ్ణి కంటితో చూడకూడదు.

ఇక్కడ ప్రవక్తకు ప్రభువు స్వరం మెల్లగా విన్పించింది. దీని భావమేమిటి? ప్రభువు తన భక్తుడైన యేలీయాకు ఆత్మీయుడూ సన్నిహితుడూ అయ్యాడని అర్థం. మనం ఎదుటవున్న వాళ్ళతో పెద్దగాగాక మెల్లగా మాట్లాడతాం. గుసగుసలాడతాం. కనుక ఇక్కడ ప్రవక్త యావే యెదుట నిల్చివున్నాడని భావం. అతనికి ప్రభువు సాక్షాత్కారం కలిగిందని ఫలితార్థం.

ఈ దైవదర్శనంతో ఏలీయా నిరుత్సాహమూ విషాద భావాలు తొలగిపోయాయి. అతనికి మళ్ళీ ధైర్యంవచ్చింది. ప్రవక్త సమరియా దేశంలో తాను చేస్తున్న ప్రభువు పనిని ఆపివేసి నిరాశతో ఈ కొండకు వచ్చాడు. ప్రభువు అతన్ని ఉత్తేజపరచి మళ్లా పూర్వపు పనిమీద పంపాడు.

యావే ఏలీయాకు మూడు విషయాలు చెప్పాడు. 1) ప్రవక్త యావే మతోద్ధరణ కార్యక్రమాన్ని మానివేయకూడదు. కనుక అతడు తనకు వారసునిగా యెలీషాను అభిషేకించాలి-16. 2) యిస్రాయేలీయులలో భక్తివిశ్వాసాలు లేనివారిని హసాయేలు, యెహూ మొదలైనవాళ్లు శిక్షిస్తారు. 3) ఏలీయా తాను వంటరిగాడినని భయపడనక్కరలేదు. ప్రభువు అతనికి భక్తిమంతులైన యిస్రాయేలీయులను ఏడువేలమందిని తోడుగా ఇస్తాడు. వాళ్ళు భాలుని ఎంతమాత్రం కొలవరు.

ఈ దర్శనం ద్వారాను ఈ సందేశం ద్వారాను ప్రవక్త ఉత్తేజాన్ని తెచ్చుకొని కొండ దిగి వచ్చాడు. ఏలీయా తన దేశానికి తిరిగిరాగా ఓ తావులో ఎలీషా పొలం దున్నుతూ కన్పించాడు. ఇతడే ఏలీయాకు వారసుడు. కనుక ఏలీయా తన అంగీని తీసి దానితో యెలీషాను కప్పాడు. ఈ యంగీ దాన్ని తాల్చిన వ్యక్తినీ, ఆ వ్యక్తి హక్కులనూ తెలియజేస్తుంది. కనుక ఇక్కడ రెండంశాలను గుర్తించాలి. 1. ఏలీయా తన అంగీతో యెలీషాను కప్పడం ద్వారా అద్భుతాలుచేసే గురువుశక్తి శిష్యుల్లోకి ప్రవేశించింది. యేలీయా దాటిపోయాక అతని అద్భుతాలను ఈ శిష్యుడు కొనసాగిస్తాడు. 2. గురువుకి శిష్యునిమీద హక్కులుంటాయి. కనుక యెలీషా ఇంటికివెళ్ళి తల్లిదండ్రులవద్ద సెలవు తీసికొని మళ్ళా గురువు దగ్గరికి రావాలి. అతని వుద్యమాన్ని కొనసాగించాలి.

ఎలీషా తాను పొలందున్నుతూన్న రెండెద్దులను వధించి మాంసం వండి తనతోపాటు వ్యవసాయంచేసే తోడి పనివారికి వడ్డించాడు. వాళ్ళంతా భుజించారు.

హీబ్రూ సంప్రదాయం ప్రకారం గురువు దగ్గరికి వచ్చిన శిష్యుడు తన పూర్వజీవితాన్ని మార్చుకొంటాడు. కనుక యెలీషా తన వ్యవసాయ వృత్తిని మానివేసి గురువుగారిని అనుసరించాడు. అతడు యావే మతోద్ధరణ కార్యక్రమానికి పూనుకొన్నాడు.

## 3. ప్రార్థనా భావాలు

1. ఏలీయా నిరాశతో యావే మతోద్ధరణ కార్యక్రమాన్ని వదలివేయాలనుకొన్నాడు. దేవుడు అతనికి కొండమీద ప్రేరణంపుట్టించి మళ్ళీ పూర్వపు పనిమీద పంపాడు. జీవితంలో మనకుగూడ అపజయాలూ నిరాశలూ కొల్లలుగా ఎదురౌతాయి. దేవుడు మనకు ఒప్పజెప్పిన పనిని వదలివేయాలనిపిస్తుంది. కాని అలా వదలివేయకూడదు. ఏలీయాలాగే మన బాధలను దేవునితో చెప్పుకోవచ్చు. పుణ్యక్షేత్రాలకు వెళ్ళవచ్చు. మనకు ఉత్సాహాన్ని పుట్టించే వ్యక్తిదగ్గరికో తావుదగ్గరికో పనిదగ్గరికో వెళ్ళవచ్చు. దేవుడు వీళ్ళ ద్వారాగాని స్వయంగాగాని మనలను ఉత్తేజపరుస్తాడు. నూత్నబలాన్ని దయచేస్తాడు. ఆ పిమ్మట మళ్ళా మన పనిమీద మనలను పంపుతాడు. ఎప్పుడుకూడ దేవుడు మనకు ఉద్దేశించిన పనిని మాత్రం వదలివేయకూడదు. అపజయాలు ఎదురైనప్పుడెల్లా ప్రభువునుండి మళ్ళామళ్ళా ప్రేరణం పొందుతూండాలి.

2. మోషే, యోనా, యిర్మీయా మొదలైన మహాభక్తుల్లాగే యేలీయాగూడ నిరుత్సాహానికి గురయ్యాడు. చనిపోగోరాడు. ఘనలనుగూడ చాలసార్లు నిరాశాభావాలు ఆవరిస్తాయి. ఐనా భక్తులందరికీ ఓదార్పును దయచేసే ప్రభువు ఒకడున్నాడు. మనం అతన్ని ఆశ్రయించడం మర్చిపోగూడదు. శ్రమలు ఎదురైనపుడు దివ్యసత్ప్రసాద సన్నిధిలో ప్రార్థన చేసికొంటే కొంత వూరట కలుగుతుంది.

3. ఏలీయా దేవదూత ఒసగిన ఆహారాన్ని భుజించి సత్తువ తెచ్చుకొని 40 రోజులు ప్రయాణం చేసి కొండను చేరుకొన్నాడు. ఈ యాహారం మన దివ్యసత్ప్రసాదాన్ని సూచిస్తుంది. ఈ లోకయాత్రలో దివ్యభోజనం మనకు అపారమైన బలాన్నిస్తుంది.

4. కొండమీద దేవుడు యేలీయాకు ప్రత్యక్షమయ్యాడు. అతనితో మెల్లని స్వరంతో మాటలాడాడు. అనగా అతనికి సన్నిహితుడయ్యాడు. ఏలీయా ప్రభువు సాన్నిధ్యాన్ని గుర్తించి భయంతో ముఖం కప్పుకొన్నాడు. అతని దైవానుభూతి గొప్పది. బైబుల్లో భక్తుల దైవానుభూతిని తెలియజేసే అరుదైన ఘట్టాల్లో ఇదీ వొకటి. మన జీవితంలోగూడ ఈ దైవానుభూతిని తప్పక సాధించాలి. ఈ వరాన్ని మనం ఆశతో అడుగుకోవాలి.

5. ఏలీయా పిలవగానే ఎలీషా అతనివెంటబోయాడు. పూర్వపు వ్యవసాయ జీవితాన్ని వదలివేసి యావే మత పునరుద్ధరణ కార్యక్రమానికి పూనుకొన్నాడు.

పిలుపునందుకొన్న గురువులూ మఠకన్యలూ మొదలైనవాళ్ళంతా పూర్వపు పాపజీవితాన్ని వదలివేసి వినూత్నమూ పవిత్రమూ ఐన ప్రేషిత జీవితానికి పూనుకోవాలి.

6. మోషే యేలీయాలకు పోలికలున్నాయి. ఇద్దరూ కొండమీద దేవుణ్ణి చూచారు. ఇద్దరూ మళ్ళా తబోరుకొండ మీద మారురూపం దాల్చిన క్రీస్తుని చూచారు - మత్త 17,2. ఏలీయా నూత్నవేదంలో క్రీస్తుకి పురోగామిగా వస్తాడు అనుకొన్నారు. ఆ మహాభక్తులు మనకొరకు ప్రార్థనం చేయాలని వేడుకొందాం.

# 14. నాబోతు ద్రాక్షతోట

## 1రాజు 21

### 1. సందర్భం

ఈ యధ్యాయం పేర్కొనే నాబోతు సంఘటనం సాంఘిక అన్యాయాన్ని తెల్పే కథ. ఇది మొదటి రాజుల గ్రంథంలోని రెండు సిరియా యుద్ధాలమధ్య చేర్చబడింది. నాబోతుపై కుట్రపన్ని అతన్ని చంపించిన సూత్రధారిణి అహాబు భార్య యెసెబెలు. ఆమె అంతకుముందే యావే ప్రవక్తలనుగూడ చంపించింది. యావే ప్రవక్తయైన ఏలీయా నిర్భయంగా రాజుని ఎదిరించి అతని అన్యాయానికి తగిన శిక్షను ఎరిగించాడు. ఈ కథ ప్రవక్తల ఆధిక్యాన్ని తెలియజేసేది, ప్రవక్తల సంప్రదాయానికి చెందింది. ఇది పూర్వవేదంలోని సుప్రసిద్ధమైన కథల్లో వొకటి.

### 2. వివరణం

అహాబు ఉత్తర రాజ్యమైన సమరియాకు చెందినవాడు. ఆ రాజ్యానికి రాజధానికూడ సమరియా నగరమే. కాని యిక్కడ చలి విపరీతంగా వుంటుంది. అందుచే ఆ రాజు చలి తక్కువగా వుండే యెస్రెయేలు పట్టణాన్ని రెండవ రాజధానిగా చేసికొన్నాడు. మన కథ ఈ నగరంలో జరిగింది.

నాబోతు యెస్రెయేలు పట్టణంలో పదిమందికీ తెలిసిన పేదరైతు. నీతి నిజాయితీలు కలవాడు. అతని చేను రాజు ప్రాసాదానికి ఆనుకొనివుంది. కనుక రాజు దానిని తీసికోగోరాడు. దానికి బదులుగా రైతుకు మరో చేనుగాని లేక సరిపడిన వెలకాని యిస్తానన్నాడు. కాని నాబోతు తన చేనుని వదలుకోవడానికి ఎంతమాత్రం ఇష్టపడలేదు. అది అతనికి తండ్రి తాతలనుండి వచ్చిన పొలం. అతడు దాన్ని మళ్ళా తన పుత్ర పౌత్రులకు వదలివెళ్ళాలి. యిస్రాయేలు దేశంలోని భూమి అంతా ప్రభువుదే. ఆ నేలను

దేవుడు యూదులకిచ్చాడు. కనుక నేల పవిత్రమైంది. ఏ కుటుంబానికి చెందిన భూమి ఆ కుటుంబం ఆధీనంలోనే వుండాలి. అన్యాక్రాంతం కాకూడదు. ఏ కుటుంబమైన పేదదై తన పొలాన్ని ఇతరులకు అమ్ముకొంటే, జూబిలి సంవత్సరమైన యేబయ్యవ యేట అది తిరిగి సొంత కుటుంబానికి చెందిపోతుంది - లేవీ 25,23. కాని రాజు తీసికొన్న భూమి తిరిగి సొంతదారునికి రాదు. కనుకనే నాబోతు తన పొలాన్ని వదలుకోడానికి ఇష్టపడలేదు.

అహాబుకి ధర్మశాస్త్ర నియమాలు తెలుసు. అతడు బలాత్కారంగా పేదవాడైన నాబోతు నేలను తీసికోలేదు. కనుక కోపంతో ఇల్లుజేరి విచారంగా పడకపై పండుకొన్నాడు. అతని భార్య యెసెబెలు భర్త మనస్తాపానికి కారణం తెలిసికొంది. ఆమె యూదుల ఆడపడుచు కాదు. తూరు దేశానికి చెందిన అన్యజాతి స్త్రీ. వాళ్లు బాలు అనే అన్యదేవతను కొల్చేవాళ్లు. యెసెబెలు సమరియా దేశంలో కూడ ఈ బాలు మతాన్ని ప్రచారం చేయించింది. తనకు అడ్డమొచ్చిన యావే ప్రవక్తలను పట్టి చంపించింది-19,10.

యెసెబెలు అహాబులాగ మోషే ధర్మశాస్త్ర నియమాలను లెక్కచేసేదికాదు. ఆ రాణి దౌర్జన్యంగా నాబోతు పొలాన్ని లాగుకోవాలనుకొంది. నీ సామర్థ్యమింతేనా అని భర్తను గేలిచేసింది. అతని అధికారాన్ని తాను చేజిక్కించుకొంది. అతని రాజముద్రను తీసికొంది. అతని పేరు మీదిగా యెస్రెయేలు నగర అధికారాలకు జాబు వ్రాసింది. దానిమీద రాజముద్రవేసి పంపించింది.

ఆ జాబులో ఆమె నగరాధికారులను ఈలా ఆజ్ఞాపించింది. "నాబోతు పాపాలకు దేవుని కోపం దేశంమీదికి దిగివస్తుంది. ఆ కోపాన్ని తొలగించడానికిగాను మీరు ఉపవాసం చేయండి. నాబోతు దేవుణ్ణీ రాజునీ శపించాడని ఇద్దరు దుర్మార్గులచేత కూటసాక్ష్యం చెప్పించండి. ఈ సాక్ష్యం ఆధారంగా అతన్ని చంపించండి".

నగరాధికారులు రాణి లేఖను చూచి అది రాజు లేఖే అనుకొన్నారు. ఆమె ఆజ్ఞాపించినట్లే చేసారు. దుర్మార్గులిద్దరు నాబోతు దేవుణ్ణీ రాజునీ శపించాడనీ కూటసాక్ష్యం చెప్పారు. ఇద్దరెందుకంటే, ఒకడి సాక్ష్యం చెల్లదు-ద్వితీ 17,6. దేవుణ్ణీ రాజునీ తిట్టడం ధర్మశాస్త్రం ప్రకారం నేరం - నిర్గ 22,28. ఈ తిట్టడమే నాబోతు చేసిన పాపం. ఈ పాపాన్ని తొలగించడానికే యెస్రెయేలు ప్రజలు ఉపవాసం పాటించింది. ఈ నేరాన్ని సాకుగా బెట్టుకొనే వాళ్లు నాబోతుని చంపించింది. కాని ఇదంతా వట్టి కుట్ర. యెసెబెలు పాపఫలం. నగరాధికారులకు యెసెబెలు కుట్రకూడ తెలియదు. వాళ్లు రాజే నాబోతును చంపమని ఆజ్ఞాపించాడు అనుకొన్నారు.

ఆరోజుల్లో యిస్రాయేలు రాజు న్యాయాధిపతికూడ. కనుక అహాబురాజు న్యాయాధిపతిగా పేదసాదలకు న్యాయం చేకూర్చవలసినవాడు. అతడే మోసంతో నాబోతును చంపిస్తే ఇక పేదలకు దిక్కెక్కడిది? కంచే చేనుమేస్తే కాపుని ఆదుకొనేదెవరు?

నాబోతు యెసెబెలు కుట్రలో జిక్కి ప్రాణాలు కోల్పోయాక అహాబు అతని పొలాన్ని స్వాధీనం చేసికోవడానికి సమరియానుండి యెజ్రెయేలుకు వచ్చాడు. చట్టరీత్యా చంపబడిన ద్రోహి ఆస్తి రాజుకు చెందుతుంది. కనుక అతడు నాబోతు పొలంమీద తనకు హక్కువున్నట్లుగా ప్రవర్తించాడు. పూర్వం దావీదురాజు ఈలాగే ఊరియాను చంపించి అతని భార్య బత్షేబాను అపహరించాడు. రాజులు తలంచుకొంటే దెబ్బలకు కొదవా?

ప్రభువు అహాబు యెసెబెలుల కుట్రను గమనిస్తూనే వున్నాడు. భక్తిమంతుల మరణం ప్రభువుకి ఎంతో బాధ కలిగిస్తుంది – కీర్తన 116,15. కనుక అతడు అహాబుకి బుద్ధి చెప్పడానికి తన సేవకుడైన యేలీయాను పంపాడు. ఆ ప్రవక్త ప్రభువు వాణిగా బయలుదేరి వచ్చాడు.

అహాబు పేదవాణ్ణి హత్యచేయించడమేగాక అతని పొలాన్నిగూడ దొంగిలించాడు. రెండు నేరాలు చేసాడు. కనుక అతనికి ఘోరశిక్ష తప్పదు. ఆ రాజు పేదవాని నెత్తుటిని చిందించిన నగరంలోనే అతని నెత్తుటినిగూడ కుక్కలు నాకుతాయి. ఎంత నేరానికి అంత శిక్ష కదా!

ఏలీయా ప్రవక్తకీ రాజుకీ పడదు. బాలుని కొల్చినందుకు ప్రవక్త రాజుని చీవాట్లు పెడుతూ వచ్చాడు. కనుక అతడు రాజుకి శత్రువయ్యాడు. పైగా యిప్పుడు రాజు పేదవాణ్ణి అన్యాయంగా చంపించాడు కదా! యిస్రాయేలీయులకు ఓ ఆచారముండేది. ఏ నరుణ్ణయినా శత్రువులు చంపివేస్తే అతని చుట్టాలు ఆ శత్రువులమీద పగతీర్చుకొనేవాళ్ళు. ఇక్కడ యేలీయా నాబోతుకు చుట్టమై అహాబుమీద పగతీర్చుకోడానికి వచ్చాడు. ఈ దృష్టిలో కూడ అతడు రాజుకి శత్రువు.

ఏలీయా అహాబు బలాన్నీ రాచరికాన్నీ చూచి దడవలేదు. నిర్భయంగా ప్రభువు సందేశాన్ని అతనికి విన్పించాడు. అహాబు చేసిన దుష్కార్యానికి అతని కుటుంబమంతా నాశమైపోతుందని గర్జించాడు. అతడు, అతని భార్య యెసెబెలు, కుమారుడు అహస్యా, మనుమడు యెహోరాము అంతా యుద్ధంలో చస్తారు. అహాబు ఓమ్రి రాజవంశానికి చెందినవాడు. ఆ వంశమే పూర్తిగా అంతరించిపోతుంది. ఈలా అతడు వొడిగట్టిన అన్యాయానికి శాస్తి జరుగుతుంది. భార్య ప్రోద్బలంపై ప్రభువును విడనాడి విగ్రహారాధనకు పాల్పడినందులకు అహాబు సర్వనాశమైపోతాడు.

ఈ యధ్యాయమంతా గూడ కుట్రతో హత్యతో శాపాలతో నిండివుంది. కట్టకడన మాత్రం ఓమంచి సంగతి వస్తుంది.

ఏలీయా తన్ను తిట్టి శపించగా అహాబు పశ్చాత్తాపపడ్డాడు. సంతాపసూచకంగా గోనెతాల్చి ఉపవాసమున్నాడు. కటిక నేలపై పండుకొన్నాడు. ప్రభువు అతన్ని పశ్చాత్తాపాన్ని చూచి మనసు మార్చుకొన్నాడు. యావే అహాబు కాలంలోనే అతని వంశాన్ని నాశం చేయలేదు. ఆ శిక్షను అహాబు కుమారుని కాలానికి వాయిదా వేసాడు.

## 3. ప్రార్థనా భావాలు

1. ఈ యధ్యాయంలో ముఖ్యమైన అంశం సాంఘిక అన్యాయం. రాజా న్యాయాధిపతీ ఐన అహాబు న్యాయాన్ని చెరిచాడు. అధికారగర్వంతో పేదవాడైన నాబోతును చంపించి అతని పొలాన్ని దోచుకొన్నాడు. దానికి తగిన శిక్షను అనుభవించాడు. ఈనాడుకూడ ధనవంతులు పేదలకు అన్యాయం చేస్తూనే వున్నారు. ఆ పేదల నెత్తురు పూర్వం హేబెలు నెత్తురులాగ దేవునికి మొరపెట్టితీరుతుంది - ఆది 4,10. కనుక మన క్రిందివాళ్ళకు మనమెప్పుడూ అన్యాయం చేయకూడదు. ఒకరికి ముట్టవలసింది మనం కొట్టివేయకూడదు. ఎవరికి దక్కవలసింది వాళ్ళకు దక్కనీయాలి.

2. అహాబులాగ దుండగాలు చేసేవాళ్ళు నేడూ వున్నారు. కాని ఆ దుండగాలను ఖండించే ప్రవక్తలు మాత్రం నేడు లేరు. ఐనా ప్రవక్తల స్థానంలో మన అంతరాత్మ వుంది. మనం పాపకార్యం చేసిన వెంటనే మన అంతరాత్మ మనలను హెచ్చరిస్తుంది. చీవాట్లు పెడుతుంది. అంతరాత్మ ప్రబోధం విని మన తప్పులకు మనం పశ్చాత్తాపపడాలి.

3. ఏలీయా అహాబు రాజుకి భయపడలేదు. ధైర్యంగా అతన్ని ఎదిరించాడు. అతని తప్పిదాన్ని వేలెత్తి చూపించాడు. నేటి సమాజంలో ధనవంతులూ బలవంతులూ చేసే అన్యాయాలు మనకు తెలుసు. కాని వాళ్ళను ఎదిరించే సాహసం మనకుండదు. పలుకుబడి కలవాళ్ళను ఎదిరించి మనం విజయాన్ని సాధించలేం. పైగా ప్రమాదాన్ని కొనితెచ్చుకొంటాంగూడ. అందుచేత దడుస్తాం, వెనుకాడతాం. కాని ప్రవక్తలు ఈలా దడవలేదు. నిర్భయంగా దుష్టులను ఎదుర్కొన్నారు. వాళ్ళ ధైర్యం మనకుకూడ లభించాలని ప్రభువుని వేడుకొందాం.

4. అహాబు ఏలీయా నోటినుండి వచ్చిన ప్రభువు వాక్యాలకి దడిసాడు. పశ్చాత్తాపపడ్డాడు. అలాగే మనం కూడ పాపకార్యాలు చేసినపుడు ప్రభువు ఆజ్ఞలకు భయపడాలి. చిత్తశుద్ధితో పశ్చాత్తాపపడాలి.

# 15. ఏలీయాకు వారసుడుగా ఎలీషా

## 2రాజు 2

### 1. సందర్భం

ఏలీయా స్వర్గానికి వెళ్ళిపోయే సమయం ఆసన్నమైంది. ఎలీషా అతనికి వారసుడయ్యాడు. అద్భుతాలు చేసే గురువుగారి శక్తి అతనికి సంక్రమించింది.

### 2. వివరణం

ఏలీయా ఎలీషా గిల్గాలునుండి బేతేలుకి అక్కడి నుండి యెరికోకీ, అక్కడినుండి యోర్దానుకీ వెళ్ళారు. ప్రతి తావులోను ఏలీయా శిష్యునితో ఇక నీవిక్కడ ఆగు అని చెప్తుండేవాడు. శిష్యుని విశ్వాసాన్ని పరీక్షించాలని ఏలీయా తలంపు. అతడు ఈలా చెప్పినపుడల్లా యెలీషా దేవుని తోడు. నేను నిన్ను వదలిపెట్టను అనేవాడు. చివరి గడియల్లో గురువుగారిని వదలిపెట్టకుండా భక్తితో సేవించాలని ఎలీషా తలంపు.

ప్రవక్తలు యేలీయా మోక్షానికి వెళ్ళిపోబోతున్నాడని గుసగుసలాడుకో జొచ్చారు. వాళ్ళు పై తావులన్నిటిలోను ఆ సంగతిని గూర్చి ఎలీషాను అడిగారు. ఆ విషయాన్ని గూర్చి మనం అసలు మాట్లాడకూడదు. మీరు నోరు కదపవద్దని యెలీషా వారిని మందలించాడు.

యోర్దాను నది దగ్గరికి రాగానే యేలీయా తన అంగీని తీసి నదీ జలాలను మోదాడు. వెంటనే నది రెండు పాయలుగా చీలి దారి యేర్పడింది. గురుశిష్యులు నది ఆవలి హొద్దుకు వెళ్ళిపోయారు. అక్కడినుండే యేలీయా స్వర్గానికి వెళ్ళాడు. పూర్వం మోషే సముద్రజలంగుండా దారిచేసాడు-నిర్గ 14. యోషువా ఈ నదీ జలాలగుండానే త్రోవచేసాడు-3. అలాగే యిప్పుడు ఏలీయాకూడ ఆ నీటిగుండా మార్గం చేసాడు.

ఏలీయా శిష్యుని భక్తికి సంతసించి, నేను వెళ్ళిపోబోతున్నాను. ఈ చివరి క్షణాల్లో నీకు ఏం వరం కావాలో కోరుకో అన్నాడు. శిష్యుడు అయ్యా! నాకు నీ శక్తిలో రెండువంతులు దయచేయి అని అడిగాడు. యూదుల సంప్రదాయం ప్రకారం పెద్దకొడుక్కి తండ్రి ఆస్తిలో రెండువంతులు వస్తుంది-ద్వితీ 21,17. కనుక గురువు తన్ను పెద్దకొడుకుని చూచినట్లుగా చూడాలని ఎలీషా ఉద్దేశం. అనగా గురువునుండి ప్రవక్త శక్తిని సమృద్ధిగాపొంది అతినికి తగిన వారసుడు కావాలని ఎలీషా కోరిక.

కాని ప్రవక్త పదవి వారసంగా వచ్చేదికాదు. అది దేవుడిచ్చే వరం. కనుక ఏలీయా శిష్యునితో నాయనా! నీ కోర్కెను తీర్చడం కష్టం. నేను ఈ భూమి మీదినుండి వెళ్ళిపోయేపుడు నేను నీకు కన్పిస్తే నీకోరిక నెరవేరుతుంది. కన్పించకపోతే నెరవేరదు

అని చెప్పాడు. ఏలీయా స్వర్గానికి వెళ్ళేపుడు ఇతర ప్రవక్తలెవరూ చూడలేదు గాని ఎలీషా మాత్రం చూచాడు.

గురుశిష్యులు ఈలా మాటలాడుకొంటూండగానే అగ్ని రథం వారిరువురిమధ్య ప్రవేశించింది. ఏలీయాకీ నిప్పుకీ దగ్గరి సంబంధం వుంది. అతడు నిప్పుని రప్పించే ప్రవక్త. ఇక్కడ నిప్పురథం దైవసాన్నిధ్యానికి గుర్తు. ఈ రథంతోపాటు వచ్చిన సుడిగాలి యేలీయాను మోక్షానికి కొనిపోయింది. పూర్వం హనోకుని గూడ దేవుడు ఈలాగే అద్భుతంగా స్వర్గానికి తీసికొని పోయాడని చదువుతున్నాం – ఆది 5,24.

సుడిగాలి ఏలీయాను స్వర్గానికి కొనిపోయిందనే వాక్యం అతడు చనిపోలేదని చెప్పదు. ఏలీయా మరణం మీద దేవునికి సర్వాధికారం వుందని మాత్రమే ఈ వాక్యభావం. అనగా దేవుడు తన కిష్టమొచ్చిన రీతిలో ఏలీయాకు మరణాన్ని పంపాడు. ఏలీయా ఏలా మరణించాడో మనకు తెలియదు. మరణానంతరమే దేవుడు అతని ఆత్మను తీసికొనిపోయాడు. బాబిలోనియా ప్రజలు తమ గాథల్లో వారివీరులూ రాజులూ సజీవులుగానే స్వర్గానికి వెళ్ళిపోయారని చెప్పుకొనేవాళ్ళు. ఇక్కడ బైబులు రచయిత ఏలీయాను గూర్చికూడ ఇదే పద్ధతిలో చెప్పాడు. ఆ ప్రవక్తకు అసాధారణమైన గొప్పతనం ఆపాదించాలని అతని కోరిక.

ఏలీయా యావే మతానికి నాయకుడు. అతడు లేకపోతే దేశంలో యావే మతం ఏలా నిలుస్తుంది? పైగా బాలుమతం పెచ్చుపెరిగిపోదా? కనుక ఎలీషా సంతాపంతో తండ్రీ! యిస్రాయేలును అన్నివిధాల కాచి కాపాడుతూ వచ్చిన నీవుపోతే ఇక మాకు దిక్కేముంది అని అరచాడు. అతడు గురువుగారివైపు అలాగే చూస్తూ నిల్చుండిపోయాడు. కొంతసేపయ్యాక గురువు అతనికి కన్పించలేదు.

ఎలీషా జారిపడిపోయిన గురువుగారి అంగీని తీసికొని యోర్దానునది వొడ్డున నిల్చున్నాడు. ఇక్కడ ఈ యంగీ దాన్ని ధరించిన ఏలీయా శక్తిని తెలియజేస్తుంది. ఆ శక్తి ఎలీషాలోకి ప్రవేశించింది. కనుక అతడు ఆ యంగీతో నదీజలాలను బాదగానే అవి రెండు పాయలుగా చీలిపోయి దారి ఏర్పడింది. ఎలీషా ఆ దారిగుండా ఈవలి గట్టుకి వచ్చాడు. కావున అద్భుతాలుచేసే గురువుగారి శక్తి ఎలీషాకు సమృద్ధిగా లభించిందని అర్థంజేసికోవాలి.

గురుశిష్యులతోపాటు యెరికోనుండి 50మంది ప్రవక్తలుకూడ యోర్దాను సమీపానికి వచ్చి దూరంగా నిలబడ్డారు. ఏలీయా మోక్షారోపణాన్ని యెలీషాలాగ వాళ్ళు చూడలేదు. అద్భుతాలుచేసే అతనిశక్తికూడ వాళ్ళకు సంక్రమించలేదు. ఇప్పుడు ఎలీషాకు నది దారి ఈయడం జూచి వాళ్ళంతా ఏలీయా శక్తి ఎలీషాకు సంక్రమించిందని తెలిసికొన్నారు. వినయంతో అతనికి నమస్కరించి అతన్ని తమ నాయకునిగా ఎన్నుకొన్నారు.

ఆ ప్రవక్తలు దేవుని ఆత్మ ఏలీయాను కొనిపోయి ఏ కొండల్లోనో లేక లోయల్లోనో జారవిడచి వుంటుందనుకొన్నారు. కనుక యాభైమంది మూడునాళ్ళపాటు అతనికోసం అంతటా వెతికారు. అటుపిమ్మట యెలీషా దగ్గరికి వచ్చి గురువుగారు ఎక్కడా కన్పించలేదని చెప్పారు. ఎలీషా అతడు మీకు దొరకడు. అసలు అతడు ఈ లోకంలో లేడు అని చెప్పాడు.

కాని యేలీయా ఏమైందీ ఎలీషా చెప్పలేదు. అతడు ఏలీయా మరణం తీరును వివరించలేదు. ఐనా అందరిలాగే ఏలీయాకూడ చనిపోయి వుండాలి. ఆ చావు వైనం మనకు తెలియదు. ప్రభువు మాత్రం అతని ఆత్మను ఆదరంతో స్వర్గానికి కొనిపోయాడు.

అసలు ఇక్కడ రచయిత చెప్పదలచుకొన్న ముఖ్యాంశం ఏలీయా మరణమూ మోక్షారోపణమూకాదు. ఎలీషా గురువుగారికి వారసుడు అయ్యాడనేది అతడు తెలియజేయదలచుకొన్న ప్రధానాంశం. కనుకనే అతడు వెంటనే గురువుగారి శక్తితో శిష్యుడు చేసిన రెండద్భుతాలను పేర్కొన్నాడు.

గురువుగారి శక్తిని పొందిన ఏలీయా రెండు అద్భుతకార్యాలు చేసాడు. మొదటిది, రోగలక్షణాలున్న యెరికో నీటిని శుద్ధిచేయడం. అతడు కొత్తపిడతలో ఉప్పును తీసుకురమ్మన్నాడు. ఈ పిడత లౌకిక కార్యాలకు వాడిందికాదు. అది దైవసేవకే అంకితమై దైవశక్తితో నిండి వుంటుంది. అలాంటి పిడతలోని ఉప్పుకూడ రోగలక్షణాలను తొలగించే సామర్థ్యం కలిగి వుంటుంది.

ఇక్కడ యెరికో ప్రజలు ప్రవక్తను గౌరవించారు. అతడు వారి అక్కరను తీర్చాడు. దైవభక్తుణ్ణి గౌరవించే ప్రజలకు దీవెన లభిస్తుందని ఈ కథ చెప్పిన రచయిత భావం.

ఎలీషా నీటిని శుద్ధిచేయడం అనే అద్భుతాన్ని నేడు మనం ఆదివారం పూజకు ముందుగా తీర్థాన్ని చల్లేపుడు జ్ఞప్తికి తెచ్చుకొంటున్నాం. ఆనాడు ఎలీషాలాగే నేడు మనంకూడ నీటిలో ఉప్పును కలుపుతున్నాం. ఆ నీటిని ప్రజలమీద చిలకరిస్తున్నాం. ఆ నీటిని చిలకరించిన తావుల్లో పిశాచ తంత్రోపాయాలు తొలగిపోయి పవిత్రాత్మ సాన్నిధ్యం నెలకొంటుందని విశ్వసిస్తున్నాం.

ఇక, రెండవ అద్భుతం బేతేలుచెంత ఎలుగుబంట్లు చిన్నపిల్లలను చీల్చివేయడం. ఈ పిల్లలు ప్రవక్తను ఎగతాళి చేసారు. అతడు ఆ పిల్లలను శపించి వారు ఎలుగుబంట్ల వాతబడేలా చేసాడు. ఇక్కడ ప్రవక్త నిర్దయతో ప్రవర్తించాడు కదా అని నేడు మనం ప్రశ్నిస్తాం. కాని ప్రవక్తను నిందిస్తే శిక్ష తప్పదని తెలియజేయడానికి మాత్రమే రచయిత ఈ సంఘటనను ఇక్కడ పేర్కొన్నాడు.

పైగా బేతేలు విగ్రహారాధనకు నిలయం. పూర్వం యెరోబామురాజు ఇక్కడ క్రొత్తగా దేవాలయాన్ని కట్టించి బాలు ఆరాధనను ప్రచారం చేయించాడు-1రాజు 13,29-30. కనుక ఈ పట్టణం పిల్లలు విగ్రహారాధకుల పిల్లలు. కనుకనే ఇక్కడ వీరికి శిక్ష పడింది.

పై రెండు అద్భుతాలను ఉదాహరించడంలో రచయిత ఉద్దేశం సంగ్రహంగా ఇది. ప్రవక్తను గౌరవిస్తే దేవుని దీవెన లభిస్తుంది. అతన్ని అవమానపరిస్తే శిక్ష వస్తుంది.

## 3. ప్రార్థనా భావాలు

1. ఈ యధ్యాయంలో ముఖ్యాంశం ఏలీయా మోక్షారోపణం కాదు. ఎలీషా గురువుకి వారసుడు కావడం ఇక్కడ ముఖ్యాంశం. నిజమైన ప్రవక్త మరో ప్రవక్తకు వారసుడైనా అయియుండాలి. లేదా దేవుడే అతన్ని స్వయంగా ఎన్నుకొనైనా వుండాలి. ఇక్కడ ఎలీషా గురువుకి వారసుడు అన్న విషయాన్ని తెలియజేసాడు రచయిత. కనుక అతడు నిజమైన ప్రవక్త. ప్రవక్తలపట్లా వారి బోధలపట్లా మనకు అపార గౌరవం వుండాలి. వాళ్ళు పవిత్రాత్మచే ప్రేరితులై దేవుని సందేశాన్ని విన్పించారు - 2పేత్రు 1,21. ఆ సందేశాన్నే ఇప్పుడు బైబుల్లో మనకొరకు పదిలపరచి వుంచారు. కనుక బైబుల్లోని ప్రవక్తల వాక్యాలు మనకు శిరోధార్యాలు. మనం వాటిని భక్తితో మననం చేసికోవాలి.

2. ఏలీయాకూడ అందరిలాగే మరణించాడు. ఏలా మరణించాడో మనకు తెలియదు. ప్రభువుకి అతని మరణం మీద సంపూర్ణాధికారం వుంది. జనన మరణాలకు అతడు కర్త కదా! కనుక అతడు ప్రవక్తను తన కిష్టమొచ్చిన రీతిలో మరణింపనిచ్చాడు. ఆ మరణంద్వారా అతన్ని తన దగ్గరకు పిల్చుకొన్నాడు. చావుద్వారా అతనికి నిత్యజీవమిచ్చాడు. యేలీయా బ్రతికివుండగా ప్రభువు ఆరాధనం పట్ల అపారమైన ఆసక్తిని చూపించాడు. దానికిగాను ప్రభువు అతన్ని బహూకరించి తన సన్నిధిలోనికి చేర్చుకొన్నాడు. ఆ ప్రవక్తకులాగే మనకుకూడ మంచి మరణం లభించాలని అడుగుకొందాం-2తిమో 4,6-8.

3. ఎలీషా గురువుని సేవించి ధన్యుడయ్యాడు. గురువు శక్తిని పొంది ప్రజలకు మేలు కలిగించే అద్భుతాలు ఎన్నో చేసాడు. శిష్యుడు గురువును గౌరవించి అతని బోధలను జాగ్రత్తగా వినాలి. గురువునుండి దైవానుభూతినీ భక్తి శ్రద్ధలనూ వారసంగా పొందాలి. మనమట్టుకు మనం మన పెద్దలమాట వింటున్నామా? ఆ ఎలీషాలాగ మన పెద్దలకు యోగ్యులమైన వారసులంగా ప్రవర్తిస్తూంటామా?

4. ప్రవక్తను గౌరవిస్తే దేవుని దీవెన లభిస్తుంది. యెలీషా యెరికో పౌరుల కొరకు నీటిని నిర్మలం చేసాడు. ప్రవక్తను అవమానిస్తే దేవుని శాపం వస్తుంది. యెలీషాను ఎగతాళి చేసిన పిల్లలను తోడేళ్ళు చీల్చివేసాయి. మనకు కూడ ప్రభువు సేవకులపట్ల గౌరవముండాలి. వాళ్ళను పూజ్యభావంతో చూడాలి. పైగా దేవుని సేవకులైన గురువులు మఠకన్యలు మొదలైనవాళ్ళు తమ పిలుపుని విలువతో చూచుకోవాలి. తమ అంతస్తుకి తగ్గట్టుగా మసలుకోవాలి. వళ్ళు దగ్గరబెట్టుకొని పవిత్రంగా జీవించాలి. దైవసేవకులకు పవిత్రత ఒక్కటి తగుతుంది.

# 16. నామాను కుష్ఠ నయంగావడం

## 2రాజు 5

### 1. సందర్భం

దేవుడు ఏలీయాను స్వర్గానికి కొనిపోయాక అతని శిష్యుడు ఎలీషా ప్రవక్త అయ్యాడు. గురువుగారిలాగే ఇతడుకూడ చాల అద్భుతకార్యాలు చేసాడు. ఇక్కడ అతడు నామాను కుష్ఠను నయంజేయడం చూస్తాం. ఈ కథలో అన్యజాతివాడైన నామానుకీ ప్రవక్త శిష్యుడైన గేహసీకిగల వ్యత్యాసాలను పాఠకులు జాగ్రత్తగా గమనించాలి. భక్తులు పలుసార్లు చదివి మననం చేసికోదగిన మంచి కథ యిది.

### 2. వివరణం

ఈ కథలో రెండుభాగాలున్నాయి. 1-19 వచనాలు నామాను కుష్ఠ నయంగావడాన్ని గూర్చి. 20-27 వచనాలు గేహసీకి శిక్షపడడాన్ని గూర్చి. బైబులు రచయిత ఈ యిద్దరు పాత్రల వ్యత్యాసాన్ని చక్కగా చిత్రించాడు. నామాను విశ్వాసం మెచ్చుకోదగ్గది. గేహసీ దురాశ నిందింపదగ్గది.

ఆ రోజుల్లో సిరియా రాజు బెన్హాదాదు. యిస్రాయేలు రాజు యెహోరాము. ఈ రాజు బెన్హాదాదుకి లొంగి కప్పం గడుతుండేవాడు. సిరియా రాజు సైన్యాధిపతి నామాను. సిరియా రాజు కొల్చే దేవత రిమ్మోనుహదాదు. కాని రాజుకి యుద్ధంలో విజయాలు ప్రసాదించింది ఈ దేవత కాదు. యావే ప్రభువే నామాను ద్వారా సిరియా దేశానికి విజయాలు దయచేసాడు. కనుక బెన్హాదాదుకి నామానంటే అభిమానం. ఈ నామాను కుష్ఠరోగి. ఐనా నామానునిగాని గేహసీనిగాని ప్రజలు సమాజంనుండి వెలివేయలేదు. కనుక వారిది యథార్థంగా కుష్ఠకాదు, ఓ రకం చర్మవ్యాధి అనుకోవాలి.

యిస్రాయేలు దేశపుపిల్ల వొకతె నామాను భార్యకు దాసి ఐంది. ఆ అమ్మాయి ఓ దినం సందర్భవశాత్తు నామాను యిస్రాయేలు దేశంలోని ప్రవక్త ఎలీషా వద్దకు వెళ్తే అతని వ్యాధి నయమౌతుందని చెప్పింది. ఆ బాలిక అన్యదేశంలోకూడ తన విశ్వాసాన్ని దాచుకోలేదు. అన్యజాతి ప్రజలవద్దగూడ యావే ప్రభువు మహిమనీ అతని ప్రవక్తశక్తినీ కొనియాడింది. ఈవిధంగా ఊరూపేరూలేని ఈ పిల్ల నామాను రోగవిముక్తికి కారకురాలైంది. ఒకోసారి మనం అన్యమతస్థుల యెదుట మన విశ్వాసాన్ని ప్రదర్శించడానికి సిగ్గుపడతాం. ఇది పొరపాటు. ఈ పిల్ల తన విశ్వాసాన్ని దాచుకోలేదు.

నామాను తన రాజు అనుమతితో విలువైన కానుకలు తీసికొని రథమెక్కి ఆడంబరంగా యిస్రాయేలు దేశానికి వచ్చాడు. సిరియా రాజు యిస్రాయేలు రాజుకి

జాబుగూడ వ్రాసి పంపాడు. దానిలో అతడు నీవు నామాను కుష్ఠను నయంచేయి అని యిస్రాయేలు రాజును ఆజ్ఞాపించాడు. ఆ రోజుల్లో యిస్రాయేలు రాజ్యం సిరియాకు లొంగి వుందని చెప్పాంగదా! కావుననే శత్రురాజు అతన్ని అలా ఆజ్ఞాపించగలిగాడు.

యిస్రాయేలు రాజు బెన్హదాదు లేఖను చదువుకొని నామాను కుష్ఠను నయంజేయడానికి నేనేమి దేవుణ్ణా యేమిటి అని గొణుగుకొన్నాడు. సిరియా రాజు ఈ కుంటిసాకుతో తనమీద యుద్ధానికి వస్తాడేమో అని భయపడ్డాడు. సంతాప సూచకంగా తనవంటిమీది బట్టలు నిలువున చించుకొన్నాడు.

ఎలీషా ప్రవక్తకు ఈ సంగతంతా తెలిసింది. యిస్రాయేలు రాజు తన ప్రవక్తద్వారా నామాను కుష్ఠను నయంజేయించాలని మాత్రమే బెన్హదాదు ఉద్దేశం. రాజే స్వయంగా వ్యాధి నయం చేయాలని అతని భావం కాదు. కనుక ప్రవక్త రాజునొద్దకు కబురంపి రోగిని తన చెంతకు పంపించమన్నాడు. లేఖలోని అపార్థం తొలగించాడు. దైవశక్తితో తానతనికి రోగవిముక్తి కలిగించగలనని చెప్పాడు. కనుక సైన్యాధిపతి రథమెక్కి అట్టహాసంగా ఎలీషా యింటికి వచ్చాడు.

నామాను తనంతట తానే యెలీషా యింటిదాకా వచ్చినా ఆ యింటిలో అడుగుపెట్టలేదు. ప్రవక్త బయటికి వచ్చి తన్ను ఆహ్వానించాలని అతని కోరిక. యెలీషాగూడ తన యింటిలోనుండి వెలుపలికి రాలేదు. సైన్యాధిపతే వినయంతో తన యింటిలోనికి రావాలని అతని వుద్దేశం. ఇద్దరికీ బెట్టుసరి యెక్కువ.

కడన ప్రవక్త తన సేవకుణ్ణి పంపి నీవు యోర్దానులో ఏడుసార్లు స్నానంచేయి అని సైన్యాధిపతికి చెప్పించాడు. నామాను పొగరు అణచాలనీ అతని విశ్వాసాన్ని పరీక్షించాలనీ గూడ ఎలీషా తలంపు. కాని ప్రవక్త తీరు సైన్యాధిపతికి నచ్చలేదు. అతడు ఈ ప్రవక్త వెలుపలికివచ్చి సాదరంగా నన్ను యింటిలోనికి ఆహ్వానిస్తాడనుకొన్నాను. కుష్ఠ సోకిన నా అవయవాలపై తన చేతిని త్రిప్పి తన దేవుని ప్రార్థించి నాకు ఆరోగ్యదానం చేస్తాడనుకొన్నాను. అతడు ఈ పనులేవీ చేయలేదు. ఇప్పుడు నన్ను వీళ్ళ యోర్దానునదిలో స్నానం చేయమంటున్నాడు. ఈ యేటి విలువెంత? మాదేశంలో ఇంతకంటె శ్రేష్ఠమైన నదులు లేవా? నేను వాటిల్లో మునిగి ఆరోగ్యం పొందలేనా? అని మండిపడుతూ అక్కడినుండి వెళ్ళిపోబోయాడు. ప్రవక్త వాక్కులోని శక్తి అతనికింకా అర్థంకాలేదు. అధికార గర్వంవలన అతనికి తల తిరిగింది.

అలా కోపంతో చిందులు త్రొక్కుతూ వెళ్ళిపోబోయే సైన్యాధిపతిని అతని సేవకులు వారించారు. అయ్యా! ప్రవక్త నిన్నేదైనా కష్టమైన కార్యం చేయమంటే నీవు తప్పక చేసేవాడివి. ఇప్పుడు అతడు సులభమైన కార్యం చేయమంటే చేయనంటావా అని మందలించారు. ఇక్కడ బైబులు రచయిత నామాను అహంకారానికి సేవకుల వినయ విశ్వాసాలకూ గల వ్యత్యాసాన్ని స్పష్టంగా తెలియజేసాడు. ఏమైతేనేమి, సేవకుల మందలింపుద్వారా నామానుకి విశ్వాసం కలిగింది. అతడు యోర్దానులో ఏడుసార్లు మునిగి శుద్ధిని పొందాడు. తన

వ్యాధి కుదరడాన్ని చూచి తానే విస్తుపోయాడు. రోగవిముక్తివల్ల అతనిలో విశ్వాసం బలపడింది.

ఆరోగ్యాన్ని పొందిన నామాను ప్రవక్తకు వందనాలు చెప్పకుండా వుడాయించలేడు. అతని కృతజ్ఞతాభావం మెచ్చుకోదగింది. అతడు తాను కొలిచే హదాదు రిమ్మోను కాక, యావే ప్రభువు నిక్కమైన దైవమని నమ్మాడు. ఆ దేవుని శక్తితో తనకు మేలు చేసిన ప్రవక్తకు భక్తితో కానుకలు అర్పింపబోయాడు. కాని యెలీషా డబ్బుకి ఆశపడని దైవసేవకుడు. కనుక నాకు నీ కానుకలేమీ వద్దు. దైవశక్తి వల్ల నీకు ఆరోగ్యం కలిగింది. అదే చాలు. ఇక వెళ్ళిపో అన్నాడు.

నామాను, నేను మీ దేశంనుండి రెండు గాడిదలు మోసేంత మట్టిని మా దేశానికి తీసికొనిపోతానన్నాడు. ఈ మట్టి యిస్రాయేలు దేశానికి చిహ్నంగా వుంటుంది. దాని మీద అతడు బలిపీఠాన్ని నిర్మించి సిరియా దేశంలో యావేను పూజిస్తాడు. ఆ రోజుల్లో ప్రజలు ఒక్కోదేశం ఒక్కో దేవునికి చెందిందని భావించేవాళ్ళు. కనుక ఏ దేశానికి అధిపతియైన దేవుణ్ణి ఆ దేశంలోనే కొలవాలి. సిరియాలో రిమ్మోనునీ యిస్రాయేలులో యావేనీ కొల్చేవాళ్ళు. నామాను ఇప్పుడు సిరియాలో యావేను కొల్వబోతున్నాడు. యావేపట్ల అతని నమ్మకం అంత గొప్పది.

ఐతే పండుగరోజున సిరియారాజు రిమ్మోను దేవళానికి వెళ్ళి ఆ దేవతకు మ్రొక్కేవాడు. అతని వెంటనున్న నామానుకూడ ఆ దేవతకు మ్రొక్కాలి. లేకపోతే మర్యాదగా వుండదు. కానీ ఇది సభ్యతవల్ల చేసే ఆరాధనకాని నిజమైన భక్తివల్ల చేసేదికాదు. ఈ వొక్క సందర్భంలోనే తాను చేసే విగ్రహారాధనకు ప్రవక్త తన్ను మన్నించాలని నామాను మనవి చేసాడు. ఎలీషా నామాను పరిస్థితిని అర్థం చేసికొని అతని విగ్రహారాధనను మన్నించాడు. అతడు వెళ్ళిపోయాడు. ఇంతవరకు నామాను కథ. అన్యజాతివాడూ విశ్వాసం లేనివాడూ ఐన నామాను రోగవిముక్తి కారణంగా పూర్ణహృదయంతో యావే ప్రభువును విశ్వసించాడు. ఇది యిక్కడ ముఖ్యాంశం.

ఇక గేహాసీ కథ. ఇతడు ప్రవక్త శిష్యుడు. భవిష్యత్తులో ప్రవక్త కాబోయేవాడు. యూదభక్తుడు. కాని అన్యమతస్థుడైన నామానుకున్న భక్తివిశ్వాసాలు ఇతనికి లేవు. అతని ప్రధాన దుర్గుణం దురాశ. గేహాసీ అనే పేరుకి ఆసబోతు అని అర్థం. ధనలోభంవల్ల నరుడు ఎంతగా పతనమైపోతాడో ఇతని కథ తెలియజేస్తుంది.

ఓ వైపున నామాను తెచ్చిన సొమ్మును చూడగానే గేహాసీ కండ్లు జిగేలున మెరిసాయి. మరోవైపున ప్రవక్త ఆ సొమ్మును ముట్టకపోవడం అతనికి నిరాశ కలిగించింది. అతడు ప్రవక్త పేరుమీదిగా ఆ సొమ్ములో కొంత దక్కించుకోవాలనుకొన్నాడు. కనుక సైన్యాధిపతి రథంవెంట పరుగెత్తుకొనిపోయి అయ్యా! మా గురువుగారు పూర్వం నీ సొమ్ము ముట్టుకోలేదు. కాని యిప్పుడు మనసు మార్చుకొన్నారు. తలవని తలంపుగా ఇద్దరు

ప్రవక్తలు ఆయన యింటికి అతిథులుగా వచ్చారు. కనుక ఆయన నీ నుండి మూడువేల నాణాలు రెండు జతల పట్టుబట్టలు కోరుతున్నాడు అని చెప్పాడు. ఇక్కడ గేహసీ నేరాల రెండు. మొదటిది, అతని అత్యాశ. రెండవది, అతడు గురువుగారిని గూర్చి అబద్ధం చెప్పడం. అనగా యెలీషా నామానునుండి ఈ సొమ్ము అడగకపోయినా అడిగాడని చెప్పడం.

నామాను ఉదారబుద్ధి కలవాడు. గేహసీ మూడువేలడిగితే అతడు ఆరువేలిచ్చాడు. ఆ సొమ్మును సేవకులనెత్తి కెక్కించి గేహసీతో పంపించాడు. గేహసీ యిల్లు ఓఫెలు కొండమీద వుంది. ఆ తావుకి రాగానే అతడు సేవకులవద్ద నుండి నాణాల సంచులు తీసికొని వారిని పంపివేసాడు. ఆ సంచులు భద్రంగా తన యింటిలో దాచుకొన్నాడు.

తర్వాత గేహసీ నంగనాచిలాగ తిరిగివచ్చి గురువు గారికి సేవచేయబోయాడు. కాని గురువుగారు అతన్ని నిలదీసి ఓయి! నీ వెక్కడికి వెళ్లావో చెప్పు అన్నాడు. అతడు నేనెక్కడికీ వెళ్ళలేదు. ఇంతసేపు ఇక్కడనే వున్నానుగదా అన్నాడు. కాని ఎలీషాకు దైవశక్తీ దైవజ్ఞానమూ రెండూ వున్నాయి. అతడు గేహసీ చేసిన తప్పుడుపని అంతా దర్శనంలో చూస్తూనే వున్నాడు. కనుక అతడు ఓయి! నేను ఇక్కడే వున్నా నా మనసు నీతో వచ్చి నీవు చేసిన మోసమంతా చూచింది. నీవు దురాశతో నామాను దగ్గర డబ్బు తీసికొని దానితో పొలాలూ తోటలూ పశులమందలూ సంపాదించాలనుకొన్నావు. కావున నీకు శిక్ష యిది. నామానుని వదలివెళ్ళిన కుష్ఠ నిన్నూ నీ వంశీయులనూ పట్టిపీడిస్తుందిపో అన్నాడు. గురువు చెప్పిట్లే వెంటనే గేహసీకి కుష్ఠ సోకింది. అనగా గేహసీ ఇక తన వారసులకు ఆస్తినికాక కుష్ఠరోగాన్ని వదలిపోతాడు. ఇది దురాశకు ప్రతిఫలం.

పాఠకులు ఈ కథలో నామాను గేహసీలకుగల వ్యత్యాసాన్ని చక్కగా గుర్తించాలి. నామాను ఉదారగుణం గలవాడు. గేహసీ ఆసబోతు. ఎలీషా నామాను విశ్వాసాన్ని పరీక్షింపగా అతడు విశ్వాసంకలవాడని రుజువైంది. కాని గేహసీ విశ్వాసం పరీక్షింపగా అతడు విశ్వాసం లేనివాడని తేలింది. నామానుకి విశ్వాసంవలన కుష్ఠ నయమైంది. గేహసీకి విశ్వాసం లేనందువలన కుష్ఠ సోకింది. ఒకడు మొదటలో కుష్ఠరోగి, మరొకడు కడపట కుష్ఠరోగి.

## 3. ప్రార్థనా భావాలు

1. ఊరూపేరూలేని ఒక బానిసపిల్ల తన విశ్వాసం ద్వారా నామాను రోగవిముక్తికి కారకురాలైంది. ఆ బాలిక పరాయిదేశంలో గూడ తన విశ్వాసాన్ని దాచుకోలేదు. ఒకోసారి సామాన్య నరులే తోడిజనానికి దేవుణ్ణి గూర్చి శ్రద్ధగా బోధిస్తారు. కనుక వీళ్ళ సేవను మనం తక్కువగా అంచనా వేయకూడదు. ఇంకా, నామాను కోపంతో యోర్దానులో మునగకుండా వెళ్ళిపోబోతూంటే సేవకులు అతనికి విశ్వాసం పుట్టించారు. కనుక వేదప్రచారంలో మనం ఈ సామాన్య జనాన్నిగూడ వాడుకోవాలి. వాళ్ళ పద్ధతిలో వాళ్ళు వేదబోధ చేస్తారు.

2. మొదట నామానుకి యావే ప్రభువుపట్ల విశ్వాసమూ వినయమూ లేవు. సేవకులు యోర్దానులో మునగమని బతిమాలడంద్వారా అతనికి ఆ గుణాలు అలవడ్డాయి. నేడు మనకుగూడ విశ్వాసమూ వినయమూ వుంటేనేగాని దేవుడు మన యిబ్బందుల్లో మనలను ఆదుకోడు. లూకా 4,27లో క్రీస్తు నామాను విశ్వాసాన్ని శ్లాఘించాడు. మనకు కూడ ఆ గుణం అలవడాలని వేడుకొందాం.

3. దురాశ ఘోరమైన పాపం. ఈ దుర్గుణం గేహాసీని నాశంచేసింది. ఈ దుర్గుణం వల్లనే ఆకాను (యెహోషువా7) యూదా, అననీయా సఫీరా మొదలైనవాళ్ళంతా చెడారు. వీళ్ళు తమ ఆత్మను ధనానికి అమ్ముకొన్నారు. డబ్బు, పదవి, తిండి మొదలైనవాటిని పురస్కరించుకొని మనం కూడ అత్యాశకు లొంగిపోతూంటాం. ఈ దుర్గుణానికి వశులం గాకుండా వుండాలని ప్రభువుని అడుగుకొందాం.

4. నామాను యోర్దాను నదిలో మునిగి శుద్ధుడయ్యాడు. నేడు మనం వేదగ్రంథ పఠనం దేవద్రవ్యానుమానాలు, ప్రార్థనం, సోదరప్రేమ సేవ మొదలైన పుణ్యకార్యాల్లో మునిగి శుద్ధులం కావాలి. ఈ భాగ్యం కొరకు ప్రభువుని వేడుకొందాం.

# 17. సౌలు పరివర్తనం

# అ.చ.9,1-19

## 1. సందర్భం

స్తెఫనుని రాళ్ళతో కొట్టి చంపించినవారిలో సౌలు కూడ ఒకడు. అతన్ని చంపేవాళ్ళు తమ బట్టలకు సౌలుని కాపలా వుంచారు. స్తెఫను చనిపోతూ తన శత్రువులకొరకు ప్రార్థించాడు. ఆ ప్రార్థనా ఫలితంగా సౌలుకి పరివర్తనం కలిగింది. ఆ పరివర్తనం కథను లూకా ఈ యధ్యాయంలో వివరించాడు. అపోస్తలుల చర్యల గ్రంథం మొదట పేత్రు కథను వర్ణిస్తుంది. ఆ పిమ్మట 9వ అధ్యాయం నుండి గ్రంథాంతం వరకు సౌలు కథను వర్ణిస్తుంది. ఆ తొలి రోజుల్లో తిరుసభ అన్యజాతి ప్రజల్లో వ్యాపించడానికి ముఖ్యకారకుడు సౌలే. కనుక అతని కథ అందరూ పఠింపదగింది.

## 2. వివరణం

క్రీస్తు ఉత్థానానంతరం క్రైస్తవమతం యెరూషలేములో శ్రీఘ్రగతిని వ్యాపిస్తూంది. యూదుల ప్రధాన యాజకుడు క్రైస్తవ భక్తులను పట్టి చెరలో వేయండని ఆజ్ఞాపించాడు. అతనికి తోడ్పడిన వాళ్ళల్లో సౌలు ఒకడు. అతడు మొదట యెరూషలేములోని క్రైస్తవులను బంధించి చెరలో త్రోయించాడు. ఆ పిమ్మట దమస్కులోని క్రైస్తవులను గూడ బంధించాలని

సంకల్పించుకొన్నాడు. దమస్కు ప్రార్థనా మందిరాల అధిపతులకు చూపడానికి ప్రధానార్చకుని నుండి పరిచయ పత్రాలను పొందాడు.

యెరూషలేమునుండి దమస్కు నగరానికి 140 మైళ్ళ దూరం. ఈ పట్టణం ప్రపంచంలోని అతి ప్రాచీన నగరాల్లో వొకటి. గొప్ప కూడలి తావు. సౌలు ఇద్దరు ముగ్గురు అనుచరులను తీసికొని గుర్రాలమీద ఈ నగరానికి వెళ్తున్నాడు. అది క్రీస్తుశకం 36వ సంవత్సరం. దారిలో తలవని తలంపుగా అతనికి ప్రభు దర్శనం కలిగింది.

కాని సౌలు క్రైస్తవులను ఎందుకు హింసించాడు? అతడు దుష్టుడు కాదు. భక్తిపరుడైన రబ్బయి. క్రైస్తవ మార్గాన్ని అపార్థం చేసుకోవడంవల్ల అతడు క్రైస్తవులకు శత్రువయ్యాడు.

క్రైస్తవులు క్రీస్తే మెస్సీయా అంటున్నారు. కాని ధర్మశాస్త్రం ప్రకారం సిలువ వేయబడినవాడు శాపగ్రస్తుడు - ద్వితీ 21,22-23. ఈలాంటి శాపగ్రస్తుడు మెస్సీయా ఏలాగౌతాడని సౌలు వాదం. ఇంకా, మెస్సీయా రాజుగా వస్తాడనుకొన్నారు యూదులు. అలాంటప్పుడు, సిలువమీద దిక్కులేని చావు చచ్చిన క్రీస్తు మెస్సీయా ఏలాగౌతాడు? పైపెచ్చు క్రైస్తవులు క్రీస్తుని "ప్రభువు" అంటున్నారు. ఇది పూర్వవేదంలో యావేకు వర్తించే బిరుదం. దీన్ని క్రీస్తుకు వాడితే అతడు యావే ప్రభువుతో సరిసమానమౌతాడు. అపుడు ఇద్దరు దేవుళ్ళవుతారు. కాని యూదులు ఏకేశ్వరోపాసకులు. కనుక క్రీస్తుని "ప్రభువు" అనడం సౌలు దృష్టిలో దేవదూషణం. ఇంకో అపరాధమేమిటంటే, క్రైస్తవులు యెరూషలేం దేవాలయాన్నీ ధర్మశాస్త్రాన్నీ తూలనాడుతున్నారు - అ.చ. 6,14. ప్రాచీన కాలంనుండీ యూదులకు ఈ రెండూ పరమ పవిత్రమైనవి. పరిసయుల శాఖకు చెందిన పరమ నిష్ఠాపరుడైన సౌలుకి ఈ నింద సహింపరానిదైంది. ఇన్ని కారణాలవల్ల అతడు క్రైస్తవులను హింసించడానికి పూనుకొన్నాడు.

సౌలు దమస్కు నగరాన్ని సమీపిస్తుండగా ఉత్థాన క్రీస్తు అతనికి వెలుగురూపంలో దర్శనమిచ్చాడు. ఆ వెలుగును భరించలేక సౌలు గుర్రం మీదినుండి క్రిందపడ్డాడు. పూర్వవేదంలో యావే ప్రభువు వెలుగు. అతడే వెలుగుని చేసాడు. ఆ వెల్తురు ఇప్పుడు ఉత్థాన క్రీస్తు రూపంలో సౌలుమీద ప్రసరించింది - 2కొ 4,6. ఆ వెల్తురు సౌలూ నీవు నన్నెందుకు హింసిస్తున్నావని ప్రశ్నించింది. ప్రభూ! నీవెవరివి అని సౌలు అడిగాడు. నీవు హింసించే క్రీస్తుని నేనేనని ఆ జ్యోతి సమాధానం చెప్పింది. సౌలు క్రీస్తుని బాధించలేదు. క్రైస్తవులను బాధించాడు. కాని క్రీస్తు క్రైస్తవుల్లో నెలకొని వుంటాడు. క్రైస్తవులు, తిరుసభ, అతనికి శరీరం. అనగా వాళ్ళు క్రీస్తుతోకూడి ఏకవ్యక్తి ఔతారు. అలాంటి క్రైస్తవుల్ని హింసిస్తే క్రీస్తుని హింసించినట్లే. క్రీస్తు క్రైస్తవుల్లో ప్రత్యక్షమై వుంటాడు.

క్రీస్తు దర్శనం సౌలుకేగాని అతని అనుచరులకు గాదు. వాళ్లు సౌలుకి ఆధ్యాత్మికంగా ఏదో జరిగిందని గ్రహించారు. వాళ్ళకు క్రీస్తు స్వరం విన్పించిందికాని అతని వెలుగు మాత్రం కన్పించలేదు. ఈ గ్రంథం 22,9. ఈ యనుచరులు వెలుగును చూచారుకాని క్రీస్తు స్వరాన్ని వినలేదని చెప్తుంది. ఈలాంటి చిన్నచిన్న తేడాలను లూకా పెద్దగా పట్టించుకోలేదు.

క్రైస్తవులను హింసించాలనుకొని వచ్చిన సౌలు ఈ దర్శనంవల్ల నిస్సహాయుడై పోయాడు. దైవశక్తి ముందు మానవుల గొప్ప ఏపాటిది? అతడు పూర్తిగా గ్రుడ్డివాడై పోయాడు. నేలమీద వెల్లకిలబడివున్నాడు. అనుచరులే అతన్ని పైకిలేపి చేయిపట్టుకొని డమస్కు నగరానికి నడిపించుకొని పోవలసి వచ్చింది. ఆ దర్శనం ప్రభావం ఎంత తీవ్రమైందంటే సౌలు మూడురోజులవరకు అన్నపానీయాలు ముట్టుకోలేదు. భగవంతుడు నరులను తన సేవకు వినియోగించుకోక ముందు వారిని నిర్వీర్యులను చేస్తాడు.

డమస్కులోని క్రైస్తవ నాయకుల్లో ఒకడు అననీయా. ప్రభువు అననీయాతో సౌలును క్రైస్తవ సమాజంలోకి చేర్చుకొమ్మని చెప్పాడు. ఆ భక్తుడు విస్తుపోయాడు. సౌలు భయంకర వేదహింసకుడు కదా! పులిదగ్గరికి గొర్రెపిల్లనీ, డేగదగ్గరికి పావురాన్నీ పంపుతావా అని అతడు క్రీస్తుని అడిగాడు.

ప్రభువు అననీయాకు భయపడవద్దని చెప్పాడు. సౌలు పూర్తిగా మారిపోయాడని తెలియజేసాడు. అతడు పూర్వం క్రైస్తవులకు ఎంత అపకారం చేసాడో ఇపుడు వారికి అంత వుపకారం చేస్తాడని చెప్పాడు. సౌలు మొదట యూదులకు వేదబోధ చేస్తాడు. అటుపిమ్మట అన్యజాతి జనులైన గ్రీకు రోమను ప్రజలకు గూడ వేదబోధ చేస్తాడు. ఇప్పుడు మనం యూరప్ అని పిల్చే ప్రదేశంలో మొట్టమొదటిసారి క్రీస్తుని బోధించినవాడు పౌలే. అతని కృషివల్ల తిరుసభ కేవలం యూదులకే పరిమితంకాక అన్యజాతుల్లో కూడ వ్యాపించింది. సౌలు సామాన్య ప్రజలకు మాత్రమే కాక హెరోదు అగ్రిప్ప మొదలైన రాజులకీ, ఫిలిక్సు, ఫెస్టస్ మొదలైన గవర్నర్లకీ, స్థానిక అధికారులకీ క్రీస్తుని తెలియజేస్తాడు. ఇంకా, సౌలు ప్రభువు సేవలో ఎన్నో బాధలు అనుభవిస్తాడు. యెషయా ప్రవక్త పేర్కొన్న బాధామయ సేవకుళ్ళాగ క్రీస్తుకోసం శ్రమలు అనుభవిస్తాడు. ఈలాంటి సౌలుని క్రైస్తవ సమాజంలో చేర్చుకోవడానికి అననీయా ఏమాత్రం వెనుకాడకూడదని క్రీస్తు తెలియజేసాడు.

సౌలుకి అద్భుతంగా దర్శనమిచ్చిన ప్రభువు అతన్ని నేరుగా క్రైస్తవ సమాజంలో చేర్చుకోవచ్చుకదా! కాని క్రీస్తు అలా చేయలేదు. ఆనాటి క్రైస్తవ పెద్దలద్వారానే అతడు

క్రైస్తవ సమాజంలో చేరాలని ప్రభువు నిర్ణయించాడు. నేడుకూడ మనం క్రీస్తు స్థానంలో వున్న పెద్దలను కాదని క్రీస్తుని చేరలేం.

అననీయా యూదా యింటిలోవున్న సౌలుని దర్శించడానికి వచ్చాడు. అతని రాకతో సౌలు బలహీనత తొలగిపోయింది. అతనికి చూపుకూడ వచ్చింది. అతని కండ్ల నుండి పొరలు చేప పొలుసుల్లాగ రాలి క్రిందబడ్డాయి. పూర్వం గ్రుడ్డివాడైన తోబియా కండ్లనుండి ఈలాగే పొరలు రాలిపడ్డాయని వింటున్నాం - తోబీతు 11,12-13.

అననీయా భక్తుడు సౌలుకి జ్ఞానస్నానమిచ్చాడు. సౌలు క్రైస్తవ సమాజంలో చేరిపోయాడు. ఈ జ్ఞానస్నానం తోనే అతడు ఆత్మను పరిపూర్ణంగా పొందాడు. ఇకమీదట ఆత్మే అతన్ని నడిపిస్తుంది. అతనిచేత నానా పట్టణాల్లో నానా ప్రజలకు వేదబోధ చేయిస్తుంది. కడన ఆత్మే అతనిని రోము పట్టణానికి తోడ్కొనిపోయి అక్కడ వేదసాక్షిగా మరణించేలాగూడ చేస్తుంది.

దమస్కు దర్శనం పౌలులో గొప్ప మార్పు తెచ్చింది. ఆ సంఘటనం తర్వాత అతని భావనాసరణి పూర్తిగా మారింది. అది అతనికి గొప్ప ప్రేరణం పుట్టించింది. కనుక ఈ దర్శనం పౌలుని ప్రభావితం చేసిన తీరును మనం కొంచెం విపులంగా తెలిసికోవాలి.

పౌలు మొదట పాపిగా వుండి తర్వాత ఈ దర్శనం వల్ల పరివర్తనం చెందలేదు. అతడు యూదమతం ప్రకారం మచ్చలేని జీవితమే గడిపాడు. ఈ దర్శనం వల్ల అతడు యూదమతాన్ని వదలి క్రైస్తవ మతంలోకి వచ్చాడు. రక్షణం ధర్మశాస్త్రాన్ని పాటించడంవల్లకాక క్రీస్తుని విశ్వసించడం వల్ల లభిస్తుందని గ్రహించాడు. ఈ దృష్టిలో మాత్రమే దమస్కు దర్శనం అతనికి పరివర్తనం కలిగించింది.

తరతరాలబట్టి యూదులు మెస్సీయాకోసం గంపెడాశతో ఎదురుచూస్తున్నారు. కాని అతడు ఎప్పుడు వస్తాడో వారికి తెలియదు. దమస్కు దర్శనంవల్ల పౌలు క్రీస్తు రాకడతోనే మెస్సియా కాలం ప్రారంభమైందని గుర్తించాడు - 1కొ 10,11. యూదులు కోరిన కోరికలన్నీ మెస్సియాద్వారా సిద్ధించాయని తెలిసికొన్నాడు.

మోషే కాలంనుండి క్రీస్తు వరకు రక్షణం ధర్మశాస్త్రాన్ని పాటించడం వల్ల సిద్ధించింది. యెరూషలేము దేవాలయంలో ఆరాధనలు జరపడంవల్ల సిద్ధించింది. కాని యికమీదట క్రీస్తుని విశ్వసించడం వల్లగాని రక్షణం లభించదు. పూర్వవేద కాలంలోలాగ యిప్పుడు మన పుణ్యక్రియలు మనలను రక్షించవు. ఈ పుణ్యక్రియలు ప్రధానంగా ధర్మశాస్త్రంలోని ఆజ్ఞలను పాటించడమే. ఇప్పుడు మనలను రక్షించేది క్రీస్తు వరప్రసాదం. ప్రభువు మరణోత్థానాలు మనకు పాపవిమోచనం కలిగిస్తాయి. ఈ సత్యం పౌలుకి బాగా అర్థమైంది.

పూర్వవేదంలోని యూదులు యావే ప్రభువు రక్షణం తమకు మాత్రమేననీ, అన్యజాతుల ప్రజలందరూ నాశమైపోతారనీ భావించారు. ఈ దర్శనంలో పౌలు రక్షణం యూదులకు మాత్రమేకాక, అన్యజాతి ప్రజలకు గూడ సిద్ధిస్తుందని గుర్తించాడు. తాను అన్యజాతులకు క్రీస్తుని అత్యవసరంగా బోధించాలనిగూడ గ్రహించాడు. అతన్ని బోధించకపోతే తాను ముదనష్టమైపోతానని తెలిసికొన్నాడు. కనుకనే "క్రీస్తుని బోధించకపోతే నా పరిస్థితి దారుణమౌతుంది" అని చెప్పుకొన్నాడు - 1కొ 9,16. యిర్మీయా మొదలైన పూర్వ ప్రవక్తల్లాగ తానూ తల్లి గర్భంనుండే ప్రభువు సేవకు పిలువబడినవాణ్ణని యెంచాడు - గల 1,15-16.

ద్వితీయోపదేశ గ్రంథం పేర్కొన్నట్లుగా సిలువపై చనిపోయిన క్రీస్తు శాపగ్రస్తుడే - 21,22-23. కాని అతడు శాపగ్రస్తుడు అయింది ఎందుకు? తన పాపాల కొరకు కాదు. మన పాపాల కొరకు. సిలువ మరణం ద్వారా అతడు శాపానికి గురై మన శాపాన్ని తొలగించాడు - గల 3,13. ఈలా అర్థం చేసికోవడంద్వారా పౌలుకి క్రీస్తుపట్ల గల ఈసడింపు తొలగిపోయింది. అతనిపట్ల గాఢమైన కృతజ్ఞతాభావం కలిగింది. ఆ క్రీస్తుని అందరికీ బోధించాలన్న తీవ్రమైన కోరికకూడ కలిగింది.

పౌలుకి రక్షణ చరిత్రలో మూడు దశలున్నాయని అర్థమైంది. మొదటిదశ అబ్రాహామునుండి మోషేవరకు. ఈ దశలో ధర్మశాస్త్రంలేదు. సొంత అంతరాత్మ ప్రకారం జీవించిన నరుడెల్లా రక్షణం పొందాడు. రెండవదశ మోషేనుండి మెస్సియా వచ్చిందాకా. ఈ దశలో ధర్మశాస్త్రం నరులకు రక్షణాన్నొసగింది. కావుననే పూర్వవేద యూదులు భక్తి శ్రద్ధలతో మోషే ఆజ్ఞలను పాటించారు. ఇక మూడవదశ క్రీస్తు ఉత్థానకాలంనుండి లోకాంతంవరకు. ఇది మెస్సియా కాలం. ఈ దశలో క్రీస్తుని విశ్వసించి రక్షణం పొందాలి. అతని మరణోత్థానాలను నమ్మి, అతని ప్రేమాజ్ఞలను పాటించి పాపపరిహారం పొందాలి. ఇప్పుడు మనమంతా ఈ మూడవదశలో వున్నాం. కనుక ఈ మూడవదశలో అవశ్యంగా క్రీస్తుని ప్రజలందరికి బోధించాలని పౌలుకి తట్టింది. కనుకనే వేదబోధమీద అతనికి తపన.

ఈ విధంగా దమస్కు దర్శనంలో ఎన్నో దైవరహస్యాలు ఇమిడి వున్నాయి. అది పౌలుకి జీవితాంతం వరకు ప్రేరణం పుట్టించి అతన్ని ముందుకి నడిపిస్తూ వచ్చింది. మనకుగూడ ఈ దమస్కు దర్శనం అనేది ఒకటి సొంతంగా వుంటేనే తప్ప మన జీవితాన్ని భక్తితో గడపలేం.

## 3. ప్రార్థనాభావాలు

1. డమస్కు దర్శనంవల్ల పౌలు పూర్తిగా మారిపోయాడని చెప్పాం. ఈ కాలంనుండి క్రీస్తు అతనికి ఏకైక ధ్యేయమయ్యాడు. ఆ ప్రభువుని బోధించడానికి అతడు సుదీర్ఘమైన ప్రేషిత ప్రయాణాలు మూడు చేసాడు. ఆనాటి గ్రీకు పట్టణాల్లో ఎన్నో క్రైస్తవ సమాజాలను స్థాపించాడు. ఆ సమాజాలకు 14 జాబులు వ్రాసాడు. వాటిని నూత్నవేదంలో నేటికీ చదువుతున్నాం. తీతు తిమోతిలాంటి శిష్యబృందాన్ని తయారుచేసాడు. ప్రభువుపట్ల తనకున్న గాఢమైన భక్తివల్ల ఇప్పుడు నేనుకాదు నాయందు క్రీస్తే జీవిస్తున్నాడని చెప్పుకొన్నాడు-గల 2,20. అతన్ని బోధించకపోతే నా పరిస్థితి దారుణమౌతుందని వాకొన్నాడు - 1కొ 9,16-17. క్రీస్తే మనకు నిజమైన విలువ, అతనితో పోలిస్తే ఈ లోకంలోని వస్తువులన్నీ చెత్తాచెదారంలాగ విలువలేనివి అని వాకొన్నాడు-ఫిలి 3,8-11. ఇలాంటి డమస్కు దర్శనాన్ని మనం పవిత్ర గ్రంథంనుండి మళ్ళామళ్ళా చదువుకొని ప్రేరణం పొందాలి.

2. పౌలుకి కలిగిన క్రీస్తు అనుభూతిలో ఓ నూరవవంతయినా మనకుకూడ కలిగితే మన జీవితం ధన్యమౌతుంది. మనం పుట్టు క్రైస్తవులం. క్రీస్తు విశ్వాసం కొరకు మనం ఎలాంటి కృషి చేయలేదు. ఏ శ్రమా పడలేదు. కనుక మామూలుగా మనకు అతనిపట్ల గాఢమైన విశ్వాసం పుట్టదు. ఇప్పుడు వేదగ్రంథ పఠనంద్వారా, దేవద్రవ్యానుమానాలను భక్తితో స్వీకరించడంద్వారా, ప్రార్థన చేసికోవడం ద్వారా మనం ఈ యనుభూతిని పొందాలి. సౌలుకి లాగ ఇప్పుడు మనకు అద్భుతమైన దర్శనాలేమీ కలగవు. మనం విశ్వాసంద్వారా హృదయంలోనే ప్రేరణం పొందాలి. ఆ ప్రేరణాన్ని ప్రభువునుండి మనకు సంపాదించి పెట్టమని ప్రేషితుడైన పౌలునే అడుగుకొందాం.

3. క్రీస్తుని బోధించకపోతే నా పరిస్థితి దారుణమౌతుంది అనుకొని పౌలు వేదబోధకు పూనుకొన్నాడు. మనకు వేదబోధపట్ల శ్రద్ధ వుండదు. ఇరుగుపొరుగువాళ్ళకు క్రీస్తుని తెలియజేసే పూచీ క్రైస్తవులందరికీ వుంది. ఈ దేశంలో కేవలం 2.5 శాతం క్రైస్తవులు. కనుక మనకు బోధన తపనను దయచేయమని పౌలుని అడుగుకొందాం.

# ప్రశ్నలు

1. ఈసాకుని బలిగా సమర్పించడంలో అబ్రాహాము ప్రదర్శించిన విశ్వాసాన్ని తెలియజేయండి.
2. స్త్రీలోలుడైన సంసోను పతనమైన తీరూ, అతడు తన మరణానికిముందు శత్రువులను నాశంజేసిన తీరూ వివరించండి.
3. ప్రభువు సమూవేలుని పిల్చినతీరూ, దానినుండి మనం నేర్చుకోదగ్గ పాఠాలనూ వివరించండి.
4. ప్రభువు అవిధేయుడైన సౌలుని రాజపదవినుండి త్రోసివేసిన తీరును వివరించండి.
5. సమూవేలు దావీదుకి అభిషేకం చేసిన తీరును వివరించండి. నేడు మనం మన పిలుపునీ సేవనూ లోతుగా అర్థంజేసికోవడానికి ఈ సంఘటనం ఏలా తోడ్పడుతుంది?
6. దావీదు గొల్యాతుల కథలో మానుషబలం దైవబలానికి లొంగిపోయిన తీరును వివరించండి. ఈ కథ నేడు మనకు కలిగించే ప్రేరణలను కొన్నిటిని తెలుపండి.
7. దావీదు దేవునికి మందిరం కట్టగోరిన తీరూ, దేవుడే దావీదుకి మందిరం కట్టిపెట్టినతీరూ వివరించండి.
8. దావీదు పాపంచేయగా నాతాను అతన్ని మందలించిన తీరును వివరించండి. ఈ కథ నేడు మనకేలా ప్రేరణం పుట్టిస్తుందో తెలియజేయండి.
9. సొలోమోనుకు విజ్ఞానవరం ఏలా లభించింది? ఆ వరం అతనిలో ఏలా పనిచేసింది?
10. అహీయా ప్రవచనాన్ని వివరించండి. రెహబాము కాలంలో రాజ్యవిభజనం ఏలా జరిగిందో తెలియజేయండి.
11. ఏలీయా ప్రవక్త సారెఫతు వితంతువునీ ఆమె కుమారుణ్ణీ ఆదుకొన్న తీరు వివరించండి.
12. కర్మెలు కొండమీద బాలుమతానికీ యావే మతానికీ జరిగిన పోటీని వివరించండి.
13. ఏలీయాకు హోరేబు కొండమీద కలిగిన దైవానుభూతిని వివరించండి. ఈ కథ నేడు మనకు ఏలా ప్రేరణం పుట్టిస్తుందో తెలియజేయండి.
14. అహాబు నాబోతు ద్రాక్షతోటను అపహరించిన తీరూ, ఏలీయా ఆ అన్యాయాన్ని ఖండించినతీరూ వివరించండి.
15. ఏలీయా స్వర్గానికి పోయినతీరూ ఏలీషా అతనికి వారసుడైన తీరూ వివరించండి.
16. ఎలీషా నామాను కుష్ఠను నయంజేసి అతనికి రోగవిముక్తిని కలిగించిన తీరును వివరించండి. లేదా "నామాను విశ్వాసం మెచ్చుకోదగ్గది" - వివరించండి.
17. సౌలుకు దమస్కు దర్శనం ఏలా కలిగింది? దానివల్ల అతడు క్రొత్తగా గ్రహించిన వేద సత్యాలేమిటివి?

# 4. బైబులు పోటీలు

## మనవిమాట

ఈ గ్రంథంలో బైబులు పోటీలు (క్విసులు) 49 పొందుపరచాం.

ఈ పుస్తకం విశేషంగా విద్యార్థులకు ఉద్దేశింపబడింది. బైబులు పోటీలు కుతూహలాన్ని పుట్టించి బైబులు నేర్చుకుందామనే కోరికను పెంచుతాయి. కనుక హైస్కూలు, కాలేజి విద్యార్థులకు పవిత్రగ్రంథం మీద ఆసక్తిని పెంచడానికి ఈ పొత్తం చక్కగా ఉపయోగపడుతుంది.

బైబులు క్విసులు నడిపించే ఉపాధ్యాయులు ఆయా విద్యార్థి బృందాల స్థాయికి తగినట్లుగా ఈ గ్రంథంలోని పోటీలను ఎన్నుకోవచ్చు. విద్యార్థులకు ఆయా పోటీల్లో వచ్చే ప్రశ్నలకు జవాబులు చెప్పేపుడు వాళ్ళచే నేరుగా బైబులునుండే జవాబులు చదివించడం ఉత్తమ పద్ధతి. క్విస్ నడిపించేవాళ్ళు ముందుగా జవాబులనూ వాటి సందర్భాలనూకూడ తెలిసికొని వుండాలి. ఇది నాల్గవ ముద్రణం.

## విషయసూచిక

# 1. ఆదిమ మానవులు

1. మొదటి నరహంత ఎవరు?
2. ఆదాముఏవల మూడవ కుమారు డెవరు?
3. ఇతడు దేవునికి సహచరుడై జీవింపగా దేవుడు ఇతనిని కొనిపోయెను. ఇతడు ఎవరు?
4. జలప్రళయ కాలమున ఓడను కట్టిన నరుడెవరు?
5. ఆదిదంపతులు వసించిన తోట పేరేమి?
6. షీనారులో ఆదిమ మానువులు నిర్మించిన గోపురము పేరేమి?
7. భూమి మరల జలప్రళయము వలన నాశము కాదనుటకు దేవుడు పెట్టిన గురుతు ఏమిటి?
8. బైబిలులోని నరులందరిలోను ఎక్కువ కాలము జీవించినవా డెవడు?
9. ఆదిమ మానవులలో గొప్ప వేటగాడుగా ప్రసిద్ధి గాంచినవా డెవడు?
10. మొదటిసారిగా ద్రాక్షలను సాగుచేసిన దెవరు?

# 2. అబ్రాహాము

1. అబ్రాహాము జన్మస్థలము ఏది?
2. అతని తండ్రి పేరేమి?
3. అబ్రాహాము మొదటిభార్య పేరేమి?
4. ఆమెకుగల ఈజిప్టు బానిసపిల్ల పేరేమి?
5. ఆ పిల్లకు అబ్రాహాము వలన పుట్టిన బిడ్డడెవరు?
6. నూరేండ్ల యీడున వున్నపుడు అబ్రాహామునకు పుట్టిన కుమారు డెవరు?
7. అబ్రాహాము శ్మశానమునకు  కొన్న గుహ ఏది?
8. అబ్రాహాము కోడలు పేరేమి?
9. ఆమె యిద్దరు కుమారులు ఎవరు?
10. అబ్రాహాము రెండవ భార్య పేరేమి?

# 3. యోసేపు కథ

1. యోసేపుకి కవగొట్టు తమ్ముడెవరు?
2. యాకోబు యోసేపును ఎక్కువగా ప్రేమించి అతనికి ఏమి కానుక నిచ్చెను?

3. సూర్యచంద్రులు పదునొకండు నక్షత్రాలు తనకు దండము పెట్టినట్లుగా యోసేపునకు కల వచ్చినది. ఈ వస్తువులు ఎవరిని సూచించును?
4. సోదరులు యోసేపుని యిష్మాయేలీయులకు ఎంతవెల కమ్మిరి?
5. యోసేపుతోపాటు చెరలోవున్న రాజసేవకులు ఇద్దరు ఎవరు?
6. తన కలలకు అర్థము చెప్పినందుకు ఫరో యోసేపుకి ఏమి పదవి నిచ్చెను?
7. యోసేపు భార్య పేరేమి?
8. అతని యిద్దరు కుమారుల పేరులేమి?
9. గృహనిర్వాహకుడు యోసేపు గిన్నెను ఎవరి గోతములో దాచెను?
10. యాకోబు ఆతని కుమారులు ఈజిప్టులోని ఏ మండలమున వసించిరి?

## 4. మోషే కథ

1. నైలు నదిలో మోషే శిశువును చూచిన దెవరు?
2. మోషే ఈజిప్టునుండి ఎందుకు పారిపోయెను?
3. మోషే భార్య పేరేమి?
4. అతని మామ పేరేమి?
5. దేవుడు మోషేను చెప్పులు విడువమనినపుడు అతడు దేనివైపు చూచుచుండెను?
6. దేవుడు ఈజిప్టుమీదికి ఎన్ని యరిష్టములు పంపెను?
7. దేవుడు యిస్రాయేలీయులను ఏయే స్తంభముల రూపమున నడిపించుకొని పోయను?
8. సీనాయి కొండమీద మోషే దేవునినుండి ఏమి స్వీకరించెను?
9. ఈజిప్టునుండి వెడలి వచ్చినందుకు జ్ఞాపకార్థముగా మోషే నెలకొల్పిన పండుగ ఏది?
10. అతడు ఏ కొండపై చనిపోయెను?

## 5. దావీదు

1. దావీదు తండ్రి పేరేమి?
2. అతడు జన్మించిన నగరమేది?
3. బేత్లెహేము నగరమున అతనిని రాజుగా అభిషేకించి ప్రవక్త ఎవరు?
4. అతడు ఫిలిస్టీయ వీరుని దేనితో కొట్టి చంపెను?
5. అతనికి ప్రాణస్నేహితుడు ఎవరు?
6. దావీదు దాగుకొనిన గుహ పేరేమి?

7. దావీదు ఒక సైనికుని మోసముతో చంపించి అతని భార్యను తన భార్యను చేసికొనెను. ఆమె పేరేమి?
8. ఈ పాపమునకుగాను దావీదుని చీవాట్లు పెట్టిన ప్రవక్త ఎవరు?
9. తండ్రియైన దావీదుపై తిరగబడిన కుమారుడెవరు?
10. దావీదు తర్వాత అతని కుమారులలో ఎవరు రాజయ్యేను?

## 6. ప్రవక్తలు

1. రెండవ దేవాలయ నిర్మాణమును ప్రోత్సహించిన ప్రవక్త ఎవరు?
2. సింహముల గుంటలోనికి తోయబడిన దీర్ఘదర్శి ఎవరు?
3. ఎండిన యెముకలు జీవముతో లేచునట్లుగా ప్రవచనము చెప్పిన ప్రవక్త యెవరు?
4. నాల్గువందలమంది ప్రవక్తలు అసత్యము చెప్పుచుండగా తానుమాత్రము సత్యమునే చెప్పిన ప్రవక్త యెవరు?
5. తెకోవ నగరపు గొర్రెల కాపరి ప్రవక్త అయ్యాడు. అతని పేరేమి?
6. ప్రభువు ఇతనితో స్నేహితుడు స్నేహితునితోవలె మాట్లాడాడు. ఇతడు ఎవరు?
7. ప్రభువు పిలువగా నేనున్నానుకదా నన్ను పంపుడు అని పల్కిన దీర్ఘదర్శి ఎవరు?
8. ఈ ప్రవక్త భార్య పేరు గోమెరు. ఇతని పేరేమి?
9. పూడిక బావిలోనికి త్రోయబడిన దీర్ఘదర్శి ఎవరు?
10. పౌలు నడికట్టుతో తన కాలుసేతులను బంధించుకొనిన ప్రవక్త ఎవరు?

## 7. పూర్వవేద రాజులు

1. అబ్రాహాముని కలసికొని అతనిని దీవించిన షాలేము రాజు ఎవరు?
2. యిస్రాయేలీయులకు మొదటి రాజెవరు?
3. యువకుడుగా నున్నపుడే దేవునినుండి జ్ఞానమును వరముగా కోరుకొనిన రాజెవరు?
4. సొలోమోను దేవాలయమును కట్టుటకు కలపను సరఫరా చేసిన తూరుదేశపు రాజెవరు?
5. సొలోమోనును సందర్శించుటకు వచ్చినరాణి ఎవరు?
6. ఈరాజు దేవుని ప్రార్థింపగా అతడు ఇతని ఆయుస్సు 15 సంవత్సరాలు పొడిగించెను. ఈ రాజు ఎవరు?
7. దైవశిక్ష వలన కుష్ఠరోగియైన రాజెవరు?
8. యిస్రాయేలు చివరి రాజెవరు?

9. హీబ్రూ బాలురను అగ్నిగుండములో త్రోయించిన రాజెవరు?
10. యూదులను బాబిలోనియా ప్రవాసమునుండి తిరిగి రానిచ్చిన పర్షియా రాజెవరు?

## 8. పూర్వవేద స్త్రీలు

1. చిన్న కుమారునకు మేలు చేయుటకు భర్తను మోసగించిన స్త్రీ ఎవరు?
2. తన దేశమును విడచిపెట్టి అత్తతోపాటు బేత్లెహేమునకు తిరిగివచ్చిన మోవాబు స్త్రీ ఎవరు?
3. పర్షియాదేశమున వష్తికి బదులుగా రాణియైన యిశ్రాయేలు మహిళ ఎవరు?
4. మోషే అక్క పేరేమి?
5. కుమారుని షిలో దేవాలయమున కానుకగా సమర్పించిన తల్లి ఎవరు?
6. ఉప్పుస్తంభముగా మారిన స్త్రీ ఎవరు?
7. శత్రుసైన్యాధిపతియైన హోలోఫెర్నెసును చంపిన స్త్రీ ఎవరు?
8. బైబులులో కన్పించు ఏకైక మంత్రగత్తె ఎవరు?
9. కణతలలో మేకును దిగగొట్టి శత్రువును చంపిన వీర వనిత ఎవరు?
10. దేవుని దూషింపుమని భర్తకు సలహా యిచ్చిన స్త్రీ ఎవరు?

## 9. నూత్నవేద స్త్రీలు

1. దేవాలయమున బాలయేసును తోడివారికి ఎరుకపరచిన వితంతువు ఎవరు?
2. క్రీస్తు ప్రేమించిన సోదరీమణులు ఎవరు?
3. క్రీస్తు ఎవరివద్దనుండి ఏడు దయ్యములను పారదోలెను?
4. క్రీస్తు జీవముతో లేపిన బాలిక ఎవరు?
5. ఒక మోసగాని భార్యయు స్వయముగా మోసగత్తెయునై పేత్రు శాపము వలన ప్రాణములు కోల్పోయిన స్త్రీ ఎవరు?
6. సుఖారు బావివద్ద క్రీస్తుతో మాట్లాడిన స్త్రీ ఎవరు?
7. చెరనుండి మార్కు ఇంటికివచ్చి తలుపుతట్టిన పేత్రుకి ద్వారము తీసిన సేవకురాలు ఎవరు?
8. ఆ నీతిమంతునిగూర్చి నీవు ఏమియు జోక్యము కలిగించుకోవలదు అని భర్తకు కబురు పంపిన స్త్రీ ఎవరు?
9. స్నాపక యోహాను శిరస్సును పళ్ళెములో పెట్టి ఇప్పింపుడు అని హేరోదు రాజును అడిగిన దెవరు?
10. క్రీస్తు ఈమె చేతిని తాకగానె ఈమె జ్వరముపోయినది. ఈమె ఎవరు?

# 10. బైబిల్లోని దుర్మార్గులు

1. దూరదేశమునకు బోయి తన ధనమంతయు భోగవిలాసములతో దుర్వినియోగము చేసినదెవరు?
2. క్రీస్తు ఎవరికి నక్క అని పేరు పెట్టెను?
3. పేతురుని మోసము చేయబోయి అతని శాపమువలన ప్రాణములు కోల్పోయినవాడెవడు?
4. అన్నకు దక్కవలసిన జ్యేష్ఠభాగమును అపహరించిన తమ్ముడెవరు?
5. బలాఢ్యుడైన భర్త తలవెంట్రుకలను గొరిగించి అతనిని శత్రువుల చేతికి అప్పగించిన స్త్రీ ఎవరు?
6. మొర్దెకయిని ఉరితీయించబోయి తానే ఉరికంబము ఎక్కినవాడెవడు?
7. నాబోతును చంపించి అతని ద్రాక్షతోటను స్వాధీనము చేసికొనిన రాజెవరు?
8. కుక్కలు ఈ దుష్టురాలి శవమును పీకుకొని తిన్నవి. ఈమె ఎవరు?
9. ఒకజాతి అంతయు నాశమగుటకంటె ఒక వ్యక్తి ఆ జాతికొరకు మరణించుట శ్రేయస్కరమని సలహా యిచ్చిన దెవరు?
10. ఎఫెసు పట్టణమున పౌలుపై గలాటా లేవదీసిన కమసాలి ఎవరు?

# 11. బైబులు నగరాలు

ఈ క్రింది నగరాల పేర్లను పేర్కొనుడు.

1. ఈ నగరమున క్రీస్తుని పర్వతముమీదినుండి క్రిందికి త్రోయబోయిరి.
2. ఈ నగరములో "తెలియని దేవునికి" గూడ ఒక బలిపీఠ ముండెడిది.
3. అబ్రాహాము ఈ రెండు పట్టణాల కొరకు విజ్ఞాపన చేసెను.
4. దావీదు ఈ నగరమును యెబూసీయులనుండి జయించి తన రాజధానిగా చేసికొనెను.
5. ఒక ప్రవక్త ఈ నగరము నాశము కావలెనని కోరుకొనెను. కాని దేవుడు దీనిని రక్షించెను.
6. ఈ నగరములో క్రీస్తు శిష్యులను మొట్టమొదటిసారిగా "క్రైస్తవులు" అని పిల్చిరి.
7. ఇది పౌలు సొంతవూరు.
8. ఈ నగరమునకు పోవుదారిలో పౌలు పరివర్తనము చెందెను.
9. ఈ గ్రామమున చనిపోయిన విధవ కుమారుని క్రీస్తు జీవముతో లేపెను.
10. క్రీస్తు ఉత్థానముకాగానే ఇద్దరు శిష్యులు యెరూషలేమునుండి ఈ గ్రామమునకు పయనమైపోయిరి.

# 12. బైబులు కొండలు

ఈ క్రింది కొండలపేర్లు తెలియజేయుడు.

1. మోషే మండుచున్న పొదనుచూచిన పర్వతము.
2. అతడు చనిపోయిన కొండ.
3. ఏలీయా ప్రార్థింపగా అగ్ని దిగివచ్చిన కొండ.
4. ఏలీయా దేవుని కలసికొనిన కొండ.
5. సమరయులు తమ దేవాలయమును నిర్మించుకొనిన కొండ.
6. నోవా వోడ నిల్చిన కొండ.
7. అబ్రాహాము ఈసాకుని బలిగా సమర్పింపబోయిన కొండ.
8. క్రీస్తు దివ్యరూపము తాల్చిన కొండ.
9. క్రీస్తుని సిలువవేసిన కొండ.
10. అతడు మోక్షారోహణము చేసిన కొండ.

# 13. బైబులు జంతువులు

ఈ క్రింది జంతువులు ఏవో తెలియజేయుడు.

1. ఈ జంతువు పేరు క్రీస్తు బిరుదములలో ఒకటి.
2. ఇది తన కొమ్ముల వలన పొదలో చిక్కుకొనెను.
3. దీని కడుపులో ఒక ప్రవక్త మూడునాళ్లుండెను.
4. ఇది తనపైనెక్కి ప్రయాణము చేయువారితో మాటలాడెను.
5. ఇది ఒక బలాఢ్యుని మీదికి దూకగా అతడు దానిని పట్టుకొని గొర్రెపిల్లనువలె చీల్చివేసెను.
6. ఫరో చక్రవర్తి ఈ జంతువులను పదునాల్గింటిని కలలో చూచెను.
7. ఈ జంతువు యిస్రాయేలీయుల పాపములను ఎడారిలోనికి మోసికొని పోయెను.
8. రిబ్కా ఈ జంతువుపైనెక్కి ఈసాకు నింటికి వచ్చెను
9. ఈ జంతువు ఒక పేదవాని పుండ్లను నాకెను.
10. క్రీస్తు హెరోదురాజును ఈ జంతువుతో పోల్చెను.

# 14. బైబులు కట్టడాలు

ఈ క్రింది కట్టడాలు ఏవో తెలియజేయుడు.

1. కఫర్నాములో రోమను సైన్యాధిపతి యూదుల కొరకు దీనిని కట్టించెను.
2. సొలోమోను మొదటిసారిగా దీనిని కట్టించెను.

3. మరియ యోసేపు బాలయేసులకు దీనిలో తావు లభింపలేదు.
4. సిలోయములో ఇది కూలినపుడు 18 మంది మరణించిరి.
5. అవివేకియైన ధనికుడు వీనిని పడగొట్టించి ఇంకను పెద్దవిగా కట్టింపగోరెను.
6. ప్రభువు నజరేత్తూరు వెళ్ళినపుడు ఈ భవనములో వేద గ్రంథము చదివి బోధచేసెను.
7. దీనిని కట్టింపగోరువాడు ముందుగా దీనికగు వ్యయమును గూర్చి ఆలోచింపవలెను.
8. ప్రభువు మత్తయిని ఇచటినుండి పిలిచెను.
9. బుద్ధిహీనుడు దీనిని ఇసుక పునాదిమీద నిర్మించెను.
10. క్రీస్తు పరిసయులను ఈ కట్టడములతో పోల్చెను.

## 15. బైబులు ఆహారాలు

ఈ క్రింది ఆహారములు ఏవో తెలియజేయుడు.

1. ఉత్థాన క్రీస్తు శిష్యులయెదుట ఈ యాహారమును భుజించెను.
2. బలాఢ్యుడైన నరుడొకడు చనిపోయిన సింహము కళేబరమునందు ఈ యాహారమును కనుగొనెను.
3. ప్రతిదినము కాకులు ఏలియాకు ఈ యాహారమును కొనివచ్చెడివి.
4. ఫరో వంటవాడు తాను వీనిని గంపలో మోసికొని పోవుచున్నట్లు కలగనెను.
5. అబ్రాహాము తన్ను దర్శింప వచ్చిన దేవదూతలకు ఈ పానీయము నిచ్చెను.
6. ఏసావు ఈ యాహారము కొరకు తన జ్యేష్ఠభాగమును యాకోబునకు అమ్మివేసెను?
7. దీని మాంసమును వేటాడి తెచ్చుటకు ఈసాకు ఏసావును అడవికి పంపెను.
8. కనాను దేశమును వేగుజూడ బోయినవారు ఈ పండ్ల గుత్తిని కర్రమీద మోసికొనివచ్చిరి.
9. దేవుడు యిస్రాయేలీయులకు ఎడారిలో ఈ పక్షులను ఆహారముగా నొసగెను.
10. యిస్రాయేలీయులు ఐగుప్తునుండి బయలు దేరకముందు దీని మాంసమును భుజించిరి.

## 16. బైబులు వృత్తులు

1. జల ప్రళయానంతరము నోవా చేపట్టిన వృత్తి ఏది?
2. ఏసావు చేపట్టిన వృత్తి ఏది?
3. యోసేపు సోదరుల వృత్తి యేది?
4. ఫరోరాజు యిస్రాయేలీయులచే ఏమిపని చేయించెను?

5. పేత్రు అంద్రెయ యాకోబు యోహానుల వృత్తి ఏది?
6. క్రీస్తు వస్త్రముల కొరకు చీట్లువేసినవారి వృత్తి యేది?
7. యొప్పేలో పేత్రును అతిథిగా స్వీకరించిన సీమోను వృత్తి యేది?
8. క్రీస్తును చూచుటకు చెట్టుపై కెక్కిన జక్కయ వృత్తి యేది?
9. క్రీస్తు బోధల ప్రకారము ఆరోగ్యవంతులకు అక్కర లేనివా డెవడు?
10. పౌలు ఏ వృత్తిచే జీవించెను?

## 17. బైబులు బాలలు

ఈ క్రింది బాలలెవరో తెలుపుడు

1. ఇతని తల్లి ఇతనిని ఎడారిలో ఒక పొదక్రింద పరుండబెట్టెను.
2. ఇతడు బాలుడుగా నున్నపుడే కలలు కనెను.
3. సోదరులందరిలో కడగొట్టువాడైన ఇతడు పుట్టినపుడు ఇతని తల్లి చనిపోయెను.
4. రాజకుమారి ఇతని తల్లినే ఇతనికి దాదిగా నియమించెను.
5. దేవళములో పెరుగుచున్న ఇతనికి ఇతని తల్లి ప్రతియేడు క్రొత్త అంగీని కుట్టుకొని వచ్చెడిది.
6. ఏడ్గురు అన్నలున్నను ఈ కడగొట్టువాడు రాజయ్యెను
7. ఎలీషా ప్రవక్త కుష్ఠ నయముచేయునని ఈమె నామానునకు తెలియజేసెను.
8. ఇతడు జన్మించువరకు ఇతని తండ్రి మూగవాడుగా నుండెను.
9. పండ్రెండేడ్ల యీడున తలిదండ్రులతో యెరూషలేము వెళ్ళిన బాలుడు.
10. క్రీస్తు జీవముతో లేపిన బాలిక.

## 18. బైబులు కథలు

ఈ క్రింది మాటల వలన బైబులులోని ఏ వ్యక్తులు మీకు జ్ఞప్తికి వచ్చెదరో తెలుపుడు.

1. జీవవృక్ష ఫలము
2. ఇంద్రధనుస్సు
3. సింహముల గుంట
4. మండుచున్న పొద
5. చేపకడుపులో మూడునాళ్ళు
6. అగ్ని రథము నెక్కుట

7. ఒడిసెల రాతిదెబ్బ
8. కొండమీద పొట్టేలును బలియిచ్చుట
9. కోడికూత
10. మేడిచెట్టు నెక్కుట

## 19. బైబులు వాగ్దానాలు

ఈ క్రింది వాగ్దానములను ఎవరు ఎవరికి చేసిరి?

1. నేను నిన్నొక మహాజాతినిగా తయారుచేయుదును.
2. ప్రభువును నమ్మినవారు పక్షిరాజువలె రెక్కలు చాచి పై కెగురుదురు.
3. నన్ను ప్రేమించువారిని దీర్ఘయువుతో సంతృప్తి పరచెదను.
4. నా కృప నీకు చాలును. బలహీనతయందు నా శక్తి పరిపూర్ణమగును.
5. నేను నీకు వివేకము విజ్ఞానము ప్రసాదింతును.
6. యెరూషలేము వీధులు మరల ఆటలాడుకొను బాలబాలికలతో నిండియుండును.
7. నేను లోకాంతము వరకు మీతో నుందును.
8. నీవ రాయివి. ఈ రాతిమీద నా సంఘమును నిర్మించెదను.
9. ఎక్కడ యిద్దరు ముగ్గురు నా పేరిట కూడుదురో అక్కడ నేనును ఉందును.
10. నేడే నీవు నాతోకూడ పరలోకము ప్రవేశింతువు.

## 20. బైబులు గ్రంథాలు

1. ఈ పుస్తకము పేరు గణిత శాస్త్రమున వచ్చును. ఇది యేది?
2. లోకసృష్టిని యిస్రాయేలీయుల జన్మవృత్తాంతమును తెలియజేయు పుస్తకమేది?
3. ఒక అందమైన రాణి పేరు కల పొత్తమేది?
4. ఒక రాజు ప్రేమగీతాల గ్రంథమేది?
5. అంత్యదినాలలో ఆత్మ ఎల్లరిమీదికి దిగివచ్చునని చెప్పెడు గ్రంథమేది?
6. చేప మింగివేసిన కథానాయకుడుగల గ్రంథమేది?
7. యిస్రాయేలీయుల పాటల పుస్తకమేది?
8. మోవాబు పుణ్యస్త్రీ కథను వర్ణించు గ్రంథ మేది?
9. తియొఫిలుకు అంకితమీయబడిన సువిశేష మేది?
10. సుంకరి వ్రాసిన సువిశేషమేది?

# 21. ఆదికాండము

1. జంతువులకు పక్షులకు మొదట పేర్లుపెట్టిన దెవరు?
2. జలప్రళయము సమసిపోయినదని నోవా యెట్లు తెలిసికొనెను?
3. నీ సంతతిని యిసుక రేణువులవలె వృద్ధిచేయుదును అని ప్రభువు ఎవరికి మాట యిచ్చెను?
4. దుర్మార్గులతోపాటు నీతిమంతులనుగూడ నాశము చేయుదువా అని దేవుని ప్రార్థించిన దెవరు?
5. ప్రభువు యాకోబునకు పెట్టిన క్రొత్త పేరేమిటి?
6. పొడుగుచేతులు నిలువుటంగీ కల యువకుడెవరు?
7. బక్కచిక్కిన ఆవులు బలసిన యావులను తిన్నట్లుగా కలగాంచిన దెవరు?
8. ఫరో యోసేపుకి పెట్టిన పేరేమిటి?
9. యోసేపు బెన్యామీనుల తల్లి యెవరు?
10. యోసేపు భార్య పేరేమి?

# 22. నిర్గమ కాండము

1. మోషేశిశువు తల్లి ఇతనిని ఏ నదిలో వదిలిపెట్టెను?
2. మోషేను దత్తుతీసుకొని పెంచిన దెవరు?
3. అతడు "నేను దగ్గరికి వెళ్ళి చూచెదను" అనుకొన్నది దేనిని గూర్చి?
4. ఫరో కట్టకడన యిశ్రాయేలీయులను ఈజిప్టునుండి ఎందుకు వెళ్ళిపోనిచ్చెను?
5. యిశ్రాయేలీయులు దాటిపోయిన సముద్రము పేరేమి?
6. ఐగుప్తునుండి బయలుదేరకముందు యిశ్రాయేలీయులు దేనిని భుజించిరి?
7. మోషే రాతినుండి నీటిని రప్పించిన తావేది?
8. బంగారు దూడను చేసిన దెవరు?
9. మోషేమీద తిరగబడినందులకు శిక్షగా మిర్యాముకు ఏమి వ్యాధి సోకెను?
10. యిశ్రాయేలీయులు ఎడారిలో భుజించిన రెండు ఆహారములు ఏవి?

# 23. క్రీస్తు జననము

1. క్రీస్తు బేత్లెహేమున జన్మించునని ప్రవచించిన ప్రవక్త ఎవరు?
2. క్రీస్తు జననకాలమున జనాభా లెక్కలు తయారు చేయించిన రోమను చక్రవర్తి యెవరు?

3. మరియ తొలిచూలు కుమారుని కని ఎక్కడ పరుండబెట్టెను?
4. క్రీస్తు శిశువుని సందర్శింప వచ్చినవారిలో మొదటివా రెవరు?
5. యేసు అను పేరునకు అర్థమేమి?
6. ప్రభూ! నీ మాట ప్రకారము ఈ దాసుని ఇక సమాధానముతో వెళ్ళిపోనిమ్ము అని పల్కిన దెవరు?
7. దేవాలయమున క్రీస్తు శిశువును చూచిన ప్రవక్త్రి ఎవరు?
8. తూర్పుదేశపు జ్ఞానులు ఏ గురుతుచూచి బేత్లెహేమునకు వచ్చిరి?
9. వారు ఆ శిశువునకు సమర్పించిన బహుమతు లేవి?
10. మరియా యోసేపులు బాలయేసుతో ఏ దేశమునకు పారిపోయిరి?

## 24. క్రీస్తు మేలు చేసిన వ్యక్తులు

1. క్రీస్తు ఈమె చేతిని తాకగానే ఈమె జ్వరము పోయెను. ఈమె ఎవరు?
2. మీరు తమ పడవ సముద్రములో మునిగిపోవునని భయపడిరి. కాని క్రీస్తు వీరిని రక్షించెను. వీరెవరు?
3. నల్గురు స్నేహితులు ఇతనిని మోసికొనివచ్చి ఇంటి కప్పుగుండ క్రీస్తు చెంతకు జారవిడిచిరి. ఇతడు ఎవడు?
4. ఈ రోగపీడితురాలు క్రీస్తు అంగీని తాకినంతనే ఆరోగ్యము పొందినది. ఈమె ఎవరు?
5. సుంకపు మెట్టుకడ కూర్చొనియుండగా క్రీస్తు ఇతనిని పిల్చెను. ఇతడు ఎవడు?
6. ఈ గ్రుడ్డివాడు త్రోవప్రక్కన కూర్చుండి భిక్ష మడుగుకొనుచుండగా క్రీస్తు ఇతనికి దృష్టి ప్రసాదించెను. ఇతడు ఎవడు?
7. క్రీస్తును చూచుటకు మేడిచెట్టును ఎక్కినవా డెవడు?
8. ఈమె తల్లి ఈమె తరపున క్రీస్తుకు మనవిచేయగా అతడు ఈమెకు పట్టిన దయ్యమును వెళ్ళగొట్టెను. ఈమె ఎవరు?
9. యేసూ! నీవు నీ రాజ్యములో ప్రవేశించినపుడు నన్ను జ్ఞాపకముంచుకొనుము అని పల్కిన దెవడు?
10. అవిశ్వాసివికాక విశ్వాసివై యుండుమని క్రీస్తు ఎవరిని మందలించెను?

# 25. క్రీస్తు సామెతలు

ఈ క్రింది వాక్యములు ఏ సామెతల లోనివి?

1. మీరు పనిపాటలులేక దినమంతయు ఇచట నిలచియున్నారేమి?
2. "నా పొరుగువా డెవడు?" అని అడిగిన వేదశాస్త్రి ప్రశ్నకు సమాధానముగా క్రీస్తు చెప్పిన సామెత యేది?
3. ఓరీ అవివేకి! ఈ రాత్రికే నీ ప్రాణములు తీసివేయబడును. అపుడు నీవు కూడబెట్టినది ఎవరికి చెందను?
4. నేను దేవునికి భయపడను, మానవులకు గౌరవింపను.
5. అవి తమకై శ్రమపడుటలేదు, వస్త్రములను సంసిద్ధపరచు కొనుటలేదు - ఏవి?
6. ఇది శత్రువు చేసిన పని - ఏది?
7. రొమ్ము బాదుకొనుచు దేవా ఈ పాపాత్ముని కనికరింపుము అని ప్రార్థించెను - ఎవరు?
8. మన మధ్య దాటుటకు వీలులేని అగాధమున్నది - ఎవరెవరికి మధ్య?
9. నీవు ఉత్తముడవు నమ్మిన బంటువు. స్వల్ప విషయములందు శ్రద్ధవహించితివి. కనుక అనేక విషయములను నీకు అప్పగింతును.
10. హృదయపరివర్తనము అవసరములేని తొంబది తొమ్మిదిమంది నీతిమంతులకంటె, హృదయ పరివర్తనము పొందు ఒక పాపాత్ముని విషయమై పరలోకమున ఎక్కువ ఆనందము కలుగును.

# 26. క్రీస్తు అద్భుతాలు

1. క్రీస్తుని కలసికొనుటకై నీటిమీద నడవబోయిన శిష్యుడెవరు?
2. "ఎప్ఫతా" అనగా నేమి?
3. మిగిలిన తొమ్మిదిమంది యేరీ - ఈ వాక్యము ఏ అద్భుతములోనిది?
4. క్రీస్తు "నా గడియ ఇంకను రాలేదు" అన్నది ఏ యద్భుతమును చేయకముందు?
5. యిస్రాయేలు ప్రజలలోకూడ నేనింతటి విశ్వాసమును చూడలేదు అని క్రీస్తు ఎవరిని గూర్చి పలికెను?
6. ఈయనకు గాలియు సముద్రమును లోపడుచున్నవి కదా? - ఇది యే యద్భుతములోని వాక్యము?
7. బిడ్డల రొట్టెను కుక్కలకు వేయతగదు అని క్రీస్తు ఎవరితో అనెను?
8. క్రీస్తు శపించిన చెట్టు ఏది?

9. నా వద్ద వెండిబంగారములు లేవు అన్నది యెవరు?
10. దేవుని సహకారము లేనియెడల నీవు చేయుచున్న అద్భుతకార్యములను ఎవడును చేయలేడు అని క్రీస్తుతో అన్నది ఎవరు?

## 27. క్రీస్తు శ్రమలు

1. క్రీస్తు దేనిపై నెక్కి యెరూషలేము ప్రవేశించెను?
2. యేసు కానుకల పెట్టెవద్ద కూర్చుండి ఎవరిని మెచ్చుకొనెను?
3. క్రీస్తు కడపటివిందు భుజించిన పిమ్మట ప్రార్థన చేయుటకు ఎక్కడికి పోయెను?
4. యూదా క్రీస్తుని ఎన్ని వెండికాసులకు పట్టియిచ్చెను?
5. సిలువను మోయుటలో క్రీస్తుకి సాయపడిన నరుడెవరు?
6. క్రీస్తు తన్ను సిలువ వేయువారికొరకు ఏమని ప్రార్థించెను?
7. సిలువపై క్రీస్తు దేనిని త్రాగుటకు నిరాకరించెను?
8. క్రీస్తు సిలువపై ఏమి వ్రాసిపెట్టిరి?
9. క్రీస్తు దేహమును ఇప్పింపుమని పిలాతుని అడిగినదెవరు?
10. యేసు భౌతికదేహమును ఎచట పాతిపెట్టిరి?

## 28. మత్తయి సువిశేష వాక్యాలు - 1

ఈ క్రింది వాక్యాలలోని ఖాళీలను పూరింపుడు

1. మానవుడు కేవలము రొట్టెవలననే జీవింపడు. దేవుడు వచించు - - - - జీవించును.
2. హృదయ పరివర్తనము చెందుడు - - - - సమీపించియున్నది.
3. మీరు నన్ను అనుసరింపుడు. నేను మిమ్ము - - - - చేయుదును.
4. కామేచ్ఛతో పరస్త్రీని పరికించు ప్రతివ్యక్తి ఆమెతో - - - - వ్యభిచరించినట్లే.
5. నీ సంపదలున్న చోటనే నీ - - - - ఉండును.
6. ఏ నరుడును ఇద్దరు - - - - సేవింపజాలడు. కనుక నీవు ఎన్నడును దైవమును - - - - సేవింపజాలవు.
7. పరులనుగూర్చి మీరు తీర్పు చేయకుడు. అప్పుడు మిమ్ము గూర్చియు - - - -
8. ఇతరులు మీకేమి చేయవలెనని కోరుకొందురో దానిని మీరు ... ... ... ...
9. నా బోధలు ఆలించి పాటించని ప్రతివాడు ... ... ... ... ఇల్లు కట్టుకొనిన బుద్ధిహీనుని పోలియున్నాడు.
10. మీ తలవెంట్రుకలన్నియు ... ... ... ... కావున భయపడకుడు.

# 29. మత్తయి సువిశేష వాక్యాలు - 2

ఈ క్రింది వాక్యాలలోని ఖాళీలను పూరింపుడు

1. నీవు పేతురువు. ఈ రాతి మీద … … … … నిర్మింతును.
2. నన్ను అనుసరింప గోరువాడు … … … … సిలువను తీసికొని నన్ను అనుసరింపవలెను.
3. మానవుడు లోకమంతటిని సంపాదించినను … … … … వానికి ప్రయోజనమేమి?
4. ఎక్కడ ఇద్దరు ముగ్గురు నాపేరిట … … … …
5. నీ అనుమతి యైనచో నేను నీకు, మోషేకు, ఏలియాకు మూడు … … … … నిర్మింతును.
6. మీరు చిన్నబిడ్డవలె రూపొందిననే తప్ప … … … … ప్రవేశింప జాలరు.
7. దేవుడు జతపరచిన జంటను … … … … వేరు పరుపరాదు.
8. … … … … నా యొద్దకు రానిండు. అట్టి వారిదే పరలోక రాజ్యము.
9. మానవులకు ఇది అసాధ్యము. కాని దేవునికి సమస్తము … … … …
10. భూమి ఆకాశము గతించి పోవునుగాని … … … … గతించిపోవు.

# 30. మత్తయి సువిశేషము 1-7

1. ఇమ్మానువేలు అనగానేమి?
2. క్రీస్తు జన్మించినపుడు యూదయా రాజెవరు?
3. క్రీస్తుకి నజరేయుడు అను పేరు ఎట్లు వచ్చెను?
4. అతడు ఎడారిలో ఎంతకాలముండెను?
5. ఎడారిలో పిశాచ శోధనలు ముగిసిన పిదప క్రీస్తుకి ఎవరు సేవలు చేసిరి?
6. క్రీస్తుకి మొదట ఏ యిద్దరు శిష్యులైరి?
7. నీ శత్రువుని ద్వేషింపుము అని పూర్వవేదము బోధించెను. దీనికి బదులుగా క్రీస్తు బోధించిన దేమిటి?
8. క్రీస్తు శిష్యులకు నేర్పిన ప్రార్థనలో మొదటి మాటలు ఏవి?
9. లిల్లీ పుష్పమువలె సుందరములైన వస్త్రములు తాల్చలేని పూర్వవేద రాజు ఎవరు?
10. నరులు ఇద్దరు యజమానులను సేవింపలేరు. ఆ యిద్దరు ఎవరు?

# 31. మత్తయి సువిశేషము 8 -17

1. నీకు ఇష్టమైనచో నన్ను శుద్ధిని చేయగలవు అని యేసుకి మనవి చేసిన దెవరు?
2. యిస్రాయేలు ప్రజలలోను నేను ఇట్టి విశ్వాసము చూడలేదు అని ప్రభువు ఎవరిని గూర్చి పలికెను?
3. భారముచే అలసి సొలసియున్నవారికి ప్రభువు ఏమి దయచేయును?
4. శిష్యులు పంట పొలములో వెన్నులు త్రుంచి తిన్నది ఏ దినమున?
5. విత్తువాని ఉపమానమును చెప్పినపుడు క్రీస్తు ఎక్కడ ఉండెను?
6. దాచబడిన ధనము ఆణిముత్యము అనునవి దేనికి ఉపమానములు?
7. నీటిపై నడచుచు క్రీస్తు దగ్గరికి రాగోరినది ఎవరు?
8. తబోరు కొండపై క్రీస్తుతో మాటలాడిన ఇద్దరు పూర్వవేద భక్తులు ఎవరు?
9. ఆ కొండపై క్రీస్తుతోనున్న ముగ్గురు శిష్యులు ఎవరు?
10. క్రీస్తు పేత్రు ఇద్దరు దేవాలయపు పన్ను చెల్లించుటకు కావలసిన నాణెము వారికి ఎచట దొరికెను?

# 32. మత్తయి సువిశేషము 18-26

1. క్రీస్తు బోధల ప్రకారము మనము తోడివారిని ఎన్నిసార్లు క్షమింపవలెను?
2. తన యిద్దరు కుమారులకు ఉపకారము చేయమని క్రీస్తుని అడిగిన తల్లి యెవరు?
3. క్రీస్తు బోధల ప్రకారము, ధర్మశాస్త్రములోని రెండు ప్రధానాజ్ఞలు ఏవి?
4. ఇది రాతిపై రాయి నిలువకుండ పడగొట్టబడును అని ప్రభువు దేనినిగూర్చి పలికెను?
5. అవివేకవతులైన కన్నెలు తమ కాగడాలతోపాటు దేనిని తీసికొని పోలేదు?
6. ముగ్గురు సేవకుల సామెతలో మూడవవాడు తాను తీసికొన్న సొమ్మును ఏమి చేసెను?
7. ప్రభువు ఎవరికి చేసినది తనకు చేసినట్లుగా భావించును?
8. "ఈ సువార్త ఎచట బోధించబడునో అచట ఈమె చేసిన కార్యము ప్రశంసింపబడును" - ఆమె చేసిన కార్యము ఏమిటి?
9. క్రీస్తు తన మరణమునకు ముందు శిష్యులతో ఏ పండుగను జరుపగోరెను?
10. గెత్సెమని తోపులో యూదులు క్రీస్తుని బంధించుటకు యూదా ఏమి గురుతు నిచ్చెను?

## 33. మత్తయి సువిశేషము 26 - 28

1. క్రీస్తుని నిరాకరించుచు "ఆ మనుష్యుని నేను ఎరుగను" అని చెప్పిన దెవరు?
2. కోడికూసిన పిమ్మట పేత్రు వెలుపలికివెళ్ళి ఏమి చేసెను?
3. యూదా దేవళములో విసిరికొట్టిన వెండి నాణెములతో ప్రధానార్చకులు ఏమి చేసిరి?
4. క్రీస్తునకు తీర్పు చెప్పినపుడు పిలాతు చేతులు ఏల కడుగుకొనెను?
5. "ఏలీ ఏలీ లామా సబక్తాని" అనగా నేమి?
6. క్రీస్తు చనిపోవునపుడు మధ్యాహ్నము మూడుగంటల పాటు దేశమంతట ఏమి యసాధారణ దృశ్యము కన్పించెను?
7. క్రీస్తు చనిపోయిన పిమ్మట ఏమి చినిగెను?
8. క్రీస్తునిగూర్చి నిశ్చయముగా ఇతడు దేవుని కుమారుడే అని పల్కిన దెవరు?
9. యేసు దేహమును ఇప్పింపుమని పిలాతుని అడిగిన దెవరు?
10. ఉత్థాన క్రీస్తు శిష్యులకు చేసిన చివరి వాగ్దానమేమిటి?

## 34. మార్కు సువిశేషము 1 - 6

1. స్నాపక యోహాను ఏమి దుస్తులు ధరించెను?
2. క్రీస్తు యాకోబు యోహానులను పిల్చినపుడు వారు ఏమి చేయుచుండిరి?
3. నల్గురు పడకపై మోసికొనివచ్చిన పక్షవాత రోగిని క్రీస్తు చెంతకు ఎట్లు తీసికొని రాగల్గిరి?
4. క్రీస్తు సూక్తుల ప్రకారము, ప్రాతగుడ్డకు దేనిని మాసిక వేయరు?
5. క్రీస్తు యాకోబు యోహానులకు "బోయనెర్గెస్" అని పేరు పెట్టెను. ఆ మాటలకు అర్థమేమి?
6. గెరాసీను మండలములోని దయ్యములు క్రీస్తు అనుమతిపై వేనిలో ప్రవేశించెను?
7. "తలితా కుమీ" అనగా నేమి?
8. నీవు స్నాపక యోహాను తలను కోరమని ఎవరు ఎవరికి చెప్పిరి?
9. యేసు ఎన్ని రొట్టెలతోను ఎన్ని చేపలతోను ఐదువేల మందికి ఆహారము పెట్టెను?
10. ఆ యాహారమును జనసమూహము దేనిపై కూర్చుండి భుజించెను?

## 35. మార్కు సువిశేషము 7-16

1. క్రీస్తు శిష్యులు చేతులు కడుగుకొనకయే భోజనము చేయుచున్నారని తప్పుపట్టిన దెవరు?

2. మనుష్యులు చెట్లవలెనుండి, నడచుచున్నట్లు నాకు కన్పించుచున్నారు అని క్రీస్తుతో చెప్పిన దెవరు?
3. నన్నుగూర్చి మీరేమనుకొనుచున్నారు అని క్రీస్తు శిష్యులను అడుగగా పేతురు ఏమి జవాబు చెప్పెను?
4. క్రీస్తు "సైతానూ! ఛీ! పో!" అన్నది యెవరిని?
5. క్రీస్తు ఒక వర్గము వారిని తన యొద్దకు రానివ్వమన్నాడు. దైవరాజ్యము వారిదేనన్నాడు. వారు ఎవరు?
6. క్రీస్తు చూపునిచ్చిన యెరికో గ్రుడ్డివాని పేరేమి?
7. పరిసయులు చక్రవర్తికి పన్ను చెల్లించుట న్యాయమా కాదా అని అడిగినపుడు క్రీస్తు చెప్పిన సమాధానమేమి?
8. కడపటి భోజనము ముగిసిన తరువాత క్రీస్తు ఆవేదన చెందుచు ప్రార్థన చేసిన తావు ఏది?
9. "తండ్రీ! ఈ పాత్రమును నానుండి తొలగింపుము" - ఈ వాక్యములో "పాత్రము" అనగానేమి?
10. క్రీస్తు దేహమునుంచిన సమాధి ద్వారమునకు అడ్డముగా ఏమి దొర్లించిరి?

## 36. లూకా సువిశేషము 1 -7

1. లూకా తన సువిశేషమును ఎవరి కొరకు వ్రాసెను?
2. క్రీస్తు జన్మించినపుడు రోమను చక్రవర్తి ఎవరు?
3. మరియ తాను కనిన క్రీస్తు శిశువును ఎచట పరుండ బెట్టెను?
4. క్రీస్తు పండ్రెండేండ్ల యీడున ఏ పట్టణమును సందర్శించెను?
5. బాలయేసు దేవాలయమున ఎవరికి ప్రశ్నలు వేసెను?
6. స్నాపక యోహాను బోధ ప్రారంభించిన కాలమున రోమను చక్రవర్తి యెవరు?
7. క్రీస్తు విశ్రాంతి దినమున అలవాటు చొప్పున ఎచటికి వెళ్ళెడివాడు?
8. క్రీస్తునకు తన యింట గొప్ప విందు చేసిన శిష్యుడెవరు?
9. కపర్నాములో రోమను శతాధిపతి యూదులకు ఏమి కట్టించెను?
10. జనులు ఒక యువకుని శవమును పాడెపై మోసికొని వచ్చుచు క్రీస్తుకి ఎదురుపడినది ఏ గ్రామమున?

## 37. లూకా సువిశేషము 7-11

1. రానున్నవాడవు నీవేనా అని అడుగుటకు క్రీస్తు నొద్దకు మనుష్యులను పంపిన దెవరు?
2. గెరాసీను మండలములోని నరుని ఆవేశించిన భూతము పేరేమి?
3. చనిపోయినపుడు యాయీరు కొమార్తె వయసెంత?
4. ఆకాశమునుండి అగ్నిని రప్పించి సమరయుల గ్రామమును నాశము చేయగోరిన శిష్యులెవరు?
5. నాగటిమీద చేయిపెట్టి వెనుకకు చూచువాడు దేనికి అయోగ్యుడు?
6. నీ పేరిట పిశాచములు కూడ మాకు లోపబడుచున్నవి అని క్రీస్తుతో చెప్పిన దెవరు?
7. క్రీస్తు ఎవరిని ఆకాశమునుండి మెరుపువలె పడుచుండగా చూచెను?
8. క్రీస్తు పాదములవద్ద కూర్చుండి అతని బోధలు విన్న భక్తురాలు ఎవరు?
9. శిష్యులు ప్రార్థన నేర్పమని అడుగగా క్రీస్తు వారికి ఏ జపము నేర్పించెను?
10. అర్ధరాత్రిలో వచ్చినవాడు తన మిత్రుని ఎన్నిరొట్టెలు బదులీయమని కోరెను?

## 38. లూకా సువిశేషము 11-15

1. మంచి సమరయుని కథలో దొంగలకు చిక్కినవాడు ఏ నగరమునుండి ఏ నగరమునకు ప్రయాణము చేయుచుండెను?
2. గాయపడి త్రోవ ప్రక్కన పడియున్న వానిని పట్టించుకొనకుండ వెళ్ళిపోయిన యిద్దరు ఎవరు?
3. క్రీస్తు బోధల ప్రకారము, నరులు ఏ పక్షులకంటె శ్రేష్ఠులు?
4. "అవి విత్తనములు నాటవు. నూర్పిళ్ళు చేయవు. ధాన్యము నిలువజేయవు" - అవి ఏవి?
5. క్రీస్తు ఈమెను తాకగా ఈమె తిన్నగా నిలబడి దేవుని స్తుతించెను. ఈమె ఎవరు?
6. క్రీస్తు పరలోక రాజ్యమును ఏ చెట్టుతో పోల్చెను?
7. కోడి తన పిల్లలనువలె నేను నీ బిడ్డలను కాపాడగోరితిని అని క్రీస్తు ఏ పట్టణముతో చెప్పెను?
8. ప్రభువు నూరుగొర్రెల సామెత చెప్పెను. వానిలో తప్పిపోయినవి ఎన్ని?
9. అతడు చెప్పిన ఇంకొక సామెతలో, ఒక స్త్రీ ఒక వస్తువును పోగొట్టుకొని దానికై యింటిలో వెదకెను. ఆ వస్తువు ఏమిటి?
10. "మరణించిన ఈ నా కుమారుడు మరల బ్రతికెను" - ఆ కుమారుడు ఎవరు?

## 39. లూకా సువిశేషము 16-24

1. "కుక్కలు వాని వ్రణములను నాకుచుండెను" ఎవరి వ్రణములు?
2. వ్యాధి నయమయిన పదిమంది కుష్ఠరోగులతో తిరిగి వచ్చి ప్రభువుకి వందనములు చెప్పినవాడు ఏ జాతి వాడు?
3. ప్రార్థన చేయుటకై ఇద్దరు దేవాలయమునకు వెళ్లిరి. ఆ యిద్దరు ఎవరు?
4. తల్లులు పసిబిడ్డలను క్రీస్తు దగ్గరికి తీసికొని రాబోగా ఎవరు అడ్డు వచ్చిరి?
5. క్రీస్తు నీ యాస్తినమ్మి పేదలకు దానము చేయమనగా బాధపడి వెళ్ళి పోయినవా డెవడు?
6. జక్కయ వృత్తి యేమిటి?
7. యేసు గమనించుచుండిన పేద వితంతువు కానుకల పెట్టెలో ఎంత సొమ్ము వేసెను?
8. సిలువపైనున్న క్రీస్తుకు సైనికులు ఏమి త్రాగనిచ్చిరి?
9. ఎమ్మావునకు వెళ్ళిన యిద్దరు శిష్యులలో ఒకని పేరేమి?
10. ఉత్థానక్రీస్తు ఏ నగరము సమీపమున మోక్షారోహణము చేసెను?

## 40. యోహాను సువిశేషము 1-6

1. యోహాను సువిశేషములో మొదటివాక్య మేది?
2. క్రీస్తు పాదరక్షల వారును విప్పుటకైనను యోగ్యుడను కానని చెప్పిన దెవరు?
3. క్రీస్తు ఏ శిష్యుని అంజూరపు చెట్టుక్రింద నుండగా చూచెను?
4. మరల జన్మించిననేతప్ప నరుడు దేవుని రాజ్యమును చూడజాలడని క్రీస్తు ఎవరితో చెప్పెను?
5. యాకోబు బావి ఏ పట్టణమువద్ద నున్నది?
6. క్రీస్తు ఒక స్త్రీతో మాటలాడుటనుచూచి ఆశ్చర్యపడిన దెవరు?
7. మొదట తనలోనికి దిగినవాని వ్యాధిని నయము చేయు కోనేరు పేరేమిటి?
8. క్రీస్తు ఎన్ని రొట్టెలు ఎన్ని చేపలు తీసికొని ఐదువేల మందికి ఆహారము పెట్టెను?
9. పితరులు ఎడారిలో దేనిని భుజించిరి?
10. "మేము ఎవరియొద్దకు పోయెదము? నీవు నిత్యజీవపు మాటలు కలవాడవు" అని క్రీస్తుతో చెప్పినదెవరు?

# 41. యోహాను సువిశేషము 7-12

1. ఆయనవలె ఎవడును ఎన్నడును మాటాడలేదు అని క్రీస్తుని గూర్చి పల్కిన దెవరు?
2. "నేనును నీకు శిక్ష విధింపను. వెళ్లుము. ఇక పాపము చేయకుము" అని క్రీస్తు ఎవరితో పలికెను?
3. క్రీస్తు దినమునుచూచి సంతోషించిన పితరుడు ఎవరు?
4. యేసు పుట్టు గ్రుడ్డివానికి చూపు నిచ్చుటకు వాని కన్నులమీద ఏమి రాచెను?
5. తోడేలు వచ్చుట చూచి గొర్రెలమందను విడచి పారిపోవువా డెవడు?
6. మరియా మార్తల యూరు ఏది?
7. "నేను పునరుత్థానమును జీవమును" అని క్రీస్తు ఎవరితో నుడివెను?
8. యేసు ఎవరికొరకు కంట తడిపెట్టెను?
9. యెరూషలేము ప్రవేశించిన క్రీస్తును ప్రజలు ఏమి మట్టలతో ఆహ్వానించిరి?
10. క్రీస్తు భూమినుండి పైకి ఎత్తబడినపుడు యేమి చేయును?

# 42. యోహాను సువిశేషము 13-21

1. క్రీస్తు నడుమునకు తుండుగుడ్డ కట్టుకొని పళ్ళెములో నీళ్ళుపోసి ఏమి చేసెను?
2. కడపటి విందులో క్రీస్తునుండి రొట్టెముక్కను స్వీకరించినంతనే యూదా లోనికి ఎవరు ప్రవేశించిరి?
3. మాకు తండ్రిని చూపింపుము అని క్రీస్తుని అడిగిన దెవరు?
4. "నేను వెళ్ళినచో ఆయనను మీ యొద్దకు పంపుదును". ఎవరిని పంపును?
5. క్రీస్తుకు చెందిన ఏ వస్తువు కొరకు సైనికులు అదృష్టపు చీట్లు వేసికొనిరి?
6. సైనికుడు క్రీస్తు ప్రక్కను బల్లెముతో పొడువగా ఏమి స్రవించెను?
7. క్రీస్తు ఉత్థానాంతరము మొదట ఖాళీ సమాధిలోనికి ప్రవేశించిన దెవరు?
8. ఉత్థాన క్రీస్తునిచూచి తోటమాలియని భ్రమపడిన దెవరు?
9. చూడక నన్ను విశ్వసించువారు ధన్యులు అని క్రీస్తు ఎవరితో చెప్పెను?
10. ఉత్థానానంతరము క్రీస్తు పేతురుని మూడుసార్లు అడిగిన ప్రశ్న యేది?

# 43. అపోస్తలుల చర్యలు 1-4

1. ఉత్థాన కీస్తు ఎన్నాళ్ళపాటు శిష్యులకు కనిపించుచు వచ్చెను?
2. శిష్యులు ఎవరినుండి జ్ఞానస్నానము పొందుదురు?

3. క్రీస్తు పరలోకమునకు కొనిపోబడినపుడు అతనిని ఏమి కమ్మివేసెను?
4. క్రీస్తు మోక్షారోహణము చేసిన పిదప శిష్యుల సంఖ్య ఎంత?
5. మత్తీయతోపాటు అపోస్తలుల పదవికి పోటీ చేసిన దెవరు?
6. ఏ పండుగ దినమున ఆత్మ అపోస్తలుల మీదికి దిగి వచ్చెను?
7. అంత్య దినములలో నరులందరిమీద నా యాత్మను కుమ్మరించెదనని ప్రవచించిన పూర్వవేద ప్రవక్తయెవరు?
8. దేవాలయములోని ఏ ద్వారమువద్ద పేత్రు కుంటివానికి నడచెడు శక్తినిచ్చెను?
9. విచారణ సభ పెట్టెడి కష్టములలో అపోస్తలులు ధైర్యము కొరకు ప్రార్థింపగా, వారున్న స్థలమునకు ఏమి జరిగెను?
10. బర్నబా అను పేరునకు అర్థమేమి?

# 44. అపోస్తలుల చర్యలు 5-8

1. అననీయా సఫీరాల నేరమేమిటి?
2. ప్రధానార్చకులు చెరలో పెట్టించిన అపోస్తలులను ఎవరు విడిపించిరి?
3. అపోస్తలులను చెరనుండి వదిలివేయుడని సలహా యిచ్చిన ధర్మశాస్త్ర బోధకుడు ఎవరు?
4. విచారణ సభవారు కొరడాలతో కొట్టింపగా అపోస్తలులు ఎందుకు సంతసించిరి?
5. యెరూషలేములోని క్రైస్తవులకు సేవలు చేయుటకు ఎందరు పరిచారకులను నియమించిరి?
6. శత్రువులు స్తెఫనుని న్యాయసభ అధికారుల యెదుటికి తీసికొనిరాగా అతని ముఖము దేనివలె కన్పించెను?
7. స్తెఫనుని ఏ రీతిగా చంపిరి?
8. స్తెఫనుని చంపినవారు తమ వస్త్రములను ఎవరివద్ద ఉంచిరి?
9. అతడు చనిపోవుచు శత్రువుల కొరకు ఏమని ప్రార్థించెను?
10. స్తెఫను మరణానంతరము క్రైస్తవ సంఘము ఏమి విపత్తుల పాలయ్యెను?

# 45. అపోస్తలుల చర్యలు 8 -9

1. ఫిలిప్పు ఏ నగరమున సువార్తను బోధించి అద్భుతములు చేసెను?
2. నీవు నీ డబ్బుతోపాటు నాశమగుదువుగాక అని పేత్రు ఎవరిని తిట్టెను?
3. ఫిలిప్పు ఏ మార్గమందు యితియోపీయుని కలిసికొనెను?
4. ఇతియోపీయుడు ఏ ప్రవక్త గ్రంథమును చదువుచుండెను?

5. గొర్రెపిల్లవలె వధ్యస్థానమును కొనిపోబడినది ఎవరు?
6. ఏ నగరము సమీపమున ఉత్థాన క్రీస్తు పౌలునకు దర్శనమిచ్చెను?
7. పౌలు దమస్కు పట్టణమున ఏ వీధిలో వసించెను?
8. పౌలునకు జ్ఞానస్నాన మిచ్చినది ఎవరు?
9. పౌలు శిష్యులు పౌలుని దమస్కునుండి ఎట్లు బయటికి పంపిరి?
10. యెరూషలేమున పౌలును అపోస్తలులకు పరిచయము చేసినది ఎవరు?

## 46. యెరూషలేము క్రైస్తవ సమాజము అ.చ. 1-8

1. యూదాకు బదులుగా 12వ అపోస్తలుడుగా ఎన్నికైన శిష్యుడు ఎవరు?
2. ఆత్మ దిగిరాకముందు యెరూషలేమున క్రీస్తు శిష్యులు ఎంతమంది యుండిరి?
3. ఆత్మ దిగివచ్చి పేత్రు ప్రసంగము చేసిన పిదప యెరూషలేమున ఎంతమంది జ్ఞానస్నానము పొందిరి?
4. దేవాలయమున "అందమయినది" అనుద్వారము నొద్ద పేత్రు ఏమి యద్భుతము చేసెను?
5. యూదులు విచారణసభ అపోస్తలులను చంపగోరగా వారిని చంపవలదని సలహా యిచ్చిన పరిసయుడు ఎవరు?
6. మొట్టమొదటి వేదసాక్షిగా మరణించిన దెవరు?
7. స్తెఫనుని రాళ్ళతో కొట్టినవారు తమ వస్త్రములను ఎవరివద్ద ఉంచిపోయిరి?
8. గాజామార్గమందు ఫిలిప్పు ఎవరికి జ్ఞానస్నానమిచ్చెను?
9. యెరూషలేమున అపోస్తలులు ఉమ్మడి జీవితము గడుపుచుండగా తన ఆస్తినమ్మి, వచ్చిన పైకమును అపోస్తలులకు ఇచ్చిన దెవరు?
10. పేత్రు యెదుట బొంకి ప్రాణములు కోల్పోయిన భార్యాభర్తలు ఎవరు?

## 47. క్రీస్తు శిష్యులు

ఈ క్రిందివారు ఎవరు?

1. క్రీస్తు ఇతనితో "నీవు రాయివి. ఈ రాతిమీద నా సంఘమును నిర్మించెదను" అని చెప్పెను.
2. ఇతడు క్రీస్తుతో "ఇక్కడ ఒక బాలునివద్ద ఐదు యవధాన్యపు రొట్టెలు, రెండు చేపలు కలవు" అని పల్కెను.
3. పాస్క భోజనమును సిద్ధము చేయుటకు ప్రభువు పేత్రుతోపాటు ఇతనినికూడా పంపెను.
4. హెరోదు ఈ భక్తుని కత్తితో చంపించెను.

5. క్రీస్తు ఇతనిని సుంకపు మెట్టునుండి పిలచెను.
6. ఇతనికి దిదీము అను రెండవ నామము కలదు.
7. క్రీస్తు ఇతనితో "నన్ను చూచినవాడు నా తండ్రిని చూచినట్లే" అని చెప్పెను.
8. యూదాకు బదులుగా ఇతడు పండ్రెండవ శిష్యుడు అయ్యెను.
9. ఇతడు అన్యజాతి జనులకు అపోస్తులుడు.
10. క్రీస్తుకు పండ్రెండు మంది శిష్యులతోపాటు వేరొక శిష్యవర్గముకూడ కలదు. వీరు ఎంతమంది?

## 48. పేత్రు జీవితము

1. పేత్రు అన్న పేరేమి?
2. పేత్రు సొంత పేరేమి? అతనికి క్రీస్తు పెట్టిన పేరేమి?
3. క్రీస్తు వ్యాధినయము చేసిన పేత్రు బంధువు ఎవరు?
4. పేత్రు దేనిమీద నడవబోయి విఫలుడయ్యెను?
5. నేనెవరినని మీరు భావించుచున్నారు అని యేసు అడగగా, పేత్రు చెప్పిన జవాబు ఏది?
6. పేత్రు కొండమీద క్రీస్తు మోషే యేలీయాలకు ఏమి నిర్మింప గోరెను?
7. గెత్సెమని తోపులో అతడు ఎవరి చెవిని తెగనరికెను?
8. పేత్రు బొంకుకు ఒక పక్షికి సంబంధమున్నది. ఆ పక్షి యేది?
9. నా వద్ద వెండిబంగారములు లేవు అని అతడు ఎవరితో అమెను?
10. అతడు క్రీస్తుని బోధించిన రోమను సైన్యాధిపతి పేరేమి?

## 49. పౌలు వాక్యాలు

ఈ క్రింది వాక్యాలలోని ఖాళీలను పూరింపుడు.

1. మనము పాపాత్ములమై యున్నపుడు క్రీస్తు మన కొరకు ... ... ... ...
2. ప్రభువు నామమున ప్రార్థించు ప్రతి వ్యక్తియు ... ... ... ...
3. ప్రభువు వచ్చువరకు మీరు ఆయన ... ... ... ... ప్రకటింతురు.
4. సువార్తను బోధింపకున్నచో నా పరిస్థితి ఎంతో ... ... ... ...
5. ఎవడైనను క్రీస్తునందున్న యెడల అతడు నూత్న సృష్టియగును. ప్రాతజీవితము గతించినది ... ... ... ... ప్రారంభమైనది.

6. నా కృప నీకు చాలును. బలహీనతయందు నా ... ... ... ... పరిపూర్ణమగుచున్నది.
7. నేను ఎప్పుడు బలహీనుడనో అప్పుడే ... ... ... ...
8. ఇక జీవించునది నేను కాదు ... ... ... ... నా యందు జీవించుచున్నాడు.
9. శరీరము కోరునది ... ... ... ... కోరుదానికి విరుద్ధముగా నుండును. ఆత్మ కోరునది ... ... ... ... కోరుదానికి విరుద్ధముగా నుండును.
10. సూర్యుడు అస్తమించులోగా మీ ... ... ... ... చల్లారిపోవలెను.

## జవాబులు

### 1వ పోటీ

1. కయీను - ఆది 4,8
2. షేతు - 4,25
3. హనోకు - 5,24
4. నోవా - 6,14
5. ఏదెను - 2,8
6. బాబెలు - 11,9
7. వరదగుడి - 9, 13-15
8. మెతూషెలా - 5,27
9. నిమ్రోదు - 10,9
10. నోవా - 9,20

### 2వ పోటీ

1. ఊరు - ఆది 11, 28
2. తెరా - 11, 27
3. సారయి - 11, 29
4. హాగారు - 16,1
5. ఇష్మాయేలు - 16,11
6. ఈసాకు - 21,5
7. మక్పేలా - 23, 17-20
8. రిబ్కా - 24, 64
9. ఏసావు, యాకోబు - 25, 25-26
10. కతూరా - 25,1

## 3వ పోటీ

1. బెన్యామీను - ఆది 42, 13
2. పొడుగు చేతుల నిలువుటంగీ - 37, 3
3. అతని తల్లిదండ్రులనూ సోదరులనూ - 37, 9-10
4. 20 వెండికాసులు - 37,28
5. పానీయవాహకుడు, వంటవాడు - 40, 1-4
6. ఈజిప్టుకు సర్వాధికారి -41, 41
7. ఆస్నతు - 41, 45
8. మనష్షే, ఎఫ్రాయీము - 41, 51-52
9. బెన్యామీను - 44,2
10. గోషెను - 47, 6

## 4వ పోటీ

1. ఫరో కొమార్తె - నిర్గ 2, 5-6
2. ఐగుప్తీయుని చంపినందున - 2, 12-15
3. సిప్పోరా - 2,21
4. యిత్రో - 3,1
5. మండుచున్న పొద - 3, 2-5
6. పది
7. అగ్ని స్తంభము, మేఘస్తంభము - 13, 21
8. పదియాజ్ఞలు
9. పాస్క - 12, 14
10. నెబో - ద్వితీ 34, 1

## 5వ పోటీ

1. యీషాయి - 1 సమూ 16,11
2. బేత్లెహేము - 16, 11
3. సమూవేలు - 16,13
4. ఒడిసెల రాతితో - 17, 49
5. యోనాతాను - 18, 1
6. అదుల్లాము - 22,1

7. బత్షెబా - 2సమూ 11,27
8. నాతాను - 2సమూ 12,1
9. అబ్షాలోము - 15,1-6
10. సొలోమోను

## 6వ పోటి

1. హగ్గయి - 2,4
2. దానియేలు - 6,16
3. యెహెజ్కేలు - 37
4. మీకాయా - 1 రాజు 22,14
5. ఆమోసు - 1,1
6. మోషే - నిర్గ 33, 11
7. యెషయా - 6,8
8. హోషేయ - 1,3
9. యిర్మీయా - 38,6
10. అగబు - అచ 21, 10-11

## 7వ పోటీ

1. మెల్కీ సెదెకు - ఆది 14, 18
2. సౌలు
3. సొలోమోను - 1రాజు 3, 9
4. హీరాము - 1రాజు 5,10
5. షెబా రాణి - 1రాజు 10,10
6. హిజ్కియా - యెష 38,5
7. ఉజ్జీయా - 2 రాజుల దినచర్య 26, 19
8. సిద్కియా
9. నెబుకద్నెసరు - దానియేలు 3
10. కోరెషు - ఎజ్రా 1, 1-4

## 8వ పోటీ

1. రిబ్కా - ఆది 27, 6-10
2. రూతు - 1, 22

3. ఎస్తేరు - 2, 18
4. మిర్యాము - నిర్గ 15, 20
5. హన్నా - సమూ 1, 28
6. లోతు భార్య - ఆది 19,26
7. యూదితు
8. ఎండోరు మంత్రగత్తె - 1సమూ 28,7
9. యాయేలు - న్యాయాధి 4,21
10. యోబు భార్య - 2,8

## 9వ పోటీ

1. అన్నా - లూకా 2, 38
2. మరియ, మార్త - యోహా 11,5
3. మరియ మగ్దలీన - లూకా 8, 2
4. యాయీరు కొమార్తె - లూకా 8, 41-42
5. సఫీర - అచ 5
6. సమరయ స్త్రీ - యోహా 4, 5-7
7. రోడా - అచ 12, 12,13
8. పిలాతు భార్య - మత్త 27, 19
9. హెరోదియా కొమార్తె - మత్త 14, 8
10. పేత్రు అత్త - మత్త 8, 14

## 10వ పోటీ

1. తప్పిపోయిన కుమారుడు - లూకా 15, 13
2. హెరోదుకి - లూకా 13, 32
3. అననీయ - అచ 5,5
4. యాకోబు - ఆది 25
5. దెలీల - న్యాయాధి 16, 19
6. హామాను - ఎస్తేరు 7, 10
7. అహాబు - 1 రాజు 21, 16
8. యెసెబెలు - 2రాజు 9, 36
9. కయిఫా - యోహా 11, 50
10. దెమేత్రి - అచ 19,24

## 11వ పోటీ

1. నజరేత్తు - లూకా 4, 29
2. ఆతెన్సు - అచ 17, 23
3. సొదొమ,గొమఱ్రా - ఆది 18
4. యెరూషలేము - 2సమూ 5,6
5. నీనివే - యోనా 3
6. అంతియోకయ - అచ 11,26
7. తార్సు - అచ 22,3
8. దమస్కు - అచ 9,3
9. నయీను - లూకా 7,11
10. ఎమ్మావు - లూకా 24, 13

## 12వ పోటీ

1. హోరేబు - నిర్గ 3,1
2. నెబో - ద్వితీ 34, 1
3. కర్మెలు - 1రాజు 18,38
4. హోరేబు - 1 రాజు 19,8
5. గెరిజం - యోహా 4,20
6. అరారతు - ఆది 8,4
7. మోరీయా - ఆది 22,2
8. తబోరు - లూకా 9, 28
9. గొల్గొత - యోహా 19, 17
10. ఒలీవ కొండ - అచ 1, 12

## 13వ పోటీ

1. గొఱ్రెపిల్ల - యోహా 1, 29
2. పొట్టేలు - ఆది 22, 13
3. తిమింగిలము - మత్త 12, 40
4. గాడిద - సంఖ్యా 22, 30
5. సింహము - న్యాయాధి 14, 5-6
6. ఆవులు - ఆది 41, 18-19

7. మేక - లేవీ 16, 22
8. ఒంటె - ఆది 24, 64
9. కుక్కలు - లూకా 16, 21
10. నక్క - లూకా 13, 32

## 14వ పోటీ

1. ప్రార్థనా మందిరము - లూకా 7,5
2. దేవాలయము - 1 రాజు 6, 1
3. సత్రము - లూకా 2, 7
4. బురుజు - లూకా 13, 4
5. కొట్లు - లూకా 12, 18
6. ప్రార్థనా మందిరము - లూకా 4, 16
7. గోపురము - లూకా 14, 28
8. సుంకపు మెట్టు - మత్త 9, 9
9. ఇల్లు - మత్త 7, 26
10. సున్నము కొట్టిన సమాధులు - మత్త 23, 27

## 15వ పోటీ

1. కాల్చిన చేప - లూకా 24, 42
2. తేనె - న్యాయాధి 14,8
3. రొట్టె, మాంసము - 1రాజు 17,6
4. పిండివంటలు - ఆది 40, 17
5. పాలు - ఆది 18,8
6. పులుసు - ఆది 25, 34
7. జింకమాంసము - ఆది 27,3
8. ద్రాక్షపండ్లు - సంఖ్యా 13, 23
9. పూరేడు పిట్టలు - సంఖ్యా 11, 31
10. గొర్రెపిల్ల - నిర్గ 12, 3

## 16వ పోటీ

1. వ్యవసాయము - ఆది 9, 20
2. వేటగాడు - ఆది 25, 27
3. గొర్రెల కాపరులు - ఆది 47, 3

4. ఇండ్లు కట్టుపని - నిర్గ 1, 14
5. బెస్తలు - మత్త 4, 18
6. సైనికులు - మార్కు 15, 24
7. చర్మకారుడు - అచ 10, 5 -6
8. సుంకరి - లూకా 19, 2
9. వైద్యుడు - 9, 12
10. గుడారములు తయారుచేయుపని - అచ 18, 3

## 17వ పోటీ

1. యిష్మాయేలు - ఆది 21, 15
2. యోసేపు - ఆది 35, 5-11
3. బెన్యామీను - ఆది 35, 16-18
4. మోషే - నిర్గ 2, 8-9
5. సమూవేలు -1 సమూ 2, 19
6. దావీదు - 1సమూ 16,13
7. యిస్రాయేలు బాలిక - 2 రాజు 5, 2-3
8. స్నాపక యోహాను - లూకా 1, 20
9. బాలయేసు - లూకా 2, 41-42
10. యాయీరు కొమార్తె - లూకా 8, 54-55

## 18వ పోటీ

1. ఆదాము, ఏవ - ఆది 3, 5-6
2. నోవా - ఆది 9, 13
3. దానియేలు - దాని 6,16
4. మోషే - నిర్గ 3, 1-2
5. యోనా - 1, 17
6. ఏలీయా - 2రాజు 2, 11
7. గొల్యాతు - 1సమూ 17, 49
8. ఈసాకు - ఆది 22,10
9. పేత్రు - మత్త 26, 75
10. జక్కయ - లూకా 19, 4

# 19వ పోటీ

1. దేవుడు అబ్రాహామునకు - ఆది 12,2
2. దేవుడు భక్తులకు - యెష 40, 31
3. దేవుడు భక్తులకు - కీర్త 91, 16
4. క్రీస్తు పౌలుకు - 2 కొరి 12, 9
5. దేవుడు సొలోమోనుకు - 2రాజు 3,12
6. దేవుడు జకర్యాకు - జెకర్యా 8,5
7. క్రీస్తు తనశిష్యులకు - మత్త 28, 20
8. క్రీస్తు పేత్రుకు - మత్త 16, 18
9. క్రీస్తు తన శిష్యులకు - మత్త 18, 20
10. క్రీస్తు మంచి దొంగకు - లూకా 23, 43

# 20వ పోటీ

1. సంఖ్యాకాండ
2. ఆదికాండ
3. ఎస్తేరు
4. పరమ గీతము
5. యోవేలు
6. యోనా
7. కీర్తనలు
8. రూతు
9. లూకా సువిశేషము
10. మత్తయి సువిశేషము

# 21వ పోటీ

1. ఆదాము - 2, 20
2. పావురము ఒలీవ ఆకుతో తిరిగి వచ్చినందున - 8, 11
3. అబ్రాహాముకి - 13, 16
4. అబ్రాహాము - 18, 23
5. యిస్రాయేలు - 32, 28
6. యోసేపు - 37, 3

7. ఫరో - 41, 4
8. జఫనత్ పానెయా - 41, 45
9. రాహేలు - 46, 19
10. ఆస్నతు - 41, 45

## 22వ పోటీ

1. నైలు
2. ఫరో కొమార్తె - నిర్గ 2, 10
3. మండుచున్న పొద - 3,3
4. తన తొలిచూలి కుమారుని చావుని చూచి - 12, 29-31
5. రెల్లు సముద్రము - 13, 18
6. పాస్క గొర్రెపిల్లను - 12, 11
7. మస్సా, మెరీబా - 17,7
8. అహరోను - 32, 4
9. కుష్ఠ - సంఖ్యా 12, 10
10. మన్నా, పూరేడు పిట్టలు - నిర్గ 16, 13-15

## 23వ పోటీ

1. మీకా - మత్త 2, 6. మీకా 5, 2
2. అగస్తు సీసరు - లూకా 2, 1
3. పశువుల తొట్టిలో - లూకా 2, 7
4. గొర్రెల కాపరులు - లూకా 2, 15-16
5. నరులను పాపమునుండి రక్షించువాడు - మత్త 1, 21
6. సిమియోను - లూకా 2, 29
7. అన్నా - 2, 38
8. చుక్కను చూచి - మత్త 2,2
9. బంగారము, సాంబ్రాణి, పరిమళ ద్రవ్యము - మత్త 2, 11
10. ఈజిప్టుకు - మత్త 2, 13

## 24వ పోటీ

1. పేత్రు అత్త - మత్త 8, 14
2. శిష్యులు - మత్త 8, 23
3. పక్షవాత రోగి - మార్కు 2,3

4. రక్తస్రావ రోగి - మత్త 9, 20
5. మత్తయి 9,9
6. బర్తిమయి - మార్కు 10, 46
7. జక్కయ - లూకా19, 4
8. కననీయ స్త్రీ కొమార్తె - మత్త 15, 22
9. మంచిదొంగ - లూకా 23, 42
10. తోమా - యోహా 20, 27

## 25వ పోటీ

1. ద్రాక్షతోట కూలీల సామెత - మత్త 20, 6
2. మంచి సమరయుని సామెత - లూకా 10, 29
3. అవివేకియైన ధనికుని ఉపమానము - లూకా 12, 20
4. అన్యాయపు న్యాయాధిపతి - లూకా 18, 4
5. లిల్లీ పుష్పములు - మత్త 6, 28
6. గోదుమ చేనిలో కలుపుగింజలు చల్లుట - మత్త 13, 28
7. సుంకరి - లూకా 18, 13
8. అబ్రాహాము లాజరులకును ధనికునికి మధ్య - లూకా 16, 26
9. ముగ్గురు సేవకుల కథ - మత్త 25, 21
10. తప్పిపోయిన గొర్రె సామెత - లూకా 15, 7

## 26వ పోటీ

1. పేత్రు - మత్త 14, 28
2. తెరువబడుము - మార్కు 7, 34
3. పదిమంది కుష్ఠరోగులు - లూకా 17, 17
4. కానావూరి వివాహము - యోహా 2, 4
5. కఫర్నాము శతాధిపతిని గూర్చి - మత్త 8, 10
6. తుఫానును అణచుట - మత్త 8, 27
7. కననీయ స్త్రీతో - మత్త 15, 26
8. అంజూరము - మార్కు 11, 13
9. పేత్రు - అచ 3,6
10. నికొదేము - యోహా 3, 2

## 27వ పోటీ

1. గాడిదపై - మత్త 21, 5
2. పేద విధవను - మార్కు 12, 41-42
3. గెత్సెమని తోపునకు - మార్కు 14, 32
4. ముప్పది - మత్త 26, 15
5. కురేనియా సీమోను - మార్కు 15, 21
6. తండ్రీ! వీరు చేయునదేమో వీరెరుగరు. వీరిని క్షమింపుము - లూకా 23, 34
7. చేదు కలిపిన ద్రాక్షరసము - మార్కు 15, 23
8. ఇతడు యూదుల రాజగు యేసు - మత్త 27, 37
9. అరిమతయియ యోసేపు - లూకా 23, 52
10. యోసేపు తన కొరకు తొలిపించుకొనిన సమాధిలో - మత్త 27, 60

## 28వ పోటీ

1. ప్రతి వాక్కువలన - మత్త 4,4
2. పరలోకరాజ్యము - 4, 17
3. మనుష్యులను పట్టువారినిగా - 4,19
4. మనస్సున - 5, 28
5. హృదయమును - 6, 21
6. యజమానులను - ద్రవ్యమును 6, 24
7. తీర్పు చేయబడదు - 7, 1
8. ఇతరులకు చేయుడు - 7, 12
9. ఇసుకపై - 7, 26
10. లెక్కింపబడియే యున్నవి - 10, 30

## 29వ పోటీ

1 నా సంఘమును - మత్త 16, 18
2. తన్ను తాను త్యజించుకొని - 16, 24
3. తన ఆత్మను కోల్పోయినచో - 16, 26
4. కూడుదురో - 18, 20
5. శిబిరములు - 17, 4
6. పరలోక రాజ్యము - 18, 3

7. మానవమాత్రుడు - 19, 6
8. చిన్నబిడ్డలను - 19, 14
9. సాధ్యమే - 19, 26
10. నా మాటలు - 24, 35

## 30వ పోటీ

1. దేవుడు మనతో ఉన్నాడు - మత్త 1, 23
2. హెరోదు - 2,1
3. అతడు నజరేతు నగరమున వసించుటచే - 2, 23
4. 40 రోజులు - 4,2
5. దేవదూతలు - 4, 11
6. పేత్రు, అంద్రెయా 4, 18
7. నీ శత్రువుని ప్రేమింపుము - 5, 43-44
8. పరలోకమందున్న మా తండ్రీ - 6, 9
9. సొలోమోను - 6, 29
10. దేవుడు, ద్రవ్యము - 6, 24

## 31వ పోటీ

1. కుష్ఠరోగి - 8,2
2. కఫర్నాము శతాధిపతి - మత్త 8, 10
3. విశ్రాంతి - 11, 28
4. విశ్రాంతి దినమున - 12, 1
5. గలిలయ సరస్సులోని పడవలో 13, 1-2
6. పరలోక రాజ్యమునకు - 12, 44-45
7. పేత్రు - 14, 29
8. మోషే, యేలీయా - 17, 3
9. పేత్రు, యాకోబు, యోహాను - 17, 1
10. చేప నోటిలో - 17, 27

## 32వ పోటీ

1. ఏడు దెబ్బది పర్యాయాలు - మత్త 18, 22
2. యాకోబు యోహానుల తల్లి - 20, 20

3. దైవప్రేమ, సోదరప్రేమ - 22, 37-39
4. యెరూషలేము దేవాలయము - 24, 2
5. నూనె - 25, 3
6. భూమిలో దాచెను - 25, 25
7. తన సోదరులకు చేసినది - 25, 40
8. పరిమళ ద్రవ్యముతో క్రీస్తు శిరస్సును అభిషేకించెను - 26, 12
9. పాస్క పండుగ - 26, 18
10. ముద్దుపెట్టుకొనుట - 26, 48

## 33వ పోటీ

1. పేతురు - 26, 74
2. వెక్కివెక్కి యేడ్చెను - మత్త 26, 75
3. కుమ్మరివాని పొలము - 27,7
4. క్రీస్తు మరణమునకు తాను బాధ్యుడను కానని తెలియజేయుటకు - 27, 24
5. నాదేవా నాదేవా నన్నేల విడనాడితివి? - 27, 46
6. చీకట్లు కమ్మెను - 27, 45
7. దేవాలయపు తెర 27, 51
8. శతాధిపతి, సైనికులు - 27, 54
9. అరిమత్తయియ యోసేపు 27, 57
10. లోకాంతము వరకు నేను మీతో వుందును - 28, 20

## 34వ పోటీ

1. ఒంటె రోమముల వస్త్రము, తోలుపట్టీ - మార్కు 1, 6
2. పడవలో వలలు బాగుచేసికొనుచుండిరి - 1, 19
3. ఇంటికప్పును ఊడదీసి పడకను క్రిందికి దింపిరి - 2, 4
4. క్రొత్త గుడ్డను - 2, 21
5. ఉరిమెడివారు - 3, 17
6. పందులలో - 5, 13
7. ఓ బాలికా లెమ్ము - 5, 41
8. హెరోదియా తన కూతురికి - 6, 24
9. ఐదు రొట్టెలు, రెండు చేపలు - 6, 41
10. పచ్చికపై - 6, 39

## 35వ పోటీ

1. పరిసయులు - 7, 2
2. బెత్సయిదా గ్రుడ్డివాడు - 8, 24
3. నీవు క్రీస్తువు - 8, 29
4. పేతురుని - 8, 33
5. చిన్నబిడ్డలు - 10, 14
6. బర్తిమయి - 10, 46
7. కైసరువి కైసరుకి, దేవునివి దేవునికి చెల్లింపుడు - 12, 17
8. గెత్సెమని - 14, 32
9. సిలువ మరణము - 14, 36
10. పెద్ద రాతిని - 15, 46

## 36వ పోటీ

1. తెయోఫిలు అనునతని కొరకు - లూకా 1, 1-3
2. అగుస్తు - 2, 1
3. పశువుల తొట్టిలో - 2, 7
4. యెరూషలేము - 2, 41-42
5. వేదబోధకులకు - 2, 46
6. తిబేరియస్ - 3,1
7. ప్రార్థనామందిరమునకు - 4, 16
8. లేవి - 5, 29
9. ప్రార్థనామందిరము - 7,5
10. నాయీను - 7, 12

## 37వ పోటీ

1. స్నాపక యోహాను - లూకా 7, 19
2. దళము - 8, 30
3. పంద్రెండు ఏండ్లు - 8, 42
4. యాకోబు యోహాను - 9, 54
5. దైవరాజ్యమునకు - 9, 62

6. దెబ్బది యిద్దరు శిష్యులు - 10, 17
7. సైతానుని - 10, 18
8. బెతనీ మరియ - 10, 39
9. పరలోక జపము - 11, 1
10. మూడు - 11, 5

## 38వ పోటీ

1. యెరూషలేమునుండి యెరికోకు - లూకా 10, 30
2. యాజకుడు, లేవీయుడు - 10, 31-32
3. పిచ్చుకలకంటె - 12, 7
4. ఆకాశపక్షులు - 12, 24
5. నడుము వంగిపోయిన స్త్రీ - 13, 12-13
6. ఆవపు చెట్టు - 13, 19
7. యెరూషలేము - 13, 34
8. ఒక్కటి - 15, 4
9. నాణెము - 15,8
10. తప్పిపోయిన కుమారుడు - 15, 24

## 39వ పోటీ

1. లాజరుని - లూకా 16, 21
2. సమరయుడు - 17, 16
3. పరిసయుడు, సుంకరి - 18, 10
4. శిష్యులు - 18, 15
5. ధనిక యువకుడు - 18, 23
6. సుంకరి - 19, 1-2
7. రెండు కాసులు - 21, 2
8. చేదు ద్రాక్షరసము - 23, 36
9. క్లియోపా - 24, 18
10. బెతని - 24, 50

## 40వ పోటీ

1. ఆదిలో వాక్కు ఉండెను - యోహా 1,1
2. స్నాపక యోహాను - 1, 27
3. నతనియేలు - 1, 48
4. నికొదేముతో - 3, 3
5. సుకారు - 4,5
6. శిష్యులు - 4, 27
7. బెత్సతా - 5,2
8. ఐదు రొట్టెలు, రెండు చేపలు - 6, 9
9. మన్నాను - 6, 49
10. పేత్రు - 6, 68

## 41వ పోటీ

1. ప్రధానార్చకులు పంపిన బంట్రౌతులు - యోహా 7, 46
2. వ్యభిచారమున పట్టుబడిన స్త్రీతో - 8, 11
3. అబ్రాహాము - 8, 56
4. ఉమ్మి కలిపిన మట్టి - 9,6
5. జీతగాడు - 10, 12
6. బెతానియా - 11,1
7. మార్తతో - 11, 25
8. లాజరు కొరకు - 11, 36
9. ఖర్జూరపు మట్టలతో - 12, 13
10. అందరినీ తన యొద్దకు ఆకర్షించును - 12, 32

## 42వ పోటీ

1. శిష్యుల కాళ్ళు కడిగెను - యోహా 13, 5
2. సైతాను - 13, 27
3. ఫిలిప్పు - 14, 8
4. పవిత్రాత్మను - 16,7
5. అంగీ కొరకు 19, 24
6. నెత్తురు, నీళ్ళు - 19, 34

7. పేత్రు - 20, 6
8. మగ్దలీన - 20, 15
9. తోమాతో - 20, 29
10. నీవు నన్ను ప్రేమించుచున్నావా? - 21, 17

## 43వ పోటీ

1. నలువది రోజులు - 1,3
2. పరిశుద్ధాత్మనుండి - 1,5
3. మేఘము - 1, 9
4. 120 మంది - 1, 15
5. యూస్తు బర్సబ్బా యోసేపు - 1, 23
6. పెంతెకోస్తు - 2,1
7. యోవేలు - 2, 16
8. అందమయినది - 3,2
9. కంపించెను - 4, 31
10. ఉత్సాహపరచువాడు - 4, 36

## 44వ పోటీ

1. కొంత సొమ్ము దాచుకొనిరి - 5,2
2. దేవదూత - 5, 19
3. గమలియేలు - 5, 34
4. యేసుకొరకు అవమానములు పొంద యోగ్యుల మైతిమని - 5, 41
5. ఏడ్గురుని - 6,3
6. దేవదూత ముఖమువలె - 6,15
7. రాళ్ళతో కొట్టి - 7, 59
8. పౌలు వద్ద - 7, 58
9. ప్రభూ! ఈ పాపము వీరిపై మోపకుము - 7, 60
10. క్రూరమైన హింసలు - 8,1

## 45వ పోటీ

1. సమరయ - 8, 5
2. సీమోను అను మాంత్రికుని - 8, 20
3. గాజాకు పోవు మార్గమున - 8, 26
4. యెషయా గ్రంథము - 8, 30
5. యేసు - 8, 32
6. దమస్కు - 9, 3
7. "తిన్ననిది" అను వీధిలో - 9,11
8. అననీయ - 9, 18
9. గంపలో కూర్చుండబెట్టి గోడమీదినుండి అవతలకు దింపిరి - 9, 25
10. బర్నబా - 9, 27

## 46వ పోటీ

1. మత్తీయ - అ.చ. 1, 26
2. 120మంది - 1, 15
3. 300మంది - 2, 41
4. కుంటివానిని నడిపించెను - 3,8
5. గమలియేలు - 5, 34
6. స్తెఫను - 7, 60
7. పౌలువద్ద - 7, 58
8. ఇతియోపియారాణి కోశాధికారియైన నపుంసకునికి - 8, 38 -39
9. బర్నబా - 4, 37
10. అననీయ, సఫీరా - 5

## 47వ పోటీ

1. పేతురు - మత్త 16, 18
2. అంద్రెయ - యోహా 6, 9-10
3. యోహాను - లూకా 22, 8
4. యాకోబు - అ.చ. 12,2

5. మత్తయి - మత్త 9,9
6. తోమా - యోహా 20, 24
7. ఫిలిప్పు - యోహా 14,9
8. మత్తీయ - అ.చ. 1,26
9. పౌలు - రోమా 11, 13
10. 72 - లూకా 10,1

## 48వ పోటీ

1. అంద్రెయ - యోహా 1, 40
2. సీమోను - కేఫా (పేతురు) -1, 42
3. పేతురు అత్త - మార్కు 1, 30-31
4. నీటిమీద - మత్త 14, 29-30
5. నీవు సజీవుడగు దేవుని కుమారుడవైన క్రీస్తువవు - మత్త 16,16
6. మూడు శిబిరాలు- మత్త 17,4.
7. మాల్కుస్ చెవిని - యోహా 18, 10
8. కోడి - లూకా 22, 60
9. కుంటివానితో - అ.చ. 3,6
10. కొర్నేలి - అ.చ. 10,1

## 49వ పోటీ

1. మరణించెను - రోమా 5,8
2. రక్షింపబడును - రోమా 10, 13
3. మరణమును - 1 కొరి 11, 26
4. దారుణమగును - 1 కొరి 9, 16
5. క్రొత్త జీవితము - 2కొరి 5, 17
6. శక్తి - 2కొరి 12, 9
7. బలవంతుడను - 2 కొరి 2, 10
8. క్రీస్తే - గల 2, 20
9. ఆత్మ - శరీరము - గల 5, 17
10. కోపము - ఎఫే 4, 26

# 5. అంత్యగతులు

## మనవిమాట

బైబులు భాష్యం 68-70 సంచికల్లో అంత్యగతులను గూర్చి చెప్పాం. ఆ సంచికలనే యిక్కడ ఏక గ్రంథంగా ప్రచురించాం.

ఈ పుస్తకం మరణానంతరం సంభవించే న్యాయనిర్ణయం, మోక్షం, నరకం మొదలైన అంశాలను పేర్కొంటుంది. ఎన్నేళ్ళు జీవించినా మన యిల్లు ఇక్కడకాదు, అక్కడే. కనుక నరుడు ఈ లోకంలో వుండగానే భావిజీవితానికి సిద్ధంకావాలి. పారమార్థిక దృష్టితో, పరలోక చింతనంతో జీవించాలి. ఈ గ్రంథం మన పాఠకులు పరలోకజీవితాన్ని గూర్చి ఆలోచించుకోవడానికి ఉపయోగపడుతుందని ఆశిస్తున్నాం. ఇది నాల్గవ ముద్రణం.

## విషయసూచిక

# 1. మరణం

చావులో మన దేహాత్మలు తాత్కాలికంగా విడిపోతాయి. దేహం మొదట మట్టిలో కలసిపోతుంది. లోకాంతంలో మళ్లా వుత్థానమౌతుంది. ఆత్మ శాశ్వతంగా జీవిస్తుంది. చావు మామూలుగా భయాన్ని కలిగిస్తుంది. ఈ భయాన్ని జయించడం అత్యవసరం. ఈ యధ్యాయంలో ఐదంశాలు పరిశీలిద్దాం.

## 1. యాత్రిక దశ నుండి శాశ్వత దశకు

మరణం వచ్చేదాకా మనం యాత్రిక దశలో వుంటాం. ఈ లోకంలో జీవితయాత్ర సాగిస్తూంటాం. కాని మరణంతో శాశ్వతదశలో అడుగిడతాం. ఇక యిహలోక జీవితమంటూ వుండదు.

మనం ఏన్నాళ్లు జీవించినా చనిపోక తప్పదు. బైబులు ఆయా వ్యక్తుల మరణాలను వర్ణించేపుడు "వాళ్ళు తమ పూర్వులను కలసికొన్నారు" అని చెప్తుంది. అబ్రాహాము దీర్ఘకాలం జీవించి పండు ముసలితనాన రాలిపోయి తన పూర్వులను గలసికొన్నాడు-ఆది 25,8. ఇంకా చనిపోవడమంటే "మట్టిలో కలిసిపోవడం" గూడ. పాపం చేసిన ఆదాముకి దేవుడు నీవు మట్టినుండి పుట్టావు గాన చివరికి మట్టిలోనే కలసిపోతావని శాపం పెట్టాడు - ఆది 3,19. కనుక నరుడు ఎన్నాళ్ళు బ్రతికినా కడకు మరణించక తప్పదు.

మనం మరణించిన తర్వాత మళ్ళా పశ్చాత్తాపపడి పూర్వ పాపజీవితాన్ని మార్చుకోలేం. వరప్రసాదమూ పుణ్యమూ ఆర్జించలేం. చనిపోయేపుడు ఏదశలో వుంటామో ఇక ఆ దశలోనే శాశ్వతంగా ఉండిపోతాం. ఈ జీవితంలో మన ఆత్మ భౌతిక దేహంమీద ఆధారపడి జీవిస్తుంది. ఈ దశలో అది ఎప్పటికప్పుడు మంచికి గాని చెడ్డకుగాని మారగలదు. తన నిర్ణయాలను మార్చుకోగలదు. కాని మరణంతో ఈ దేహం తొలగిపోతుంది. ఆత్మ వంటరిగా జీవించడం మొదలుపెడుతుంది. అది ఈ భౌతికకాలంలోగాక, ఆ కాలానికి వెలుపల జీవిస్తుంది. ఇక దానిలో మార్పుంటూ ఉండదు. కనుకనే అది మరణానంతరం పూర్వ పాపాలకు పశ్చాత్తాపపడలేదు. క్రొత్తగా పాపపుణ్యాలను కట్టుకోలేదు కూడ.

చాలమంది ఈ ప్రపంచ జీవితంలో కుత్తిక వరకు మునిగి ఉంటారు. ఆ పరలోక జీవితాన్ని గుర్తుకి తెచ్చుకోనే తెచ్చుకోరు. కూడు గుడ్డ యిల్లు వాకిలి సంపాదించుకోవడం డబ్బు జేసికోవడం పేరు ప్రతిష్ఠలు గడించడం మొదలైన వ్యామోహాల్లో తగుల్కొని శాశ్వత సత్యాలను విస్మరిస్తారు. ఇది పొరపాటు. నీడలాగ, నీటి బుడగలాగ, మనం విడిచే శ్వాసలాగ, ఈ జీవితం క్షణికమైంది. ఎన్నాళ్లు జీవించినా ఏమేమి సాధించినా నరులు

చావక తప్పదు. మనం అక్కడి వాళ్ళమే కాని యిక్కడి వాళ్ళం కాదు. కనుకనే తాత్త్వికులు యద్దృశ్యం తన్నశ్యం - అనగా కంటికి కన్పించేదల్లా నశించేదే అని వాకొన్నారు.

## 2. ఆ గడియను దేవుడే నిర్ణయిస్తాడు

మనం ఎప్పుడు మరణిస్తామో, ఏలా మరణిస్తామో, మనకు తెలియదు. మనమరణాకాలాన్ని మనం నిర్ణయించం. దేవుడే ఆ గడియను నిర్ణయిస్తాడు. కొద్దిమంది విషయంలో మాత్రం చావు ఎప్పుడు వస్తుందో ఊహించవచ్చు. కాని చాలమంది అలాంటి వూహకు తావులేకుండానే తలవని తలంపుగానే దాటిపోతారు.

మృత్యువుకీ జీవానికీ అధిపతులం మనంగాదు, దేవుడు. సొలోమోను జ్ఞానగ్రంథం భగవంతుణ్ణి ఉద్దేశించి

జీవంమీదా మరణంమీదా నీ కధికార ముంది
నీవు నరుణ్ణి మృత్యుద్వారం చెంతకు గొనిపోతావు
అక్కడినుండి మరల వెనుకకు తీసుకొని వస్తావు

అని చెప్తుంది - 16,13. అలాగే ద్వితియోపదేశ కాండంగూడ

నేను తప్పక మరో దేవుడు లేడు
జీవానికీ మరణానికీ కర్తను నేనే
గాయపరచేది నయంచేసేది కూడ నేనే
నా కెవరూ అడ్డు రాలేరు

అని వాకొంటుంది - 32,39. ప్రభువు మనుష్యకుమారుడు దొంగలా వస్తాడని చెప్పాడు- లూకా 12,39-40. దొంగ ఎప్పుడొస్తాడో మనకు తెలియదు. అలాగే మరణం ఎప్పుడు వస్తుందో గూడ మన మూహించలేం.

మన బ్రతుకుని దేవుని వద్ద నుండి ఎరువు తెచ్చుకొన్నాం. కనుక మన ప్రాణానికి మనం కర్తలం కాదు. దేవుడు ఊపిరిపోస్తాడు, ఊపిరి తీస్తాడు కూడ. మనతరపున మనం దేవుడు మనకు దయచేసిన ఈ జీవితాన్ని సద్వినియోగం చేసికోవాలి. ఈ లోకంలో సత్కార్యాలు చేయాలి. ఈ మంటిమీద నిరర్థకంగా రోజులు వెళ్ళబుచ్చగూడదు. ఇంకా, దేవుడు మనలను పిల్చిందాకా ఈ నేలమీద మన ప్రాణాన్ని పదిలంగా కాపాడుకోవాలి. మన ప్రాణాన్ని తీసికొనే హక్కు, అనగా ఆత్మహత్యకు పాల్పడే అధికారం, మనకు లేదు.

కొంతమంది మే మెప్పుడు ఏలా చనిపోతామో అని భయపడుతూంటారు. మనకు ప్రాణమిచ్చిన తండ్రి క్రూరుడు కాదు, దయామయుడు. దయామయుడు కనుకనే అతడు మనలను పుట్టించాడు. మనలను తీసికొని పోయేప్పుడుగూడ అతడు క్రూరుడుగా గాక దయాపరుడూనే మెలుగుతాడు. కనుక మనం ప్రభుని నమ్మాలి. మనం ఎప్పుడు చనిపోతామో ఏలాంటి పరిస్థితుల్లో చనిపోతామో మనకు ముందుగా తెలియకపోయినా

ఆ తండ్రికి తెలుసు. మనం పోయేదికూడ ఆ నాన్న యింటికే. కనుక మన తరపున మనం అకాలమృత్యువు వాతబడతామేమోనని భయపడనక్కరలేదు. అసలు మనచావు మనకు ముందుగా తెలియకుండా ఉంటేనే మంచిది. అలా తెలిస్తే దిగులువల్ల చావు రాకముందే చనిపోమా? అందుకే దేవుడు మంచివాడు కనుక మరణాన్ని మనకు ముందుగా తెలియనీడు.

## 3. మృత్యువు పాప ఫలితం

నరులంతా చనిపోవలసిందే. మనం చనిపోయేవాళ్ళను రోజూ చూస్తూనే ఉంటాం. అందుచేత నరులకు మరణం సహజంగానే వస్తుందనుకొంటాం. కాని మరణం సహజ సిద్ధమైంది మాత్రమేకాదు. అది పాపఫలితం కూడ. ఈ సత్యం మనకు దివ్యశ్రుతినుండి మాత్రమే తెలుస్తుంది.

భగవంతుడు మనలను చావడానికిగాక బ్రతకడానికి సృజించాడు. పాపఫలితంగా మనమే చావుని కొనితెచ్చుకొన్నాం. సొలోమోను జ్ఞానగ్రంథం

దేవుడు నరుణ్ణి అమరుణ్ణిగా జేసాడు
అతన్ని తనవలె నిత్యునిగా జేసాడు,
కాని పిశాచం అసూయవలన
మృత్యువు లోకంలోనికి ప్రవేశించింది

అని చెప్తుంది - 2,23-24. ఆదాము పాపం చేయకముందు లోకంలో చావులేదు. ఒక నరుని పాపంద్వారా మృత్యువు మొదటిసారిగా లోకంలో అడుగుపెట్టింది-రోమా 5,12. యెషయా ప్రవక్త వర్ణించిన బాధామయ సేవకుడూ, ఆసేవకుడు సూచించే క్రీస్తుకూడ నరుల పాపాలకు ప్రాయశ్చిత్తం చేయడానికే స్వీయప్రాణాలు అర్పించారు - యెష 53.

పాపంయొక్క ఫలితం మరణం అన్నాడు పౌలు - రోమా 6,23. అనగా పాపఫలితంగా మరణం వచ్చింది. ఇంకా మరణం యొక్క ముల్లు పాపం-1కొ 15,56. అనగా చావు మనలను ఓ విషప్రాణిలా కుడుతుంది. అలా కుట్టే శక్తి దానికి పాపంనుండే వచ్చింది. ఆదాము నుంచి సంక్రమించే జన్మపాపమూ మన సొంత పాపాలూ కలసి మనకు ఈ మృత్యువును తెచ్చి పెడతాయి.

. మామూలుగా మనం మరణించేప్పుడు చాల బాధలను అనుభవింపవలసి ఉంటుంది. మరణంలాగే ఈ బాధలుకూడ పాపజనితాలే. మరణానికీ మరణబాధలకూ గూడ మనం సంసిద్ధంగా ఉండాలి. ఎందుకంటే అవి మన పాపఫలితాలు. వాటిని మనం తప్పించుకోలేం.

## 4. క్రీస్తు మరణం మన మరణంమీద సోకుతుంది

క్రీస్తు వచ్చిందాకా మృత్యువు లోకంలో రాజ్యం చేసింది. నరులు మృత్యువుకి వెరచారు. కాని క్రీస్తు వచ్చాక ఈ పరిస్థితి మారిపోయింది. అతడు మృత్యువుకి గురై దాన్ని జయించాడు. ఆ మృత్యుంజయుని విజయం నేడు మనకు సంక్రమిస్తుంది. మనం అతనిలోనికి మరణించి అతనితోపాటు ఉత్థానమౌతాం. క్రీస్తు రాకముందు మరణం అంతంలేని చీకటి సొరంగంలా ఉండేది. దానిలోనికి అడుగుపెట్టినవాళ్లు ఇక బయటికి రాలేకపోయేవాళ్ళు. కాని క్రీస్తు మరణం ద్వారా ఆ సొరంగానికి ఆవలి ద్వారం ఏర్పడింది. ఆ ద్వారంగుండా మనం ఆవలివెలుగులోనికీ, జీవంలోనికీ నడచిపోవచ్చు. మృత్యువంటే అందరికీ భయమే. కాని క్రీస్తు విజయం మనమీద సోకడంవల్ల మనం మరణించిగూడ మళ్ళా బ్రతుకుతాం అనేభావం ఈభయాన్ని చాలవరకు తగ్గిస్తుంది.

పూర్వవేదంలోని భక్తులను ఉత్థానమూ మోక్షమూ అనే విషయాలు అంత స్పష్టంగా తెలియవు. వాళ్లు చనిపోయిన వాళ్ళంతా పాతాళమనే చీకటి కోనేటిలోకి వెళ్ళిపోతారని భావించేవాళ్లు. అక్కడ మృతులు దేవుణ్ణి దర్శింపక, సుఖదుఃఖాలు అనుభవింపక కేవలం నిద్రావస్థలో ఉండిపోతారని యెంచేవాళ్ళు. ఈ పరిస్థితుల్లో గూడ కొందరు భక్తులు ఉత్థానాన్ని గూర్చి అస్పష్టంగానైన మాట్లాడారు. ఉదాహరణకు 16వ కీర్తన వ్రాసిన భక్తుడు

నీవు నన్ను పాతాళానికి పంపవు
నీ పరిశుద్ధుని గోతిపాలు చేయవు

అని వాకొన్నాడు. తర్వాత నూత్నవేద రచయితలు ఈ వాక్యాన్ని మృతక్రీస్తుకి అన్వయింపజేసారు - అచ 2,27. రెండవ మక్కబీయుల గ్రంథం ఉత్థానాన్ని గూర్చి ఇంతకంటె స్పష్టంగా మాట్లాడుతుంది. యూదా మక్కబీయుడు రెండువేల వెండినాణాలు ప్రోగుజేసి యుద్ధంలో చనిపోయినవాళ్ళకు పరిపరిహార బలిని అర్పించడానికి యెరూషలేముకు పంపాడు. మృతులు మళ్లాఉత్థానమౌతారని విశ్వసించాడు కనుకనే అతడు ఈపుణ్యకార్యం చేయించాడు- 12,43.

నూత్నవేదంలో పౌలు మనం క్రీస్తు మరణంలోనికి మరణించిన అతనితో ఉత్థానమౌతామని మాటిమాటికి చెప్తూంటాడు. ప్రభువు సిలువ మరణం మరణించేంతవరకూ విధేయుడయ్యాడు - ఫిలి 2,8. అతడు గోదుమ గింజలాగ భూమిలోపడి చివికిపోయాడు. కాని మళ్ళా మొలకెత్తి విస్తారంగా ఫలించాడు-యోహా 12,24. అనగా మరణాన్ని జయించి జీవనమూర్తి అయ్యాడు. నేడు మనం క్రీస్తు మరణంలోనికి జ్ఞానస్నానం పొందుతాం- రోమా 6,3-4. దీనివలన పాపజీవితానికి చనిపోయి పుణ్యజీవితానికి ఉత్థానమౌతాం. జ్ఞానస్నానం ద్వారా ప్రభువు మరణం మనమీద సోకుతుంది. అతని చావు మన చావుని

పునీతం చేస్తుంది. కావున మృత్యువు మనలను ఓడించలేదు. ఆ ప్రభువు మనకు పునరుత్థానమూ జీవమూను. అతన్ని విశ్వసించేవాడు మరణించి గూడ మళ్ళా బ్రతుకుతాడు - యోహా 11,25.

ఒక్క మరణ సమయంలోనేగాదు, రోజువారి జీవితంలోగూడ క్రీస్తు మరణం మనమీద సోకుతుంది. అలా సోకితేనేగాని మనకు ఆధ్యాత్మిక జీవనం లభించదు. మనం శారీరక జీవితం - అనగా పాపజీవితం జీవిస్తే తప్పక మరణిస్తాం. కాని పాపక్రియలను నాశంజేసే ఆధ్యాత్మిక జీవితం జీవిస్తే బ్రతుకుతాం - రోమా 8,43. కనుకనే పౌలు ప్రతిదినమూ శారీరక జీవితానికి చనిపోయేవాడు -1కొ 15,31. మనకుకూడ ఇదే నియమం వర్తిస్తుంది. మనం ఈలోకంలో జీవించినా ప్రభువు కొరకే జీవించాలి, మరణించినా ప్రభువుకొరకే మరణించాలి-రోమా 14,8. ఆ ప్రభువునందు కన్నుమూసే భక్తులు ధన్యులు - దర్శ 14,13.

పౌలు ఈ జీవితాన్ని త్యజించి త్వరగా క్రీస్తుని చేరుకోవాలని ఉవ్విళ్ళూరిపోయాడు. మరణం తనకు లాభకరమని యెంచాడు - ఫిలి 1,21-23. ఇది చాల పవిత్రమైన కోర్కె. ప్రభువుని అనుభవానికి తెచ్చుకొన్నవాళ్లు మరణానికి భయపడరు. దాన్ని మక్కువతో ఆహ్వానిస్తారు.

క్రీస్తు మరణించినా మన మరణాన్ని తొలగించలేదు. నేడు మనంకూడ చావవలసిందే. ఐతే అతడు మన చావుని ఫలప్రదం చేసాడు. ఆ ప్రభువుని నమ్మి అతనియందు మరణించినపుడు అతని మరణం మన మరణంమీద సోకి మనకు పాపపరిహారమూ వరప్రసాదమూ ఉత్థానమూ జీవమూ మోక్షభాగ్యమూ సంపాదించి పెడుతుంది. క్రీస్తు రాకముందు మరణం నరజాతికి పాపశిక్షగా ఉండేది. అతని మరణం తర్వాత అది మనకు పాపక్షమను దయచేసే సాధనమైంది. అమరత్వానికి ద్వారమైంది. అతని చలవవల్ల నేడు మనం చావు అనే వంతెనగుండా ఈ యిహలోకాన్నుండి దాటిపోయి శాశ్వతమైన మోక్షధామాన్ని చేరుకొంటాం. కనుక చావు మనకు నిరాశను గాక నమ్మకాన్ని కలిగించాలి. భయాన్ని గాక ధైర్యాన్ని పుట్టించాలి. క్రీస్తుమరణం మన మరణాన్ని పూర్తిగా మార్చివేసింది.

ఈ సందర్భంలోనే పునీతుల భావాలనుకూడ పరిశీలించాలి. మామూలుగానే మనంచావంటే భయపడతాం. దాన్ని ఏలాగైనా తప్పించుకోజూస్తాం. కాని పునీతులు మరణాన్ని జూచి సంతోషించారు. దాని కోసం ఉవ్విళ్ళూరారు. దాన్ని ఆహ్వానించారు. పౌలు తన మరణం కోసం ఏలా ఆశతో ఎదురుచూచాడో పైన వివరించాం. ఇక నాల్గవ శతాబ్దానికి చెందిన గ్రెగోరీ నీసా భక్తుడు ఈలా వ్రాసాడు. "మనం చనిపోయినవాళ్ళ కొరకు గాక బ్రతికి వున్నవాళ్ళకొరకు శోకించాలి. ఎందుకంటే బ్రతికివున్నవాళ్ళు పరలోకపు

యెరూషలేమునూ దేవదూతలనూ ఇంకా దర్శింపలేకుండా ఉన్నారు కనుక. ఈ లోకంలో నరుడు చెరలోలాగ ఉండిపోతాడు. చెరలో ఉన్నవాడు క్రమేణ ఆ చెర జీవితానికి అలవాటు పడిపోయి తన దౌర్భాగ్యాన్ని అర్థంజేసికొనే చేసికోడు. ఈ లోకజీవితంలో నరుడు కూడ అంతే. తల్లి గర్భంలోవున్న శిశువు ఆ గర్భంలోని చీకటిజీవితానికి అలవాటు పడిపోతుంది. ఆ గర్భం నుండి వెలుపలికి వచ్చి వెలుగుని దర్శించడానికి ఇష్టపడదు. అందుకే శిశువులు పుట్టేప్పుడు ఏడ్చి అల్లరిచేస్తారు. అలాగే నరులు కూడ ఈలోక జీవితంనుండి పరలోక జీవితంలోకి ప్రవేశించడానికి ఏమాత్రమూ ఇష్టపడరు. మంత్రసాని బిడ్డ పుట్టడానికి తోడ్పడుతుంది. మృత్యువు గూడ ఓ మంత్రసానిలా మెలుగుతుంది. అది చనిపోయేవాళ్లు పరలోక జీవితంలోకి పుట్టడానికి తోడ్పడుతుంది. పూవునూ దానినుండి పుట్టే పిందెనూ చూస్తుంటాంగదా! పూవు రాలిపోతేనేగాని పిందె కాయగా ఎదగదు. అలాగే మనం ఈ జీవితానికి చనిపోతేనే గాని పరలోక జీవితానికి పుట్టం". ఈ వాక్యాల్లో గ్రెగోరీ వాడిన మూడు ఉపమానాలు - అనగా చెరలోఉన్న వ్యక్తి, గర్భస్థ శిశువు, కాయగా మారవలసిన పూవు - గమనింపదగ్గవి.

రెండవ శతాబ్దానికి చెందిన అతనేష్యసు భక్తుడు ఈలా వాకొన్నాడు. "క్రీస్తు చనిపోయి ఉత్థానమయ్యాక మృత్యుభయం తొలగిపోయింది. క్రీస్తుకోసం ప్రాణాలర్పించే భక్తులు చావుని ఓ అల్పవస్తువులాగ తమ కాళ్ళక్రిందపడవేసి తొక్కుతారు. మరణంద్వారా ఈ జీవితం నాశంకాదనీ ఉత్థానంద్వారా అమరత్వాన్ని పొందుతామనీ వాళ్ళకు తెలుసు".

రెండవ శతాబ్దంలో రోములో వేదసాక్షిగా మరణించిన ఇగ్నేష్యస్ భక్తుడు ఈలా వచించాడు. "రోములోని క్రీడాశాలలో నన్ను సింహాలకు మేతగా వేస్తారు. నన్ను జూచి భయపడకుండా వెంటనే నామీదికి దూకి నన్ను మింగివేయవలసిందిగా నేను ఆ మృగాలను బుజ్జగిస్తాను. అవి నన్ను వధించినప్పుడుగాని నేను శిష్యుణ్ణి కాను. ఏశక్తీ నన్ను క్రీస్తుని చేరనీయకుండా ఆటంకపరచకుందునుగాక. నేను క్రొత్త పుట్టువు పుట్టడానికి ప్రసవవేదన పడుతున్నాను. మీరు నా మరణానికి ఆటంకం కలిగించి నా నూత్న జన్మనుభంగం చేయవద్దు. నన్ను నిర్మలమైన జ్యోతిని చేరుకోనీయండి. ఆ వెలుగుని సమీపించినప్పుడు గాని నేను పరిపూర్ణ మానవుణ్ణి కాను. చావుకి నేను ఉబలాటపడుతున్నాను. నాలోని జీవజలం నీవు శీఘ్రమే తండ్రి వద్దకు వెళ్ళు అని నన్ను హెచ్చరిస్తూంది. నేను మృత్యువుకోసం ఓప్రియునిలాగ తపించిపోతూన్నాను. ఇక యీలోక సుఖాలమీద నాకు కోర్కెలేదు".

ఇక క్రైస్తవ ఆరాధనంలోని ప్రార్థనలను పరిశీలిస్తే మనం మరణానికి భయపడనక్కరలేదు, దేవుణ్ణి నమ్మితే చాలు అనే భావం కన్పిస్తుంది. మృతుల పూజలో వచ్చే ప్రెఫేస్ ప్రార్థనం ఈలా చెప్తుంది. "మరణం **తప్పదనే** సత్యం మాకు దుఃఖాన్ని

కలిగించినా శాశ్వత జీవితం లభిస్తుందనే వాగ్దానం మాకు ఊరట నిస్తుంది. ప్రభూ! మీ విశ్వాసులకు ఈ జీవితం మారుతుందే కాని అంతం కాదు. ఈ భూలోక నివాసం శిథిలం కాగా మాకు పరలోక నిత్యనివాసం సిద్ధమౌతుంది". ఇది చాల గొప్ప భావం.

విశ్వాసులు చనిపోయేప్పుడు చెప్పే మరో ప్రార్థనం ఇది. "సోదరా! (సోదరీ) మేము నీ యాత్మను సర్వశక్తిమంతుడైన దేవునికి అర్పిస్తున్నాం. నీయాత్మ మరల సృష్టికర్తను చేరునుగాక. నీవు పరలోకంలో సన్మనస్కులనూ వేదసాక్షులనూ స్తుతీయులనూ కలసికొందువుగాక. దేవదూత నిన్ను చల్లని చూపున జూచునుగాక. న్యాయాధిపతియైన యేసుక్రీస్తు నిన్ను అనుగ్రహించునుగాక. ప్రభువువైన యేసూ! నీవు కరుణతో ఈయాత్మను మోక్షంలో ప్రవేశపెట్టు. ఈ యాత్మ ప్రేమ ద్వారా నీతో ఐక్యమగునుగాక".

ఈ ప్రార్థనలో కొండంత నమ్మకం ఇమిడి ఉంది. మనం చావును జూచి భయపడకూడదు. తండ్రిలాంటి వాడైన దేవుణ్ణి నమ్మాలి, అంతే.

## 5. ఆధునికుల భావాలు

మరణాన్ని గూర్చి ఆధునిక వేదాంతులూ శాస్త్రజ్ఞులూ నూత్న భావాలు చాల సూచిస్తున్నారు. ప్రస్తుతానికివాటిల్లో రెండింటినిమాత్రం పేర్కొందాం. మొదటిది, చావులోమనకు స్వేచ్ఛ ఉంటుందా అనే అంశం. మరణకాలాన్ని ఎన్నుకొనే స్వేచ్ఛ మనకులేదు. దేవుడే ఆ గడియను నిర్ణయిస్తాడు. ఐనా మరణంలో మన స్వేచ్ఛ నశించదు. ఇహలోక జీవితంలో మనకు స్వేచ్ఛ ఉంది. పరలోక జీవితంలో గూడ స్వేచ్ఛ ఉంటుంది. మరణసమయంలో మాత్రమే ఆస్వేచ్ఛ ఎందుకు నశించాలి? చనిపోయేప్పుడు మనంపూర్ణ స్వేచ్ఛతో భగవంతుణ్ణి అంగీకరించనైనా అంగీకరిస్తాం. నిరాకరించనైనా నిరాకరిస్తాం. అతన్ని అంగీకరించేవాళ్ళకి శాశ్వత బహుమతీ, నిరాకరించేవాళ్ళకి శాశ్వత శిక్షా ప్రాప్తిస్తాయి.

కాని మనం ఏలా జీవిస్తామో అలాగే మరణిస్తాం. తమ జీవితకాలంలో భక్తివిశ్వాసాలతో జీవించినవాళ్ళు అవసానక్షణాల్లో గూడ ప్రభువుని ఎన్నుకొంటారు. అలా జీవించనివాళ్లు అంత్యక్షణాల్లో గూడ అతన్ని నిరాకరిస్తారు. నరుడు ఆఖరి క్షణాల్లో పరివర్తనం చెంది జీవితాన్ని మార్చుకోవడమనేది చాల అరుదు.

ఒక్కోసారి జనులు ప్రమాదాల్లోను గండాల్లోను చిక్కి దిఢీలున చనిపోతారు. కాని ఈలాంటి పరిస్థితుల్లో గూడ చావు ఒక్కనిమిషంలో సంభవింపదు. మనం మనిషి చనిపోయాడు అనుకొన్న తర్వాతగూడ అతడు కొంతకాలం బ్రతికేఉంటాడు. అతని మెదడులోని కణాలు చైతన్యవంతంగానే ఉంటాయి. అలా ఉన్నంతకాలం అతడు బ్రతికిఉన్నట్లే. నరులు ఎప్పుడుగూడ దిఢీలున మరణించరు నిదానంగా మరణిస్తారు. కనుక ఏలాంటి మరణంలోనైనా సరే నరుడు స్వేచ్ఛగా భగవంతుణ్ణి ఎన్నుకోవడానికిగాని, నిరాకరించడానికిగాని వ్యవధి ఉంటుంది.

రెండవది, చనిపోయేవాళ్ళ అనుభవాలు ఏలా ఉంటాయి అనే అంశం. శాస్త్రజ్ఞులు ఇంచుమించు చనిపోయి మళ్లా బ్రతికిబయటపడ్డవాళ్ళ అనుభవాలనుకొన్నింటిని పరిశీలించారు. వాళ్ళ అనుభవాల ప్రకారం చనిపోయేవాళ్లు ఓ జ్యోతిర్మూర్తిని కలుసుకొంటారు. అతడు చనిపోయేవాళ్ళను తన దగ్గరికి బలంగా ఆకర్షిస్తాడు. ఆప్యాయతతోను ఆదరాభిమానాలతోను తన దగ్గరికి రాబట్టుకొంటాడు. వాళ్ళని తన కాంతి ప్రవాహంలో ముంచుతాడు. ఈ కాంతి యెంతో ఆహ్లాదంగా ఉంటుంది. క్రైస్తవులు ఈ జ్యోతిర్మూర్తిని క్రీస్తునిగా భావించారు. యూదులు దేవదూతనుగా ఎంచారు.

ఇంకా, ఈ చనిపోయేవాళ్ళకు ఈ భౌతిక దశలో నుండి మరో దశలోనికి అడుగు పెడ్తున్నట్లుగా కన్పిస్తుంది. ఆ నూత్నదశ ఈ ప్రస్తుత దశకంటె మెరుగైందని కూడ అనిపిస్తుంది. ఆ నూత్నదశలో ఇక్కడ లేని సౌందర్యమూ శాంతీ భద్రతా ప్రేమా ఉన్నట్లుగా స్ఫురిస్తుంది. కనుక చనిపోయేవాళ్లు ఆ నూత్నదశ నుండి మళ్ళా తమ ప్రాత జీవితానికి తిరిగిరావడానికి ఒప్పుకోరు. వాళ్ళకు జీవించడం కంటె మరణించడమే మేలనిపిస్తుంది.

ఈ భావాలనుబట్టి గూడ మృత్యువు భయపడదగింది కాదని అర్థం జేసికోవాలి. పైగా అది అంగీకరింపదగిందీ, ఆహ్వానింపదగిందీని.

## ప్రార్థనా భావాలు

1. మనం మరణభయాన్ని తప్పక జయించాలి. మామూలుగా నరులంతా చావనగానే తల్లడిల్లిపోతారు. కాని యిది వట్టి అజ్ఞానం. మనం కొన్నాళ్ళపాటు ఈ లోకంలో జీవించగానే ఇక యీ ప్రపంచానికి అంటిపెట్టుకొంటాం. ఇక్కడి వస్తువులూ, సుఖభోగాలూ, వ్యక్తులూ మొదలైన వాళ్లమీద వ్యామోహాలు పెంచుకొంటాం. కనుకనే ఈ ప్రపంచాన్ని వదలిపెట్టి పోవాలంటేమనకు అనిష్టంగాను బాధగాను భయంగాను ఉంటుంది. మనం ఈలోక వ్యామోహాలను ఎంతగా పెంచుకొంటామో మరణంకూడ అంత చేదుగా ఉంటుంది. ఆ వ్యామోహాలను ఎంతగా తగ్గించుకొంటామో చావుగూడ అంత తేలికగా ఉంటుంది. మృత్యుభయానికి స్వార్థం ప్రబలకారణం. విశ్వాసం నేర్పేదేమిటంటే, మన యీ లౌకిక జీవితం క్షణికమైంది. అది మనలను పరలోక జీవితానికి సిద్ధం జేయడానికి మాత్రమే ఉద్దేశింపబడింది. మనకు ఇక్కడ స్థిరమైన పట్టం ఏమీ లేదు. రాబోయే నగరం కోసం ఎదురుచూడాలి - హెబ్రే 13,14.

2. క్రీస్తులోనికి చనిపోయి అతనితో ఉత్థానమౌతామనే నమ్మకమొక్కటే యథార్థంగా మృత్యుభయాన్ని జయించడానికి ఉపయోగపడేది. ఆ ప్రభువునందు మరణించినవాళ్ళకు జీవితం నాశంకాదు, క్రొత్తజీవితం ప్రారంభమౌతుంది. కనుక

ఆ ప్రభువు మన ఆశ, మన నమ్మకం. ఒక్కమరణ సమయంలోనేగాదు, రోజువారి జీవితంలో గూడ మనం క్రీస్తుతో చనిపోయి అతనితో ఉత్థాన మౌతుండాలి. ప్రతిదినమూ అతని సిలువా మహిమా మన జీవితంలో ప్రత్యక్షమౌతుండాలి. కావుననే పౌలు క్రీస్తుశ్రమల్లో పాల్గొని అతని ఉత్థానాన్ని అనుభవానికి తెచ్చుకోవాలని కోరుకొన్నాడు - ఫిలి 3,10-11.

3. మనం రాబోయే మృత్యువుని గూర్చి భయపడ్డంకంటె ఆ మృత్యువుని కలిసికోవడానికి ఇప్పటినుండే సిద్ధం కావడం మంచిది. నరులు ఏలా జీవిస్తారో అలాగే చనిపోతారు. ఈయిహలోక జీవితం పరీక్షాసమయం. ఇది కోతకాలం. ఇక్కడ మంచిజీవితమనే పంటను పండించుకొనేవాళ్లు పరలోకానికి ధాన్యం చేకూర్చి పెట్టుకొంటారు. పైగా మనం ఇక్కడ కొన్నియేండ్లు మాత్రమే జీవిస్తాం. ఈ లోకంగుండ ఒక్కసారి మాత్రమే సాగిపోతాం. కనుక దేవుడు మనకు దయచేసిన యీ హ్రస్వకాలాన్ని సద్వినియోగం చేసికోవాలి. సత్క్రియలతో ఈలోక జీవితాన్ని సార్థకం జేసికోవాలి. ఈలా చేసినవాడు కొలది యేండ్లు జీవించినా పెక్కేండ్లు జీవించినవా డవుతాడు.

4. తరచుగా మృత్యువునిగూర్చి ధ్యానం చేసికోవడంగూడ మంచిది. చాలమంది పునీతులు ఈలాచేసారు. మృత్యుమననంవల్ల లోక వ్యామోహాలనుండి వైదొలగుతాం. పారమార్థిక దృష్టి నలవర్చుకొంటాం. పాపాలకు పశ్చాత్తాపపడతాం. పుణ్యకార్యాలకు పూనుకొంటాం. ఒక్కమాటలో చెప్పాలంటే, వళ్లు దగ్గర పెట్టుకొని జీవిస్తాం. ఇది అల్పభాగ్యమేమీ కాదు.

# 2. తీర్పు

భగవంతుడు నరులందరికీ ఓదినం ఖండితంగా తీర్పు తీరుస్తాడు. కనుక మనం ధర్మబద్ధంగా జీవించాలి. ఈ యధ్యాయంలో నాల్గంశాలు పరిశీలిద్దాం.

## 1. తీర్పు అంటే యేమిటి?

మనం చనిపోగానే మన ఆత్మ దేవుణ్ణి చేరుకొంటుంది. భగవంతుడు దానికి తీర్పు తీరుస్తాడు. మన తలపులకీ మాటలకీ చేతలకీ, చేయవలసిగూడ చేయకుండా వదలివేసిన పనులకీ మనం భగవంతునికి ఖండితమై లెక్క ఒప్పచెప్పాలి.

ఒక్క క్రైస్తవ యూదమతాల్లోనేగాక ప్రపంచంలోని ముఖ్య మతాలన్నిటిలోగూడ భగవంతుడు న్యాయాధిపతి, అతడు నరులందరికీ న్యాయనిర్ణయం చేస్తాడు అనే భావం

వుంది. మామూలుగా నరులందరూ అన్యాయానికి జంకుతూనే ఉంటారు. పాపంచేసే ప్రతి నరుణ్ణీ అతని అంతరాత్మ హెచ్చరిస్తూనే ఉంటుంది.

తీర్పుని గూర్చిన పై వేదసత్యంలో మూడంశాలు ఇమిడి వున్నాయి. మొదటిది, మనం చనిపోయేప్పుడే భగవంతుడు మన స్థితిని శాశ్వతంగా నిర్ణయిస్తాడు. అనగా చనిపోయినప్పుడు దేవుడు మనలను పుణ్యాత్ములనుగా గణిస్తే ఇక శాశ్వతంగా పుణ్యాత్ములంగానే ఉండిపోతాం. పాపాత్ములనుగా గణిస్తే ఇక శాశ్వతంగా పాపాత్ములంగానే ఉండిపోతాం. ఈ స్థితికి ఇక మార్పంటూ ఉండదు. రెండవది, మన మరణకాలంలో మనం పుణ్యాత్ములమో పాపాత్ములమో దేవుడు మనకు స్పష్టంగా తెలియజేస్తాడు. ఆత్మ తన స్థితిని తాను స్పష్టంగా అర్థం జేసికొంటుంది. ఈ విషయంలో అనుమానమంటూ ఉండదు. మూడవది, మన ఆత్మ తన పుణ్యపాపాల ఫలితాన్ని వెంటనే అనుభవించడం మొదలు పెడుతుంది. అనగా పాపపుటాత్మకు వెంటనే నరకశిక్ష ప్రాప్తిస్తుంది. పుణ్యపుటాత్మకు వెంటనేగాని, లేక ఉత్తరించే స్థలంలో శుద్ధిని పొందిన పిదపగాని, మోక్షభాగ్యం సిద్ధిస్తుంది. ఈ పుణ్యపాపాల ఫలితానుభవంలో జాప్యం అంటూ ఉండదు. ఈ మూడు సత్యాలనుగూడ మనం రూఢిగా నమ్మాలి.

## 2. ఎన్ని తీర్పులున్నాయి?

రెండు తీర్పులున్నాయని జ్ఞానోపదేశంలో నేర్చుకొంటూంటాం. అవి ప్రత్యేకతీర్పు, సాధారణ తీర్పు లేక కడతీర్పు. భగవంతుడు ఒక్కో నరుడు చనిపోయిన వెంటనే అతనికి వ్యక్తిగతంగా తీర్చే తీర్పు ప్రత్యేకమైన తీర్పు. అతడు లోకాంతంలో అందరి యెదుటా అంధరికీ కలిసి తీర్చే తీర్పు సాధారణతీర్పు లేక కడతీర్పు.

బైబులు విశేషంగా సాధారణ తీర్పుని పేర్కొంటుంది. ఐనా ప్రత్యేకమైన తీర్పుని గూర్చి గూడ కొన్ని సందర్భాల్లో చెప్పకపోదు. తొలి రోజుల్లోని పితృపాదులూ వేదాంతులూ సాధారణ తీర్పుని మాత్రమే పేర్కొన్నారు. 7వ శతాబ్దం తర్వాత గాని క్రైస్తవ వేదాంతులు ప్రత్యేక తీర్పుని గూర్చి మాట్లాడ్డం మొదలుపెట్టలేదు. కనుక క్రైస్తవ ప్రజలు తొలిరోజుల్లో సాధారణ తీర్పుని గూర్చి మాత్రమే మాట్లాడుతూ వచ్చారు. క్రమేణ ప్రత్యేక తీర్పుకూడ ఉందనే భావం ప్రచారంలోకి వచ్చింది.

క్రైస్తవులు తొలి రోజుల్లో ప్రత్యేక తీర్పుని గూర్చి మాట్లాడకపోవడానికి కొన్ని కారణాలున్నాయి. మొదటిది, నరుడు దేహాత్మల సంయోగంవల్ల ఏకవ్యక్తిగా రూపొందుతాడని చెప్తుంది బైబులు. కాని ప్రత్యేక తీర్పులో దేహమనేది ఉండదు. కనుక నరుని వ్యక్తిత్వంలో సగం లోపించినట్లే. సగం వ్యక్తియైన నరునికి తీర్పు జరగడ మేమిటని తొలినాటి క్రైస్తవులు ప్రత్యేక తీర్పుని పట్టించుకోలేదు. రెండవది, యూద క్రైస్తవ మతాలు

రెండూ సామూహికమైనవిగాని వ్యక్తిగతమైనవి కావు. కనుక మృతులకు సామూహికంగా తీర్పు జరగాలి గాని వ్యక్తిగతంగా తీర్పు జరగడమేమిటనుకొని తొలిరోజుల్లోనివాళ్ళు ప్రత్యేకతీర్పుని అనాదరం చేసారు. మూడవది, తొలినాటి క్రైస్తవులు ప్రభువు త్వరలోనే - తమ జీవితకాలంలోనే - రెండవమారు వేంచేసి వస్తాడని నమ్మారు. పౌలుకూడ మొదటలో ఈ భావానికి లొంగిపోయాడు. ఇక, యీలా త్వరలోనే వేంచేసి వస్తాడనుకొన్న ప్రభువు అందరికీ కలిపి సాధారణ తీర్పు తీరుస్తాడు కదా! అందుచేత ప్రత్యేక తీర్పునుగూర్చి ఆలోచించే అవసరం తొలినాళ్ళలోని క్రైస్తవులకు కలుగలేదు.

కాని ఈ రెండవ రాకడ విషయంలో ఆలస్యం జరిగేకొద్దీ తొలినాటి క్రైస్తవ ప్రజలు ఆలోచించడం మొదలెట్టారు. నరుడు చచ్చిపోయినప్పుడు ఏం జరుగుతుందా అనీ, దేవుడు వెంటనే న్యాయనిర్ణయం చేయడా అనీ ఊహలు ప్రారంభించారు. అంతలో వేదసాక్షులుగా మరణించినవాళ్లు చనిపోగానే మోక్షానికి వెళ్ళి దేవుణ్ణి దర్శిస్తారనే భావం ప్రచారంలోకి వచ్చింది. అనగా వాళ్ళకు చనిపోగానే న్యాయనిర్ణం - ప్రత్యేకతీర్పు- జరిగిందన్నమాట. ఈ వేదసాక్షులకు జరిగే ప్రత్యేక తీర్పే మృతులైన కన్యలు, స్తుతీయులు, మామూలు విశ్వాసులు మొదలైన వాళ్ళందరికీ గూడ జరుగుతుందనేభావం క్రమేణ ప్రచారంలోకి వచ్చింది. ఈలా 13వ శతాబ్దానికల్లా ప్రత్యేకమైన తీర్పు ఒకటుందనే భావం బాగా వ్యాప్తిలోకి వచ్చింది. ఆ శతాబ్దంలోనే తిరుసభ ఈ వేదసత్యాన్ని అధికారపూర్వకంగా ప్రకటనచేసింది కూడ.

క్రైస్తవ విశ్వాసులు ఒకమారు ప్రత్యేక తీర్పుని గూర్చి తెలుసుకొన్నంక ఇక సాధారణ తీర్పుతో అవసరమేమిటా అని వితర్కించడం మొదలుపెట్టారు. సాధారణ తీర్పు ప్రత్యేకతీర్పుకి ఏమీ చేర్చదు. దానినుండి ఏమీ తొలగించదు. ప్రభువు అక్కడ చేసిన న్యాయనిర్ణయమే ఇక్కడ కూడ చెల్లుబాటవుతుంది. మరి మళ్లా ఈ సాధారణ తీర్పనేది ఎందుకు?

సాధారణ తీర్పుని సమర్థిస్తూ వేదశాస్త్రులు కొన్ని కారణాలు చెప్పారు. మొదటిది, నరుల్లో ఒకరి పాపాలొకరికి వెల్లడి చేయడం కోసం. సాధారణతీర్పు జరిగిందాకా ఎవరు మంచివాళ్ళో ఎవరు చెడ్డవాళ్ళో లోకానికి తెలియదు. అంతవరకూ సజ్జనులూ దుర్మార్గులూ కలిసే జీవిస్తుంటారు. కాని ఈ తీర్పులో నిజానిజాలు వెల్లడి యౌతాయి. కడకు సత్యం గెల్చి బహుమతిని పొందుతుంది. అసత్యం ఓడిపోయి శిక్షననుభవిస్తుంది. ఇది ప్రత్యేక తీర్పులో జరుగదు.

రెండవది, మన దేహంకూడ బహుమతినిగాని శిక్షను గాని పొందడంకోసం. ఆత్మ మంచిపనులు చేసినా చెడ్డపనులు చేసినా ఈ దేహంతో చేస్తుంది. కనుక బహుమతి

గాని శిక్షగాని దేహాత్మలు రెండిటికీ లభించాలి. కాని ప్రత్యేకతీర్పులో ఆత్మ మాత్రమే, శిక్షనో బహుమతినో పొందుతుంది. సాధారణ తీర్పులోగాని దేహంగూడ ఉత్థానమై శిక్షనో బహుమతినో పొందదు.

మూడవది, సామూహిక భావాన్ని తెలియజేయడం కోసం. మనమంతా క్రీస్తు జ్ఞాన శరీరానిమి. అతని అవయవాలమి. పరలోకరాజ్య సభ్యులం. కనుక కడ తీర్పులో పుణ్యాత్ములంతా కలసే క్రీస్తునుండి బహుమతిని పొందుతారు. పాపాత్ములంతా కలసే అతని జ్ఞాన శరీరంనుండి బహిష్కృతులగుతారు. జ్ఞానశరీరంగా క్రీస్తుతో మనకున్న ఐక్యతనీ, ఆ జ్ఞానశరీర సభ్యులంగా మనలో మనకున్న ఐక్యతనీ కడతీర్పు స్పష్టం చేస్తుంది.

ఇన్ని కారణాలవల్ల కడతీర్పు అవసరమైంది. ప్రత్యేకతీర్పు కేవలం వ్యక్తిగతమైంది. సాధారణ తీర్పు సామూహికమైంది. నేడు కొందరు వేదశాస్త్రులు రెండు తీర్పులు అక్కరలేదనీ, ఒక తీర్పుతోనే సరిపెట్టుకోవచ్చునని చెప్తున్నారు. ఆ వొక్క తీర్పునే రెండు దృక్పథాలనుండి పరిశీలించి చూడవచ్చునని వీళ్ళ సూచన. దీన్నే మరణ సమయంలో ప్రత్యేక తీర్పనీ, లోకాంతంలో సాధారణ తీర్పనీ పిలవవచ్చునని వీళ్ళ అభిప్రాయం. రెండవ తీర్పు మొదటి తీర్పుకి ఏమీ చేర్చదు. కనుక వీళ్లు ఈలా అభిప్రాయపడుతున్నారు. బైబులు రెండు తీర్పులనుగాక ఒక్క తీర్పునే పేర్కొంటుంది. ఈ విషయంకూడ తమ అభిప్రాయానికి బలం చేకూరుస్తుందని వీళ్ళవాదం. ఇక్కడ ఈవివాదంలోకి మనం ప్రవేశించనక్కరలేదు. శతాబ్దలపొడుగునా పెద్దపెద్ద వేదశాస్త్రులే తీర్పులు రెండా లేక వొకటా అని చర్చలుచేసి ఎటూ తేల్చలేకపోయారు. కనుక నేడు మనం తీర్పులు రెండా లేక వొకటా అని వాదిస్తూ కూర్చోవడంకంటె, వాటికి ఏలా సంసిద్ధం కావాలా అని ఆలోచించడం మేలు.

## 3. బైబులు భావాలు

నూత్నవేదం ప్రభువు మనకు తీర్పుతీరుస్తాడని స్పష్టంగా చెప్తుంది. ఆ తీర్పు రెండుసార్లుగాక ఒకేసారి జరుగుతుందని చెప్తుంది. కాని ఆ తీర్పు ఎప్పుడు జరుగుతుందో స్పష్టంగా చెప్పదు. మత్తయి భావాల ప్రకారం తీర్పు లోకాంతంలో జరుగుతుంది. లూకా భావాల ప్రకారం అది మనం మరణించిన వెంటనే జరుగుతుంది. యోహాను భావాల ప్రకారం అది మనం జీవిస్తూండగానే జరుగుతుంది. ఇక ఈ భావాలను క్రమం పరిశీలిద్దాం.

1. మత్తయి 23,31-46 వచనాల్లో కడతీర్పు సామెత వస్తుంది. తొలిరోజుల్లో క్రైస్తవలోకంలో సాధారణ తీర్పు బాగా ప్రచారంలోకి రావడానికి కారణం ఈ సామెతే. "మనుష్య కుమారుడు సమస్త దూతల సమేతంగా తన మహిమతో వచ్చునప్పుడు" అనే ప్రారంభ వాక్యాలనుబట్టి ఈ రచయిత తీర్పు లోకాంతంలో జరుగుతుందని భావించాడు అనుకోవాలి.

ఈ తీర్పులోని ముఖ్యాంశం ఇది. నరులు దేన్నిబట్టి దేవునినుండి శిక్షనుగాని బహుమతినిగాని పొందుతారు? జనులు తోడినరులపట్ల ప్రవర్తించే తీరునుబట్టే శిక్షనుగాని బహుమతిగాని వస్తుంది. క్రీస్తు తోడినరుల్లో ఉంటాడు. కనుక తోడినరులకు మేలుచేస్తే అతనికి మేలు చేసినట్లే. తోడినరులకు కీడుచేస్తే అతనికి కీడుచేసినట్లే. "ఈ నా సోదరుల్లో అత్యల్పుడైన ఏవొక్కనికి మీరు ఇవి చేసినపుడు నాకు చేసితిరి" అనే 40వ వాక్యం భావమూ, "ఈ యత్యల్పుల్లో ఒకనికైనను మీరివి చేయనపుడు నాకును చేయలేదు" అనే 45వ వాక్యం భావమూ ఇదే. కనుక మనం కడతీర్పులో నెగ్గాలంటే దైవప్రేమతోపాట సోదరప్రేమనుగూడ పాటించాలి.

2. లూకాభావాల ప్రకారం తీర్పు లోకాంతంలోగాక మనం మరణించిన వెంటనే జరుగుతుంది. ఇతని సువిశేషం 16వ అధ్యాయంలో ధనికుడు - లాజరు అనే సామెత వస్తుంది. ఈ యధ్యాయంలో మనకు కావలసింది 22-23 వచనాలు. లాజరూ ధనికుడూ ఇద్దరూ చనిపోయారు. చనిపోయిన వెంటనే దేవదూత లాజరుని అబ్రాహాము వొడిలోనికి, అనగా మోక్షానికి చేర్చాడు. ధనికుడు పాతాళానికి, అనగా నరకానికి వెళ్ళాడు. వీళ్ళిద్దరూ లోకాంతంలోని సాధారణ తీర్పుదాకా ఆగకుండానే, చనిపోయిన వెంటనే, దేవునినుండి బహుమతినీ శిక్షనూ పొందారు. అనగా వీళ్ళకు మరణించిన వెంటనే ప్రత్యేక తీర్పు జరిగింది.

ఈలాగే సిలువమీద చనిపోయే క్రీస్తు మంచి దొంగతో "నేడే నీవు నాతో కూడ పరలోకంలో ప్రవేశిస్తావు' అని చెప్తాడు - లూకా 23,43. ఈ వాక్యంలో "నేడే" అంటే ఈ రోజే అని భావం. యూదులకు రోజు సూర్యాస్తమయంతో ముగుస్తుంది. కనుక మంచిదొంగ శుక్రవారం సాయంకాలం ప్రొద్దు క్రుంకకమునుపే, తాను చనిపోయిన వెంటనే, మోక్షంలో వుంటాడు. అనగా అతనికి మరణం ముగియగానే తీర్పు జరిగింది, బహుమతి లభించింది.

ఈలాగే అ.చ. 1,25లొ "తన చోటికి పోవుటకు యూదా విసర్జించిన యీ పరిచర్యలో" అన్న వాక్యం వస్తుంది. యూదా చనిపోయిన వెంటనే తనకు నిర్ణయింపబడిన తావుకి వెళ్ళిపోయాడు. అనగా అతనికిగూడ మరణించిన వెంటనే తీర్పు జరిగింది.

ఈ యాలోకనాలన్నిటినిబట్టి లూకా భావాన్ని అర్థంజేసికోవచ్చు. లోకాంతంవరకు ఆగనక్కరలేకుండానే మరణించిన వెంటనే మనకు తీర్పు జరుగుతుంది. ఆ తీర్పులోనే మనం శాశ్వతంగా బహుమతినో శిక్షనో పొందుతాం.

3. యోహాను 3,17-18లో ఈ వాక్యాలు తగులుతాయి. "ఆయనను విశ్వసించేవాడు తీర్పును పొందడు. విశ్వసించనివాడు ఈవరకే తీర్పుని పొందాడు. ఆ తీర్పు యిది. వెలుగు లోకంలోనికి వచ్చింది. కాని మనుష్యులు దుష్క్రియలుచేస్తూ

వెలుగుకంటె చీకటినే యెక్కువగా ప్రేమించారు". ఈ వాక్యాల్లో వెలుగంటే క్రీస్తే. నరుల్లో కొందరు క్రీస్తుని అంగీకరిస్తారు, మరికొందరు అంగీకరించరు. ఆ ప్రభువుని విశ్వసించనివాళ్ళకు ఖండనం ఉంటుంది.

యోహాను భావాల ప్రకారం మనం తీర్పుకి లోకాంతందాకా వేచి ఉండనక్కరలేదు. మరణందాకా గూడ వేచి ఉండనక్కరలేదు. ఆ తీర్పు యిప్పుడే, మనం జీవించి ఉండగానే జరిగిపోతుంది. క్రీస్తు వెలుగుగా మనకు తీర్పు విధిస్తాడు. అతన్ని అంగీకరించేవాళ్ళకు బహుమతీ, అంగీకరించనివాళ్ళకు శిక్షా ఉంటాయి. క్రీస్తుపట్ల మనకుండే అవిశ్వాసంగాని విశ్వాసంగాని యీ శిక్షా బహుమతులకు ఆధారం. ఇక్కడ క్రీస్తుని అంగీకరించడమూ విశ్వసించడమూ అంటే ఆ ప్రభువుని ప్రేమించి అతని ఆజ్ఞలను పాటించడం.

4. పైన మత్తయి, యోహాను, లూకా భావాలను చూచాం. ఇక మిగిలిన నూత్న వేద రచయితలు, అనగా పౌలు పేత్రు మొదలైనవాళ్ళు ప్రభువు రెండవమారు విజయంచేసినపుడు తీర్పు తీరుస్తాడని చెప్పారు. అనగా యిది లోకాంతంలో జరిగే సాధారణ తీర్పన్నమాట. లోకాంతంలో ప్రభువు స్వయంగా విచ్చేసి బ్రతికినవాళ్ళను చనిపోయినవాళ్ళనూగూడ తీర్పుకి పిలుస్తాడు - 1తెస్స 4,15-18. మనం ఇప్పుడు క్రీస్తు శ్రమల్లో పాలుపొందితే అతడు మహిమతో వచ్చినపుడు ఆనందాన్ని పొందుతాం- 1 పేత్రు 4,14. భక్తులు ఓపికతోను ధైర్యంతోను ప్రభువు విచ్చేసే దినంకోసం వేచివుండాలి - యాకో 5,8. ప్రతివ్యక్తీ ఒక్కసారే మరణిస్తాడు. తదుపరి దేవుని నుండి తీర్పు పొందుతాడు - హెబ్రే 9,27.

5. విశ్వాసులకు దైవభీతి కలిగించడానికి దివ్య గ్రంథం తీర్పుని భయంకరమైన దాన్నిగాకూడ చిత్రిస్తుంది. దేవుడు పక్షపాతానికి లొంగకుండా ఎవరెవరి ప్రవర్తనను బట్టి వాళ్ళకు తీర్పు జెప్తాడు - 1పేత్రు 1,17. కాబట్టి నిష్పక్షపాతియైన ఆ న్యాయాధిపతిని జూచి మనం భయపడాలి. పూర్వవేదంలో మోషే ధర్మశాస్త్రాన్ని మీరినవాళ్ళకు, ఇద్దరు ముగ్గురు సాక్షుల నిదర్శనం లభిస్తే చాలు, మరణశిక్ష పడేది. అలాంటప్పుడు నూత్నవేదంలో దేవుని పుత్రుణ్ణే నిరాకరించినవాళ్ళ గతి ఏమౌతుంది? నిబంధన రక్తాన్ని కాలదన్ని దేవుని ఆత్మనే అవమానపరచినవాళ్ళు ఎంతటి ఘోరశిక్షననుభవించరు? సజీవుడైన దేవుని చేతికి జిక్కడం మహాభయంకరంగదా? - హెబ్రే 10,27-31. ఆ దేవుడు మన రహస్యాలోచనలకుగూడ తీర్పు తీరుస్తాడు అంటే మనం ఎంతగా జాగ్రత్తపడవలసి ఉంటుంది! - రోమా 2,16. అతడు మనం పలికే ప్రతి వ్యర్థపు మాటకుగూడ లెక్క అడుగుతాడు అంటే మనం ఎంత మెలకువతో ఉండవలసి ఉంటుంది! - మత్తయి 12,36. మన మంచి పనులూ చెడ్డపనులూకూడ అతని గ్రంథంలో లిఖింపబడి ఉంటాయి అంటే, అతడు మన పాపపుణ్యాలను ఏమాత్రమూ మర్చిపోడు అంటే, మనం ఎంత నిర్మలంగా

ప్రవర్తింపవలసిఉంటుంది! - దర్శ 20,12. మనం ఇతరులకు ఏ కొలతన కొలుస్తామో దేవుడుకూడ మనకు అదే కొలతన కొలుస్తాడు అంటే మనం తోడిజనంతో ఎంత చిత్తశుద్ధితో మెలగవలసి ఉంటుంది! - మత్త 7,2. ఈ భావాలన్నీ మనకు ఆలోచన పుట్టించాలి. మనం ఎప్పటికప్పుడు మన జీవితాన్ని చక్కదిద్దుకొని మంచికి మారడానికి ప్రేరణం పుట్టించాలి.

6. దేవుని తీర్పుకి తట్టుకోవడం ఏలా? ఏ ప్రభువు మనకు న్యాయాధిపతో అతడే మనకు ఆశాకిరణం గూడ. మనం దేవుని తీర్పుకి తట్టుకొని నిలబడాలంటే క్రీస్తుని విశ్వసించాలి. మరోమార్గంలేదు. క్రీస్తుని నమ్మినవాళ్ళకు దండనం లేదు -రోమా 8,1. ప్రభువుని నమ్మినవాడికి ఖండనం లేదు. అతడు మరణాన్ని తప్పించుకొని జీవాన్ని పొందుతాడు - యోహా 5,24. తండ్రిగాని క్రీస్తుగాని మనలను ఖండించరు. తండ్రి ప్రేమతో మన కొరకు క్రీస్తుని పంపినవాడు. క్రీస్తు మనకొరకు చనిపోయి, మనకు మధ్యవర్తియై నిరంతరమూ మన తరపున ప్రార్థనం చేసేవాడు. అలాంటి తండ్రీకొడుకులు మనలను దండించడానికి తయారుగా వుండరు కదా! - రోమా 8,33-34. దేవుడు మనలను ప్రేమించేవాడు కనుక తీర్పుదినాన్ని గూర్చి భయపడక ధైర్యంగా ఉండవచ్చు - 1యోహా 4,17. మనం చీకటికీ రాత్రికీ సంబంధించనవాళ్ళం కాదు. వెలుగుకీ పగటికీ సంబంధించినవాళ్ళం. కనుక తీర్పుదినం దొంగలావచ్చి మనలను నిశ్చేష్టులను చేయలేదు. ఎప్పుడుగూడ ప్రభువు దండనం దుర్మార్గులకుగాని సజ్జనులకుగాదు - 1తెస్స 5,3-6.

కనుక ఓవైపు మనం దేవుని తీర్పుని జూచి భయపడాలి. వళ్లు దగ్గిర పెట్టుకొని జీవించాలి. కాని మరోవైపు క్రీస్తుని విశ్వసించాలి. అతనికి మనపట్లగల ప్రేమను జూచి నమ్మకం దెచ్చుకోవాలి. ఆ నమ్మకంద్వారానే ఆ న్యాయాధిపతి విధించే శిక్షవలని భయాన్ని తొలగించుకోవాలి.

## 4. ఆధునికుల భావాలు

పూర్వాధ్యాయంలో శాస్త్రజ్ఞులు ఇంచుమించు చనిపోయి మళ్లాబ్రతికి బయటపడ్డవాళ్ళ అనుభవాలను కొన్నింటిని పరిశీలించి చూచారని చెప్పాం. చనిపోయేవాళ్ళు జ్యోతిర్మూర్తిని కలసికొంటారనిగూడ చెప్పాం. ఈ చనిపోయేవాళ్ళ కథనం ప్రకారం, ఆ జ్యోతిర్మూర్తి మరణించేవాళ్ళకు వాళ్ళ జీవిత సంఘటలనన్నిటినీ దృశ్యాలుగా చూపిస్తాడు. ఈ దృశ్యాల్లో నరుల జీవితంలోని ప్రధాన సంఘటలన్నీ ఉంటాయి. అవి త్వరత్వరగా కదిలే సినిమా బొమ్మల్లాగ వాళ్ళ కన్నులయెదుట కన్పిస్తాయి. అలా త్వరగా కదిలినా మరణించేవాళ్లు వాటి భావాన్ని గ్రహించగలుగుతారు. అసలా బొమ్మలన్నీ వాళ్లకు ఏకకాలంలోనే కన్పిస్తాయి. ఏకకాలంలోనే వాటి అర్థాన్ని గ్రహించే శక్తికూడ వాళ్ళకు

ఉంటుంది. ఆ తేజోమూర్తి చనిపోయేవాళ్ళను అడిగే రెండు ముఖ్యవిషయాలు వాళ్ళు లోకంలో తోడినరులను ప్రేమించారా అనీ, తన్ను గూర్చి తెలుసుకోవలసినంతగా తెలుసుకొన్నారా అనీని. ఈ చనిపోయేవాళ్ళ భావాలుకూడ దేవుడు మరణ సమయంలో మనకు తీర్పు తీరుస్తాడనే సత్యాన్ని ధ్రువపరుస్తున్నాయికదా!

## ప్రార్థనా భావాలు

1. న్యాయాధిపతి ఒకడున్నాడనీ అతడు మనకు మరణ సమయంలో ఖండితంగా తీర్పు తీరుస్తాడనీ చెప్పాం. కనుక మన తరపున మనం చిత్తశుద్ధితో జీవించాలి. నరుల కన్నుగప్పినా దేవుని కన్నుగప్పలేం. ఆ ప్రభువుకి మన హృదయాలోచనలు కూడ తెలుసు. కనుక మనం అతి నిర్మలంగా జీవించాలి. ఈ సందర్భంలో ఆత్మజ్ఞానంకూడ ఎంతో ఉపయోగపడుతుంది. అనగా మన లోపాలూ మేలిగుణాలు కూడ మనకు బాగా తెలిసివుండాలి. ఆలోపాలను రోజురోజూ సవరించుకొంటూండాలి. ఆ మేలిగుణాలనుగూడ రోజురోజుకీ వృద్ధి చేసికొంటూండాలి. ఈలా చేయకుండా లోకాన్ని వంచిస్తూ, మనలను మనం వంచించుకొంటూ కాలం గడిపితే చివరి రోజున విచారించవలసి వస్తుంది.

2. ఇండియా ప్రభుత్వం "సత్యమేవ జయతే" అనే ప్రాచీన సూక్తిని ఆదర్శంగా స్వీకరించింది. ఎప్పటికైనా సత్యం జయించి తీరుతుంది. న్యాయ నిర్ణయ దినాన ఈ సూక్తి అక్షరాల నెరవేరుతుంది. ఆ రోజున సత్యం గెలుస్తుంది. అబద్ధం వోడిపోతుంది. దుర్మార్గులకు శిక్షా సజ్జనులకు బహుమతీ లభించి తీరుతాయి. తాత్కాలికంగా అసత్యం గెలవవచ్చు. మనచుట్టూ ఉన్నవాళ్లు అక్రమపద్ధతిలో లాభాలు గడించవచ్చు. వాళ్ళను జూచి మనంగూడ ప్రలోభానికి లొంగి అక్రమ పద్ధతులకు పాల్పడబోతాం. కాని ఇది పొరపాటు. అక్రమమార్గాలవల్ల ఇప్పుడు తాత్కాలిక లాభం కలిగినా చివరకు న్యాయ నిర్ణయదినాన మన దుర్మార్గం రుజువౌతుంది. శిక్షపడుతుంది. కనుక మనం సత్యమార్గాన్ని ఏనాడు విడనాడకూడదు. దుష్టుల దుష్కార్యాలను జూచి ప్రలోభం చెందకూడదు. 73వ కీర్తన ఈ సంగతినే చెప్తుంది.

"నేను గర్వాత్ములనుగాంచి అసూయ జెందాను
దుర్మార్గులు వృద్ధిలోనికి వస్తున్నారని గ్రహించి
ప్రలోభంలో జిక్కుకొన్నాను
జారిపడిపోవడానికి సంసిద్ధుడ నయ్యాను
దుష్టులు సంపన్ను లౌతున్నారు

రోజురోజుకీ ఇంకా సంపన్ను లౌతున్నారు
మరి నేను విశుద్ధుణ్ణిగా జీవించడంవల్ల ఫలితమేమిటి?
దుష్కార్యాలు విడనాడ్డం వలన లాభమేమిటి?
నేనీ సమస్యలను అర్థం జేసికోజూచాను
కాని అది నాకు దుర్గ్రహమైంది
అంతలో ఒకనాడు నేను దైవరహస్యాన్ని గ్రహించాను
దుష్టుల కేలాంటిగతి పడుతుందో తెలిసికొన్నాను
వాళ్ళు క్షణకాలంలో నాశమౌతారు
ఘోరవినాశానికి జిక్కి కంటికి కన్పించకుండా బోతారు".

3. మనం ఆనాడు ప్రభువు న్యాయనిర్ణయానికి తట్టుకోవాలంటే ఇప్పుడు న్యాయయుక్తంగా జీవించాలి. ప్రతిరోజూ ఈనాడే నాకు న్యాయనిర్ణయం జరగవచ్చుననుకొని విశుద్ధంగా బ్రతకాలి. పునీతులు ఈలా చేసారు. మనలో ప్రతివాణ్ణి దేవుడు ప్రతిరోజూ, ప్రతిక్షణమూ గమనిస్తూనే వుంటాడు కదా! ప్రతిరోజూ, ప్రతిక్షణమూ అతడు మన తలంపులకూ మాటలకూ చేతలకూ తీర్పుతీరుస్తూనే ఉంటాడు కదా! ఈ తీర్పే న్యాయనిర్ణయ దినాన గూడ లెక్కలోకి వస్తుంది. కనుకనే మనం ప్రతిరోజూ ఈదినమే నాకు తీర్పు జరుగుతుందేమో ననుకోవాలి అని చెప్పాం. మనం నరులను మోసగించినా దేవుణ్ణి మోసగించలేం. నరుల దృష్టిలో మనకు విలువ వుండవచ్చు. కాని అది లెక్కలోనికి రాదు. దేవుని దృష్టిలో ఉండే విలువే నిజమైన విలువ. కనుక మనం అనుక్షణమూ అనుదినమూ నిజాయితీతో జీవించాలి. ఈ సందర్భంలో బైబులు అబ్రాహాము హనోకులాంటి పుణ్యపురుషులు దేవుని సన్నిధిలో నడచారని చెప్తుంది. అనగా వాళ్లు చిత్తశుద్ధితోను దైవభక్తితోను జీవించారని భావం. ఈ భాగ్యం మనకుకూడ అబ్బితే యెంత బాగుంటుంది!

4. మన భవిష్యత్తుని మనమే నిర్ణయించుకొంటాం. ఇక్కడ మనం చేసే ప్రతి పుణ్యకార్యమూ మనం నిర్మించుకొనే మోక్షసౌధంలో ఓ రాయి ఔతుంది. అలాగే ఇక్కడ మనం చేసే ప్రతిపాపకార్యమూ పరలోకంలోని మన శిక్షామందిరంలో ఓ రాయి ఔతుంది. ప్రభువు మనం ఇప్పుడు చేసే మంచి చెడ్డలకే అప్పుడు తీర్పు తీరుస్తాడు. అసలు మన తీర్పుని మనమే తయారు చేసుకొంటాం. న్యాయనిర్ణయ దినాన దేవుడు ఆ తీర్పుని మాటలతో ప్రకటిస్తాడు, అంతే. కనుక ప్రస్తుతం మనం ఏలాంటి జీవితం జీవిస్తున్నాము అనేదానిమీదనే అంతా అధారపడి ఉంటుంది.

5. సాధారణ తీర్పు ప్రధానంగా సంఘీభావం కొరకు ఉద్దేశింపబడిందని చెప్పాం. ప్రభువు తన జ్ఞానశరీరానికంతటికీ కలిపి తీర్పు తీరుస్తాడని చెప్పాం. కనుక ఈ జీవితంలో తోడి నరులను పట్టించుకోవడమూ, సోదర ప్రేమను పాటించడమూ చాల ముఖ్యం. ఇండియాలాంటి పేదదేశంలో ఉన్నవాళ్లు లేనివాళ్ళను ఆదుకొంటూండాలి. మనకు నాల్గు ముద్దలుంటే ఏమీలేనివాడికి ఓ ముద్ద పెట్టాలి.

6. మనం న్యాయాధిపతియైన దేవుణ్ణిజూచి భయపడాలి. అతడు ఏ నరునికీ పక్షపాతం చూపించడు. ఎవరినీ వదిలిపెట్టడు. మన పాపపుణ్యాలకు తగినట్లుగా మనకు ప్రతిఫలమిస్తాడు. అంచేత మనం నిరంతరమూ భయభక్తులతో జీవించాలి. ఇప్పుడు భయంతో జీవించేవాడు మరణాంతంలో వచ్చే న్యాయనిర్ణయ సమయంలో భయపడనక్కరలేదు.

# 3. నరకం

నరుల్లో కొందరు బుద్ధిపూర్వకంగా దేవుని రక్షణాన్ని నిరాకరిస్తారు. నిత్యజీవాన్ని పోగొట్టుకొంటారు. దేవుని సాన్నిధ్యాన్ని కోల్పోతారు. ఇదే నరకం. ఈ అధ్యాయంలో రెండంశాలు పరిశీలిద్దాం.

## 1. నరకాన్ని గూర్చిన బైబులు బోధలు

### 1. తొలి మూడు సువిశేషాల భావాలు

క్రీస్తు తన బోధల్లోను సామెతల్లోను నరకాన్ని చాలసార్లు ప్రస్తావించాడు. ఒక్క మత్తయినే తీసికొంటే, గోదుమలు కలుపు మొక్కలు అనే సామెతలో పాపాత్ములను అగ్నికుండంలో పడద్రోసారు - అక్కడ ఆ పాపులు ఏడుస్తూ పండ్లుకొరుకుకొంటారు - 13,42. పెండ్లివిందు అనే సామెతలో వివాహవస్త్రం లేకుండా వచ్చినవాడిని కాళ్ళు చేతులు కట్టి వెలుపలి చీకటిలోనికి త్రోసివేసారు. అక్కడ అతడు విలపిస్తూ పండ్లు కొరుకుకుంటాడు- 22,13. పదిమంది కన్యలు అనే సామెతలో పెండ్లి కుమారుడు ఐదుగురు కన్యలను వివాహశాల నుండి బహిష్కరిస్తూ నేను మిమ్ము ఎరుగనే ఎరుగను అనిపల్కాడు - 25,12. యూదుల సంప్రదాయం ప్రకారం శిష్యులేమైనా తప్పుచేస్తే రబ్బయిలు వాళ్ళను శిష్యబృందం నుండి ఏడునాళ్ళపాటు బహిష్కరించి ఈ మాటలు పలికేవాళ్లు. కనుక ఇక్కడ ఈ వాక్యంలో పెండ్లికుమారుడు ఈ యైదుగురు కన్నెలను తన సన్నిధిలోనుండి బహిష్కరించాడు అనుకోవాలి. ముగ్గురు సేవకులు అన్న సామెతలో డబ్బుని వృథాగా నేలలో పాతిపెట్టిన

సేవకుణ్ణి వెలుపలి చీకటిలోనికి త్రోసివేసారు. అచటివాళ్లు ఏడుస్తూ పండ్లు కొరుకుకొంటారు - 25,30. కడతీర్పు సామెతలో శాపగ్రస్తులను నిత్యాగ్నిలోనికి పంపారు. అది పిశాచమూ దాని దూతలూ ఉండేచోటు - 25,41. ప్రభువు పేరుమాత్రము వాడుకొంటూ అతని బోధలను పాటించకుండా ఉండేవాళ్ళతో అతడు దుష్టులారా! మీరు నానుండి తొలగిపొండి. నేను మిమ్మును ఎరుగనే యెరగను అని చెప్తాడు-7,23. బహుశా అన్నికటింటె కఠోరమైన వాక్యం మార్కు సువిశేషంలో వస్తుంది. ఇతరులను అపమార్గం పట్టించేవాళ్ళను నరకంలో త్రోస్తారు. అక్కడ వాళ్ళ పురుగు చాపదు, అగ్ని చల్లారదు - 9,48.

పైన మనం పేర్కొన్న వాక్యాలన్నిటినీ పరిశీలిస్తే నరక వర్ణనలోని ముఖ్యాంశాలు ఇవి. అది అగ్నిగుండం. చీకటి చెరసాల. అక్కడ పిశాచమూ దాని దూతలూ ఉంటారు. దానిలోనివాళ్లు దుఃఖంతో ఏడుస్తూ పండ్లు కొరుకుకొంటూ ఉంటారు. అక్కడివాళ్ళను ప్రభువు తన సన్నిధిలో నుండి బహిష్కరించాడు. అక్కడి నిప్పు ఆరక మండే నిత్యాగ్ని. అక్కడి వాళ్ళ పురుగు చావదు.

## 2. యోహాను, పౌలు భావాలు

యోహాను తొలి మూడు సువిశేషాల్లాగా వర్ణనలకు పూనుకోడు. కనుక అతడు నరకాగ్నిని గూర్చి చెప్పేప్పుడు అగ్నిగుండం, పండ్లు కొరకడం మొదలైన ప్రయోగాలు అట్టేవాడడు. అతని దృష్టిలో నరకం మృత్యువూ, అంధకారమూ. క్రీస్తు జీవమూర్తి. మనకుకూడ జీవాన్ని ప్రసాదించేవాడు. అతన్ని నిరాకరించేవాళ్ళు మృత్యువుని చవిజూస్తారు. అదేనరకం. కుమారుని విశ్వసించేవాడు నిత్యజీవాన్ని పొందుతాడు. విశ్వసించనివాడు ఆ జీవాన్ని ఎంతమాత్రమూ పొందలేడు. దేవుని కోపం అతనిమీద నిలుస్తుంది-3,36. యోహాను ఈమృత్యువుని "రెండవ మృత్యువు" అని కూడ పిల్చాడు. జీవగ్రంథంలో ఎవరి పేర్లు లేవో వాళ్ళనందరినీ అగ్నిగుండంలోకి త్రోస్తారు. ఈ యగ్నిగుండమే రెండవ మృత్యువు - దర్శ 20,14. మొదటి మృత్యువు మన చావే. దీనివల్ల మనం భౌతిక జీవం కోల్పోతాం. రెండవ మృత్యువు నరకం. దీనివల్ల మనం ఆధ్యాత్మిక జీవం కోల్పోతాం.

క్రీస్తు వెలుగు. ఆ వెలుగుని కోల్పోతే మనం చీకటికి జిక్కుతాం. ఆ చీకటే నరకం. "లోకానికి వెలుగుని నేనే. నన్ననుసరించేవాడు చీకటిలో నడవక జీవపు వెలుగుని పొందుతాడు" - 8,12.

ఇక, పౌలు దృష్టిలో నరకం మరణం - రోమా 6,23. వినాశం-ఫిలి 3,19. దేవుని ఆగ్రహం -1తెస్స 1,9.

## 3. నరకాగ్ని అంటే యేమిటి?

మనం మామూలుగా నరకం అనగానే అగ్ని అనుకొంటాం. మత్తయి సువిశేషం ఈ యగ్నిని గూర్చిన భావాన్ని ఎక్కువగా ప్రచారం చేసింది. కాని నరకాగ్ని అనేది కేవలం సాంకేతిక పదం. ఈ పదం భావం ఏమిటి?

పూర్వవేదంలో నిప్పు దేవుని సాన్నిధ్యానికి చిహ్నంగా ఉంటుంది. మోషే మండుతూన్న పొదలో దేవుణ్ణి చూచాడు - నిర్గ 3,2. మళ్ళా సీనాయి కొండమీద నిప్పు మంటల్లో దేవుణ్ణి దర్శించాడు - నిర్గ 19,18. కాని ఈ భావం మనకిక్కడ పనికిరాదు.

పూర్వవేదంలో నిప్పు దేవుని కోపానికీ శిక్షకీ తీర్పుకీ కూడ చిహ్నంగా ఉంటుంది. యెషయా ప్రవక్త దుష్టులను శిక్షించడానికి వచ్చే దేవుణ్ణి వర్ణిస్తూ

"ప్రభువు శక్తి దూరం నుండి విచ్చేస్తూంది
అతని కోపం నిప్పువలె మండుతూంది
దట్టమైన పొగవలె రాజుకొంటూంది
అతని పెదవులు ఆగ్రహపూరితాలై యున్నాయి
అతని జిహ్వ జ్వలించే అగ్గిలా ఉంది"

అని వర్ణించాడు-30,27. నరకాగ్నిని అర్థం చేసికోవడానికి ఈ వర్ణనం కొంతవరకు ఉపయోగపడతుంది.

నిప్పు దైవకోపానికీ శిక్షకీమాత్రమేకాదు, నరుల పాపాలకుగూడ చిహ్నంగా ఉంటుంది. దుష్టుని అతని పాపమే అగ్నిలా దహిస్తుంది. పై ప్రవక్త పాపాత్ములను వర్ణిస్తూ

"ప్రజల పాపాలు అగ్గిలా మండి
ముండ్లపొదల నన్నిటినీ తగులబెడతాయి
ఆ పాపాలు అడవిలోని కారుచిచ్చులా రగుల్కొని
పొగలు వెడలగ్రక్కుతాయి
సర్వశక్తిమంతుడైన ప్రభువు కోపాగ్ని
దేశాన్నంతటినీ కాల్చివేస్తుంది
ప్రజలెల్లరూ ఆ యగ్నికి ఆహుతి యౌతారు"

అని వర్ణించాడు - 9,18-19. ఇంకా అతడు దుష్టులను గూర్చి చెప్తూ "వారి పురుగు చావదు, వారి యగ్గి చల్లారదు" అని చెప్పాడు - 66,24. అనగా దుర్మార్గులు నిరంతరం అగ్నిలో కాలతారు, పురుగులకు మేత ఔతారు అని భావం.

ఈ వర్ణనలనుబట్టి పూర్వవేదంలో నిప్పు దైవకోపాన్నీ నరుల పాపాన్నీ గూడ సూచిస్తుందనుకోవాలి. క్రీస్తు ఈ పూర్వవేద సంప్రదాయంలో పుట్టి చిన్ననాటినుండే ఈ

వర్ణనలు జీర్ణం చేసికొన్నారు. కనుక అతడు నరకాన్ని గూర్చి చెప్పేపుడు గూడ ఈ వర్ణనలను విరివిగా వాడారు.

నూత్నవేదరచయితల్లో యోహాను పౌలు నరకాన్ని ప్రస్తావించేప్పుడు అగ్నిని అట్టే పేర్కొనలేదు. తొలి మూడు సువార్తలూ, విశేషంగా మత్తయి ఈ నరకాగ్నిని విరివిగా వర్ణించాడు. ఇతడు పూర్వవేద సంప్రదాయాన్ని ఎక్కువగా అనుసరించిన రచయిత. ఇతని సువిశేషం కూడ ఆ పూర్వవేదం బాగా తెలిసిన యూదుల కొరకే ఉద్దేశింపబడింది. ఇక ఈ రచయిత దృష్టిలో నరకాగ్ని అంటే యేమిటి? అది వో సాంకేతికమైన పదం. మత్తయి దృష్టిలో ఈ పదానికి దేవునికి కోపమనీ, శిక్ష అనీ, నరుడుతన పాపాలకు పొందే దండనమనీ అర్థం. కావున మనం నరకాగ్ని మన భౌతికమైన నిప్పునిగా అర్థం చేసికోగూడదు. మన భౌతిక పదార్థాలేమీ నరకంలో ఉండవు.

ఇంకా నూత్నవేదం నరకంలో "పురుగు" "గంధకం" ఉంటాయని చెప్తుంది – మార్కు 9,43. దర్శ 14,10. ఇవి కూడ దైవశిక్షను సూచించే సాంకేతిక పదాలే. ఈలాగే నూత్నవేదం మోక్షాన్ని గూర్చి చెప్పేపుడు దాన్ని వివాహోత్సవంగాను, విందుగాను, జీవజలంగాను, వెండి బంగారాలుగాను వర్ణిస్తుంది. అక్కడ సుఖసంతోషాలుంటాయని ఈ వర్ణనల భావం. కావున ఇవన్నీ వట్టి సంకేతాలు, ఉత్ప్రేక్షలు. మోక్షాన్నీ నరకాన్నీ గూర్చిన ఈ వర్ణనలను ఉన్నవాటిని ఉన్నట్లుగా అర్థం చేసికోగూడదు. ఇవి సూచించే భావాన్ని మాత్రం గ్రహించాలి.

సంగ్రహంగా నరకాగ్ని అంటే యేమిటి? నరుని అతని పాపమే దహిస్తుంది. ఈ స్వీయపాపాన్నే యెషయా అగ్ని అని పేర్కొన్నాడని చెప్పాం. కనుక నరకంలో ఉన్నవాళ్ళని వాళ్ళకి వెలుపలవున్న వస్తువేదో వచ్చి దహింపదు. అసలు అలాంటి వస్తువేదీ నరకంలో ఉండదుకూడ. పాపభరితమైన దుష్టుల అంతరాత్మే ఆ దుష్టులను బాధిస్తుంది. వాళ్ళు బుద్ధిపూర్వకంగా దైవదర్శనాన్ని కోల్పోయారు కనుకను, ప్రేమగల తండ్రివంటివాడైన దేవుణ్ణి బుద్ధిపూర్వకంగా నిరాకరించారు కనుకను, వాళ్ళ అంతరాత్మ వాళ్ళని లోలోపలే బాధిస్తుంది. ఈలోపలి బాధనే బైబులు అగ్ని అని పిలుస్తుంది. దీనికిమించి వేరే అగ్ని యేది నరలోకంలోలేదు.

## 2. దైవసాన్నిధ్యాన్ని కోల్పోవడమే నరకం

### 1. నరకాన్ని గూర్చిన ముఖ్యాంశం ఏమిటి?

పూర్వాంశంలో నరుని అంతరాత్మ అతన్ని పీడించడమే నరకాగ్ని అనిచెప్పాం. కాని ఈ యంతరాత్మ నరుణ్ణి ఎందుకు బాధపెడుతుంది? అతడు బుద్ధిపూర్వకంగా

దైవసాన్నిధ్యాన్ని కోల్పోయాడు కనుక. ఈలా దైవసాన్నిధ్యాన్ని కోల్పోవడమే నరకాన్ని గూర్చిన ముఖ్యాంశం.

భగవంతుడు నరుణ్ణి తనకొరకే చేసాడు. అతని హృదయంలో తనమీద శాశ్వతమైన కోర్కెనుగూడ పెట్టాడు. అందుకే ప్రతినరుడూ సహజంగానే భగవంతుణ్ణి వాంఛిస్తాడు. కాని కొందరు బుద్ధిపూర్వకంగానే ఈ వాంఛను అణగద్రొక్కుకొంటారు. చావైన పాపంచేసి భగవంతునినుండి వైదొలగుతారు. అతన్ని నిరాకరిస్తారు. ఈ స్థితిలోనే చనిపోతారు. మరణానంతరం ఇక మనసు మార్చుకోవడమనేది ఉండదు. కనుక, వాళ్లు నరకంలో గూడ భగవంతుణ్ణి నిరాకరిస్తారు. అతని సాన్నిధ్యంనుండి వైదొలగుతారు. ఈలా బుద్ధిపూర్వకంగా భగవంతుణ్ణి నిరాకరించి అతని సాన్నిధ్యంనుండి వైదలొగడమే నరకం. సంగ్రహంగా చెప్పాలంటే దైవసాన్నిధ్యాన్ని దైవదర్శనాన్ని కోల్పోడమే నరకం. భగవంతుణ్ణి పొందితే మనకు పూర్ణానందం కలుగుతుంది. అతన్ని కోల్పోతే మనకు దుఃఖం కలుగుతుంది. కనుక నరకం దుఃఖమయమైంది.

మనం మామూలుగా నరకాన్ని ఓ తావుగా భావిస్తాం. కాని అదితావుకాదు. ఓస్థితి. దేవుణ్ణి కోల్పోయి దుఃఖించే స్థితి.

## 2. నరక శిక్షను ఎవరు విధిస్తారు?

మామూలుగా దేవుడే నరుణ్ణి నరకానికి పంపిస్తాడని అనుకొంటాం. **అతడు** మనం బ్రతికివున్నపుడు ప్రేమను చూపేవాడే ఐనా, మన మరణానంతరం **కఠినంగా** ప్రవర్తిస్తాడని యెంచుతాం. కానియిది పొరపాటు. దేవుడు ఎప్పుడూ **ప్రేమమయుడే.** అతని ప్రేమ ఏనాడూ మారదు. దేవుడు మనకు నరకాన్ని నిర్ణయించడు, మనమే దాన్ని నిర్ణయించుకొంటాం. అతడు ఓమారు మనకు స్వేచ్ఛను ఇచ్చాక ఆ స్వేచ్ఛను మన్నిస్తాడు. మనం ఆ స్వేచ్ఛను దుర్వినియోగం చేసికొంటున్నా చూస్తూఊరకుంటాడేగాని మనలను నిర్బంధం చేయడు. నరుడు తన స్వాతంత్ర్యాన్ని దుర్వినియోగం చేసికొని నరకానికి పోవడం చూచి భగవంతుడు దుఃఖిస్తాడు. అతని ప్రేమ అంత గొప్పది. అతడు ఓయి నరుడా! నీదుష్ట చిత్తం భూమిమీదవలె నరకంలోకూడ నెరవేరునుగాక అని చెప్తాడు. నరకందేవుడు నరునికిపెట్టే శిక్షకాదు. నరుడు తనకు తానే విధించుకొనేశిక్ష. అది దేవుడు విధించే మరణశిక్షకాదు, నరుడు బుద్ధిపూర్వకంగా చేసికొనే ఆత్మహత్య. పాపంద్వారా నరుడు దేవుణ్ణి నిరాకరిస్తాడు. ఆ నిరాకరణమే కడన నరకంగా రూపొందుతుంది. పశ్చాత్తాపపడని పాపమే నరకం.

నరకంలోని వాళ్ళకు పూర్ణ స్వేచ్ఛ ఉంటుంది. ఐనా వాళ్ళు పశ్చాత్తాపపడరు, పడలేరుకూడ. పాపి తనపాపాలకు పశ్చాత్తాపపడాలంటే దేవుని వరప్రసాదం అవసరం. నరకంలోని పాపాత్ములకు ఈ వరప్రసాదం లభించదు.

భగవంతుడు అందరిని గాఢంగా ప్రేమిస్తాడు. ఈ ప్రేమవల్లనే అతడు అందరు నరుల్లోను తనపట్ల గాఢమైన ఆకర్షణను పెడతాడు. కనుకనే మనందరి హృదయాలు సహజంగానే భగవంతుణ్ణి కోరుకుంటాయి. పాపి ఈ కోరికను తాత్కాలికంగా అణచివేసికోగలడేగాని దాన్నిమాత్రం హృదయంలోనుండి నిర్మూలించలేడు. ఇక, నరకంలోని వాళ్ళకుకూడ భగవంతునిమీద గాఢమైన కోరిక ఉంటుంది. వాళ్లు ఒకవైపున తమ స్వేచ్ఛను దుర్వినియోగం జేసికొని భగవంతుణ్ణి నిరాకరిస్తుంటారు. మరొకవైపున హృదయంలోని సహజవాంఛవలన అతనివైపు ఆకర్షితులౌతూంటారు. ఈ నిరాకరణ ఆకర్షణల మధ్య ఘోరమైన ఘర్షణ జరుగుతూంటుంది. ఇది మహాబాధ. నరకవాసులు దేవుణ్ణి ద్వేషిస్తూ ఉంటారు, అతన్ని వాంఛిస్తూ ఉంటారుకూడ. దేవునివైపు ఆకర్షితులౌతూంటారు, అతనినుండి వెనుకకు త్రోయబడుతూంటారుకూడ. దేవునివైపు తిరుగుతూంటారు, అతనినుండి మొగం త్రిప్పుకొంటూంటారుకూడ. ఈ విపరీత చర్యలవల్ల వాళ్ళకు కలిగే బాధ అంతాయింతాకాదు. భగవంతునిపట్ల నరునికుండే సహజవాంఛ నరునిపట్ల భగవంతునికుండే ప్రేమకు నిదర్శనం. అలాంటి ప్రేమమయుడైన దేవుడు నరునికి నరకాన్ని విధించడు. కనుక నరకం దేవుడు చేసింది కాదు, అతడే స్వయంగా చేసికొనేది. దేవుడు నరునికి ద్రోహం చేయడు. నరుడే దేవునికి ద్రోహం చేస్తాడు.

## 3. నరకం శాశ్వతమైంది

నరకం శాశ్వతంగా ఉండిపోతుంది. అనగా పాపి నిరంతరమూ నరకంలో ఉండిపోతాడు. అతడు పశ్చాత్తాపపబడి, పాపపరిహారంపొంది మళ్ళా దేవుని సన్నిధిలోకి రాలేడు. ఎందుకంటె మనం చనిపోయేప్పుడు ఏస్థితిలో ఉంటామో ఇక ఆ స్థితిలోనే శాశ్వతంగా ఉండిపోతాం. చనిపోయాక మళ్ళా మనసు మార్చుకోవడమూ ఉండదు. కనుక నరకంలోని పాపులు ఏనాటికీ పశ్చాత్తాపపడరు. కనుకనే నరకం శాశ్వతమైందని చెప్తాం.

"శాశ్వతం" అనే పదమే మనకు భీతిని పుట్టిస్తుంది. నరకశిక్షకు ఏనాడూ అంతంలేదు. ఆ బాధ ఏనాడూ ముగియదు. ఈలోకంలో కొంచెం జాగ్రత్తగా ప్రవర్తించినట్లయితే నరకంలోనివాళ్ళు తమశిక్షను తప్పించుకొని వుండేవాళ్ళే. వాళ్లు తమ అజాగ్రత్తవల్లా అహంకారంవల్లా ఆ దండనను చేతులార కొని తెచ్చుకొన్నారు. తాముదాన్ని తప్పించుకోగలిగి కూడ తప్పించుకోలేదు. కనుక తప్పు పూర్తిగా తమదేనని అంతరాత్మ

వాళ్ళను చీవాట్లు పెడుతూంటుంది. కావున వాళ్ళు నిరంతరమూ పండ్లు కొరుకుకొంటూ దుఃఖిస్తూంటారు. ఆ దుఃఖం ఘోరాతిఘోరమైంది.

మత్తయి 25వ అధ్యాయంలో కడతీర్పుసామెత వస్తుంది. ఈ కథలో విభిన్న భావాలు జంటలు జంటలుగా కన్పిస్తాయి. న్యాయాధిపతికి కుడివైపున గొర్రెలూ ఎడమవైపున మేకలూ ఉంటాయి. అతడు దీవింపబడినవాళ్ళను తనచెంతకు రండని పిలుస్తాడు. శపింపబడిన వారలతో పొండని చెప్తాడు. ఈ యధ్యాయంలో కడపటిదైన 46వ వాక్యం "వాళ్లు నిత్యశిక్షకు వెడలిపోతారు, నీతిమంతులు నిత్యజీవంలో ప్రవేశిస్తారు" అని చెప్తుంది. ఈ వాక్యం చెప్పేదాన్నిబట్టి నీతిమంతులు "నిత్యజీవం" పొందుతారు. ఈ నిత్యజీవం కొన్నాళ్ళు మాత్రమే ఉండేది కాదు, శాశ్వతమైంది. ఇక, దీనికి భిన్నంగా పాపాత్ములకు సిద్ధించే నిత్యశిక్షకూడ శాశ్వతమైంది. అనగా ఆ శిక్షగూడ కొన్నాళ్ళు మాత్రమే ఉండేదికాదు, అనంతమైంది. ఇక్కడ నిత్యజీవముంటే మోక్షం. నిత్యశిక్ష అంటే నరకం. ఐతే మోక్షమేలా శాశ్వతమైందో, నరకంకూడ అలాగే శాశ్వతమైంది. అవి రెండూ నిత్యమైనవే. నరకం నిత్యమైందనడానికి మత్తయి 25,46 గట్టి ఆధారం.

కనీసం ఐదవ శతాబ్దంనుండయినాసరే నరకం శాశ్వతమైందనే భావం తిరుసభలో కన్పిస్తూంది. 1215లో తిరుసభ ఈవేదసత్యాన్ని అధికారపూర్వకంగా ప్రకటించింది కూడ.

## ప్రార్థనా భావాలు

1. మనం నరుల్లో అధిక సంఖ్యాకులు నరకానికి వెళ్తారని అనుకోగూడదు. దేవుని కరుణవల్ల చాలమంది రక్షణం పొందుతారు. అలాగంటే అక్కడి కెవ్వరూ వెళ్ళరని భావించకూడదు. నరకానికి పోయేవాళ్ళుకూడ లేకపోలేదు. ప్రభువు చెప్పిన కడతీర్పు సామెతను బట్టి కొందరు రూఢిగా నిత్యశిక్షను పొందుతారని అర్థంచేసికోవాలి. కనుక మనంకూడ నరకానికిపోవచ్చు. ఇది అసంభవంకాదు. ఈ జీవితంలో మనం మాటిమాటికీ మంచికీచెడ్డకీ మారుతూంటాం. పుణ్యంతో పాటు పాపాన్ని కూడ చేస్తూంటాం. కనుక మన తరపున మనం ఎల్లప్పుడూ భయభక్తులతో జీవిస్తూండాలి. దైవభీతి లేనివాడు, నరకాన్ని పట్టించుకోనివాడు, తప్పక చెడతాడు. ఇగ్నేష్యస్ భక్తుడు మనలోని దైవప్రేమ చల్లారినపుడు నరక భయం వలనైనా మనం పాపంనుండి వైదొలగాలని చెప్పాడు. కనుక నరకభయం మంచిది. దాన్ని ఏనాడూ మర్చిపోకూడదు.

2. కాని ఈ భయంతోపాటు మనకు దేవునిపట్ల నమ్మకంకూడ ఉండాలి. మానవులందరూ రక్షణాన్ని పొందాలనే దేవుని కోరిక - 2తిమో 2,4. దేవుడు మనలను నరకానికికాదు, మోక్షానికే సృజించాడు. మనం బుద్ధిపూర్వకంగా దేవునికి

ఎదురు తిరిగితేతప్ప, నరకానికి పోనక్కరలేదు. క్రీస్తు సిలువ మీద చనిపోయిందికూడ మనలను శిక్షించడానికికాదు, రక్షించడానికే. కనుక మనం రక్షణం పొందవచ్చు, పొందాలి.

3. మన తరపున మనం నరకాన్ని గూర్చి ధ్యానం చేసికొంటూండాలి. బుద్ధి పూర్వకంగా దేవునిప్రేమను నిరాకరించి శాశ్వతంగా అతని సాన్నిధ్యంనుండి వైదొలగడం భయంకరమైన నేరం. మన హృదయంలో ఆ భగవంతుని మీదవుండే సహజ వాంఛను బుద్ధిపూర్వకంగా అణచుకోవడం ఘోరమైంది. నరకానికి పోయామంటే మన యీ జీవితాన్నే నాశం చేసికొన్నామన్నమాటే. ఈ జీవిత గమ్యాన్ని చేరుకోలేకపోయామన్నమాటే. ఈ జీవితంలో విజయాన్ని సాధించలేక ఓడిపోయామన్నమాటే. ఇంతకంటే దౌర్భాగ్యమేముంటుంది? కనుక భక్తుడు తరచుగా నరకాన్ని స్మరించుకొంటూండాలి, దానికి భయపడుతూండాలి.

గురువులు మొదలైనవాళ్ళు నరకాన్ని గూర్చి బోధిస్తూండాలి. అది మన విశ్వాస సత్యాల్లో ప్రధానమైనది కాదు. కాని మనం అహంకారంవల్ల అక్కడికిపోయే అవకాశం ఉంది. కనుక మన విశ్వాసులకు అప్పుడప్పుడూ దాన్ని గూర్చి చెప్తుండాలి. నేడు చాలమంది బోధకులు నరకాన్ని గూర్చి అసలు మాట్లాడ్డమేలేదు. ఇది దురదృష్టకరం.

# 4. ఉత్తరించే స్థలం

క్రీస్తుని విశ్వసించి వరప్రసాద స్థితిలో చనిపోయిన వాళ్ళకుగూడ పరిశుద్ధుడైన దేవుణ్ణి దర్శించడానికి చాలినంత పావిత్ర్యం ఉండకపోవచ్చు. వాళ్ళ ఆత్మలో ఇంకా మాలిన్యం ఉండవచ్చు. ఈ మాలిన్యాన్ని తొలగించడానికి ఉద్దేశింపబడిందే ఉత్తరించే స్థలం. ఈ యధ్యాయంలో నాల్గంశాలు పరిశీలిద్దాం.

## 1. ఉత్తరించే స్థలం అంటే ఏమిటి?

పాపశిక్ష నిత్యశిక్ష, అనిత్యశిక్ష అని రెండు రకాలుగా ఉంటుంది. నిత్యశిక్ష అంటే నరకం. అనత్యశిక్ష అంటే కొన్ని తాత్కాలిక బాధలు అనుభవించడం. మనం మనపాపాలకు చక్కగా పశ్చాత్తాపపడి పాపసంకీర్తనం చేసికొన్నపుడు నిత్యశిక్ష తొలగుతుందేగాని అనిత్యశిక్ష తొలగదు. ఈ యనిత్యశిక్షను తొలగించుకోడానికి ఉద్దేశింపబడిందే ఉత్తరించే స్థలం.

మనకు అనిత్యశిక్ష ఎందుకు వస్తుంది? గాయం నయమయ్యాకగూడ దానిమచ్చ మిగిలివుంటుంది. అలాగే మన పాపాలు పరిహారమయ్యాకగూడ వాటి అవశేషాలు లేక దుష్ఫలితాలు మిగిలివుంటాయి. సృష్టివస్తువులకు అంటిపెట్టుకొని ఉండడం,

చెడ్డనుచేయాలని కోరుకోవడం, తన్ను తాను విపరీతంగా ప్రేమించుకోవడం మొదలైనవి ఈయవశేషాలు. ఈ యవశేషాలవల్లనే మనం అనిత్యశిక్షకు గురౌతాం. భూలోకంలో తపస్సు చేయడంద్వారా ఈ యనిత్యశిక్షను తొలగించుకోవచ్చు. అలా చేయనివాళ్లు పరలోకంలో దాన్ని తొలగించుకోవలసి ఉంటుంది. ఈలా తొలగించుకోడానికి ఉద్దేశింపబడిందే ఉత్తరించే స్థలం.

తెలుగులో "ఉత్తరించే స్థలం" అన్నమాట పూర్వవేదశాస్త్రులు కల్పించింది. దాటిపోయే తావు అని ఈమాటకర్థం. అనగా వరప్రసాద స్థితిలో చనిపోయినవాళ్ళు ఈ తావుగుండా మోక్షానికి దాటిపోతారు. మొదట ఇక్కడ శుద్ధిని పొంది తర్వాత మోక్షాన్ని చేరుకొంటారు. ఉత్తరించే స్థలంలో జరిగే ప్రధాన కార్యం ఆత్మ తన మాలిన్యం నుండి శుద్ధిని పొందడం. కనుక దాన్ని శుద్ధీకరణ స్థలం అనిగానీ, ప్రాయశ్చిత్త స్థలం అనిగానీ పిలవడం ఉచితం.

మన మనుష్యభాషలో మోక్షనరకాలనూ ఉత్తరించే స్థలాన్నీ "స్థలాలు" అని పేర్కొంటాం. కాని ఇవి స్థలాలు కానేకావు. ఇవి మన ఆత్మకు పట్టే స్థితులు లేక దశలు. ఐనా సామాన్య ప్రజలకుగూడ అర్థంకావడంకోసం వీటిని స్థలాలు అంటూంటాం.

మోక్షనరకాలు శాశ్వతంగా ఉంటాయి. ఉత్తరించే స్థలం శాశ్వతమైంది కాదు. దానికి కాలపరిమితి లేదు. అసలు మన కాలం దానికి వర్తించదు. మన భాషలో చెప్పాలంటే, ఉత్తరించే స్థలానికి వెళ్ళిన ఆత్మలు బహుశ అతిస్వల్పకాలం మాత్రమే అక్కడ వుంటాయి. పూర్వవేదశాస్త్రులు కొన్ని ఆత్మలు లోకాంతంవరకుగూడ ఆ తావులో ఉండిపోవచ్చునని భావించారు. ఇప్పటి వేదశాస్త్రులు ఈ భావాన్ని అంగీకరించరు.

నరకంలో మన భౌతికమైన నిప్పు ఉండదని చెప్పాం. ఉత్తరించే స్థలంలోగూడ భౌతికమైన నిప్పు యేదీ ఉండదు. దేవుణ్ణి దర్శించలేకపోవడమే అక్కడి ఆత్మలు అనుభవించే ప్రధాన శిక్ష.

## 2. బైబులు బోధ

బైబులు ఉత్తరించే స్థలాన్ని గూర్చి ప్రత్యక్షంగా ఏమీ చెప్పదు. బైబులు మొత్తంలోను ఉత్తరించే స్థలాన్ని సమర్థించే అలోకనం ఒక్కటే లభిస్తుంది. అదికూడ పరోక్షమైంది. యూదా మక్కబీయుడు అదుల్లాం నగరంలో యుద్ధం చేస్తూండగా అతని సైనికులు స్థానిక దేవతల బొమ్మలను తమ శరీరాలమీద తాయెతులుగా ధరించారు. ఈ కార్యంద్వారా వాళ్లు ధర్మశాస్త్రాన్ని మీరి పాపం కట్టుకొన్నారు. ఈ పాపానికి శిక్షగా వాళ్లు యుద్ధంలో కూలారు. యూదా రెండువేల వెండి నాణాలు యెరూషలేముకు పంపించి యుద్ధంలో దుర్మరణం చెందిన సైనికుల కొరకు పాపపరిహారబలిని అర్పింపజేసాడు-2

మక్క 12,39-45. ఈ సంఘటననుబట్టి మనం చనిపోయినవాళ్ళ పాపపరిహారానికి బలులూ ప్రార్థనలూ సమర్పింపవచ్చునని అర్థం చేసికోవాలి.

ఈ వేదసత్యం బైబుల్లో కన్పించదని చెప్పాం. కాని బైబుల్లో స్పష్టంగాలేని వేదసత్యాలుకూడ తొలినాటి క్రైస్తవుల్లో వ్యాప్తిలోకి వచ్చాయి. ఉత్తరించే స్థలాన్ని గూర్చిన వేదసత్యం గూడ ఈలాంటిదే. తొలిరోజుల్లోనుండి "అర్చ్య శిష్టుల సంబంధ ప్రయోజనం" అనేది వాడుకలో ఉంది. అనగా మోక్షంలోని విజయక్రైస్తవులు, ఉత్తరించే స్థలంలోని బాధామయ క్రైస్తవులు, భూలోకంలోని యుధ్యమాన క్రైస్తవులు ఒకరికొరకొకరు ప్రార్థనలు చేసికోవడమూ, ఒకరినుండి ఒకరు జ్ఞానలాభాలు పొందడమూ తొలినాళ్ళనుండి వాడుకలో ఉంది. ఈ సంప్రదాయం ప్రకారం ఈ లోకంలో బ్రతికివున్న క్రైస్తవులు చనిపోయిన తమ బంధువుల పాపపరిహారానికి ప్రార్థన లర్పించేవాళ్లు.

ఇంకా తొలిరోజులనుండి చనిపోయినవారికొరకుకూడ పూజలో ప్రార్థన లర్పించేవాళ్లు. ప్రస్తుత పూజలో ఈ ప్రార్థనం "ఉత్థాన మౌతామనే నమ్మకంతో చనిపోయిన మా సోదరీ సోదరులనూ, మీకనికరమందు చనిపోయినవారందరినీ స్మరించండి" అనే వాక్యంలో కన్పిస్తుంది.

ఈలా క్రైస్తవుల పరస్పర ప్రార్థనలు, పూజబలి ప్రార్థనలు అనే రెండు క్రియలద్వారా ఉత్తరించే స్థలంలోని ఆత్మలకొరకు ప్రార్థనలు చేయడం అనే సంప్రదాయం వ్యాప్తిలోకి వచ్చింది. రెండవ శతాబ్దంలోనే ఈ సంప్రదాయం వాడుకలో ఉన్నట్లు తెలుస్తూంది. నాల్గవ శతాబ్దంలో అగస్టీను భక్తుడు ఈ సంప్రదాయాన్ని స్పష్టంగా పేర్కొన్నాడు. అతడు చనిపోయినవాళ్ళు సాంకేతికమైన నిప్పులో కాలి తమ మాలిన్యాన్ని తొలగించుకొని శుద్ధిని పొందుతారని చెప్పాడు. ఈ శుద్ధీకరణం మరణ సమయంలో జరగవచ్చునని అభిప్రాయపడ్డాడు. ఈ కార్యాన్నే ఇప్పుడు మనం ఉత్తరించే స్థలం అని పేర్కొంటున్నాం. ఈలా ఉత్తరించే స్థలాన్ని గూర్చిన వేదసత్యం బైబుల్లో స్పష్టంగా లేకపోయినా తొలినాటి క్రైస్తవుల్లో క్రమేణ వ్యాప్తిలోకి వచ్చింది. క్రైస్తవమతానికి బైబులొక్కటేగాదు, తొలినాటి క్రైస్తవ పారంపర్యబోధకూడ ఆధారం. బైబుల్లో లేదన్న కారణంతో నేడు ప్రోటస్టెంటు శాఖలు ఉత్తరించే స్థలాన్ని అంగీకరించవు.

## 3. ఉత్థాన క్రీస్తువల్లా, పవిత్రాత్మవల్లా శుద్ధి

మామూలుగా మనం ఉత్తరించేస్థలం బాధలనుభవించే స్థలం అనుకొంటాం. కాని అది ప్రధానంగా శుద్ధిని పొందే తావు. ఈ శుద్ధి కూడ ఉత్థానక్రీస్తుని కలుసుకోవడం వల్ల లభిస్తుంది. కనుక దాన్ని ఉత్థాన క్రీస్తువల్ల శుద్ధిని పొందే తావునిగా భావించాలి. ఈ శుద్ధి ప్రక్రియలో బాధా ఆనందమూ రెండూ ఉంటాయి.

భగవత్సాన్నిధ్యం కలిగిన నరుడు ఆనందాన్నీ భయాన్నీ కూడ పొందుతాడని చెప్తుంది బైబులు. మోషే మండుతూన్న పొదలో దేవుణ్ణి చూచి ఆనందించాడు, భయపడ్డాడు కూడ. అలాగే యేలీయా హోరేబు కొండమీద దేవుణ్ణిచూచి సంతోషించాడు, భయపడ్డాడు కూడ. నూత్నవేదంలో శిష్యులు తబోరు కొండమీద క్రీస్తు దివ్యరూపాన్ని చూచి సంతోషించారు, భయపడ్డారు కూడ – మత్త 17,2-6. ఇంకా దేవుడు నిప్పులాంటివాడు. ఆ నిప్పు నరుణ్ణి దహిస్తుంది, శుద్ధిచేస్తుంది కూడ.

మన మరణసమయంలో ఉత్థానక్రీస్తు మనకు జ్యోతిర్మూర్తిగా దర్శనమిస్తాడు. మనలను తన జ్యోతిఃప్రవాహంలో ముంచుతాడు. ఆ జ్యోతి మనకు ఆనందకరంగా ఉంటుంది. ఇంకా ఆ పవిత్రమూర్తి తన తేజోకిరణాలతో మనలను శుద్ధిచేస్తాడు గూడ. అతని తేజస్సూ అగ్నీ మన పాపాభిలాషలనూ వస్తువ్యామోహాలనూ స్వార్థపరత్వాన్నీ దహించివేస్తాయి. దీనివల్ల మన ఆత్మ శుద్ధిని పొందుతుంది. ఈ దహనమూ ఈ శుద్ధీకరణమూ మన ఆత్మకు బాధను కలిగిస్తాయి. దైవసాన్నిధ్యం సంతోషాన్నీ బాధనూకూడ కలిగిస్తుంది. కాని ఈ బాధ ద్వారానే మన ఆత్మలోని పాపమాలిన్యం తొలగిపోతుంది. పావిత్ర్యం సిద్ధిస్తుంది. ఉదయాన సూర్యుడు వెలుగొందగానే మంచుబిందువులు కరిగిపోతాయి. అలాగే ఉత్థానమూర్తియైన ప్రభువు సూర్యుడిలా మన ఆత్మమీద ప్రకాశింపగానే దానిలోని మాలిన్యమంతా కరిగిపోతుంది. అది నైర్మల్యాన్ని పొందుతుంది.

దేవుడే మన కడగతి. మనం దేవుణ్ణి పొందినపుడు అతడే మనకు మోక్ష మౌతాడు. అతన్ని కోల్పోయినపుడు అతడే మనకు నరకమౌతాడు. మనకు న్యాయం చెప్పినపుడు అతడే మనకు కడతీర్పు ఔతాడు. మనలను శుద్ధి చేసినపుడు అతడే మనకు ఉత్తరించే స్థలం ఔతాడు. ఈ రీతిగా దేవుడు తన కుమారుడైన క్రీస్తుద్వారా మనకు మోక్షమూ, నరకమూ, కడతీర్పూ, ఉత్తరించే స్థలం అన్నీ ఔతాడు.

అగస్టీను భక్తుడు భావించినట్లు మన శుద్ధీకరణం మరణ సమయంలోనే జరుగుతుంది. మన మరణంకూడ ఈ శుద్ధీకరణంలోను దానివల్ల కలిగే బాధలోను భాగమౌతుంది.

నరులు ఉత్తరించే స్థలంలో ఎంతకాలముంటారనేది మనం కేవలం మనుష్యభాషలో అడిగే ప్రశ్న. ఆ చోటుని అసలు మన కాలంతో కొలవలేం. ఉత్థాన క్రీస్తు మనం చనిపోయే సమయంలో ఒక్క నిమిషంలోనే మన ఆత్మను శుద్ధి చేయవచ్చు. ఈ శుద్ధిలో సంతోషమూ బాధా రెండూ ఉంటాయని చెప్పాం. ఎక్కువ మాలిన్యంకల ఆత్మలు ఒక్క నిమిషంలోనే ఎక్కువ బాధ ననుభవించి పూర్ణశుద్ధిని పొందవచ్చు. కనుక ఉత్తరించే స్థలం మామూలుగా మన మనుకొన్నట్లుగా ఎక్కువకాలముండేది కాదు. కాని అక్కడ ఎక్కువ బాధా, ఎక్కువగా శుద్ధిని పొందడం అనేవి మాత్రం ఉంటాయి.

ఉత్తరించే స్థలానికి కాలం లేనట్లే అక్కడ అగ్నిగూడ ఏమీ ఉండదు. ఉత్థానక్రీస్తే అక్కడ మన జ్యోతీ మన అగ్నీ ఐ మనలను శుద్ధిచేస్తాడు. నూత్నవేదం అతన్ని జ్యోతి అని పిలుస్తుంది -యోహా 1,9. అగ్ని అని కూడ పిలుస్తుంది - దర్శ 1,14.

ఇంతవరకూ ఉత్థాన క్రీస్తుద్వారా మనం శుద్ధిని పొందే తీరును చూచాం. ఇక పవిత్రాత్మద్వారా ఏలా శుద్ధిని పొందుతామో పరిశీలిద్దాం.

పవిత్రాత్మ చాపైన పాపమూ ఒకేసారి నరుల హృదయాల్లో వసింపవు. కాని పవిత్రాత్మా పాపాభిలాషా ఒకేసారి హృదయంలో ఉండవచ్చు. క్రైస్తవుడు మొదట పాపంతోను పాపాభిలాషతోను పుడతాడు. తర్వాతనే పవిత్రాత్మను పొందుతాడు. మన హృదయంలో పాపాభిలాషా పవిత్రాత్మా అనే ఇద్దరు అతిథులూ ఒకరిప్రక్కన ఒకరు జీవిస్తుంటారు. మన జీవితాంతమూ ఈ రెండు శక్తులూ మనలను పరస్పర విరుద్ధమైన రెండు విభిన్న మార్గాల్లోనికి లాగుతూంటాయి. దీనివల్ల మన హృదయంలో ఘర్షణ యేర్పడుతుంది. కాని మరణ సమయంలో ఈ ఘర్షణం అంతరిస్తుంది. అప్పుడు పాపాభిలాష పవిత్రాత్మకు పూర్తిగా లొంగిపోతుంది. ఆ చివరిక్షణంలో మనం పాపవాంఛలు వదలించుకొని పూర్తి పావిత్ర్యాన్ని పొందుతాం.

మెస్సీయానుగూర్చి చెప్తూ స్నాపక యోహాను "నా తర్వాత వచ్చేవాడు మిమ్ము పవిత్రాత్మతోను అగ్నితోను స్నానం చేయిస్తాడు" అని చెప్పాడు - మత్త 3,11. ఆ యాత్మ అగ్నిలాంటిది. కనుకనే పెంతెకోస్తు దినాన అగ్నిలా దిగివచ్చింది. "అగ్నిజ్వాలలు నాలుకల్లా వ్యాపించి అక్కడవున్న ఒక్కొక్కరిపై నిల్చాయి" - అ.చ. 1,3. ఆ యాత్మ జ్ఞానస్నాన సమయంలో మనలోనికి ప్రవేశించింది మొదలు మనలను దహించి శుద్ధిచేస్తూనే వుంటుంది. కాని ఈ దహనక్రియ మన మరణ సమయంలో ఎక్కువౌతుంది. ఆ చివరిక్షణంలో మనలోని పవిత్రాత్మ మహాజ్వాలయై మన హృదయంలోని ప్రతిపాపపుటణువునీ కాల్చి పునీతం చేస్తుంది. ఇదే ఉత్తరించే స్థలం.

ఈలా ఆత్మ మన పాపపుటాత్మను దహించి పునీతం చేస్తూంటే మనకు ఆనందమూ బాధా రెండూ కలుగుతాయి. ఈ సందర్భంలో భక్తురాలు జెనొవా కత్తరీనమ్మ ఈలా నుడివింది. "దేవుని అగ్ని మన హృదయంలోనికి ప్రవేశిస్తూంటే మనలోని పాపపు త్రుప్పు దానికి అడ్డుపడుతూంటుంది. కాని ఆ దివ్యాగ్ని తనకు అడ్డుపడే తుప్పునంతటినీ కాల్చివేస్తుంది. ఆ తుప్పు కరిగిపోయేకొద్దీ మన ఆత్మ దేవుణ్ణి అధికాధికంగా స్వీకరిస్తుంది. దీనివల్ల మన ఆనందం పెరిగిపోతుంది".

పాపాభిలాషా పవిత్రాత్మా రెండూ పరస్పర విరోధ శక్తులుగా మన హృదయంలో వసిస్తూంటాయని చెప్పాం. పాపాభిలాష మనకు దుఃఖాన్ని కలిగిస్తూంటే ఆత్మ మనకు ఆనందాన్ని కలిగిస్తూంటుంది. మృత్యుకాలంలో ఆత్మ ఈ పాపాభిలాషను పూర్తిగా కాల్చి

నాశం చేస్తుంది. ఇదే ఉత్తరించే స్థలం. ఈలా మనలోని పాపాభిలాషంతా భస్మమైపోయాక మనకు పూర్ణానందం కలుగుతుంది. దీనితో మనమనుభవించే ఉత్తరించే స్థలం అంతమౌతుంది. మనం దైవదర్శనానికి సిద్ధమౌతాం. అనగా మనం శుద్ధీకరణ స్థలాన్ని దాటి మోక్షాన్ని ప్రవేశించడానికి పాత్రులమౌతాం. ఈ భాగ్యం మనకు ఉత్థాన క్రీస్తువల్లా అతని ఆత్మవల్లాకూడ సిద్ధిస్తుంది. మన రక్షణ ఘట్టాలన్నిటిలోనూ క్రీస్తూ, అతని ఆత్మా యిద్దరూ కలసే పని చేస్తారు. కాని క్రీస్తూ ఆత్మా మనలను శుద్ధిచేయడానికి ఎంతోకాలం పట్టదు. మన మరణ సమయంలో ఒక్క నిమిషంలోనే ఈ కార్యం జరిగిపోతుంది.

## 4. మన ప్రార్ధనలు ఆలస్యం కావా?

ఉత్తరించే స్థలంలోని ఆత్మలు ఒక్క నిమిషంలోనే శుద్ధిని పొందుతాయని చెప్పాం. మరి మనం ఏటేట చనిపోయిన వాళ్ళకొరకు ప్రార్థనలర్పించడంలో భావం ఏమిటి? మన ప్రార్థనలు ఆలస్యం కావా? చనిపోయినవాళ్లు అంతకుపూర్వమే మోక్షానికి వెళ్ళివుండరా?

నరులమైన మనకు భూతం, వర్తమానం, భవిష్యత్తు అని మూదుకాలాలుంటాయి. దేవుడికి ఈలా త్రికాలాలు ఉండవు. అతనికి అంతా వర్తమానమే. అన్ని కాలాల్లోని సంఘటనలూ అతనికి వర్తమానంలో కండ్లయెదుట జరుగుతూన్నట్లే కన్పిస్తాయి. "దేవుని దృష్టిలో ఒక దినమనిగాని వేయి సంవత్సరాలనిగాని తేడాలేదు. ఆయనకు రెండూ సరిసమానమే" - 2పేత్రు 3,8. కనుక మనం నరులు చనిపోకముందు ప్రార్థించినా, చనిపోయేప్పుడు ప్రార్థించినా, చనిపోయిన తర్వాత ప్రార్థించినా అతనికి అంతా సరిసమానమే ఔతుంది. ఆ ప్రార్థనలన్నీ అతనికి వర్తమాన ప్రార్థనలే ఔతాయి. మనం భూత భవిష్యద్వర్తమానకాలాల్లో చేసే క్రియలన్నీ అతని వర్తమానంలోకి ప్రవేశిస్తాయి. కనుక మనం ఎప్పుడు ప్రార్థనలు చేసినా దేవుడు వాటి నంగీకరించి ఉత్తరించే ఆత్మలను శుద్ధిచేస్తాడు.

ఈ సత్యాన్ని అర్థంచేసికోవడానికి ఓ వుపమానం చూద్దాం. రాబోయే క్రీస్తు సిలువ మరణం ఫలితాలనుచూచి దేవుడు మరియను జన్మపాపరహితనుగా పుట్టించాడు. మరియ పుట్టాక షుమారు యాభై యేండ్లకుగాని క్రీస్తు సిలువ మరణాన్ని అనుభవింపలేదు. ఐనా దేవుని దృష్టిలో మరియ పుట్టువూ క్రీస్తు సిలువ మరణమూ అనే రెండు సంఘటనలు ఏకమయ్యాయి. ఆ రెండూ అతని వర్తమానంలోకి ప్రవేశించాయి. క్రీస్తు సిలువ మరణం యాభైయేండ్లు వెనక్కు జరిగి అతని తల్లిని నిష్కల్మషనుగా పుట్టించింది. మన ప్రార్థనలు

గూడ ఉత్తరించే స్థలంలోని ఆత్మలకు ఈలాగే ఉపయోగపడతాయి. మన కాలం దేవుణ్ణి బాధించదు. మన కాలానికీ ఉత్తరించే స్థలానికీ అసలు సంబంధం లేదనికూడ ముందే చెప్పాం.

ఇక, ఉత్తరించే స్థలంలోని ఆత్మలకొరకు మనం ఏలాంటి ప్రార్థనలు చేయవచ్చు? ఈ భూలోకంలో మనం చేసే పుణ్యక్రియలు ఉత్తరించే స్థలంలోని ఆత్మలకు ఉపయోగపడతాయనేది విశ్వసనీయమైన వేదసత్యం. దీనికి కారణం అర్చ్యశిష్టుల పరస్పర సంబంధం. అనగా మోక్షంలోను ఉత్తరించే స్థలంలోను భూలోకంలోను ఉన్న క్రైస్తవులకు పరస్పర సంబంధం ఉంటుంది. ఒకరి పుణ్యక్రియలొకరికి ఉపయోగపడతాయి. ఒకరి ప్రార్థన లొకరికి ఫలితాన్నిస్తాయి.

మనమట్టుకు మనం ప్రార్థనలూ దానధర్మాలూ ఉపవాసాలూ శ్రమలూ పరిపూర్ణ ఫలాలూ మొదలైనవాటిని ఉత్తరించే స్థలంలోని ఆత్మల పాపపరిహారం కొరకు అర్పించవచ్చు. అన్నిటికంటె ముఖ్యంగా పూజబలి వాళ్ళకుపయోగపడుతుంది. కనుక మనం పూజను వాళ్ళకొరకు అర్పించాలి. పూజలో వాళ్ళను భక్తితో స్మరించుకోవాలి.

## ప్రార్థనా భావాలు

1. ఈ లోకంలో మనం సత్కార్యాలు చేయవచ్చు. వాటిద్వారా పుణ్యాన్ని ఆర్జించవచ్చు. ఈ పుణ్యంద్వారా మన పాపావశేషాలకు మనమే ప్రాయశ్చిత్తం చేసికోవచ్చు. కాని చనిపోయాక మనం ఇక సత్కార్యాలుచేసి పుణ్యాన్ని ఆర్జించలేం. మన పాపాలకు మనం ప్రాయశ్చిత్తం చేసికోలేం. అందుకే ఉత్తరించే స్థలంలోని ఆత్మలు తమకుతాము ఏలాంటి సహాయమూ చేసికోలేరు. తమ పాపావశేషాలకొరకు బాధలుమాత్రం అనుభవించగలరు, అంతే. వాళ్లకు వాళ్లు సహాయం చేసికోలేరు కనుక, మన సహాయం వాళ్ళకు అవసరమౌతుంది. మన సహాయాన్ని పొందకపోతే వాళ్ళు పూర్తిగా శిక్షననుభవించి శుద్ధిని పొందాలి. మనసహాయమందితేవాళ్ళ శిక్ష కొంతవరకు తగ్గుతుంది. కనుక మన పుణ్యకార్యాలద్వారా మనం వాళ్ళశిక్షను తగ్గిస్తూండాలి. ఉత్తరించే స్థలంలోని ఆత్మలు అక్కడున్నప్పుడు మనకేలాంటి సహాయమూ చేయలేరు. మోక్షానికి వెళ్ళాక మనకు సాయం చేస్తారు.

2. చనిపోయిన వాళ్ళల్లో మన దగ్గరి బంధువులూ మనకు మేలు చేసినవాళ్ళూ ఉండవచ్చు. వీళ్ళు మన సహాయాన్ని అపేక్షిస్తారు. కనుక మనం వీళ్ళకొరకు ప్రార్థనలూ పూజబలులూ మొదలైనవాటినికి తప్పక అర్పించాలి.

3. మన తరపున మనం సాధ్యమైనంతవరకు ఈ లోకంలోనే మన పాపావశేషాలకు ప్రాయశ్చిత్తం చేసికొంటే పరలోకంలో ఉత్తరించే స్థలాన్ని చాలవరకు తప్పించుకోవచ్చు. దీనికిగాను మనం ఏమి చేయాలి? ప్రార్థనలు ఉపవాసాలు దానధర్మాలు మొదలైన పుణ్యకార్యాలు చేసి వాటిని మన పాపపరిహారానికి సమర్పించుకోవచ్చు. ఈ జీవితంలో మన పాలబడే శ్రమలనుగూడ మంచి ఉద్దేశంతో స్వీకరించి మన పాపాలకు ప్రాయశ్చిత్తం చేసుకోవచ్చు. మన శ్రమలను క్రీస్తు శ్రమలతో చేర్చి పాపపరిహారంగా సమర్పించుకోవచ్చు. ఇంకా, మన పాపాలకు ప్రాయశ్చిత్తంగా పూజబలిని గూడ అర్పించుకోవచ్చు. ఈలోకంలో కొద్దిపాటి బాధలతోనే మన అనిత్య శిక్షను తొలగించుకోవచ్చు. పరలోకంలో ఐతే ఘోర బాధలతోగాని ఆ శిక్షను తొలగించుకోలేం. కనుక ఈ లోకంలో ఉండగానే మన పాపాలకు ప్రాయశ్చిత్తం చేసికొందామనే కోరిక మనకు మిక్కుటంగా ఉండాలి. ఎప్పుడుకూడ విశుద్ధ హృదయులేకాని దేవుణ్ణి దర్శించటానికి యోగ్యులుకారు. కనుక దూరదృష్టి కలిగి యిక్కడ ఉండగానే మన భవిష్యత్తుని మనం చక్కదిద్దుకొంటే బాగుపడతాం. బహుశా మనలో చాలామంది ఉత్తరించే స్థలంద్వారా గాని మోక్షాన్ని చేరుకోలేరు. ఈలోకంలో కఠోరమైన తపస్సు ద్వారా మన పాపాలకు ప్రాయశ్చిత్తం చేసికొన్న ఏకొద్దిమందో గాని నేరుగా మోక్షానికి పోరు.

# 5. మోక్షం

ముగ్గురు దైవవ్యక్తులను ముఖాముఖి దర్శించి ఆనందించడమే మోక్షం. మనకు మోక్షంమీద మిక్కుటమైన కోర్కె ఉండాలి. మన యిల్లు అక్కడ. ఈ యధ్యాయంలో ఆరంశాలు పరిశీలిద్దాం.

## 1. కీర్తనకారుల మోక్షవాంఛ

కీర్తనలు రచించిన భక్తులు మోక్షాన్నీ దైవదర్శనాన్నీ గాఢంగా వాంఛించారు. ప్రస్తుతానికి వాళ్ళల్లో ముగ్గురు భక్తుల కోరికలను మాత్రం పరిశీలిద్దాం.

"నేను నిరంతరమూ ప్రభువు సాన్నిధ్యం
కలిగించుకొంటాను
అతడు నాచెంతనే వుంటాడుకనుక నాకేభయము లేదు
నేనతనికి వందనాలర్పించి సంతోషిస్తుంటాను,
సురక్షితంగా వుండిపోతాను

నీవు నన్ను పాతాళం వాత బడనీయవు
నీ భక్తుణ్ణి మృతలోకంపాలు చేయవు
నీవు నాకు జీవనమార్గాన్ని చూపిస్తావు
నీ సాన్నిధ్యం నా కమితానందం కలిగిస్తుంది
సదా సంతోషాన్ని దయచేస్తుంది" - 16,8-11.

ఈ కీర్తనలో భక్తుడు భగవత్సాన్నిధ్యాన్ని తలంచుకొన్నాడు. ఆ సాన్నిధ్యం తన్ను సురక్షితంగా వుంచుతుందని నమ్మాడు. ప్రభువు అతని మరణానంతరం అతన్ని పాతాళలోకంలో వదలివేయడు. అతనికి ఉత్థానభాగ్యాన్నీ దైవదర్శనాన్నీ దయచేస్తాడు. అదే జీవనమార్గం. పరలోకంలో దైవసాన్నిధ్యం అతనికి అమితానందాన్ని కలిగిస్తుంది. దైవసాన్నిధ్యం మీదా మోక్షంమీదా ఆ కీర్తనకారునికున్న కోరిక అలాంటిది.

"నీ ప్రేమ అమూల్యమైంది
నరులకు నీ రెక్కలమాటున ఆశ్రయం దొరుకుతుంది
వాళ్ళు నీ ఆలయంలో సమృద్ధిగా లభించే
భోజనం సాపడతారు
నీ మంచితనం అనే నది నుండి పానీయం సేవిస్తారు
నీవు జీవపు చలమవు
నీ వెలుగువలన మేమూ వెలుగు చూస్తాం" - 36,7-9.

కీర్తనకారులు యెరూషలేము దేవళంలో దేవుణ్ణి పూజించుకొని అతని సన్నిధిలో ప్రార్థనలు అర్పించుకొన్నారు. వాళ్ళభక్తికి దేవాలయమే కేంద్రం. కాని వాళ్ళు దేవాలయంలోని దేవునితోపాటు మోక్షంలోని దైవసాన్నిధ్యాన్ని కూడ నమ్మారు. కనుక వాళ్ళు దైవసాన్నిధ్యాన్ని గూర్చి మాటలాడేటప్పుడు వాళ్ళ భక్తిలో దేవాలయమూ పరలోకమూ మిళితమై ఉంటాయి. ఈ 36వ కీర్తనను చెప్పిన భక్తుడు దేవునికి రెండుపమానాలు వాడాడు. అతడు జీవపు చెలమ. అనగా ఎప్పుడూ వట్టిపోని ఊట. దేవాలయంలోను పరలోకంలోను భక్తులు ఆ వూటనుండి వూరే నీటిని త్రాగుతారు. ఇంకా, ఆ ప్రభువు వెలుగు. ఆ వెలుగులో భక్తులు వెలుగును చూస్తారు. ఇక్కడ ఊటా వెలుగూ దైవజీవనానికి సంకేతాలు. కనుక భక్తులు దేవునినుండి వరప్రసాదమూ ఆనందమూ రక్షణమూ మొదలైన భాగ్యాలు పొందుతారని భావం. సంగ్రహంగా చెప్పాలంటే, 36వ కీర్తన వ్రాసిన భక్తుడు తాను వెలుగూ వూటఐన దేవుణ్ణి దర్శిస్తానని నమ్మాడు.

"నేను నిరంతరమూ నీ కంటిపెట్టుకొని వుంటాను
నీవు నా కుడిచేతిని పట్టుకొని నన్ను నడిపిస్తావు
నీ వుపదేశంతో నీవు నన్ను నడిపిస్తావు
కడన నిన్ను నీ మహిమలోనికి గొనిపోతావు
స్వర్గంలో నీవు తప్ప నా కింకెవరున్నారు?
ఈ భూమిమీద నీవు తప్ప మరొకటి నాకు రుచించదు
నా దేహమూ నా హృదయమూ
ప్రేమవలన కృశించిపోతున్నాయి
దేవుడే సదా నా కాశ్రయం
అతడే నాకు వారసభూమి" - 73,23-26.

ఈ కీర్తనకారుని భావాల ప్రకారం, భగవంతుడు భక్తునికి ధర్మశాస్త్రోపదేశంచేస్తూ అతన్ని ఈ జీవితంగుండా నడిపించుకొని పోతాడు. ఈ జీవితయాత్ర ముగిసాక అతన్ని మోక్షమహిమలోనికి చేర్చుకొంటాడు. అక్కడ దేవుడు తప్ప అతనికి ఆనందాన్నొసగేదేమీ ఉండదు. ఈ లోకంలో ప్రభువు మీది ప్రేమవలన అతని హృదయం కృశించిపోతూంది. అతడు మోక్షంలో ప్రభువుని దర్శించి రక్షణాన్నీ పరమానందాన్నీ పొందుతాడు. కావున స్వర్గంలోని ప్రభువుని చూడాలని అతనికి గాఢమైన కోర్కె.

మోక్షాన్నీ దైవదర్శనాన్నీ గూర్చిన మహాభక్తుల కోరికలు ఈలా ఉంటాయి. మనం ఈలోక వస్తువ్యామోహాల్లో కూరుకొనిపోయి మోక్షాన్ని పట్టించుకోం. అలాంటప్పుడు ఈ భక్తుల ప్రార్థనలు మనకు ప్రేరణం పుట్టిస్తాయి. మన మనసులను ఈలోక వస్తువులనుండి పరలోక భాగ్యాలవైపు మరల్చుతాయి.

## 2. బైబులూ మోక్షవర్ణనమూ

బైబులు మోక్షాన్ని దైవదర్శనంగాను, దైవజ్యోతిగాను, దైవస్పర్శగాను వర్ణిస్తుంది. ఈ మూడంశాలను విపులంగా పరిశీలిద్దాం.

### 1. మోక్షం దైవదర్శనం

భక్తులు భగవంతుణ్ణి దర్శిస్తారని చెప్తుంది బైబులు. స్నేహితుడు స్నేహితునితో మాట్లాడినట్టే మోషే ప్రభువుతో ముఖాముఖి మాట్లాడేవాడు - నిర్గ 33,11. అతడు దేవుని రూపాన్ని చూచాడు - సంఖ్యా 12,8. ఈ మోషేలాగే కీర్తన కారుడుకూడ తాను దేవుణ్ణి చూస్తానని నమ్మాడు. "నేను నిర్దోషిని గనుక నిన్ను దర్శిస్తాను, నేను మేల్కొనినప్పుడు నీ సాన్నిధ్యం వలన సంతృప్తి చెందుతాను" అని పల్కాడు - 17,15. ఈ వేదవాక్యాల్లో

దేవుణ్ణి దర్శించడమంటే ఆ ప్రభువు సాన్నిధ్యంలో ఉండిపోవడం. అతన్ని వ్యక్తిగతంగా అనుభవానికి తెచ్చుకోవడం. అతని ప్రేమకు నోచుకోవడం. అతన్ని తలంచుకొని ఆనందించడం. ఈ యనుభూతులన్నిటినీ కలిగించేదే మోక్షం.

సాధారణంగా మనం ఈలోకంలో దేవుణ్ణి ప్రత్యక్షంగా చూడం. విశ్వాసంతో మాత్రం అతన్ని నమ్ముతాం. ఈ నమ్మకం మనకు దైవానుభూతిని కలిగిస్తుంది. కాని ఈ యనుభూతి ఇక్కడ అస్పష్టంగా ఉంటుంది. అద్దంలో ప్రతిబింబం మసకగా కన్పిస్తుంది. అలాగే ఈలోకంలో దేవుడు అస్పష్టంగాగాని అనుభవానికిరాడు. కాని మోక్షంలో అతన్ని ప్రత్యక్షంగా, ముఖాముఖి దర్శిస్తాం. దేవుడు మనలను ఎరిగినట్లే మనమూ అతన్ని ఎరుగుతాం - 1కొరి 13,12.

క్రీస్తు శిష్యులకొరకు తండ్రిని ప్రార్థిస్తూ "తండ్రీ! ఏకైక సత్యసర్వేశ్వరుడవైన నిన్నూ, నీవు పంపిన యేసుక్రీస్తునీ తెలిసికోవడమే నిత్యజీవం" అని పల్కాడు - యోహా 17,3. హీబ్రూ సంప్రదాయం ప్రకారం "ఎరగడం" "తెలిసికోవడం" అంటే కేవలం జ్ఞానం మాత్రమేకాదు. ప్రేమకూడ. కనుక మనం మోక్షంలో భగవంతుణ్ణి బాగా తెలిసికొంటాం, ప్రేమిస్తాం గూడ.

మనం దేవుని బిడ్డలం. కనుక తండ్రియైన దేవుణ్ణి దర్శిస్తాం. జ్ఞానస్నానం పొందినపుడే మనం దేవుని బిడ్డలమౌతాం. అప్పటినుండి దేవుణ్ణి దర్శించేశక్తి మనకు లభిస్తుంది. మోక్షంలో ఈ శక్తిపరిపూర్ణమౌతుంది. కనుక అక్కడ దేవుణ్ణి ఉన్నవాణ్ణి ఉన్నట్లుగా చూస్తాం - 1 యోహా 3,2.

## 2. మోక్షం దైవజ్యోతి

యెరూషలేము దేవళం ఎప్పుడూ వెలుగుతో నిండి ఉండేది. దానిలో సప్తశాఖలుకల దీపస్తంభం ఉండేది. వాటిలో మూడుశాఖలు దినమంతా వెలుగుతూండేవి. రాత్రిలో ఏడుశాఖలూ వెలుగుతూండేవి. గుడారాల ఉత్సవం, దేవాలయ ప్రతిష్ఠోత్సవం వచ్చినపుడు ఇంకా యెక్కువ దీపాలుకూడ వెలిగించేవాళ్లు. వీటన్నిటితో యెరూషలేం దేవళం రాత్రంతా మిరుమిట్లు గొల్పుతూండేది. అది ప్రధానంగా తేజోనిలయమైన మందిరం. దాని కాంతిలో యెరూషలేం నగరంకూడ ప్రకాశిస్తూండేది. ఈ కాంతిమయమైన దేవాలయం జ్యోతిర్మయమైన స్వర్గానికి చిహ్నంగా ఉండేది.

వెలుగులేకుండా యూదులు తమ దేవాలయాన్ని కాని దేవుణ్ణి కాని ఊహించుకొనేవాళ్లు కాదు. తండ్రి నరులు చేరరాని దివ్యతేజస్సులో వసించేవాడు - 1తిమో 6,16. అతడు వెలుగునే బట్టనుగా ధరిస్తాడు - కీర్తన 104,2. క్రీస్తు ఆ తండ్రి

తేజస్సుకి ప్రతిబింబం - హెబ్రే 1,3. తబోరు కొండమీద అతని ముఖం సూర్యుళ్లా ప్రకాశించింది - మత్త 17,2. అతడు జగజ్జ్యోతి - యోహా 8,12. పౌలు దమాస్కు త్రోవలో ఉత్థాన క్రీస్తుని జ్యోతినిగానే దర్శించాడు - అచ 26,13.

బైబులు తండ్రినీ క్రీస్తునీ ఈలా జ్యోతిర్మూర్తులనుగా పేర్కొనడం దేనికి? యూదుల భావాల ప్రకారం వెలుగు నరునికి ఆనందాన్నిస్తుంది. అతన్ని రక్షిస్తుంది కూడ. కనుక జ్యోతిర్మూర్తియైన భగవంతుడు నరుణ్ణి కాపాడేవాడూ, అతనికి సంతోషాన్ని దయచేసేవాడూను.

ఇక, భగవంతునికి వాసస్థలమైన స్వర్గంకూడ జ్యోతిర్మయమైందే. దర్శన గ్రంథం పరలోక యెరూషలేమును అనగా మోక్షాన్ని వర్ణిస్తూ ఈలా వాకొంది. "ఆ నగరంలో నాకు దేవాలయమెక్కడా కన్పించలేదు. సర్వశక్తిమంతుడు దేవుడూ ఐన ప్రభువూ, గొర్రెపిల్లా ఆ నగరానికి దేవాలయమౌతారు. ఆ పట్టణానికి సూర్యచంద్రుల వెలుగు అవసరం లేదు. దేవుని తేజస్సే ఆ నగరానికి వెలుగు. గొర్రెపిల్ల ఆ నగరానికి దీపం" - 21,22-23. ఈ వాక్యాల భావమేమిటి? యూదుల సంప్రదాయం ప్రకారం దేవాలయం అతి ముఖ్యమైంది. భక్తులు దేవుణ్ణి కలుసుకొనేది ప్రధానంగా ఆ దేవళంలోనే. ఐనా ఈ వేదవాక్యం పరలోకంలో దేవళం అవసరంలేదని చెప్తుంది. మోక్షంలో తండ్రి కుమారుడే మనకు దైవసాన్నిధ్యమౌతారు. అక్కడ యీ లోకంలోలాగే సూర్యచంద్రుల వెలుగుగాని, దీపాల వెలుగుగాని ఉండదు. తండ్రీ ఉత్థానక్రీస్తూ అక్కడ వెలుగౌతారు. అనగా మోక్షం దేవుని తేజస్సుతో నిండి ఉంటుందని భావం. మోక్షానికి వెళ్ళినపుడు మనంకూడ ఆ తేజస్సులో పాల్గొంటాం. తండ్రి రాజ్యంలో నీతిమంతులు సూర్యునివలె ప్రకాశిస్తారని క్రీస్తే చెప్పాడు - మత్త 13,43. తండ్రి మనల్ని చీకటిలో నుండి అద్భుతమైన వెలుగులోనికి పిలుస్తాడు - 1పేత్రు 2,9. అది దేవుడు తన ప్రజలకు వారసభూమిగా యిచ్చే వెలుగు సామ్రాజ్యం - కోలో 2,12. ఈ వాక్యాలన్నిటినిబట్టి బైబులు మోక్షాన్ని వెలుగులోకంగా భావిస్తుందని అర్థంచేసికోవాలి.

## 3. మోక్షం దైవస్పర్శ

స్పర్శ జీవితానికి సంబంధించింది. చిన్న బిడ్డలకేగాక పెద్దవాళ్ళకుగూడ స్పర్శ అవసరం. బాల్యంనుండి చనిపోయిందాకా గూడ మనందరికీ స్పర్శ అవసరమే. మనం ఒక వ్యక్తిని స్పృశించినపుడు అతనిపట్ల మనకు ఆప్యాయతా ప్రేమా ఉందని తెలియజేస్తాం. ప్రేమతో గూడిన స్పర్శ ఎంతో ఆనందాన్ని కలిగిస్తుంది.

దేవుడుకి ఈ మర్మం తెలుసు. కనుక అతడు ఓ అమ్మలా నాన్నలా మనలను ఆప్యాయంగా తాకుతుంటాడు. "యిస్రాయేలు బాలుడై యుండగా నేనతన్ని ప్రేమించాను.

అతన్ని నా చేతుల్లోనికి తీసికొన్నాను. నేను క్రిందికి వంగి అతనిచేత అన్నంతినిపించాను" హోషే 11,1-4. అనగా దేవుడు అమ్మానాన్న ఐ యిస్రాయేలు అనే బాలుణ్ణి తన చేతుల్లోకి తీసికొన్నాడు. అతనికి ఆప్యాయంగా అన్నం పెట్టాడు. ఇంకా గరుడపక్షి తనపిల్లల్ని రెక్కలమీద నిల్పుకొన్నట్లే ప్రభువు యిస్రాయేలు ప్రజల్ని తన భుజాలమీద నిల్పుకొని ఐగుప్తునుండి కనాను మండలానికి కొనివచ్చాడు - ద్వితీ 32,11. ఔను, ప్రభువు తన ప్రజల్ని ప్రేమతో తాకేవాడు.

క్రీస్తు ఎందరో రోగుల్ని చేతితో తాకి వాళ్ల రోగాలు కుదిర్చాడు. ఉత్థాన క్రీస్తు తోమాని తన గాయాల్లో వేళ్ళుపెట్టి చూడమని ఆహ్వానించాడు - యోహా 20,27. మరియ మగ్దలీన తోటలో ఉత్థాన క్రీస్తు పాదాలు ముట్టుకొంది - యోహా 20,17. అలాగే సమాధివద్ద పుణ్యస్త్రీలు అతని పాదాలు పట్టుకొన్నారు - 28,9. ఈ విధంగా క్రీస్తు నరులను తాకాడు. నరులు కూడ అతన్ని తాకారు.

అసిస్సీ ఫ్రాన్సిస్, అవిలా తేరేసమ్మ, నోర్విచ్చి జూల్యానా మొదలైన భక్తులూ భక్తురాళ్ళు దేవుడు దర్శనాల్లో తమ శరీరాన్ని స్పృశించినట్లుగా చెప్పుకొన్నారు. ఈ జీవితంలో లాగే మోక్షజీవితంలో కూడ సర్పర్శ అనేది ఉంటుంది. అక్కడ దేవుడు మనలను తాకుతాడు, మనమూ అతన్ని తాకుతాం. ఆ తండ్రి ప్రేమనీ ఆప్యాయతనీ అనుభవానికి తెచ్చుకొని పులకించిపోతాం.

మోక్షంలో దేవుడు భక్తులను స్పృశించే తీరును దర్శన గ్రంథం మనుష్యభాషలో ఈలా వర్ణిస్తుంది. "సింహాసనం మధ్యలోవున్న గొర్రెపిల్ల వారికి కాపరియై వాళ్ళని జీవజలాల వద్దకు తీసికొనిపోతుంది. దేవుడు వారి నేత్రాలనుండి బాష్పబిందువులను తుడిచివేస్తాడు" - దర్శ 7,17. అనగా మోక్షంలో భక్తులకు క్రీస్తే నాయకుడై వాళ్ళను సంరక్షిస్తుంటాడు. తండ్రి వాళ్ళ దుఃఖాలన్నిటినీ తొలగిస్తాడు.

ఈలా మోక్షమంటే భగవంతుణ్ణి దర్శించడం, అతని వెలుగుని పొందడం, అతన్ని తాకడం. ఈ క్రియలన్నీ మనకు పరమానందాన్ని కలిగిస్తాయి. మోక్షం ఆనందమందిరం.

## 3. ఉత్థాన క్రీస్తే మనకు మోక్షం

క్రీస్తు సిలువమీద చనిపోయి మనకు పాపపరిహారం చేసాడు. ఉత్థానమై మనకు వరప్రసాదాన్ని ఆర్జించిపెట్టాడు. ఈ వరప్రసాద ఫలితమే మోక్షం. మోక్షంలో మన భాగ్యం ఉత్థానక్రీస్తే. అతనితో ఐక్యమయ్యే అక్కడ మనం తండ్రినీ ఆత్మనీ దర్శిస్తాం.

అద్దంలో మన ముఖాన్ని చూచుకొంటాం. అలాగే ఉత్థానక్రీస్తు ద్వారా తండ్రిని ఆత్మనీ చూస్తాం. ఆ యిద్దరు దైవవ్యక్తులను పొందడంలో క్రీస్తు మనకు మధ్యవర్తి ఔతాడు.

ఉత్థాన ఆదివారం క్రీస్తు శిష్యులమీదికి శ్వాసనూది మీరు పవిత్రాత్మను పొందండి అని చెప్పాడు - యోహా 20,23. మోక్షంలో ఉత్థానక్రీస్తు భక్తులలోనికి తన ఆత్మను ఊదుతూంటాడు. ఇక్కడ మనం ఆత్మను పూర్తిగా పొందలేం. పరలోకంలో క్రీస్తునుండి ఆ యాత్మను సమృద్ధిగా పొందుతాం.

ఈ లోకంలో క్రీస్తుకి తండ్రిపట్ల గాఢమైన ఆకర్షణం ఉండేది. అతడు నిరంతరము తండ్రికి ప్రీతిని కలిగించే కార్యమే చేసేవాడు - యోహా 8,29. అతనికి తండ్రిపట్ల ఈ యాకర్షణం ఎందుకుండేదంటే, ఆదిలో వాక్కు దేవునివద్ద ఉండేది - యోహా 1,1. ఆ వాక్కే తర్వాత క్రీస్తులోనికి ప్రవేశించి అతడు నిరంతరమూ తండ్రిని స్మరించుకొనేలా చేస్తుండేది. ఆ తండ్రిని ప్రేమించి సేవించేలా చేస్తుండేది. మోక్షంలోగూడ ఉత్థానక్రీస్తు నిరంతరమూ తండ్రిచే ఆకర్షితుడౌతూంటాడు. ఇక, మోక్షంలో ఉత్థాన క్రీస్తుతో ఐక్యమయ్యే భక్తులుకూడ అతనిద్వారా తండ్రిని చూస్తారు. మోక్షమంటే ప్రధానంగా ముగ్గురు దైవవ్యక్తులను దర్శించే తావు.

## 4. మోక్షానందం అందరికీ సరిసమానం కాదు

మోక్షంలో అందరూ దేవుణ్ణి దర్శించి ఆనందిస్తారు. అందరూ అతని వెలుగునుపొంది సంతోషిస్తారు. ఐనాఅక్కడ అందరి సంతోషమూ సమానంగా ఉండదు. ఈ లోకంలో మనం చేసికొనే పుణ్యంలో తారతమ్యాలుంటాయి. కనుక అక్కడ మనం భగవంతుణ్ణి దర్శించి ఆనందించే తీరులో కూడ తారతమ్యాలుంటాయి. అధిక పుణ్యంచేసికొన్నవాళ్లు ఎక్కువగాను, తక్కువ పుణ్యం చేసికొన్నవాళ్ళు తక్కువగాను అతన్ని దర్శిస్తారు. పెద్ద కుండలో ఎక్కువ నీళ్ళు పడతాయి. చిన్నకుండలో తక్కువ నీళ్ళు పడతాయి. మన మోక్షానందం కూడ ఈలాగే ఉంటుంది.

అసలు ఈ వ్యత్యాసం మోక్షంలో కాక భూమిమీదనే ప్రారంభమౌతుంది. మనం ఈలోకంలో వున్నపుడు దేవునితో ఎంతగా సహకరించి కృషి చేస్తామో అంతగా పుణ్యాత్ములమౌతాం. కాని నరుల్లో కొందరు దేవునితో ఎక్కువగా సహకరిస్తారు, కొందరు తక్కువగా సహకరిస్తారు. దీనివల్లనే మనం మోక్షంలో ఎక్కువ మహిమకాని తక్కువ మహిమకాని పొందుతాం. మనం ఇక్కడచేసిన పుణ్యకార్యాలనే సామగ్రితోనే అక్కడ స్వర్గంలో మన సౌధాన్ని నిర్మించుకొంటాం. మన పుణ్యసామగ్రినిబట్టే మనస్వర్గధామం కూడ ఉంటుంది.

ఇంకో విషయంగూడ. మోక్షంలో మన శక్తికొలది దేవుణ్ణి దర్శిస్తాం, తెలిసికొంటాం. ఐనా మనం అతన్ని ఏనాటికీ పూర్తిగా గ్రహించలేం. నరులు అతన్ని

పూర్తిగా గ్రహించగల్గితే అతడు దేవుడే కాదు. అపరిపూర్ణులైన సృష్టి ప్రాణులకు అనంతుడైన భగవంతుడు సంపూర్ణంగా దొరకడు. చిన్న చెంబు సముద్రంలో ఎంతనీటిని గ్రహించగల్గుతుంది? మోక్షంలో నరులు కూడ భగవంతుణ్ణి కొద్దిగానే గ్రహిస్తారు. మన తరపున మనం అతన్ని పూర్తిగా గ్రహించినా, అతని తరపున అతన్ని పూర్తిగా గ్రహించలేం. లోతైన సముద్రంలో రాయివేస్తే అది క్రమేణ అడుగునకు చేరుకొంటుంది. కాని భగవంతుడనే సముద్రంలోకి దిగితే ఆ సముద్రానికి అడుగే ఉండదు. కనుక మనం ఏనాడూ ఆ ప్రభువు అంతాన్ని చూడలేం.

నరునికి భగవంతుణ్ణి తెలిసికొని ప్రేమించాలనేకోరిక మిక్కుటంగా ఉంటుంది. ఈ కోరికతో మనం మోక్షంలో క్షణక్షణమూ భగవంతుణ్ణి అధికాధికంగా తెలిసికొని ప్రేమిస్తూనే ఉంటాం. ఈ దృష్టితో జూస్తే స్వర్గంలో నిరంతరమూ పెరుగుతూనే ఉంటాం. కాని మనం ఆ దేవుణ్ణి ఎంత తెలిసికొన్నా మనకుతెలియంది ఇంకా చాలా ఉండిపోతుంది. దీనివల్ల మనకు అసంతృప్తి యేమీ కలుగదు. మిక్కుటమైన ఆశతో ఆ ప్రభువుని ఇంకా అధికంగా తెలిసికోగోరుతూంటాం.

పరలోకంలో దేవుడు మనలను శాశ్వతంగా ప్రేమిస్తాడు. ఆ ప్రేమకు అంతం ఉండదు. దేవుని ప్రేమనుపొంది మనంకూడ అతన్ని శాశ్వతంగా ప్రేమిస్తాం. ప్రేమిస్తున్నంత కాలం, ప్రేమను పొందుతున్నంతకాలం, నరులు సంతోషంగా ఉంటారు. కనుక మనం అక్కడ దేవుని ప్రేమలో మునిగితేలుతూ కలకాలమూ శాంతిసంతోషాల ననుభవిస్తాం.

## 5. పునీతుల బాంధవ్యం

మోక్షంలో భక్తులు కేవలం ముగ్గురు దైవవ్యక్తులతో మాత్రమే ఐక్యంగారు. వాళ్ళు ఒకరితో ఒకరుగూడ ఐక్యమౌతారు. ఈ లోకంలో మనం క్రీస్తులోనికి జ్ఞానస్నానం పొందినపుడే అతనితో ఐక్యమౌతాం. ప్రభువుతో ఐక్యమైనవాళ్లు తమలో తాము గూడ ఐక్యమౌతారు. ఈ ఐక్యతనే జ్ఞానశరీరం అంటాం. జ్ఞానశరీరం అనే భావం ఓవైపు క్రీస్తుతో మనకుండే సంబంధాన్నీ, మరోవైపు తోడి క్రైస్తవులతో మనకుండే సంబంధాన్నీ తెలియజేస్తుంది.

క్రీస్తు ఈలోకంలో తన శిష్యులు ఒకరితో ఒకరు ఐక్యం కావాలని తండ్రిని ప్రార్థించాడు. "మనవలె వాళ్లూ ఒకరుగా ఐక్యమైయుండాలి" అని మనవి చేసాడు - యోహా 17,22. అనగా తండ్రీ క్రీస్తూ యేలా పరస్పరం ఐక్యమైయుంటారో అలాగే అతని శిష్యులుకూడ ఒకరితో ఒకరు ఐక్యమై యుండాలి.

పూర్వవేదంలో యిస్రాయేలు ప్రజలు సీనాయి నిబంధనం ద్వారా ప్రభువుతో ఐక్యమయ్యారు. ఆ నిబంధనం వల్లనే వాళ్లు పరస్పరంగూడ ఐక్యమయ్యారు. నూత్నవేదంలో

మనం సిలువ నిబంధనం ద్వారా క్రీస్తుతో ఐక్యమౌతాం. ఈ సిలువ నిబంధనమే జ్ఞానస్నానంలో మనమీద సోకుతుంది. క్రీస్తుతో ఐక్యమైనవాళ్లు అతనితో ఐక్యమైన ఇతర నరులతోగూడ ఐక్యమౌతారు.

పైన పేర్కొన్న పూర్వవేదపు యూదుల ఐక్యతకాని నూత్నవేదపు క్రైస్తవుల ఐక్యతగాని ఈ భూమిమీద ముగిసేది మాత్రమే కాదు. అది పరలోకంలోగూడ కొనసాగుతుంది. అదే పునీతుల బాంధవ్యం. మనం దివికేగినపుడు ఈ పునీతులను కలసికొంటాం.

నూత్నవేదంలో పరలోకాన్ని గూర్చిన వర్ణనలు ఎక్కువగా దర్శన గ్రంథంలో ఉన్నాయి. ఆ పుస్తకం మోక్షంలోని భక్తులను గూర్చి చెప్తూ "తదనంతరం నేను అటు చూడగా అక్కడ గొప్ప జనసమూహం కన్పించింది. దానిసంఖ్య లెక్కకు మిక్కుటంగా వుంది. ఆ జనంలో అన్నిజాతులవారు, అన్ని తెగలవారు, అన్ని భాషలవారు కలసిఉన్నారు. వాళ్లు సింహాసనానికి గొర్రెపిల్లకీ ఎదురుగా నిల్చి ఉన్నారు" అని నుడువుతుంది - 7,9. ఈ జనసమూహమే పరలోకంలో పరస్పరం ఐక్యమైయున్న పునీతులు.

రోజూ పూజారాధనంలో "ఉత్థానమౌతామనే నమ్మకంతో చనిపోయిన మా సోదరీసోదరులను, మీ కనికరమందు చనిపోయినవారందరిని స్మరించండి. వారిని మీ దివ్యప్రకాశంలోనికి చేర్చుకొనండి. మా అందరికి దయచూపండి. దేవుని కన్యమాతయగు మరియమాంబతోను, అపోస్తలులతోను, ఆదినుండి మీకు సేవలు చేసిన పుణ్యాత్ములందరితోను మాకు నిత్యజీవంలో భాగం దయచేయండి" అని ప్రార్థిస్తాం. ఇంకా యేటేట సకలార్చ్యశిష్టుల పండుగ జరుపుకొని ఆ పునీతులందరికి ప్రార్థనలర్పిస్తాం. ఈ ప్రార్థనలు ఫలించి మనం మోక్షంలోని పునీతులతో ఐక్యమౌతాం. అక్కడ దేవమాత సన్మనస్కులు అర్చ్యశిష్టులు మొదలైన వాళ్ళనందరినీ కలుసుకొని సంతోషిస్తాం. ఈ లోకంలో మనకు రక్తబంధువులుగా ఉండినవాళ్ళను కూడ మోక్షంలో మళ్ళా కలుసుకొని ఆనందిస్తాం. ఈ సందర్భంలో సిప్రియను భక్తుడు ఈలా చెప్పాడు. "మోక్షంలో ఓ పెద్ద భక్త బృందం మనకోసం ఎదురుచూస్తూంటుంది. వాళ్ళల్లో మనకు ప్రీతిపాత్రులైన తల్లిదండ్రులూ సోదరీసోదరులు పుత్రీపుత్రులుకూడ ఉంటారు. మనకోసం కాచుకొనివుండే ఆ బృందం చాల పెద్దది. వాళ్లకు తమ రక్షణాన్ని గూర్చి చింతలేదు. మన రక్షణాన్ని గూర్చి మాత్రం నిరంతరం చింతిస్తూంటారు. వాళ్ళ సన్నిధిలోనికి వెళ్ళి వాళ్ళను ఆలింగనం చేసికొన్నపుడు మనకు పరమానందం కలుగుతుంది. అక్కడ ఇక మృత్యుభయం ఉండదు. అక్కడ అందరమూ నిత్యజీవాన్ని పొంది మహానందం చెందుతాం." ఈలా మోక్షం దేవుణ్ణి కలుసుకొనే తావు మాత్రమే కాదు, తోడి పునీతులను కలసికొనేతావు కూడ.

## 6. మోక్షంమీద కోర్కె

నూత్న వేదంలో క్రీస్తు, పౌలు, పేత్రు మొదలైన వాళ్ళను పరిశీలిస్తే వాళ్ళకి మోక్షంమీద గాఢమైన కోర్కె ఉందని తెలుస్తుంది. క్రీస్తు బోధల ప్రకారం, ఈ లోకంలో సత్కార్యాలు చేసినవాళ్లు ప్రపంచ ప్రారంభంనుండి సిద్ధమైయున్న రాజ్యాన్ని చేకొంటారు - మత్త 25,34. తండ్రి యింటిలో చాలానివాసాలున్నాయి. క్రీస్తు ముందుగా అక్కడికి పోయి శిష్యులకు ఓ నివాసస్థలాన్ని సిద్ధం చేస్తాడు - యోహా 14,2. ఈలా ఆ ప్రభువు తన శిష్యులు మోక్షంకొరకు ఉవ్విళ్ళూరాలని కోరాడు. ఇంకా అతడు స్వయంగా గూడ స్వర్గాన్ని ఆశించాడు. కనుకనే తండ్రినిచూచి నేనిపుడు నీవద్దకు వస్తున్నానని పల్కాడు - యోహాను 17,13. ఆ తండ్రి తన్ను మహిమపరచాలని వేడుకొన్నాడు - 17,5.

పౌలుకి ఫిలిప్పి క్రైస్తవులంటే ఎంతో యిష్టం. వాళ్ళతో ఉండిపోయి వాళ్ళకు సేవలు చేయాలని అతని కోరిక. కాని అతనికి క్రీస్తంటే ఇంకా యెక్కువయిష్టం. కనుక తాను చనిపోయి క్రీస్తుని చేరుకోవడంమేలో, లేక బ్రతికివుండి ఫిలిప్పీయులకు సేవలు చేయడం మేలో అతనికే అర్థం కాలేదు. ఈరెండు కార్యాల్లో దేనిని ఎన్నుకోవాలో తనకే తెలియడంలేదన్నాడు. తన మట్టుకు తానైతే ఈ జీవితాన్ని త్యజించి క్రీస్తుని చేరుకోగోరుతున్నాని వాకొన్నాడు - ఫిలి 1,11-23. ఈ లోకంలో మనంభరించే చిన్నకష్టాలే మోక్షంలో మనకు అత్యధికమైన నిత్యమహిమను సంపాదించి పెడతాయి. కనుక మనం ఆ మోక్షాన్ని దృష్టిలోపెట్టుకొని ఇక్కడ కష్టాలనుభవించడానికి వెనుకాడకూడదని వాకొన్నాడు - 2కొ 4,17. ఈ జీవితంలో పౌలు చక్కగా పోరాడాడు. కనుక ప్రభువతనికి మోక్షంలో నీతిమంతుల కిరీటం దయచేస్తాడు. ఒక్క పౌలుకేగాదు, ఇక్కడ భక్తిగల జీవితం జీవించి ప్రభువు దర్శనం కొరకు ప్రేమతో వేచివుంటే వాళ్ళందరికి అలాంటి కిరీటమే లభిస్తుంది -2తిమో 4,7-8. పౌలు మోక్షవాంఛ యిలాంటిది.

పేత్రు తననాటి క్రైస్తవ సంఘపాలకులను ప్రోత్సహిస్తూ "ఆ ప్రధాన కాపరి ప్రత్యక్షమైనపుడు మీరు ఎన్నటికిని క్షీణింపని మహిమాన్వితమైన కిరీటం పొందుతారు" అని చెప్పాడు - 1పేత్రు 5,4.

ఈలా క్రీస్తూ, పౌలూ, పేత్రూ మొదలైన వాళ్లంతా మనం మోక్షంమీద కోర్కె పెంచుకోవాలని సూచించారు. పూజారాధనలోని ప్రార్థనలుకూడ మనం యిలోక

వస్తువులను ఉపేక్షించి మోక్షవస్తువులను ఘనంగా యెంచాలని చెప్తాయి. క్రీస్తు జయంతి సందర్భంలో వచ్చే ప్రార్థన "ప్రభూ! నేడు మామీద అవతరించిన జ్యోతిని మేము మోక్షంలోగూడ దర్శించేభాగ్యాన్ని ప్రసాదించు" అంటుంది. క్రీస్తు మోక్షారోహణం సందర్భంలో వచ్చే ప్రార్థనం "ప్రభూ! మేము ఈ దినం నీ కుమారుడు మోక్షరోహణం చేసాడని విశ్వసిస్తున్నాం. అతనితోపాటు మేముకూడ మోక్షంలో వసించే భాగ్యాన్ని ప్రసాదించు" అంటుంది. దివ్యసత్ప్రసాద పండుగ సందర్భంలో వచ్చే ప్రార్థనం "ఓ ప్రభూ! నీ దివ్యశరీర రక్తాలను స్వీకరించిన మేము మోక్షంలో నీ దివ్యత్వాన్ని దర్శించి ఆనందింతుముగాక" అని చెప్తుంది. మనం ఈలోకానికి అంటిపెట్టుకొని ఉండకూడదనీ, మోక్షాన్నీ దైవదర్శనాన్నీ ఆశించాలనీ ఈ ప్రార్థనల భావం. కనుక మనం అవశ్యం మోక్షంమీద కోర్కె పెంపొందించుకోవాలి.

## ప్రార్థనా భావాలు

1. ఇక్కడ మనకు పరిపూర్ణానందం ఉండదు. అది మోక్షంలోగాని సిద్ధింపదు. మన యిల్లు ఇక్కడకాదు, అక్కడ. మనం చేరవలసిన రేవు అక్కడుంది. కనుక మనం ఆ పరలోకానికి యాత్ర చేసే నావికులం. ఇక్కడ మనకు స్థిరమైన పట్టణం ఏదీ లేదు. రాబోయే నగరం కోసం ఎదురుచూడాలి - హెబ్రే 13,14. మన హృదయాలను పరలోకంలోని వస్తువులవైపు మరల్చాలి - కొలో 3,1-2. కనుక ఈ లోకాన్ని మాత్రమే నమ్ముకొనేవాడు మోసపోతాడు. పరలోకంవైపు దృష్టి త్రిప్పేవాడు బాగుపడతాడు.

2. మోక్షంలో మనం పునీతుల బాంధవ్యాన్ని పొంది సంతోషిస్తామని చెప్పాం. కాని తోడినరులతో సఖ్య సంబంధాలను ఈ లోకంలోనే ప్రారంభించాలి. ఇక్కడ తోడిజనుల పట్ల ఆదరాభిమానాలు చూపించాలి. విశేషంగా పేదసాదలను ఆదుకోవాలి. మనకున్నది తులమో ఫలమో వాళ్ళతో పంచుకోవాలి. ఈ లోకంలో తోడినరులపట్ల ప్రేమతో జీవించనివాడు పరలోకంలో పునీతులబాంధవ్యానికి అర్హుడుకాడు.

3. అగస్టీను భక్తుడు "ఓ ప్రభూ! మా హృదయాన్ని నీ కొరకే చేసావు, నీయందు విశ్రమించిందాకా దానికి విశ్రాంతిలేదు" అని వాకొన్నాడు. ఇది మహావాక్యం. భగవంతుడు తనమీదా, తన మోక్షంమీదా మన హృదయంలో సహజమైన కోర్కెను పెడతాడు. మనం ఈ లోకవస్తు వ్యామోహాల్లో తగుల్కొని ఆ కోరికను అణచివేసికోగూడదు. పునీతులకు మోక్షంమీద గాఢమైన వాంఛ ఉండేది. ఆ భాగ్యం మనకుకూడ అబ్బితే మన జీవితం ధన్యమౌతుంది.

4. అగస్టీను భక్తుడే మోక్షాన్ని గూర్చి చెప్తూ "అక్కడ మనం విశ్రాంతిని పొందుతాం. దేవుణ్ణి దర్శిస్తాం, ప్రేమిస్తాం, స్తుతిస్తాం. అంతంలో అనంతంగా జరిగేది యిదే" అని వాకొన్నాడు. మోక్షంలో ఈలోకంలోలాగ కృషిచేయం. ఇక్కడ చేసిన కృషికి ఫలితంగా అక్కడ విశ్రాంతిని పొందుతాం. ఇంకా, అక్కడ దేవుణ్ణి దర్శించి ఆనందిస్తాం. భగవంతుణ్ణి దర్శించినవాళ్ళు అతన్ని ప్రేమించి స్తుతించకుండా ఉండలేరుకదా! మోక్షం మనకు గమ్యం. మనం పొరుగూరు వెళ్ళినపుడు మళ్ళా మనవూరికి తిరిగి పోవాలని ఉబలాటపడతాం. అలాగే మన గమ్యమైన మోక్షానికి తిరిగి పోవడానికి మనం సదా ఉబలాటపడుతూండాలి. మనం పరలోక పౌరులం - ఫిలి 3,20.

# 6. ఉత్థానం

లోకాంతంలో మన మృతదేహం మళ్ళా ఉత్థానమై దేవుని సన్నిధిని చేరుతుంది. కనుక మనం దేహాన్ని గౌరవంతో చూడాలి. ఈ యధ్యాయంలో రెండంశాలు పరిశీలిద్దాం.

## 1. ఉత్థానాన్ని గూర్చిన బైబులు బోధలు

1. పూర్వవేదం మొదటలో ఉత్థానాన్ని గూర్చి స్పష్టంగా చెప్పదు. కాని దానియేలు గ్రంథం, మక్కబీయుల గ్రంథాలు మొదలైన చివరి పుస్తకాల్లో ఈ భావం స్పష్టంగా కన్పిస్తుంది.

జీవానికీ మరణానికీ గూడ అధిపతి ప్రభువేనని చెప్తూ మొదటి సమూవేలు గ్రంథం

"చంపేవాడు ప్రాణమిచ్చేవాడు ప్రభువే
పాతాళానికి గొనిపోయేవాడు
పైకి గొనివచ్చేవాడూ అతడే"

అంటుంది - 2,6. కీర్తనకారులకు ఉత్థానాన్ని గూర్చి నిక్కచ్చిగా తెలియకపోయినా అస్పష్టంగానైన తెలుసు. కనుకనే

"నీ ఉపదేశంతో నీవు నన్ను నడిపిస్తావు
కడన నన్ను నీ మహిమలోనికి గొనిపోతావు"

అన్నాడు వో కీర్తనకారుడు - 73,24. 16వ కీర్తన చెప్పిన భక్తుడు ప్రభువు నుద్దేశించి

"నీవు నన్ను పాతాళానికి పంపవు
నీ పరిశుద్ధుని గోతిపాలు చేయవు"

అని వాకొన్నాడు-16,10. ఇక్కడ "గోతిపాలు చేయవు" అనే భాగానికి "కుళ్లు పట్టనీయవు" అనే పాఠాంతరంకూడ వుంది. ఈ భక్తుడు మరణానంతరం తాను పాతాళంలో నాశమైపోననీ ప్రభువు తనకు ఉత్థాన భాగ్యాన్ని దయచేస్తాడనీ నమ్మాడు. తర్వాత నూత్న వేదకాలంలో అపోస్తలులు ఈ కీర్తన వాక్యాన్ని క్రీస్తుకి అన్వయింప జేసారు - అచ 13,35-37.

పూర్వవేదాంతంలో వచ్చే దానియేలు గ్రంథంలో ఉత్థాన భావం స్పష్టంగా కన్పిస్తుంది. "సమాధుల్లో నిద్రించే వాళ్ళల్లో అనేకులు మేలుకొంటారు. వాళ్ళల్లో కొందరు నిత్యజీవాన్ని అనుభవిస్తారు. కొందరు నిత్యావమానం పొందుతారు" అంటుంది ఈ పుస్తకం 12,2.

రెండవ మక్కబీయుల గ్రంథం అంటియోకసురాజు యూదులను వేదహింసకు గురిచేసిన తీరును వివరిస్తుంది. అతడు ఏడ్గురు సోదరులను వరుసగా ఒకరి తర్వాత ఒకరిని చంపించాడు. వారిలో రెండవవాడు ఘోరబాధలతో ప్రాణాలు విడుస్తూ రాజు నుద్దేశించి "రాక్షసుడా! నీవు మమ్ము చంపించవచ్చుగాక. కాని విశ్వాధిపతియైన ప్రభువు మాకు పునరుత్థాన భాగ్యాన్ని దయచేసి మేము శాశ్వతంగా జీవించేలా చేస్తాడు" అని పల్కాడు - 2 మక్క 7,9.

2. నూత్నవేద కాలానికి ఉత్థానాన్ని గూర్చిన భావాలు బాగా ప్రచారంలోకి వచ్చాయి. నూత్నవేదం క్రీస్తు ఉత్థానాన్ని వర్ణిస్తుంది. ప్రభువు నయీను విధవా పుత్రుణ్ణీ, యాయీరు కొమార్తనూ, లాజరునీ జీవంతో లేపాడు. ఇవి ఉత్థానాలు కాదు, పునర్జీవాలు. ఐనా ఈ సంఘటనలు క్రీస్తు ఉత్థానాన్ని సూచిస్తాయి. ఆ ప్రభువు ఉత్థానమూ మనలను కూడ లేపుతుంది. అతడు సజీవుడై లేచినట్లే మనమూ లేస్తాం.

యోహాను భావాల ప్రకారం క్రీస్తుని విశ్వసించడం వల్లా, అతని భోజనంగా స్వీకరించడంవల్లా, ఉత్థానాన్ని పొందుతాం. తమ్ముడు లాజరు చనిపోయినందుకు దిగులుపడుతున్న మూర్తతో ప్రభువు "నేను ఉత్థానాన్ని జీవాన్ని కూడాను. నన్ను విశ్వసించేవాడు మరణించినా మళ్ళా జీవిస్తాడు" అని పల్కాడు-11,25. అనగా క్రీస్తుని విశ్వసించేవాళ్ళు మరణానంతరం మళ్ళా లేస్తారు.

ఇక, క్రీస్తు శరీరమైన దివ్యసత్ప్రసాదంకూడ మనకు ఉత్థానాన్ని దయచేస్తుంది. కనుకనే ప్రభువు "నా శరీరాన్ని భుజించి నా రక్తాన్ని పానం జేసేవాడు నిత్యజీవాన్ని పొందుతాడు. నేనతన్ని అంతిమదినాన లేపుతాను" అని పల్కాడు-6,54. ఉత్థాన క్రీస్తు ప్రధానంగా జీవమయుడు. అతని శరీరాన్ని ఆరగించినపుడు మనంకూడ జీవమయులమౌతాం. ఈ జీవమే మనల్ని లోకాంతంలో లేపుతుంది. క్రీస్తు "నేను తండ్రి మూలాన జీవిస్తున్నాను. అట్లే నన్ను భుజించేవాడు నా మూలాన జీవిస్తాడు" అని నుడివాడు-6,57. అనగా జీవవాహిని తండ్రి నుండి కుమారుణ్ణి చేరుతుంది. కుమారుని నుండి మనలను చేరుతుంది. మరో సందర్భంలో అతడు "తండ్రి ఏలా మృతులను సజీవులను చేసాడో అలాగే కుమారుడుకూడ తన కిష్టమైనవారిని సజీవులను చేస్తాడు" అని వాకొన్నాడు-5,21.

యూదుల్లో ఓ తెగవాళ్ళయిన సద్దూకయిలు ఉత్థానాన్ని నమ్మరు. వీళ్ళు క్రీస్తుతో ఉత్థానం లేదని వాదించారు. కాని ప్రభువు వీళ్ళ నోళ్లు మూయించాడు. దేవుడు సజీవుల దేవుడు కాని మృతుల దేవుడు కాడు. కాని మనం జీవంతో లేస్తేనేగాని అతడు సజీవుల దేవుడు కాలేడు. అందుచేత ఉత్థానమనేది ఉంది అని క్రీస్తు రుజువు చేసాడు - మత్త 22,23-32,

3. నూత్నవేద రచయితలందరిలోను ఉత్థానాన్ని గూర్చి విస్తృతంగా చెప్పినవాడు పౌలు. అతని భావాలను మనం చక్కగా జీర్ణం చేసికోవాలి.

క్రీస్తు ఉత్థానం మన ఉత్థానానికి మాదిరిగాను కారణంగాను ఉంటుంది. క్రీస్తుని జీవంతో లేవనెత్తిన తండ్రి మనలను కూడ లేపుతాడు. క్రీస్తు లేచాడంటే మనమూ లేస్తామన్నమాటే - 1కొరి 15,12-13.

క్రీస్తుని కాని మనల్ని కాని జీవంతో లేపేది పవిత్రాత్మే. తండ్రి ఏ యాత్మద్వారా క్రీస్తుని లేపాడో, ఆ యాత్మద్వారానే మనలనుకూడ లేపుతాడు-రోమా 8,11. మనం జ్ఞానస్నానంలోనే ఉత్థాన క్రీస్తు ఆత్మను పొందుతాం. అతనికి దేవాలయమౌతాం-1కొరి 6,19. తనకు దేవాలయమైన నరుణ్ణి ఆ దివ్యాత్ముడు పట్టినే వదలివేయడు. మరణానంతరం అతన్ని తప్పకుండా లేపుతాడు.

మనం జ్ఞానస్నానం పొందినప్పటినుండి క్రీస్తు మరణోత్థానాలు మనమీద పనిచేయడం మొదలుపెడతాయి. అతడు భౌతికంగా మరణిస్తే మనం ఆధ్యాత్మికంగా, అనగా పాపజీవితానికి చనిపోతాం. అతడు భౌతికంగా ఉత్థానమైతే మనం ఆధ్యాత్మికంగా, అనగా పుణ్యజీవితానికి ఉత్థానమౌతాం. ఈ యాధ్యాత్మిక ఉత్థానం కడన మనకు శారీరకోత్థానాన్ని గూడ సంపాదించి పెడుతుంది- రోమీ 6,4-5.

పౌలుకి క్రీస్తు తబోరు కొండమీద పొందిన ప్రకాశమంటే చాల యిష్టం. అతడు తన జాబుల్లో చాలాసార్లు ఆ ప్రకాశాన్ని పేర్కొన్నాడు. అది మనకుగూడ లభిస్తుందని వాకొన్నాడు. ప్రభువు కొండమీద రూపాంతరం చెందగా అతని ముఖం సూర్యుళ్ళా ప్రకాశించింది. అతని దుస్తులు వెలుగువలె తెల్లనయ్యాయి-మత్త 17,2. తండ్రి ఆనాడు క్రీస్తు ముఖంపై ప్రకాశింపజేసిన వెలుగుని ఈనాడు భక్తుల హృదయాల్లో గూడ ప్రకాశింపజేస్తాడు-2కొ 4,6. పౌలుకి దమస్కు త్రోవలో దర్శనమిచ్చింది తబోరు కొండమీది ప్రకాశం లాంటి ప్రకాశమే - అచ 9,3. బలహీనమైన మన యీ మర్త్యశరీరాన్ని ఉత్థానక్రీస్తు తన శరీరంలాగ ప్రకాశవంతమైన దాన్నిగా చేస్తాడు-ఫిలి 3,21,

మరణించిన వాళ్ళల్లో ప్రథమఫలమో అన్నట్లుగా క్రీస్తు మృతులలో నుండి లేపబడ్డాడు - 1కొరి 15,20. ఈ వాక్యం భావమిది. యూదుల దేవాలయంలో ప్రథమఫలాలు అర్పించేవాళ్లు. దీనిద్వారా పొలంలోని పంటంతా దేవునికే చెందిందని సూచించారు. అలాగే క్రీస్తు మృతులలో నుండి మొదటి ఫలమో అన్నట్లు లేచాడు. అతని ఉత్థానం చనిపోయిన వాళ్ళంతా ఉత్థానమౌతారని సూచిస్తుంది. అతడు మృతులలోనుండి

లేపబడిన వారిలో జ్యేష్ఠుడు. కనుక మనం కనిష్ఠులం - కొలో 1,18. ఈలా క్రీస్తు ఉత్థానం మన ఉత్థానానికి మాదిరీ కారణమూ ఔతుంది.

## 2. ఉత్థాన సత్యాలు

1. సజ్జనులకు దుర్మార్గులకూ గూడ లోకాంతంలో ఉత్థానం సిద్ధిస్తుంది. తొలిమానవుడు అమరుడు. పాపంవలన అతడు అమరత్వాన్ని పోగొట్టుకొన్నాడు. ఉత్థానంద్వారా దేవుడు మళ్లా నరులందరికీ ఆదివరమైన ఈ యమరత్వాన్ని దయచేస్తాడు. ఏ నరుడూ ఈవరాన్ని తిరస్కరించలేడు. కనుక పుణ్యాత్ములూ పాపాత్ములూకూడ కడన జీవంతో లేస్తారు. కాని పుణ్యాత్ములు ఉత్థానంద్వారా మహిమను పొందుతారు. వాళ్లు క్రీస్తుద్వారా లేచి క్రీస్తు మహిమలో తామూ పాలుపొందుతారు. ఇక, పాపాత్ములు క్రీస్తుని నిరాకరించినవాళ్ళు కనుక వాళ్లు క్రీస్తు మహిమలో పాలుపొందరు. రెండవ మరణమైన నరకాన్ని పొందుతారు.

2. మనం పూర్వ దేహంతోనే ఉత్థానమౌతాం. అనగా మనం ఈ లోకంలో జీవించినపుడు ఏ దేహంతో ఉన్నామో ఆ దేహంతోనే లేస్తాం. అన్యదేహాన్ని పొందం. ఐతే ఉత్థానమయ్యాక మన పూర్వదేహం మహిమను పొంది పూర్తిగా మారిపోతుంది. ఈ లోకంలో ఉన్నపుడు మన శరీరం ఆకలి దప్పులకూ వ్యాధి బాధలకూ గురౌతూంటుంది. జీవంతో లేచాక దానికి ఈ బాధలేవీ ఉండవు. అప్పుడది మహిమ శరీరంగా మారిపోతుంది. కొందరు ఆధునిక వేదశాస్త్రులు మనం మరణించిన వెంటనే మన దేహం ఉత్థాన మౌతుందని చెప్తున్నారు. కాన ఈ భావమింకా వ్యాప్తిలోకి రాలేదు.

3. మహిమ శరీర లక్షణాలు నాల్గు. 1కొ 15,42-44ను ఆధారంగా తీసికొని వేదశాస్త్రులు మహిమ శరీర లక్షణాలను నాల్గింటిని పేర్కొన్నారు. మొదటి లక్షణం, అది ప్రకాశవంతంగా ఉంటుంది. ఉత్థానక్రీస్తు శరీరంలాగే మన శరీరంకూడ తేజస్సుని పొందుతుంది-ఫిలి 3,21. రెండవ లక్షణం, అది అవినాశంగా ఉంటుంది. పాపఫలితంగా ఇక్కడ మన శరీరం వ్యాధిబాధలకూ మరణానికి వినాశనానికి గురౌతుంది. కాని ఉత్థాన శరీరం క్రీస్తుఉండి తేజస్సునీ పూర్ణజీవాన్ని పొంది అవినాశమౌతుంది. పరలోకంలో ఉత్థాన దేహానికి సంతానేచ్ఛ ఉండదు. అక్కడివాళ్ళు పెండ్లిచేసికోరు - మత్త 22,30. వాళ్ళకు

ఆకలి దప్పులుండవు-ప్రక 7,16. మూడవ లక్షణం, అది శక్తిమంతమైనదిగా ఉంటుంది. దేవుడు తన శక్తితో క్రీస్తుని లేపాడు. అదేశక్తితో మనలనూ లేపుతాడు. కనుక మన ఉత్థాన దేహం దైవశక్తితో నిండివుంటుంది-ఎఫే 1,19-20. నాల్గవ లక్షణం, అది ఆధ్యాత్మికంగా ఉంటుంది. అనగా మహిమ శరీరం పవిత్రాత్మతో నిండి ఉంటుంది. మన తనువు ఈ లోకంలోనే పవిత్రాత్మకు ఆలయమైవున్నా అది యిక్కడ జంతువాంఛలతో నిండివుంటుంది. ఆత్మకు అట్టే లొంగదు. కాని అది పరలోకంలో పవిత్రాత్మతో నిండి ఆత్మకు వశవర్తినియై ఉంటుంది. కనుక ఈ భౌతిక దేహమే ఉత్థానమైనా, ఈ దేహానికీ, ఆ పరలోక దేహానికీ ఎంతో తేడా వుంటుంది. విత్తనానికీ ఆ విత్తనం నుండి మొలిచే మొలకకీ ఎంత వ్యత్యాసం ఉంటుందో మన యిహలోక శరీరానికీ పరలోక శరీరానికీ అంత వ్యత్యాస ముంటుంది.

4. పరలోకంలో మన ఉత్థాన దేహంకూడ దానంతట అది త్రీత్వైక సర్వేశ్వరుణ్ణి దర్శించలేదు. అక్కడ మన తనువు క్రీస్తు ఉత్థానదేహంతో ఐక్యమై ఆ ప్రభువు నుండి దివ్యశక్తిని పొందుతుంది. ఆ శక్తితోనే అది త్రీత్వైక సర్వేశ్వరుణ్ణి చూడగల్గుతుంది.

5. ఒక్క మన శరీరం మాత్రమే కాదు, ఈ విశ్వమంతాగూడ మహిమను పొందుతుంది. నరుడు ఈ విశ్వంలో జీవిస్తాడు. కనుక విశ్వం అతని కోసం ఉంది. నరుడు పాపం చేసి తన ఉన్నతస్థితిని కోల్పోయినప్పుడు ఈ విశ్వంకూడ శాపానికి గురైంది. అతడు ఉత్థానమై మహిమను పొందినపుడు ఈ విశ్వంకూడ మహిమను పొందుతుంది. "సృష్టి నాశానికి గురైంది. కాని ఒకనాడు అది వినాశ దాస్యం నుండి విముక్తి చెంది, దేవుని పుత్రుల మహిమాన్వితమైన స్వాతంత్ర్యంలో పాలు పొందుతుంది" అని వ్రాసాడు పౌలు- రోమా 8,20-21. "దేవుడు నీతికి నిలయమైన క్రొత్త భువిని క్రొత్త దివిని వాగ్దానం చేసాడు. మనం వాటికోసం వేచివుండాలి" అని చెప్తుంది-2పేత్రు 3,13. "సింహాసనాసీనుడైన ప్రభువు నేనిపుడు అన్నిటిని క్రొత్తవాటిని చేస్తానని పల్కాడు" అంటుంది దర్శనగ్రంథం 21,5. ఈ వేద వాక్యాలన్నీ మహిమను పొందబోయే నూత్న విశ్వాన్ని సూచిస్తాయి. కనుక ఈ ప్రస్తుత ప్రపంచం నాశంకాదు. ఇది క్రొత్త ప్రపంచంగా మారిపోతుంది. లోకాంతంలో మన దేహాలు నాశంకావు, మహిమను పొందుతాయి. అలాగే యుగాంతంలో ఈ విశ్వంకూడ నాశంకాదు, క్రొత్తదనాన్ని పొందుతుంది.

# ప్రార్థనా భావాలు

1. వేదశాస్త్రులు ఉత్థానాన్ని బీజం మొలకెత్తడంతో పోల్చారు. ఓ ప్రత్యేక బీజంనుండి ఓ ప్రత్యేకమైన మొలకవస్తుంది. చింత విత్తనం నుండి చింత మొలకే మొలుస్తుంది. వేప విత్తనం నుండి వేపమొలకే మొలుస్తుంది. అలాగే మన పూర్వ దేహంనుండే మహిమ దేహం ఏర్పడుతుంది. ఆ రెండింటికీ సంబంధం ఉంటుంది. ఐనా ఆ విత్తనానికీ దానిలో నుండి మొలచే మొలకకీ, ఎంతో వ్యత్యాసముంటుంది. అలాగే నరుని పూర్వదేహమే ఉత్థానమైనా, అది యెంతో మారి మహిమాన్విత శరీరంగా లేస్తుంది. ఈలా సామ్యమూ, భిన్నత్వమూ గల అద్భుతమైన ఉత్థానాన్ని దేవుడు మాత్రమే మనకు దయచేయగలడు. అందుకు ఆ ప్రభువుకి వందనా లర్పించాలి.

2. ఈ ప్రకృతిలో ఎక్కడ చూచినా ఉత్థానం కన్పిస్తూనే ఉంటుంది. సూర్యచంద్ర నక్షత్రాలు రోజురోజు అస్తమించి మళ్ళా ఉదయిస్తూంటాయి. భూమిలో నాటిన విత్తనం మళ్ళా మొలకెత్తుతూంది. అలాగే ఆకు రాల్చిన చెట్టూ, నేలలో నాటిన కొమ్మా మళ్ళా చిగురిస్తున్నాయి. ఈ ప్రక్రియలన్నీ ప్రకృతిలోని ఉత్థానానికి నిదర్శనాలు. నరదేహాన్నీ కూడ ఓ విత్తనంలా నేలలో నాటుతారు. అది ఈ నేలనుండి మళ్ళా మొలకెత్తుతుంది. బీజంలోని జీవశక్తివల్ల, అనగా క్రీస్తు ఆత్మల సాన్నిధ్యంవల్ల, అది మళ్ళా ఉత్థానమౌతుంది. ఈ యద్భుత వరానికి మనం దేవునికి నమస్కారం చేయాలి.

3. నరులు సహజంగానే అమరత్వాన్నీ శాశ్వతత్వాన్నీ కోరుకొంటారు. "మృత్యోర్మా అమృతం గమయ" అన్న వైదిక ఋషి ప్రార్థనం మనందరి ప్రార్థనంకూడ. కాని మనంతట మనం ఈ శాశ్వతత్వాన్ని పొందలేం. ప్రభువే ఉత్థానం ద్వారా ఈ భాగ్యాన్ని మనకు దయచేస్తాడు. ఈ భాగ్యంపట్ల మన హృదయంలో గాఢమైన వాంఛను గూడ ముందుగానే నెలకొల్పుతాడు. ఆ ప్రభువు మంచితనాన్నీ ప్రేమనీ మనం వేనోళ్ళ కొనియాడాలి.

4. హిందూ సంప్రదాయం ప్రకారం దేహం చెడ్డది. పక్షి పంజరంలోలాగ మన ఆత్మ దేహంలో బంధింపబడి ఉంటుంది. అది ఆత్మకు చెరలాంటిది. కనుక దేహం

ఎంత త్వరగా నశిస్తే అంత మంచిది. కాని బైబులు సంప్రదాయం ప్రకారం దేవుని సృష్టిలోని అన్ని వస్తువుల్లాగే దేహంకూడ మంచిది. అది ఉత్థానమై దేవుణ్ణి చేరుతుంది. కనుక మనం దాన్ని గౌరవంతో చూడాలి. దాన్ని పాపానికి దూరంగా ఉంచాలి. ఉత్థాన భాగ్యాన్ని పొందడానికి తగినట్లుగా పవిత్రంగా ఉంచాలి. దైనందిన జీవితంలో ఆత్మ దేహాన్ని నడిపించాలి కాని దేహం ఆత్మను నడిపించకూడదు. ఈ లోకంలో శరీరం పశుప్రవృత్తితో నిండివుండి వెర్రిపోకడలు పోతూంటుంది. కనుక దాన్ని నిరంతరమూ అదుపులో ఉంచుకొంటూండాలి.

5. ఆధునిక యుగం లైంగిక యుగం. ప్రచార సాధనాలైన సినిమా, పత్రికలు మొదలైనవి నరదేహాన్ని - విశేషంగా స్త్రీదేహాన్ని - కామపూరితంగా ప్రదర్శించి సొమ్ము చేసికొంటూంటాయి. లోకంలో స్త్రీ పురుషులు ఒకరి దేహాన్నొకరు కామదృష్టితో చూస్తూంటారు. కాని క్రైస్తవులమైన మనకు దేహంపట్ల - అది పురుష దేహమైనా స్త్రీ దేహమైనా - పవిత్ర భావాలుండాలి. అది వోనాడు ఉత్థానమై దేవుని సన్నిధిని చేరేది. ఈ లోకంలో ఉండగానే దేవుని ఆత్మకు ఆలయంగా వొప్పేది. ఈలాంటి తనువుని మనం దేవుని ఆలయంగానే చూడాలి. ఇంకా, దేవుని మందిరమైన ఈ శరీరాన్ని వ్యభిచారంతో కళంకితం చేయకూడదు. పౌలు కొరింతీయులకు వ్రాస్తూ దేహంతోను పాపం చేయవద్దు, దేహంలోను పాపం చేయవద్దు అని హెచ్చరించాడు - 1కొ 6,18-19.

6. ఉత్థాన క్రీస్తు మన ఉత్థానానికి మాదిరిగాను కారణంగాను ఉంటాడని చెప్పాం. ఉత్థాపిత మాతయైన మరియకూడ మనకు ప్రేరణంగా ఉంటుంది. కేవలం మానవమాత్రురాలైన ఆ తల్లి ఉత్థానమై యిపుడు మోక్షంలో ఉంది. ఆమెకు అబ్బిన భాగ్యమే ఓనాడు మనకూ అబ్బుతుంది. ఆమె పరలోకంలో ఉండి మనలను తనచెంతకు పిలుస్తుంది. తన శరీరంలాగే మన శరీరంగూడ మహిమను పొందుతుందని మనకు ఆశ పుట్టిస్తుంది.

7. శరీరంలాగే ఈ లోకంకూడ చెడ్డదికాదు, మంచిది. అది నాశంకాదు, మహిమను పొంది క్రొత్తరూపం తాలుస్తుంది. కనుక ఈ లోకాన్నీ ఇక్కడి భౌతిక వస్తువులనూ

విలువతో చూడాలి. కొందరు భ్రాంతపడినట్లుగా ఈ లోకం మాయకాదు. మనం లోకంలోని వివిధ రంగాల్లోకి ప్రవేశించి కృషి చేయాలి, విజయాలు సాధించాలి. ఈ లోకమంతా యిప్పుడే ఉత్థానక్రీస్తు తేజస్సుతో భాసిల్లుతూంది. అతనివైపు ఆకర్షితమౌతుంది. మన శరీరంలాగే అదికూడ కడన మహిమను పొందుతుంది. ఈలాంటి లోకంలో జీవించడం భాగ్యం అనుకోవాలి. మనకు కర్మవాదం పనికిరాదు. నిరుత్సాహ భావాలు కూడవు. కష్టే ఫలి అని నమ్మాలి.

# 7. రెండవ రాకడ

క్రీస్తు లోకాంతంలో మళ్ళా రెండవమారు విజయం చేసి జనులందరికీ న్యాయతీర్పు తీరుస్తాడు. ఈ యధ్యాయంలో రెండంశాలు పరిశీలిద్దాం.

## 1. బైబులు భావాలు

### 1. రెండవ రాకడను గూర్చిన వేదవాక్యాలు

తొలిరోజుల్లోని క్రైస్తవులు క్రీస్తు మళ్లా తమ జీవితకాలంలోనే తిరిగివస్తాడని నమ్మారు. ఆనాటి క్రైస్తవ జీవితంలో ఈ నిరీక్షణం ముఖ్యాంశంగా ఉండేది. కాని వాళ్ళు భావించినట్లుగా ప్రభువు రెండవసారి తిరిగిరాలేదు. ఈనాడు మనం క్రీస్తు ఎప్పుడో లోకాంతంలో తిరిగివస్తాడని ఎంచుతాం. అతడు మన జీవితకాలంలో రానేరాడని తలుస్తాం. కనుక ఈనాటి మన నమ్మకం తొలిరోజుల్లోని క్రైస్తవుల నమ్మకానికి కేవలం భిన్నమైంది.

మార్కు సువార్త ప్రభువు రెండవరాకడను ఈలా వర్ణించింది. "మనుష్యకుమారుడు మహాశక్తితోను మహిమతోను మేఘారూఢుడై రావడాన్ని ప్రజలంతా చూస్తారు. అతడు దూతలను పంపి భూలోకంనుండి ఆకాశంవరకు నలుదిశలనుండి తానెన్నుకొనినవారిని ప్రోగుజేయిస్తాడు" 13,26-27. ఈ సంఘటనాన్నే పౌలు మొదటి తెస్సలోనీయుల జాబులో ఈలా వర్ణించాడు. "అపుడు ఆజ్ఞారావము ప్రధాన దేవదూత పిలుపు, దేవుని బాకాధ్వని విన్పిస్తాయి. ప్రభువు స్వయంగా పరలోకంనుండి దిగివస్తాడు. క్రీస్తుని నమ్మి మరణించినవారు ముందుగా పునరుత్థానమౌతారు. పిమ్మట అప్పటికింకా సజీవులై ఉన్నవారు ప్రభువుని వాయుమండలంలో కలసికోవడానికి ఆ ఉత్థానమైన వారితోపాటు మేఘాలపై ఎక్కిపోతారు. కనుక మనం సదా ప్రభువుతోనే ఉంటాం" - 1తెస్స 4,16-17.

ఈ వేదవాక్యాలు ప్రభువు రెండవరాకడను దర్శనాల భాషలో వర్ణించాయి. ఇక్కడ చెప్పిన అంశాలన్నిటినీ రచయితలు వర్ణించిన వాటిని వర్ణించినట్లుగా మనం స్వీకరించనక్కరలేదు. ఉదాహరణకు ప్రభువు మేఘాలమీద దిగిరావడం, దేవదూతలు బాకా వూది ప్రజలందరినీ ప్రోగుజేయడం, చనిపోయినవారు మేఘాలనెక్కి దేవుని దగ్గరికి రావడం మొదలైన అంశాలు దర్శనశైలికి సంబంధించినవి. వీటిని మనం గ్రహించనక్కరలేదు. ప్రభువు నరులకు తీర్పు జెప్పడానికి రెండవసారి వేంచేసినవస్తాడనేది ఈ వాక్యాల్లోని ముఖ్యాంశం. మనం ఈ సత్యాన్ని స్వీకరిస్తే చాలు.

## 2. తిరుసభలోనుండే ప్రభువు దర్శనమిస్తాడు

మనం మామూలుగా క్రీస్తు లోకాంతంలో మోక్షంనుండి దిగివస్తాడు అనుకొంటాం. నూత్న వేదవాక్యాలుకూడ ఈ భ్రాంతిని పుట్టిస్తాయి. కాని యథార్థంగా ప్రభువు యుగాంతంలో ఎక్కడో ఆకాశంనుండి దిగిరాడు. అతడు ఇదివరకే తిరుసభలో నెలకొని ఉన్నాడు. అతడే యిప్పుడు మనకు దర్శనమిస్తాడు. కనుక అతడెక్కడో బయటినుండి రాడు. తిరుసభలోనుండే మనకు దర్శనమిస్తాడు. పైగా మనం "రెండవరాకడ" అంటాం. అసలిక్కడ "రాకడ" అనేది లేనేలేదు. ప్రభువు మనకు కన్పిస్తాడు, అంతే. కనుక క్రీస్తు మళ్ళా రెండవసారి వేంచేస్తాడు అని చెప్పడం కంటె, అతడు మళ్ళా రెండవసారి తిరుసభలోనుండి మనకు దర్శనమిస్తాడు అని చెప్పడం మెరుగు. కాని మన మనుష్యభాషలో, మనకు సులభంగా అర్థంకావడంకోసం, అతడు రెండవసారి వేంచేస్తాడని చెప్పుకొంటాం.

ప్రభువు ఉత్థానమైనంక తిరుసభను వదలిపెట్టలేదు. నిరంతరమూ దానిలోనే వసిస్తూంటాడు. కనుకనే మత్తయి సువార్తలో అతడు "లోకాంతంవరకు సదా నేను మీతో వుంటాను" అని పల్కాడు- 28,20. అనగా అతడు నిరంతరమూ తిరుసభలో వసిస్తూంటాడు. మోక్షారోహణానంతరం క్రీస్తు దశ మారుతుందేకాని తావు మారదు. కనుక అతడు పూర్వమెక్కడున్నాడో అక్కడే ఉంటాడు. మోక్షారోహణానంతరం అతడు నరుల కంటికి కన్పించడు. ఐనా అతడు నరలోకాన్ని వీడిపోలేదు. తిరుసభను వదలిపోలేదు. ప్రేమ, భక్తి విశ్వాసాలతో తన దగ్గరికి వచ్చే భక్తులకు క్రీస్తు తిరుసభలోనుండి నిరంతరం దర్శనమిస్తూనే ఉంటాడు.

మబ్బులు కమ్మివున్న దినాన ఆకాశంలో సూర్యుడు కన్పించడు. కాని మనకంటికి కన్పించకపోయినా సూర్యుడు ఆకాశంలోనే ఉన్నాడనుకోవాలి. అలాగే క్రీస్తు నేడు మనకంటికి కన్పింపకపోయినా తిరుసభలో ఉన్నాడనుకోవాలి. ఇంకా సూర్యబింబం ఎక్కడినుండో ఆకాశంలోకి రాదు. అది నిరంతరమూ అక్కడే ఉంటుంది. అలాగే క్రీస్తు లోకాంతంలో ఎక్కడినుండో మనదగ్గరికి రాదు. అతడు నిరంతరమూ మన మధ్యలో, తిరుసభలోనే ఉంటూంటాడు.

మనం సూర్యుణ్ణి నేరుగా చూడలేం. చూస్తే మనకండ్లు మాడిపోతాయి. మేఘంమాటున ఉన్న సూర్యబింబాన్ని మాత్రమే మనం దర్శింపగలం. అలాగే మహా తేజోమూర్తియైన ఉత్థాన క్రీస్తుని మనం నేరుగా చూడలేం. ఈ జీవితంలో విశ్వాసపు తెరలు అడ్డంబెట్టుకొని మాత్రమే అతన్ని దర్శిస్తాం. లోకాంతంలో ఇక ఈ విశ్వాసంతో అవసరంలేదు. అప్పుడతన్ని నేరుగా దర్శిస్తాం.

క్రీస్తు నేడు తిరుసభలో చాల రూపాల్లో ప్రత్యక్షమౌతూంటాడు. అతడు క్రైస్తవ సమాజంలో ఉంటాడు. కనుకనే ప్రభువు నా పేరుమీదిగా ఇద్దరు ముగ్గురు సమావేశమైనకాడ నేనూ ఉంటానని చెప్పాడు- మత్త 18,20. అతడు పేదసాదల్లోను ఆకలిదప్పులు అనుభవించే వాళ్ళలోను ఉంటాడు. కనుకనే ఈనా సోదరుల్లో అత్యల్పుడైన ఒకనికి మీరు చేసింది నాకు చేసినట్లే భావిస్తానని పల్కాడు – మత్త 25,40. అతడు తన శిష్య సమూహంలో ఉంటాడు. కావుననే లోకాంతంవరకు నేను మీతో ఉంటానని చెప్పాడు – మత్త 28,20. అతడు జ్ఞానస్నానంపొందిన క్రైస్తవుల్లో ఉంటాడు. కావుననే విశ్వాసంద్వారా క్రీస్తు మీ హృదయాల్లో వసిస్తుంటాడు అని పౌలు పేర్కొన్నాడు - ఎఫే 3,17. భక్తులు వేదగ్రంథాలు చదివేకాడ అతడే దివ్యగ్రంథ బోధను విన్పిస్తూంటాడు. అన్నిటికంటె అధికంగా అతడు దివ్యసత్ప్రసాదంలో ఉంటాడు. ఈ సాన్నిధ్యాలేవీ మనకంటికి కన్పించవు. ఐనా మనం విశ్వాసంతో ఈ సాన్నిధ్యాలను నమ్ముతుంటాం. ఐనా ఈ సాన్నిధ్యాలన్నీ తాత్కాలికమైనవే. కనుక ఇవన్నీ అంతరించిపోతాయి. అతడు చివరిసారిగా తిరుసభలోనుండి చూపించే సాన్నిధ్యం మహా తేజోవంతమైంది. విశ్వాసపు తెరలు అడ్డం పెట్టుకోకుండానే ఆ తేజోవంతమైన సాన్నిధ్యాన్ని మనం దర్శించవచ్చు. అదే రెండవ రాకడ.

## 3. మన మరణ సమయంలోనే ప్రభుదర్శనం

పూర్వవేదశాస్త్రులు ప్రభువు లోకాంతంలో రెండవమారు వేంచేసివస్తాడని చెప్పారు. నూత్నవేదంలో కొన్నివాక్యాలు కూడ ఈ భావాన్ని సమర్థిస్తున్నట్లు కన్పిస్తాయి. కాని నేటి వేదశాస్త్రులు మన మరణమే మనకు రెండవరాకడ ఔతుందని చెప్తున్నారు. ప్రభువు లోకాంతంలో వస్తే అప్పటికి బ్రతికివున్న కొద్దిమందికి మాత్రమే ఆరాకడ అర్థవంతంగా ఉంటుంది. అంతకుముందు చనిపోయిన అసంఖ్యాక ప్రజలకు ఆరాకడ ముఖ్యమైంది కాజాలదు. అది మన జీవితకాలంలో జరుగదు కనుక మన మెవ్వరమూ దాన్ని పట్టించుకోం.

అందుకే ఆధునిక వేదశాస్త్రులు రెండవరాకడ మన మరణకాలంలోనే జరుగుతుందని భావిస్తున్నారు. ఈలా భావిస్తే అది మనకు ముఖ్యమైన సంఘటనం అవుతుంది. మన మందరమూ మన మరణ సమయంలో ప్రభువుని కలుసుకోవాలని యెంచితే, ఆ గడియకోసం చిత్తశుద్ధితో వేచిఉంటాం. ప్రతివాడూ తన మరణానికీ, ఆ మరణంలో ప్రభువుని కలుసుకోవడానికీ జాగ్రత్తగా సంసిద్ధుడౌతాడు. ఐనా మన మరణకాలమే మనకు రెండవరాకడ ఔతుంది అనేది కేవలం వేదశాస్త్రుల అభిప్రాయం మాత్రమే. అది వేదసత్యంకాదు. తిరుసభ ప్రభువు మళ్ళా రెండవసారి వస్తాడని మాత్రమే చెప్తుంది. ఎప్పుడు వస్తాడు, ఏలా వస్తాడు అనే విషయాలను గూర్చి అధికారపూర్వకంగా ఏమీ చెప్పదు.

నూత్నవేదంలో కొన్నివాక్యాలు ప్రభువు లోకాంతంలో వస్తాడని చెప్తాయి. కాని అతడు మనమరణకాలంలోనే వస్తాడని సూచించే వాక్యాలుకూడ లేకపోలేదు. అలాంటివాటిని కొన్నిటిని పరిశీలిద్దాం. యూదుల స్తెఫనును రాళ్ళతో కొట్టి చంపగా అతడు పవిత్రాత్మతో నిండినవాడై పరలోకంవైపు చూచాడు. అతని దేవుని మహిమా, దేవునికి కుడి ప్రక్కన యేసు నిలబడి ఉండడమూ కన్పించాయి. అతడు చూడండి! పరలోకం తెరవబడి ఉంది. మనుష్యకుమారుడు దేవుని కుడిప్రక్కన నిలబడి ఉన్నాడు" అని పల్కాడు- అచ 7,55-56. ఈ వాక్యాలనుబట్టి స్తెఫను లోకాంతంలో గాక, తాను మరణించిన వెంటనే ఉత్థానక్రీస్తుని దర్శించాడు అనుకోవాలి. అతడు ఇక్కడ దర్శించింది ప్రభువు రెండవరాకడనే. అది అతని మరణకాలంలోనే జరిగింది. ఈలాగే మంచిదొంగ కూడ

తాను మరణించిన వెంటనే ప్రభువు రెండవరాకడను దర్శించాడు. అలా దర్శించి ఉండకపోతే "నేడే నీవు నాతో కూడ పరలోకం ప్రవేశిస్తావు" అని క్రీస్తు అతనితో చెప్పిన మాటలకు అర్థం లేదు-లూకా 23,43.

పై వాక్యాలనుబట్టి లూకా రెండవరాకడ అనేది మన మరణకాలంలోనే జరుగుతుందని భావించాడు అనుకోవాలి. యోహానుకూడ ఈలాగే భావించాడు. అతని సువిశేషంలో క్రీస్తు తన శిష్యులతో "నా తండ్రి గృహంలో అనేక నివాసస్థలాలున్నాయి. నేను మీకు ఓ నివాసస్థలాన్ని సిద్ధం చేయడానికి పోతున్నాను. నేను వెళ్ళితే మీకు ఓ నివాసస్థలాన్ని సిద్ధంచేసి మళ్ళా వస్తాను" అని చెప్పాడు - యోహా 14,1-4. ఈ వాక్యాల సందర్భాన్ని జాగ్రత్తగా గుర్తించాలి. ప్రభువు తాను వెళ్ళిపోతానని చెప్పగా శిష్యులు కలవరపడ్డారు. వాళ్ళ విచారాన్ని తొలగించడానికి ప్రభువు పై వాక్యాలు చెప్పి వాళ్ళను ఓదార్చాడు - కనుక అతడు శీఘ్రమే తిరిగివచ్చి వాళ్ళను తనచెంతకు తీసికొనిపోవాలి. అప్పుడుగాని వాళ్ళకు ఓదార్పు కలుగదు. అతడెప్పుడో లోకాంతంలో వస్తే వాళ్ళకు ఓదార్పేమీ కలుగదు. కనుక ఇక్కడ "నేను మళ్ళా తిరిగి వస్తాను మిమ్ము నాచెంతకు తీసికొని పోతాను" అనే మాటలు వాళ్ళ జీవితకాలానికి వర్తించాలి. అందుచేత ఇక్కడ ప్రభువు మళ్లావచ్చే కాలం అతని ఉత్థానం నుండి అపోస్తలుల మరణం వరకు ఉన్న కాలమైయుండాలి. పన్నెండుమంది శిష్యుల్లో ప్రతివాడూ తాను చనిపోయేపుడే ప్రభువు రెండవ రాకడను దర్శించిఉండాలి.

ఈలా ఈ వేదవాక్యాలు మన మరణకాలంలోనే మనం ప్రభువు రెండవరాకడను చూస్తామని బోధిస్తున్నాయి. కాని ఈ వాక్యాలు లోకాంతంలో ప్రభువు వేంచేసి రాడని చెప్పవు. మనం మరణకాలంలో చూచే రెండవరాకడనే మళ్ళా లోకాంతంలో కూడ చూస్తాం అవి రెండు సంఘటనలు కావు, ఏకసంఘటనమే. రెండవరాకడ మన మరణకాలంలో ప్రారంభమై లోకాంతంవరకు కొనసాగుతుంది. మన వ్యక్తిగతమైన రెండవరాకడా, లోకాంతంలో జరిగే సాధారణ రాకడా ఒకదానితో ఒకటి కలసిపోతాయి.

## 2. రెండవరాకడకు సంబంధించిన కొన్ని అంశాలు

1. ప్రభువు లోకాంతంలో ఎప్పుడు వేంచేసి వస్తాడు? మన మరణం ఎప్పుడు వచ్చేదీ కొంతవరకైనా వూహించవచ్చు. కనుక మనకు వ్యక్తిగతమైన రెండవరాకడ ఎప్పుడు

జరుగుతుందో కొంతవరకైనా ముందుగానే తెలిసికోవచ్చు. కాని లోకాంతంలోని సాధారణపురాకడ ఎప్పుడు జరుగుతుందో ఎవరికీ తెలియదు. క్రీస్తు ఈ విషయాన్ని ప్రస్తావిస్తూ "ఆ దినం ఎప్పుడు వస్తుందో నా తండ్రికి మాత్రమే తెలుసు. కుమారునికి గాని పరలోకంలోని దూతలకుగాని మరెవ్వరికిగాని ఆ గడియ తెలియదు" అని వాకొన్నాడు – మత్త 24,36. కనుక ఆయంత్యదినాన్ని గూర్చి పుకార్లు పుట్టించడం వ్యర్థప్రయాస మాత్రమే ఔతుంది.

2. ఈ లోకం ఏలా ముగుస్తుంది? క్రీస్తు రెండవమారు విజయం చేసినప్పుడు ఈ భౌతికలోకం నాశమైపోతుందనీ, అది అగ్నివల్ల దగ్ధమై పోతుందనీ పూర్వ వేదశాస్త్రులు భావించారు. దీనికి పేత్రు రెండవ జాబులోని వేదవాక్యాలను ఆధారంగా చూపించారు. "ప్రభుదినం దొంగలా వస్తుంది. ఆ రోజున భయంకర ధ్వనితో ఆకాశం అంతరిస్తుంది. గ్రహతారకాదులు దగ్ధమై నశిస్తాయి. సర్వవస్తు సంచయంతోపాటు భువి అదృశ్యమౌతుంది. నీతికి నిలయమైన క్రొత్త దివిని భువిని దేవుడు వాగ్దానం చేస్తాడు" – 2 పేత్రు 3,10-13. కాని ఈ వేదవాక్యాలు దర్శనాల భాషలో ఉన్నాయి. కనుక మనం వీటిని ఉన్నవాటిని ఉన్నట్లుగా గ్రహించనక్కరలేదు. ప్రభువు ఆకస్మాత్తుగా రెండవమారు వేంచేసి వస్తాడనే ఈ వాక్యాల భావం. అతడేలా వస్తాడు, అగ్నితో వస్తాడా అనే ప్రశ్నలకు ఈ వాక్యాలు జవాబు చెప్పవు.

నేటి వేదశాస్త్రులు ఈ యంశాన్ని గూర్చి ఈలా బోధిస్తున్నారు. క్రీస్తు రెండవరాకడతో ఈ ప్రస్తుత ప్రపంచమేమో ముగుస్తుంది. కాని అది అగ్నివలన కాలిపోదు. మార్పును మాత్రం చెందుతుంది. మన భౌతికదేహం ఆత్మవలన మార్పు చెందుతుంది. అలాగే క్రీస్తు రెండవరాకడ వలన ఈ భౌతిక ప్రపంచంకూడ మార్పు చెందుతుంది. కాని యిలా మారిన ప్రపంచం స్వరూపం ఏలా ఉంటుందో ఎవరికీ తెలియదు.

3. క్రీస్తు రెండవసారి వచ్చాక ప్రస్తుత తిరుసభ ఏమౌతుంది? బైబుల్లో దైవరాజ్యమనేది పెద్ద భావం. పరలోకంలోని మోక్షమూ భూలోకంలోని తిరుసభా కలసి దైవరాజ్యమౌతాయి. ఇక, క్రీస్తు రెండవరాకడతో భూలోకంలోని తిరుసభ ఏమౌతుంది? తిరుసభ అంటే క్రైస్తవులే. కనుక క్రీస్తు రెండవరాకడతో తిరుసభ తన భౌతిక జీవితాన్ని ముగించి ఆధ్యాత్మిక జీవితం ప్రారంభిస్తుంది. లోకాంతం తర్వాత ప్రస్తుత తిరుసభ అనేది

ఉండదు. మహిమను పొందిన తిరుసభ మాత్రం ఉంటుంది. కనుక తిరుసభ ఏనాటికీ నాశంకాదు. అది లోకాంతంలో ఆధ్యాత్మిక తిరుసభగా మారిపోతుంది. పౌలు ఈ యంశాన్ని గూర్చి యీలా చెప్పాడు. "అప్పుడు అంతం వస్తుంది. క్రీస్తు పాలకులను అధికారులను శక్తులను అందరినీ జయించి రాజ్యాన్ని తండ్రియైన దేవునికి అప్పగిస్తాడు" - 1కొ 15,24. ఇక్కడ పౌలు పేర్కొన్న "రాజ్యం" తిరుసభే. లోకాంతంలో తండ్రి సమస్తాన్ని పరిపాలిస్తాడు- 1కొ 15,28. కనుక తిరుసభ ఆధ్యాత్మికంగా మారిపోయి కలకాలమూ తండ్రి ఆధీనంలో ఉండిపోతుంది.

4. క్రీస్తు రెండవమారు మహిమతో వేంచేసివచ్చి ఏంచేస్తాడు? అతడు మృతులమైయున్న మనలను జీవంతో లేపుతాడు. మనకు సాధారణ తీర్పు తీర్చి బహుమతినో లేక దండననో విధిస్తాడు. మనలనూ ఈ భౌతిక సృష్టినీ మహిమపరుస్తాడు. రెండవరాకడ అనేది లోకాంతంలో జరిగే అనేక సంఘటనల్లో ఒకటి మాత్రమేకాదు. అతి ముఖ్యమైన సంఘటనం. దానితో పూర్వవేదకాలం నుండి వస్తూన్న ప్రస్తుత రక్షణ చరిత్ర ముగుస్తుంది. ఈ లోకంలో భౌతిక తిరుసభ యాత్ర కూడ ముగుస్తుంది. క్రీస్తు తర్వాత నూత్న రక్షకుడెవడూ రాడు. తిరుసభ ప్రజలను రక్షించడమనేది కూడ ఉండదు. క్రీస్తు తన రాజ్యాన్ని పరిపూర్ణం చేసి తండ్రికి సమర్పిస్తాడు. ఆ దినం కొరకు మనమంతా భక్తిశ్రద్ధలతో వేచి ఉండాలి.

## ప్రార్థనా భావాలు

1. క్రైస్తవులమైన మనం ప్రధానంగా నిరీక్షణతో జీవించేవాళ్ళం. మన ప్రభువైన క్రీస్తు మరణకాలంలోను లోకాంతంలోను గూడ వేంచేసి వస్తాడు. అతడు మనలను మహిమ పరుస్తాడు. ఈ లోకంలో మన మనుభవించే శ్రమలకూ పడే కష్టాలకూ విలువ ఉంటుంది. అసలు ఇప్పుడు మనం పడే కష్టాలు తర్వాత మనకు ప్రత్యక్షమయ్యే మహిమతో ఎంతమాత్రం పోల్చదగినవికావు. అనగా ఇప్పటిశ్రమలకు అప్పుడు నూరంతలు ఫలితం పొందుతాం - రోమా 8,18. కనుక మనం ఆ యంత్యదినంకోసం ఆతురతతో వేచివుండాలి.

2. క్రీస్తు సామెతల్లో కొన్ని మనం అతని రెండవ రాకడకొరకు కనిపెట్టుకొని ఉండాలని హెచ్చరిస్తున్నాయి. "యజమానుడు సాయంకాలమో అర్ధరాత్రివేళలోనే కోడికూసే

వేళనో ప్రాతఃకాలాన్నో యెప్పుడు వస్తాడో మీకు తెలియదు. కనుక మీరు మేల్కొనివుండండి" - మార్కు 13,35. కనుక మనం భక్తిగల క్రైస్తవ జీవితం జీవిస్తూ నిరంతరం మేల్కొనివుండాలి. అంత్యదినాన ప్రభువు వచ్చినపుడు మనం అవివేకవతులైన కన్యల్లాగ సత్క్రియలనే చమురులేకుండా ఉండకూడదు. వివేకవతులైన కన్యల్లాగ మంచి పనులనే చమురుచేకూర్చుకొని ఉండాలి - మత్త 25,8-9.

3. రెండవ శతాబ్దానికి చెందిన టెర్టూలియన్ అనే వేదశాస్త్రి రైతు పంటకోసం వేచివున్నట్లుగా, యుద్ధం జేసే సైనికులు యుద్ధాంతంకోసం వేచివున్నట్లుగా, క్రైస్తవుడు ప్రభువు రాకడకోసం వేచివుండాలని వ్రాసాడు. ప్రభుని భక్తితో సేవించేవాళ్ళకు అతని రాకడ ఎంతో ఆనందాన్నిస్తుంది. కనుక వాళ్ళు ఆ సుదినంకొరకు ఉవ్విళ్లూరుతూండాలి.

4. ఈ లోకంలో ప్రభువుకొరకు వేచివున్నపుడు మనకు దివ్యబలాన్నీ శక్తినీ దయచేసేవి దేవద్రవ్యానుమానాలు. వీటిల్లోగూడ దివ్యసత్ప్రసాదం విశేష బలాన్ని చేకూర్చిపెడుతుంది. అది మనకు ప్రభువు దివ్యజీవనాన్ని ప్రసాదిస్తుంది. "ఈ రొట్టెను తిని ఈ పాత్రనుండి త్రాగినపుడెల్ల, ప్రభువు రెండవసారి వచ్చేవరకూ మనం అతని మరణాన్ని ప్రకటిస్తూంటాం." - 1కొ 11,25. కావున భక్తులు ఈ దివ్యభోజనాన్ని యోగ్యంగా స్వీకరిస్తూ ప్రభువు రెండవ రాకడకు సిద్ధమౌతూండాలి.

# 8. క్రీస్తు మనకు ఓడలంగరు

క్రైస్తవుడు ప్రధానంగా నిరీక్షణతో జీవించేవాడు. ఐనా అతడు ఈ లోకంనుండి తప్పించుకోవాలని కోరుకోడు. ఇక్కడ చక్కగా కృషిచేసి ఈ భౌతిక ప్రపంచాన్ని వశం చేసుకోవాలని కోరుకొంటాడు. ఈ కృషివల్లనే అతనికి రక్షణం లభిస్తుంది. ఈ చివరియధ్యాయంలో మూడంశాలు పరిశీలిద్దాం.

## 1. క్రైస్తవునికి నిరీక్షణం ప్రధానం

క్రైస్తవుడు ప్రధానంగా ఆశించేదేమిటి? తన మరణకాలంలో ఉత్థానక్రీస్తుని కలసికొని ఆ ప్రభువునుండి బహుమతిని పొందాలనే. "మనం పరలోక పౌరులం. దివి

నుండి మన రక్షకుడు ప్రభువుఐన యేసుక్రీస్తు రాకకై ఆతురతతో వేచివుంటాం-ఫిలి 3,20. క్రీస్తు వేంచేసి వచ్చినపుడు మనం అతని మహిమలో పాలుపొందుతాం. అతడు మనకు నిత్యజీవాన్నీ మోక్షభాగ్యాన్నీ దయచేస్తాడు. కనుక మనం ప్రధానంగా నిరీక్షణంతో జీవిస్తాం.

పదిమంది కన్నెలు చమురుతోను దిటివీలతోను పెండ్లి కొమారుని రాకడకొరకు వేచివున్నారు - మత్త 25,10. ఈ కన్నెలు భక్తి విశ్వాసాలుగల క్రైస్తవులందరికీ పోలికగా ఉంటారు. మనం ఈ లోకంలో వసిస్తున్నా ఈలోకానికి కాక పరలోకానికి చెందినవాళ్ళం. రానున్న మరో నగరం కోసం వేచివుండేవాళ్ళం - హెబ్రే 13,14. ఈ లోకంలో మనం కేవలం యాత్రికులం. దేవుడు ఆయుస్సు దయచేసినకొలది కొంతకాలంపాటు ఇక్కడ జీవించి పరలోకానికి వెళ్ళిపోయేవాళ్ళం. కనుక ఈ మంటి కట్టిపెట్టుని ఉండిపోవడం, ఈ లోకమే శాశ్వత మనుకోవడం, ఈ లోక వాంఛలకు లొంగిపోవడం ఉత్తమ క్రైస్తవుని లక్షణం కాదు.

## 2. క్రైస్తవుడు ఈ లోకంలో కృషిచేయాలి

మనం ఈ లోకంలో కొంతకాలంపాటు మాత్రమే ఉంటాం. ఐనా ఇక్కడున్నంతకాలం ఈ ప్రపంచంలో చక్కగా కృషిచేయాలి. కొందరు భావించనట్లు ఈ జగత్తు మాయకాదు. ఇది యథార్థమైన లోకం. నరుడు ఈలోకంలో కృషి చేయాలనే దేవుని కోరిక. అతడు ఆదిమానవులను దీవించి "మీరు చాలమంది బిడ్డలను కని వృద్ధి చెందండి. భూమండల మంతటా నివసించి దానిని వశం చేసికొనండి" అని చెప్పాడు - ఆది 1,28. కనుక ఈ విశ్వాన్నీ, దానిలో దాగివున్న శక్తులనూ వశం జేసికోవడానికి నరులు నిరంతరమూ కృషిచేయాలి. ఇది పాపపులోకమైనా దేవుని కుమారుడు దీన్ని రక్షించాడు. అతడు దీనిలో నెలకొని ఉంటాడు.

ఈ లోకంలో మన కృషి స్వార్థరూపంలో ఉండకూడదు. ప్రేమ సేవలరూపంలో ఉండాలి. కేవలం మనకొరకు మనం జీవిస్తే ప్రయోజనంలేదు. పదిమంది మేలుకొరకు జీవించాలి. ప్రభువు ఈలోకంలోని పేదసాదల్లో బాధామయ జీవుల్లో తానూ బాధలనుభవిస్తూంటాడు. కనుకనే ఇక్కడ అత్యల్పులైన వారికి చేసిన ఉపకారాన్ని తనకు

చేసినట్లే భావిస్తాడు. వాళ్ళను పట్టించుకోనప్పుడు తన్ను పట్టించుకోనట్లే భావిస్తాడు - మత్త 25,40-45.

చాలమంది భగవంతుణ్ణి పూజిస్తే చాలు తోడినరుణ్ణి పట్టించుకోనక్కరలేదులే అనుకొంటారు. ఇది పొరపాటు. భగవంతుడు తరచుగా తోడినరుల్లో దర్శనమిస్తాడు. కనుక అతన్ని తోడిమానవుల్లో గుర్తిస్తుండాలి. ఆ దేవుణ్ణి ప్రేమించే హృదయంతోనే తోడిమానవులను గూడ ప్రేమించాలి.

మనం ఈ భౌతిక ప్రపంచాన్ని వశం చేసికోవడానికి కృషిచేయాలి. తోడినరులను సేవించి ప్రేమించడానికీ కృషిచేయాలి. ఈలా చేసేవాళ్ళు ఈ లోకంలో దేవుని సృష్టిని కొనసాగించుకొని పోతూంటారు. తాముా ఆ సృష్టికర్తతో కలసి పని చేస్తూంటారు.

## 3. లోకకృషివల్లనే క్రైస్తవునికి రక్షణం

ఈ లోకంలో చక్కగా కృషిచేసిన వాళ్లకి మోక్షబహుమతి లభిస్తుంది. ప్రభువు బాగా కృషిచేసిన మంచి సేవకులిద్దరినీ మెచ్చుకొని "మీరు మీ యజమానుని ఆనందంలో పాలు పంచుకొనండి" అని చెప్పాడు - మత్త 25,21-23. కాని అతడు బాగా కృషిచేయని మూడవ దాసుని శిక్షించి వెలుపలి చీకటిలోనికి త్రోయించాడు-25,30 పిండికొలది రొట్టె. ఇక్కడ కృషిచేసినదాన్నిబట్టి రక్షణ ఫలాన్ని పొందుతాం. ఇక్కడ శ్రమపడి పనిచేయడాన్నే నూత్నవేదం దేవుని చిత్తప్రకారం జీవించడమనీ, ఆజ్ఞలను అనుసరించడమనీ, ప్రేమను పాటించడమనీ పేర్కొంటుంది.

భగవంతుడు నరునికి కృషి, సేవ, ప్రేమ, స్వాతంత్ర్యం, పావిత్ర్యం తన్ను పూర్ణ హృదయంతో ప్రేమించడం మొదలైన దొడ్డ విలువల నిచ్చాడు. మనం ఈ లోకంలో స్వయంకృషిచేసి ఈ విలువలను ఫలసిద్ధికి తీసికొనిరావాలి. వాటిని పరిపూర్ణం చేసికోవాలి. ఈ స్వయంకృషే కడన మనం ఉత్థాన క్రీస్తుని కలుసుకొనేలా చేస్తుంది. ప్రభువు దర్శనంకోసం ప్రేమతో వేచివుండేవాళ్ళ కందరికీ అతడు నీతికిరీటాన్ని బహూకరిస్తాడు - 2తిమో 4,8. మంచి క్రైస్తవుడు నిరంతరమూ "యేసుప్రభూ రమ్ము!" అనే భావంతో జీవిస్తూంటాడు - ప్రక 22,20.

## ప్రార్థనా భావాలు

1. ఈ లోకంలో మనం ఇటు నేలవైపు చూస్తూ నడవాలి. అటు పరలోకంవైపు చూస్తూగూడ నడవాలి. ఈ రెండు దృక్పథాలు ముఖ్యమే. ఈ లోకం యథార్థమైంది. ఈ మంటిపై జీవించినంతకాలం మనం ఇక్కడ కృషిచేయక తప్పదు. ఐనా ఈ ప్రపంచం శాశ్వతమైంది కాదు. శాశ్వతలోకం మరొకటుంది. కనుక మనం నిరంతరం దానిమీద దృష్టినిల్పి జీవించాలి. ఈలా ఇహపరాలమీద దృష్టికలవాడే ఉత్తమ క్రైస్తవుడు. కాని నిత్యజీవితంలో ఈ ఇహపరాలను రెండింటినీ విలువతో చూడ్డం ఎంతమాత్రం సులభం కాదు. అధిక సంఖ్యాకులు ఇహాన్ని ప్రేమించి పరాన్ని అశ్రద్ధ చేస్తారు. స్వల్పసంఖ్యాకులు పరాన్ని ప్రేమించి ఇహాన్ని అశ్రద్ధ చేస్తారు. ఇవి రెండు అపమార్గాలే.

2. ఉత్థానక్రీస్తు దర్శనం కోసం నిరీక్షిస్తూండడమే క్రైస్తవ జీవిత సారాంశం. మనం ఆ క్రీస్తుమీద ఆశపెట్టుకొని జీవించేవాళ్ళం. మన బహుమతి అతనినుండే. హెబ్రేయుల జాబు ఈ క్రీస్తునీ ఓడ లంగరుతో పోల్చింది - 6,19. లంగరు వేసిన ఓడ కొట్టుకొనిపోక స్థిరంగా నిలుస్తుంది. అలాగే క్రీస్తుని నమ్మినవాళ్ళు స్థిరంగా నిలుస్తారు. మనం ఓడమైతే అతడు మనకు లంగరు. మరణం, తీర్పు, ఉత్తరించే స్థలం మొదలైన మన కడగతులన్నీ కూడా ఉత్థాన క్రీస్తుమీది నమ్మకంవల్లనే ఫలసిద్ధిని పొందుతాయి. మన అంత్యగతి అతడే.

# ప్రశ్నలు

## అధ్యాయం - 1

1. మరణం మనలను యాత్రిక దశనుండి శాశ్వతదశకు ఏలా తీసికొనిపోతుంది?
2. మరణం ఏలా పాపఫలితమౌతుందో వివరించండి.
3. "క్రీస్తు మరణం మన మరణాన్ని పూర్తిగా మార్చివేసింది" - ఎట్లో తెలియజేయండి.
4. గ్రెగోరీ భక్తుడు మృత్యువును చెరసాలలో ఉన్న వ్యక్తితోను, గర్భస్థ శిశువుతోను, కాయగా మారనున్న పిందెతోను పోల్చడంలో భావమేమిటి?

5. "ప్రభూ! మీ విశ్వాసులకు ఈ జీవితం మారుతుందేకాని అంతంకాదు" అనే వాక్యం మనం మృత్యుభయం జయించడానికి ఏలా ఉపయోగపడుతుంది?
6. ఇంచుమించు చనిపోయి మళ్ళా బ్రతికి బయటపడ్డవాళ్ళ అనుభవం ప్రకారం మృత్యువు భయపడతగింది కాదని ఏలా నిరూపిస్తావు?
7. విశ్వాసులు మంచి మరణానికి తయారుకావడం ఏలా?

## అధ్యాయం - 2

1. తీర్పుని గూర్చిన వేదసత్యంలో ఇమిడివున్న మూడంశాలు ఏమిటివి?
2. సాధారణ తీర్పుని సమర్థిస్తూ వేదశాస్త్రులు పేర్కొన్న కారణాలు తెలియజేయండి.
3. తీర్పుని గూర్చిన మత్తయి, లూకా, యోహాను భావాలనూ, వాటిల్లోని వ్యత్యాసాలనూ పేర్కొనండి.
4. తీర్పుని భయంకరమైనదాన్నిగా చిత్రించే నూత్నవేద వాక్యాలను పేర్కొనండి.
5. అక్రమ మార్గాలవల్ల లాభాలు గణించేవాళ్ళను జూచి మనంకూడ ప్రలోభానికి గురౌతూంటాం. న్యాయతీర్పుని గూర్చిన భావన మనం ఈ ప్రలోభం నుండి తప్పుకొనేలా చేయగలదా?
6. మనం ఈ లోకంలో జీవిస్తుండగానే న్యాయనిర్ణయ దినానికి తయారుకావడం ఏలా?

## అధ్యాయం - 3

1. తొలిమూడు సువిశేషాలు, యోహాను, పౌలు, నరకాన్ని వర్ణించిన తీరును వివరించండి.
2. నరకాగ్ని అంటే యేమిటి?
3. "దైవసాన్నిధ్యాన్ని కోల్పోవడమే నరకాగ్నిని గూర్చిన ముఖ్యాంశం" – వివరించండి.
4. "నరకం దేవుడు నరునికి పెట్టే శిక్షకాదు, నరుడు తనకు తానే విధించుకొనే శిక్ష' – వివరించండి.
5. నరకం ఏలా శాశ్వతంగా ఉంటుందో తెలియజేయండి.

## అధ్యాయం - 4

1. ఉత్తరించే స్థలం అంటే యేమిటి?
2. ఉత్తరించే స్థలాన్ని గూర్చిన వేదసత్యం బైబుల్లో లేకపోయినా అది తొలినాటి క్రైస్తవ సమాజంలో ఏలా వ్యాప్తిలోకి వచ్చింది?
3. ఉత్థానక్రీస్తూ, పవిత్రాత్మా ఉత్తరించే స్థలంలోని ఆత్మలను ఏలా శుద్ధి చేస్తారు?
4. ఉత్తరించే స్థలంలోని ఆత్మలకు మనం ఏలా సహాయం చేయగలం?

## అధ్యాయం - 5

1. బైబులు మోక్షాన్ని దైవదర్శనంగాను, దైవజ్యోతిగాను, దైవస్పర్శగాను వర్ణిస్తుంది - వివరించండి.
2. మోక్షంలో ఉత్థాన క్రీస్తుద్వారా తండ్రినీ ఆత్మనూ ఏలా దర్శిస్తామో తెలియజేయండి.
3. మోక్షానందం ఎందుకు అందరికీ సమానం కాదు? మోక్షంలో మనం దేవుణ్ణి పూర్తిగా ఎందుకు గ్రహించలేం?
4. మోక్షంలో తోడి పునీతులను ఏలా కలసికొంటామో తెలియజేయండి.

## అధ్యాయం - 6

1. ఉత్థానాన్ని గూర్చిన బైబులుబోధలను వివరించండి.
2. మహిమ శరీర లక్షణాలను పేర్కొనండి.
3. ఈ విశ్వంకూడ ఏలా మహిమను పొందుతుందో, ఈ లోకాన్ని మనం ఏలా విలువతో చూడాలో వివరించండి.
4. నేటి లైంగిక యుగంలో నరదేహంపట్ల మనకు ఏలాంటి పవిత్రభావాలుండాలో వివరించండి.

## అధ్యాయం - 7

1. రెండవరాకడలో క్రీస్తు ఎక్కడో బయటినుండి రాడు, తిరుసభలో నుండే మనకు దర్శనమిస్తాడు - వివరించండి

2. నేటి వేదశాస్త్రులు మన మరణమే మనకు రెండవరాకడ ఔతుందని చెప్తున్నారు - వివరించండి.

3. క్రీస్తు రెండవమారు వేంచేసి ఏం చేస్తాడు?

4. ప్రభువు రెండవరాకడకు మనం ఏలా సిద్ధంకావాలి?

## అధ్యాయం - 8

1. క్రైస్తవునికి నిరీక్షణం ఏలా ప్రధానమో వివరించండి.

2 ఈ లోకంలో కృషిచేయడం క్రైస్తవునికి ఏలా ముఖ్యమో వివరించండి.

# బైబులు అవలోకనాలు

## అధ్యాయం - 1

నరుడు మట్టిలో కలసిపోతాడు - ఆది 3,19

జీవానికీ మరణానికీ కర్త దేవుడే - ద్వితీ 32,39

మనుష్య కుమారుడు దొంగలా వస్తాడు - లూకా 12,39-40

పాపం చేయకముందు నరుడు అమరుడు - జ్ఞాన 2,23-24

పాపఫలితం మరణం - రోమా 6,23

మనం క్రీస్తు మరణంలోనికి జ్ఞానస్నానం పొందుతాం - రోమా 6,3-4

పౌలు దినదినమూ శారీరక జీవితానికి చనిపోతుండేవాడు - 1కొ 15,31

క్రీస్తునందు చనిపోయేవాళ్ళు ధన్యులు - దర్శ 14,13

మనకు ఇక్కడ స్థిరమైన పట్టణమేమీ లేదు - హెబ్రె 13,14

## అధ్యాయం - 2

లోకాంతంలో తీర్పు - మత్త 25,31-46

మరణాంతంలో తీర్పు - లూకా 16,22-23 ; 23,43

జీవించి ఉండగానే తీర్పు - యోహా 3,17-18

ప్రభువు రెండవమారు వచ్చినపుడు తీర్పు - 1తెస్స 4,15-18

ఒకసారి మరణం, ఒకసారి తీర్పు - హెబ్రే 9,27

సజీవుడైన దేవుని చేతికి చిక్కడం భయంకరం - హెబ్రే 10,27-31

ప్రతి వ్యర్థపు మాటకూ లెక్క చెప్పాలి - మత్త 12,36

మన కార్యాలన్నీ దేవుని గ్రంథంలో వ్రాయబడి ఉంటాయి - దర్శ 20,12

క్రీస్తుని నమ్మితే దండనం లేదు - రోమా 8,1

## అధ్యాయం - 3

నరకం అగ్నికుండం - మత్త 13,42

చీకటి చెరసాల - 22,13

బహిష్కరణం - 25,12

పండ్లు కొరుకుకోవడం - 25,30

పిశాచాలుండే తావు - 25,41

పురుగు చావదు, అగ్ని చల్లారదు - మార్కు 9,48

మరణం - యోహా 3,36

రెండవ మృత్యువు - దర్శ 20,14

చీకటి - 8,12

నిప్పు దేవుని కోపానికీ, శిక్షకీ చిహ్నం - యెష 30,27

నిప్పు నరుల పాపాలకు గూడ చిహ్నం - 9,18-19

పురుగు చావదు, అగ్ని చల్లారదు - 66,24

నరకం నిత్యమైంది - మత్త 25,46

## అధ్యాయం - 4

యూదా మక్కబీయుని పాపపరిహార బలి - 2మక్క 12,39-45

## అధ్యాయం - 5

మోషేకు దైవదర్శనం - నిర్గ 33,11

మోక్షంలో ప్రత్యక్ష దర్శనం - 1కొ 13,12

క్రీస్తు జగజ్జ్యోతి - యోహా 8,12

స్వర్గం జ్యోతిర్మయం - దర్శ 21,22-23

యిస్రాయేలనే బాలునికి దేవుని స్పర్శ - హోషే 11,1-4

మోక్షంలో దేవుని స్పర్శ - దర్శ 7,17

శిష్యుల ఐక్యత - యోహా 17,22

మోక్షంలో పునీతులు - దర్శ 7,9

## అధ్యాయం - 6

నీ పరిశుద్ధిని గోతిపాలు చేయవు - కీర్త 16,10

అనేకులు మేలుకొంటారు - దాని 12,2

పునరుత్థాన భాగ్యం - 2 మక్క 7,9

విశ్వాసం వలనా, సత్ప్రసాదం వలనా ఉత్థానం - యోహా 11,25; 6,54

క్రీస్తు సద్దూకయుల నోళ్లు మూయించడం - మత్త 22,23-32

ఆత్మద్వారా తండ్రి మనలను లేపుతాడు - రోమా 8,11

జ్ఞానస్నానంద్వారా ఉత్థానం - రోమా 6,4-5

క్రీస్తు మరణించిన వాళ్ళల్లో ప్రథమఫలం - 1కొ 15,20

మహిమ శరీరం - 1కొ 15,42-44

విశ్వంకూడ మహిమను పొందుతుంది - రోమా 8,20-21

మన దేహం ఆత్మకు ఆలయం - 1కొ 6,18-19

## అధ్యాయం - 7

రెండవరాకడ : { మార్కు 13,26-27<br>1తెస్స 4,16-17 }

లోకాంతం వరకు మీతో ఉంటాను - మత్త 28,20

మన మరణకాలమే రెండవరాకడ : { అచ 7,55-56<br>లూకా 23,43<br>యోహా 14,1-4 }

ఆ దినం ఎప్పుడు వస్తుందో తెలియదు - మత్త 25,36

క్రీస్తు రాజ్యాన్ని దేవునికి అప్పగిస్తాడు - 1కొ 15,24

యజమానుడు ఎప్పుడు వస్తాడో మీకు తెలియదు - మార్కు 13,35

ప్రభువు మళ్లా రెండవసారి వచ్చేవరకూ - 1కొ 11,25

## అధ్యాయం - 8

యేసుక్రీస్తు రాకకొరకు కనిపెట్టుకొని ఉండాలి - ఫిలి 3,20

పదిమంది కన్నెలు - మత్త 25,10

భూమిని వశం చేసికొనండి - ఆది 1,28

తోడినరులపట్ల ప్రేమ, వారికి సేవలు - మత్త 25,40-45

మంచి సేవకులకు మెప్పుకోలు - మత్త 25,21-23

నీతికిరీటం - 2తిమో4,8

క్రీస్తు మనకు ఓడ లంగరు - హెబ్రే 6,19.

# పది సంపుటాలకు సంపూర్ణ విషయసూచిక

## 1. బైబులు పరిచయం



## 2. బైబులు బోధనలు

## 3. బైబులు వాక్యామృతం

1. ప్రవక్త
2. నాల్గు బైబులు భావాలు
3. సంపదలు
4. పేదల పాట్లు
5. దైవప్రజలు
6. ఎడారి మునుల సూక్తులు
7. పునీత ఇగ్నేష్యస్ సూక్తులు
8. విశ్వాసం
9. వేదబోధ
10. పని
11. మంచిమరణం
12. సన్మనస్కులు
13. బైబులు వాక్యామృతం

## 4. ప్రార్థనం

1. ఐదురకాల ప్రార్థనలు
2. మనవి ప్రార్థనం
3. వివిధ ప్రార్థనలు
4. క్రీస్తు ప్రార్థనం
5. పరలోకజపం
6. బాధాతత్వం
7. తెరువబడిన హృదయం
8. బైబులు భక్తుల ప్రార్థనలు
9. ఆత్మశోధనలు
10. బైబులు ప్రార్థనలు

☆☆☆



**ఫాదర్ పూదోట జోజయ్య, S.J.** గారు, పూదోట మరయ్య, చిన్నమ్మ దంపతులకు 1931వ సం॥ ఫిబ్రవరి 15న, గుంటూరు జిల్లాలోని కనపర్రు గ్రామంలో జన్మించారు. ఈయన ప్రాథమిక విద్యను కనపర్రులో, ఉన్నతవిద్యను ఫిరంగిపురంలో అభ్యసించారు. మద్రాసు లొయోలాలో కళాశాల విద్యను పూర్తిచేసి, ఆంధ్రవిశ్వవిద్యాలయంలో **M.A.** (సాహిత్యం) లో పట్టా పుచ్చుకున్నారు.

1955లో తమిళనాడులోని దిండిగల్ నందు యేసుసభలో చేరిన జోజయ్యగారు, అటుపిమ్మట కొడైకెనాల్‌లో తత్వశాస్త్రాన్ని, కర్సియాంగ్‌లో వేదాంతశాస్త్రాన్ని నిశిత పరిశీలనా దృష్టితో క్షుణ్ణంగా అధ్యయనం గావించారు. 1965, మార్చి 27న బిషప్ ముమ్మడి ఇగ్నేషియస్ గారి చేతుల మీదుగా ఫిరంగిపురంలో గురుపట్టం పొందారు.

రోమునగరంలోని బిబ్లికల్ ఇన్‌స్టిట్యూట్‌లో బైబులు విద్యనభ్యసించిన జోజయ్యగారు ఆ తర్వాత తనదైన విశిష్టశైలిలో బైబులు సాహిత్యానికి ఎనలేని సేవ చేసారు. లొయోలా కళాశాలలో 2 సంవత్సరములు ఉపన్యాసకునిగా విద్యార్థులకు చక్కని శిక్షణను అందించారు. పుస్తకరచన, బైబులుబోధ, విద్యార్థులకు నాయకత్వ శిక్షణ వీరి ముఖ్య కార్యక్రమాలు.

**సాహిత్యరంగంలో వీరు నిర్వహించిన కొన్ని బృహత్తర కార్యక్రమాల వివరాలు :**

1. అనువాదకునిగా : అకుంఠిత దీక్షతో 17 సం॥లు అవిరళకృషిసల్పి క్యాథలిక్ బైబులులోని పూర్వవేదాన్ని జనరంజకంగా తెలుగులోనికి అనువదించారు.
2. ఆధ్యాత్మికవేత్తగా : ఆధ్యాత్మిక చింతనకు పెద్దపీట వేస్తూ ఆయన నడిపే బైబులు భాష్యం పత్రిక, బైబులు గ్రంథమాల ఆయన ఆధ్యాత్మికరంగంలో నిత్యకృషీవలుడని చెప్పకనే చెబుతాయి.
3. విద్యార్థి బాంధవునిగా : విద్యార్థిలోకాన్ని ఉత్తేజపరచడానికి, వారిలో నవచైతన్యం నింపడానికి ఆయన నడిపే చైతన్యవాణి పత్రిక, విద్యార్థిహిత గ్రంథమాల, విద్యార్థిలోకానికే నిర్దేశకాలు.
4. వక్తగా : ఆంధ్రరాష్ట్రమంతటా తిరిగి విద్యార్థులకు,ఉపాధ్యాయులకు, ఉపదేశకులకు సామాన్యప్రజానీకానికి వందలకొలది సదస్సులు నిర్వహించి, వారిలో నవ్యోత్సాహాలను నింపారు.